# శ్రీ రామాయణ పారిజాతం

## (యుద్ధకాండము)

### ద్వితీయ భాగము



గ్రంథకర్త :

'సహజకవి'

# శ్రీరామాయణ పారిజాతము

(నిర్వచన రామాయణము)

## యుద్ధకాండము

(ద్వితీయ భాగము)




గ్రంథకర్త

"సహజకవి" పంతుల చినజోగారావు

ప్రథమ ముద్రణ — 500 ప్రతులు

ఫిబ్రవరి — 18 — 2000

వెల : రూ॥ 110 /-

ప్రతులకు :

శ్రీపంతుల లక్ష్మీనారాయణరావు
43 — 7 — 32
"శ్రీ రామ మారుతి"
రైల్వే న్యూకాలని
విశాఖపట్నం — 530 016.

(Residence)
Phone No - 561603

ముఖచిత్రం : పురాణపండా రాధాకృష్ణమూర్తి
(రాజమండ్రి)

ముద్రణ :

లలితా ఆర్టు ప్రెస్
టౌన్‌హాల్ రోడ్డు
విశాఖపట్నం — 530 001.

## జీవిత సంగ్రహము :-

గ్రంథకర్త : శ్రీ శ్రీ వంతుల [illegible]గారావు

ధర్మపత్ని : శ్రీ శ్రీ వంతుల సుభద్రమ్మ

జన్మస్థలము : పార్వతీపురం

జననము : 15-8-1913.

విద్యాభ్యాసము : ఉన్నత పాఠశాల, పార్వతీపురం
మార్చి 1931

ఉద్యోగ ప్రవేశము : 16-7-1934, B. N. Railway

ఉద్యోగ విరమణ : నవంబరు 1968
(స్టేషను మాస్టర్, S.E.Rly [illegible])

సుందరకాండ రచన : 1975

శ్రీ మద్రామాయణ పారిజాత రచన : 1976-1981

అముద్రిత గ్రంథములు :

- భగవద్గీతానువాదము [ఛందోబద్ధము]
- తారక బ్రహ్మనామ శతకము
- శ్రీరామ రత్నమాల
- రామచంద్ర నీతి శతకము
- శ్రీ వేంకటేశ్వర నక్షత్రమాల
- శివ నక్షత్రమాల

# శ్రీరామాయణ పారిజాతము

## యుద్ధకాండము

(ద్వితీయ భాగము)



శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారిచే ప్రారంభించబడిన
ధార్మిక గ్రంథ ప్రచురణ సహాయ ప్రణాళిక క్రింద
ఇయ్యబడిన విరాళముతో ముద్రింపబడినది.


గ్రంథకర్త

"సహజకవి" పంతుల చినజోగారావు

విశాఖపట్నం.

## ఈ గ్రంథమునకు విరాళాలు అందచేసిన దాతలు

| | | |
|---|---|---|
| 1. | ఒకమహాభక్తుని భూరివిరాళం | 15000-00 |
| 2. | శ్రీమతి & శ్రీ అకుంది సీతారాం. | 5000_00 |
| 3. | శ్రీమతి & డాక్టర్ . ఏ జగన్నాథరావు | 3116_00 |
| 4. | శ్రీమతి & శ్రీ డి. వి. యస్. కుమార్ | 3116_00 |
| 5. | శ్రీమతి & శ్రీ యమ్ రామచంద్రరావు | 3116_00 |
| 6. | శ్రీమతి & శ్రీ వఝ్ఝుల కాశేశ్వరరావు. | 3116_00 |
| 7. | శ్రీమతి & శ్రీ కె. ఆర్ కె మూర్తి | 2000_00 |
| 8. | శ్రీమతి & శ్రీ అకుంది అన్నపూర్ణమ్మ | 2000_00 |
| 9. | శ్రీమతి & శ్రీ. ఏ. వి. కె. శాస్త్రి | 1116-00 |
| 10. | శ్రీమతి & శ్రీ కె. వై. కొండలరావు. | 516-00 |
| 11. | శ్రీమతి & శ్రీ ఎస్. ఎస్. శర్మ | 516-00 |
| 12. | శ్రీమతి & శ్రీ ఎస్. రాజారావు | 516-00 |

## బి. హెచ్. పి. వి. ఉద్యోగుల విరాళములు

| | | |
|---|---|---|
| 13. | శ్రీ ఏ. యస్. రామారావు | 11160_00 |
| 14. | శ్రీ పి. యస్. ఎస్. రాజు | 116_00 |
| 15. | శ్రీ కె. పెద్దయ్య | 116_00 |
| 16. | శ్రీ కె డి. మల్లికార్జున | 116-00 |
| 17 | శ్రీ ఎస్ ఏ, జైన్ | 116_00 |
| 18. | శ్రీ కె, కృష్ణమూర్తి | 116_00 |
| 19. | శ్రీ కె. అనంతరాయ్ | 101-00 |
| 20. | శ్రీ కె. యస్, ఎస్. మూర్తి | 100-00 |
| 21. | శ్రీ ఎమ్. ఆనందరావు | 50-00 |
| 22. | శ్రీ నాగభూషణం | 50_00 |
| 23. | శ్రీ డి, యస్, రావు | 50_00 |
| 24 | శ్రీ ఎస్. ఎ. నాయుడు | 50_00 |
| 25. | శ్రీ లక్ష్మీపతి | 25-00 |
| 26. | శ్రీ ఆచార్యులు | 10-00 |

వ్యాకరణాలంకార చక్రవర్తి - సాహిత్య విశారద
అప్పల్ల సోమేశ్వరశర్మ
విశ్రాంత సంస్కృతాచార్యుడు
ఆంధ్రవిశ్వవిద్యాలయం

# ప్రియవచనము

"సత్యం పరమం వదంతి" ( సత్యమన్నిటికన్న గొప్పది ) "ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా" ( ప్రపంచమునకు మూలాధారము ధర్మమే ) అని వేదం నిర్దేశించింది.

"సత్యాన్నాఽస్తి పరం పదమ్" ( సత్యమును మించిన ఉత్తమ గతి లేదు ), "ధర్మసారమిదం జగత్" (ప్రపంచమునకు ధర్మమే మూలం ) అని రామాయణం ఉపదేశించింది. పదాలు వేరుకాని తాత్పర్యం ఒకటే.

ధర్మమునకు పరమ మూలమైన వేదపురుషుని మాటలు ఒకవర్గమైతే అతని పరమావతారమైన శ్రీరాముని చరితము, రామాయణపు మాటలు రెండవ వర్గమవుతుంది. రెండింటిని ఇంకను కుదించి "సత్యం వద-ధర్మం చర" (సత్యమును పలుకుము-ధర్మాన్ని ఆచరించుము ) అని ఋషులు రెండు అతి ప్రసిద్ధమైన సూత్రాలుగా లోకానికందించేరు. అప్పుడు ఇప్పుడు - ఎల్లప్పుడు కూడా ఈసూత్రాలే మానవాభ్యుదయానికి, సర్వతోముఖ వికాసానికిన్నీ నిదానములు.

సత్యధర్మాల ప్రతిష్ఠ - ప్రచారం-విచారం-ఆచారం కోసమే రామాయణం అవతరించింది. వాల్మీకిముని గొప్ప అదృష్టవంతుడు. వాణీపతి స్వయంగావచ్చి, అతనిని అనుగ్రహించినాడు. "నావాక నీవాక అవుతుంది" అన్నాడు. రామచరితమును గానం చెయ్యమన్నాడు. "కులపర్వతాలు, మహానదులు ఉన్నంత కాలం రామాయణం ఉంటుంది" అన్నాడు వాల్మీకి - కోకిలగా మారి, రామచరితాన్ని మధురంగాను, మధురాక్షరంగాను గానం చేసినాడు. దానికి ఆమహామునియే "రామాయణకావ్యము" అని, సీతామహాచరితము అనిన్నీ నామకరణం చేసినాడు.

తరువాత రామాయణానికి ఎన్నో పేర్లు అమరినాయి. ఆదికావ్యము రామచరితము, రామభక్తి - కామృతము రామకథాసుధ, రామాయణ కల్పవృక్షము మొదలైనవి శ్రీరాముని నామాంకితమైన రామాయణ నామాలు కూడా శతపత్రాలుగా వెలుగుతున్నవి. ఇంకొక విశేషము, రామాయణము ధర్మ ధ్వజమేకాకుండా, సాహిత్య ప్రస్థానంలో ఆదిలక్షణ గ్రంథంగా కూడా సిద్ధమయింది. భారతదేశంలోని సకల భాషా సాహిత్యాలలో కావ్యమార్గానికి అదే ప్రవర్తకమయింది, నిన్న మొన్నటివరకు (నేడు కూడా) వివిధ సాహిత్య ప్రక్రియలకున్నూ అదే ఉపజీవ్యమయింది. కాగా రామాయణం "కావ్యంలక్షణము లక్ష్యంలక్ష్యము" కూడా అని "కావ్యలంకార సిద్ధాంతులు" సిద్ధాంతం చేసినారు. అస్తు,

ఇక భక్తి విషయం. "రామో విగ్రహవాన్ ధర్మః, సీతాపతివ్రతా మహాభాగా సీతారాములు సాక్షాత్తు లక్ష్మీనారాయణులు. వారి సేవ ఇహపర భోగకము - విశ్వశ్రేయస్కరము, ఇది భక్తుల శ్రవణం మననం - నిదిధ్యాసనం కూడా అందువల్లనే అనాదిగా భక్తులు "రామ కోటు"లను కష్టాలు "రామచరితము"ను వ్రాసుకున్నారు వ్రాసుకుంటున్నారు- వ్రాసుకుంటారు ఎవరికి వారే "ఆత్మానందము గాను" "తరణోపాయం" గాను త్రికరణ శుద్ధితో భావించుకుని ఆయా పనులను నిర్వహిస్తున్నారు. తాము తరించుట - అనుయాయులను తరింపజేయుట - ఈ రెండిటికి ముఖ్య ప్రయోజనములు.

ఇదిగో! ఇటువంటి భావం తోనే ( ముఖ్యంగా ఆత్మనివేదన భావం ) "సహజకవి" శ్రీపంతుల లివజీగారావుగారు "రామాయణ పారిజాతము"ను రచించినారు. వీరున్నూ వాల్మీకి వంటి వారే! ఆనాడు వాల్మీకిని బ్రహ్మ కృపవల్ల సరస్వతి అనుగ్రహించింది, ఒకనాడు కాళిదాసునిపై కాళిదయ చూపింది. మరొకనాడు పోతన్నచే రామభద్రుడు పలికించినాడు, నేడు ఆ రామభద్రుడే శ్రీ లివజీగారావుచే తన చరితాన్ని తాను తెలుగులో వ్రాయించుకున్నాడు. వీరందరు సహజకవులు. ఆయా దేవతల కరుణవల్ల వీరికి కవిత్వమబ్బుతుంది, అమృత ప్రాయంగా సాగిపోతుంది. దైవానుగ్రహంవల్ల కలిగిన "కవితాశక్తి"నే "ప్రతిభ" అంటారు, అది ఒక్కటే

ంటి వ్యుత్పత్తి ( పాండిత్యము ), అభ్యాసం ( పెక్కొంది కావ్యాలు వ్రాయడం ) అక్కరలేదు. అందువల్లనే అలంకార శాస్త్రాలు ఉగ్గేలు పట్టి, మంత్రాలు చింపుకుని చివరకు "శక్తిః" ఒక్కటే కవితా హేతువు" అని పెద్దలు గుట్టు చెప్పేరు.

శ్రీ భోగారావుగారి విషయమే ఇక్కడ ముఖ్యదృష్టాంతం! వీరు స్కూల్‌ఫైనల్" మాత్రమే చదివినట్లు విన్నాను. రైల్వేలో "స్టేషన్ మాస్టర్‌గా పని చేసేరు. అయినా రామాయణాన్ని రమణీయంగాను రస భరితంగాను రచించేరు. తన చదువుకు, వృత్తికి, ఈ కవితా ప్రవాహానికి - ఏమయినా పొంతన కాని కార్యకారణ భావం కాని ఉందా! కేవలం శ్రీరాముని దయచేతను - ఆషాఢిగ సకల జనులు సౌహాయనగా" - వీరిని రామాయణ కవితాకన్య వరించింది.

ఈ సంగతిని వీరు బాహాటంగా చెప్పుకున్నారు. "దశరథ రాజపుత్రుడా కలితా కవితో క్తి బల్కెదనే", "రాము కరుణచేత బుణుకు వాద నాకు కలిగిన రీతిని, భారతమునంచిన రామభద్రుడవయి 'అర్చితుడు రఘురాముని సార్థకమగు మధుర కవిత ఛందోవిభక్తి' - మొదలగు వచనములు.

శ్రీ భోగారావు కవిగారి రామాయణ పారిజాతం మూలవిధేయంగాను, స్వేచ్ఛగాను కూడా సాగిపోయింది, తెలుగున సుప్రసిద్ధులైన మహాకవుల లోకమంతా అందులో "ఓంకారారం" గా కనిపిస్తాయి. ప్రసాద గుణ ప్రధానంగా సంఘటన సాగింది. రమణీయాలైన శబ్దాలు చెట్టపట్టాలు వేసుకుని విహరించేయి. ఈ భాగం యుద్ధకాండము దీనితో రామాయణామృత భాండం పరిపూర్ణమై భక్తజనాస్వాదానికి సంసిద్ధమయింది. భోగారావుగారు 'యోగారావుగారు అయినారు, వీరు ధన్యులు సహృదయులను కూడా ధన్యులను చేసినవారు.

ఇక ఇటువంటి కావ్యాలకు 'ప్రముఖుల అభిప్రాయాలు' వాస్తవంగా అక్కరలేదు. వీటిని ఆస్వాదించడమే సహృదయుల కర్తవ్యం. విపుంగవులకు వ్రాయడం సరికాదు! అయినా నేటి సాహిత్య లోకంలో ఈ తీరు "గతానుగతికం" గా సాగిపోతున్నది దీనిని అనుసరించియే శ్రీమంతులు, లక్ష్మీనారాయణరావుగారు నన్ను కూడా 'ప్రముఖుల పత్రిక'లో

శ్రీ వంతుల చినజోగారావుగారు శ్రీమద్రామాయణ పారిజాతమను నిర్వచనముగ రచించిరి. సుమారు ఆరు వత్సరములు రామాయణాబ్ధిని మథించి ఈ పారిజాతమును బయటకు తీసిరి. వారిది పండిత కుటుంబము, ఆ వారసమున శాస్త్రాధ్యయనమొనర్చిరి; సాహిత్యమును, కవిత్వము, వైద్యము, జ్యోతిషము మున్నగునవి పుట్టుకతోనే అలవడినవి వారి పురాకృత పుణ్య పరిపాకమున్నది.

శ్రీ చినజోగారావుగారి ఉద్యోగము రైల్వేకు సంబంధించినదైనను, పారిజాతమహాకావ్యమును వ్రాయగలుగుట మిక్కిలి ఆశ్చర్య జనకము, కానివారే దానికి కారణమును చెప్పినారు. శ్రీరామచంద్ర పాదభక్తియే వారికట్టి శక్తిని ఇచ్చినది. "అవిచ్ఛిన్న విశేష రాఘవపద భక్త్యావేశ చిత్తుండనై సేవాయత్త పరాయణుండనగుచున్ జేయంగ నేనెంచితిన్" 'దశరథరాజపుత్ర కరుణా కవితా కవితోక్తి వల్కెదన్" అని తన రచనకు కారణమ్ము ఆ శ్రీరామచంద్రుని అనుగ్రహమేనని వక్కాణించినారు ఎందు చేతనే ఆశ్రద్ధాది రామచరణమ్మునకే అంకితము గావించినారు. శ్రీరామ భక్తాగ్రేసరులైన శ్రీ చినజోగారావుగారు ధన్యాత్ములు, కృతకృత్యులు. సహజ పాండిత్య ధురీణ శ్రీ బమ్మెర పోతనామాత్యునివంటి వారనదగును

వాఙ్మయభూషణ, సాహిత్యవిద్యాప్రవీణ
రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి

శ్రీ రామచరితం, భువనైక సమ్మోహనం అతిపవిత్రం దానిని ఎందరో వివిధ ప్రక్రియలలో రచించి వారి వారి జీవితములను ధన్యము చేసికొని నారు,

అట్టివారిలో ప్రముఖులు బ్రహ్మశ్రీ పంతుల చిదకోగారావుగారు. వారి వృత్తి లౌకికమైనను ప్రవృత్తి ఆధ్యాత్మికమై భగవదభిముఖమైనది. దానికితోడు వేదములకు ప్రతిరూపము, గాయత్రీ మంత్ర స్వరూపము అయిన శ్రీరామాయణమును శ్రీ చిదకోగారావుగారు "పారిజాతముగా గుర్తించినారు" శ్రీ రామాయణమును పఠించినను, లిఖించినను, విని నను "తేషాం పాపహ ప్రతిష్ఠితా" అని చెప్పినట్లు ఉత్తమలోక స్థిరనివాస మేర్పడును, ఈలోకమున సుఖముగ జీవించుటకు మాత్రమే కొరక, శాశ్వత బ్రహ్మలోక ప్రాప్తిని కాంక్షించి దానిని పొందుటకు శ్రీరామాయణ రచనమునే వారు సాధనముగా భావించినారు. జన్మసిద్ధసిద్ధమైన కవితా ప్రాభవమును, సద్వినియోగపరచి, జన్మసార్థకము చేసికొనవలెనని సంకల్పించుకొనినారు. భగవద్భక్తులగు వాక్కును భగవద్విషయమున ప్రవర్తింపజేసినారు. పోతన భాగవతమునందు వలె వీరు కూడ ప్రారంభమున శ్రీరాముని స్తుతియించుచూ గ్రంథమును ఆరంభించినారు. భక్తి పోషణము అర్థవైశద్యము వీరి పద్యములలో స్పష్టముగ గోచరించు చుండును,

రామాయణము అనువదించుట చాలా సులభమనిపించును. కాని చాలా కష్టము. శబ్దములు లలితములై, సులభముగ నుండును. గాని భావములు గంభీరములై లోతు అందకుండ ఉండును, అది కేవలము శ్రీరామ, హనుమత్ కటాక్షపాత్రులకే వశపడును, అట్టి మహానుభావులు కవిశేఖరులు శ్రీ పంతుల చిదకోగారావుగారు, కనుకనే వారిచేత లలిత సుందరముగ శ్రీరామచంద్ర ప్రభువులవారు శ్రీరామాయణమును అను వదింపజేసినారు,

శ్రీ చిదకోగారావుగారు ఏ ప్రయోజనమును కాంక్షింపక, శ్రీభద్రాద్రి రామునకు అంకితముగ ఈ రామాయణ పారిజాతమును రచించినారు. అట్టి శ్రీరామచంద్రులవారి కటాక్షమే ఈ గ్రంథమును ప్రకాశింపజేయు చున్నది, ఆంధ్రపాఠకలోకమంతయు దీనిని చదివి, తరించుటకు, సీతా రామచంద్ర ప్రభువు అనుగ్రహింపవలెనని ప్రార్థించుచున్నాను,

ధాతనామ సంవత్సర<br>ఫాల్గుణ బహుళ విదియ<br>జయవారము,

శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామి

రామాయణ మహోదధి, రామాయణార్ణవము, శ్రీరామాయణ దుగ్ధసింధువు, రామకథామృత సాగరమని రామాయణాన్ని, ప్రాచీన కవిపుంగవులు భక్తితో అభివర్ణించారు. అయితే రామాయణ విష వృక్షం లాంటి విశేషణాలు ఉపయోగించి భారతీయ సాంస్కృతిక వాతావరణాన్ని కలుషితంచేశాయి. ఈ తరుణంలో అభినవ వాయుపుత్రులై విజృంభిస్తూ ఆ కాలుష్యాన్ని కరిగించివేసి సాంస్కృతిక పరిమళాలను వెదజల్లే రచన చేసి "శ్రీరామాయణ పారిజాతం"తో భారతీయ అంతరంగాల్ని భక్తి సుగంధతో నింపారు. "సహజకవి" "రామభక్తి" ప్రపూర్ణులు, పుణ్యమూర్తులు అగు శ్రీ పంతుల జోగారాయులుగారు.

వీరు యథావాల్మీకంగా వాల్మీకి అడుగుజాడల్లో నడుస్తూ, వాల్మీకి కవితా మాధుర్యపు బిందువులు చిందిపోకుండా తెలుగు పద్య కుసుమాల్లో తెలుగు పాఠకలోకానికి అందించారు. తాము తరించడంతో పాటు, తమవారి తరించడానికి చక్కని కవితా పుష్పాలను సమకూర్చారు.

వీరి రచనలో సీసపద్యరచన ప్రత్యేకంగా చెప్పుకోవలసి ఉంది. మూలంలోని నాలుగైదు శ్లోకాల భావాన్ని ఒక సీసపద్యంలో రమ్యంగా కూర్చడం శ్రీనాథుడు అందించిన విద్య, ఒక తత్త్వము. వర్ణించడానికో, ఒక ప్రత్యేకమయిన సన్నివేశాన్ని చిత్రించడానికో చేసిన పద్యాన్ని ఎన్నుకోవడం నేర్పరులైన కవులు చేసే పని. ఆ నేర్పు పుష్కలంగా ఉన్న కవిశేఖరులు, శ్రీపంతుల జోగారావుగారు.

శ్రీపంతుల జోగరాయకవిగారు ప్రాచేత సోద్యానజాత, రామాయణ పారిజాతమని, రామాయణాన్ని పారిజాతంగా ప్రకీర్తించారు. నదులు, గిరులు ఉన్నంతకాలం, రామాయణం స్థిరంగా ఉంటుందని వాల్మీకి మాట. రామాయణం స్థిరంగా ఉండటమే కాదు. రామాయణ రచన అవిచ్ఛిన్నంగా సాగుతూ ఉంటుందనడానికి శ్రీపంతులవారి "రామాయణ పారిజాతం" ఒక ఉదాహరణ అని చెప్పక తప్పదు.

ఆచార్య శ్రీమతి కె. మలయవాసిని
ఆంధ్ర విశ్వవిద్యాలయం

ఈ గ్రంథకర్త శ్రీపంతుల చిదంబరరావుగారిని ముఖాముఖి నేను కలవలేకపోయినను. అతని కుమారుడు మధురగాయకుడు, నాకు పరమ ఆప్తుడు, కోకిల సుందరగానసమర గ్రంథకర్త అగు చిరంజీవి పి, యస్. నారాయణరావు శ్రీరామాయణ పారిజాతమునిచ్చి ఆసాంతము చదివే భాగ్యమును కలిగించినాడు.

వర్తమాన కాలమున భక్తి మహాకావ్యరచన గావించుట. అందునా ఏ గురువువద్ద పాండిత్యము అంతగా నేర్చుకొనుటకు అవకాశము లేకపోయి స్వప్రతిభ కేవలము ఆ శ్రీరామచంద్రుని అనుగ్రహమువలన రాసినదిగా నేనూ భావించుచున్నాను, అందువలననే గాబోలు నా మిత్రులు బ్రహ్మభూషణ రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రిగారు శ్రీపంతుల చిదంబరరావు గారిని సహజపాండిత్య ధురీణుడగు బమ్మెర పోతనామాత్యునితో సరిపోల్చినారు. అది ఎంతయో సముచితం. ఈ శ్రీరామాయణ పారిజాతము, కవిపండిత హృదయాలలో పారిజాత పరిమళములు వెదజల్లగలదనుటలో సందేహము లేదు.

ఆదికవి రచనయందలి ముఖ్యములైన కథాంశములనుగాని, వర్ణనలుగాని, ఉపమానాదులనుగాని గ్రంథకర్త ఇందు లేశమైనను విడువలేదు. కావున కవికోకిల వాల్మీకి రచనయందలి సౌందర్యమంతయు ఇందు కానవచ్చును. తండ్రిగారి చివరికోరిక మేరకు వారి కుమారులు కుమార్తెలు, అల్లుళ్ళు, మనుమలు, మనుమరాండ్రు ఈ పారిజాతమును ముద్రించి వారి ఋణము దీర్చుకొని, వారి జీవితములకు కూడా ఒక పరమావధిని ఒనగూర్చుకొనినారు. అట్టివారి కుటుంబమును ఆ శ్రీరామ చంద్రుడు ఎల్లవేళల రక్షించుగాక.

కళాప్రపూర్ణ చర్ల గణపతిశాస్త్రి

# అభినందనలు

మా తండ్రిగారి చివరి కోరిక తను రచించి, శ్రీ భద్రాద్రి రామచంద్రులవారి పాదపద్మములకు అంకితము గావించిన శ్రీ రామాయణ పారిజాతము గ్రంథమును ముద్రించి, శ్రీ రాముని పాదాల చెంత చేర్చమన్నారు. కుటుంబ భారం వల్ల ముద్రణాభారం వల్ల ఆ కార్యం వెంటనే చేయలేకపోయాను దానికి క్షంతవ్యుణ్ణి. కాని తిరిగి మా తండ్రిగారి ప్రేరణతో, ఆ ఆంజనేయస్వామివారి దీవెనలతో తొలుతగా సుందరకాండము ముద్రించి, అటు పిమ్మట అరణ్య, కిష్కింధ, యుద్ధకాండములు (రెండు సంపుటములు) ముద్రించగలిగినాను.

ఈ గ్రంథమునకు భూరి విరాళాలు అందజేసిన దాతలకు శతసహస్ర వందనములు. ఆ మహనీయుల పేర్లు ప్రతి కాండమునందు పొందుపరచినాను. అదేవిధంగా కోరిన వెంటనే వారివారి అమూల్యమైన అభిప్రాయములను వ్రాసి యిచ్చిన శ్రీమాన్, శ్రీ శాస్త్రం అప్పలాచార్య స్వామివారికి, శ్రీ అప్పల్ల సోమేశ్వర శర్మగారికి, శ్రీ దివాకర్ల రామమూర్తిగారికి, శ్రీ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి, శ్రీమతి మలయవాసిని గారికి, శ్రీ మండికోట బ్రహ్మాజీగారికి నా వందన శతాలు.

అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధకాండములు అందముగా ముద్రించి అనుకున్న సమయమునకు అందజేసిన శ్రీ లలితా ఆర్టు ప్రింటర్స్ అధినేత కుమారి చర్ల శిరులగారికి, శ్రీ కోపల్లె రామ్మూర్తి గారికి, శర్వాణి ప్రింటర్స్ అధినేత శ్రీ M. R. L. రావుగారికి నా ధన్యవాదాలు.

యుద్ధ కాండమునకు 20, 000/- రూపాయలు విడుదల జేసిన తిరుమల, తిరుపతి దేవస్థానం వారికి, 15,000/- భూరి విరాళం అందజేసి తన పేరు కూడా వేయటానికి అంగీకరించని ఒక మహాదాతకు నా శిరస్సువంచి పాదాభివందనం జేస్తున్నా.

యుద్ధకాండ ముఖచిత్రం ముద్రించి సకాలంలో అందజేసిన శ్రీ పురాణపండా రాధాకృష్ణమూర్తి (రాజమండ్రి) గారికి నా ధన్యవాదాలు. వీరే కాకుండా శ్రీ రామాయణ పారిజాత మహాయజ్ఞంలో పాలుపంచుకున్న ప్రతీ భక్తునికి ఆ హనుమత్ సమేత శ్రీ సీతారామచంద్రస్వామి వారి దివ్యాశీస్సులు అందించాలని మనసా, వాచా, కర్మణా కోరుకుంటున్నాను.

తృతీయ కుమారుడు

22 - 1 - 2000 కళారత్న పంతుల లక్ష్మీనారాయణరావు

# పంచరత్నమాల

మ॥ వెంసెన్ పంతులవారి వంశమున నావిర్భవన్ చివరోగరా
విలలో శ్రీ రఘురామచంద్రు పదభక్త్యావేశ చిత్తుండునై
కలమున్ పట్టి యుపక్రమించెను మహాకావ్యంబు రామాంకమున్
తెలుగున్ వ్రాసెను పారిజాతమును దివ్యంబుగా కాండలన్.

చ॥ సహజ కవీశ్వరుండవయి సద్గుణవర్తివియై చెలంగుచున్
ఇహమున సర్వసంపదలు వీడి సనాతన ధర్మవర్తివై
అహరము రామనామమును హాయిగ పల్కి కథావిశేషముల్
మహిమలు తెల్పుచుండి రఘురామ చరిత్రను పూర్తి వేసితో,

సీ॥ తెలిగించినాడవు తేటతెల్లముగాను
రామాయణ మహాగ్రంథమొకటి
నిర్వహించితివయ్య నిర్వచనంబుగా
పారిజాతమనుచు - పరగుచుండు
బమ్మెర పోతన - కమ్మనిశైలిలో
సహజ కవిత్వంబు - పల్కినావు
పుత్రులమై మేము పూజించి శ్రద్ధతో
మానవాళికి నీదు మహిమదెల్పు।

గీ॥ కావ్యముద్రణ భారంబు - కలుగజేసి
అంతరించితివయ్య మా - చెంతలేక
కాళ్లకడిగెద కన్నీటి - కాల్వలోన
కాచిరక్షించు మాతండ్రి - కన్నతండ్రి।

ఉ॥ శాశ్వత గల్గి కావ్యబుంధారము మాత్రమె దీర్చినారు సా
మర్థ్యము జూపి, తంత్రిబుంధమున్నది శిల్పదమున్న దైవ సా
న్నిధ్యము చేరిపోయితివి నిత్యము నశ్రుజలాల తోడనే
పథ్యము నందుమాత్రమిట పాద్యమొసంగగ వేర్చినామిటుల్

గీ॥ నీదుమూర్తికి పూజలు నిత్యముగను
నీదుపాదములకు పూజ నిరతముగను
చేయుచున్నాము దీనత తీయునయ్య
చూడు కృపతోడ పంతుల - భోగరాయ

చతుర్థ కుమారుడు : పంతుల శ్రీరామారావు
బుచ్చిరాజుపాలెం, విశాఖపట్నం



## ఆదిలో నాన్నగారు రామాయణమును ముద్రించుటకు చేసిన ప్రయత్నము.

శ్రీరామాయణ పారిజాతకృతి ను శ్రీయుక్తమై ముదిరా
కారంబున్ సహియించి ద్రవ్యమును సంప్రాప్తంబు గావించు నీ
ప్రారో దార మనీషులన్ సుజన రక్షాదక్షు డై తర్థి యా
శ్రీరాముండు చిరాయుష్యం తత శ్రీయుక్తులం జేయుతన్.

పరమాత్మ స్వరూపుడయిన శ్రీరాముని చరిత్రము భగవద్వాల్మీకి విరచిత శ్రీమద్రామాయణమును మూలముగా చేసికొని రామాయణ పారిజాతమను పేరిట (నిర్వచనాంధ్ర శ్రీమద్రామాయణము) సుమారు 13000 పద్యముల పరిమితిగల గ్రంథమును వ్రాసితిని. ఇది సర్వజన గ్రాహ్యము. సులభశైలి. వయోవృద్ధుడనగుటను, ఆర్థిక స్తోమత లేమిని గ్రంథ ముద్రణకు బంధు మిత్రుల ఆర్థిక సహాయము కోరవలసివచ్చినది. మొత్తము గ్రంథమునకు తగు ద్రవ్య సహాయము లభించుట కష్టమని యెంచి ప్రప్రథమమున బాలకాండ, అయోధ్యాకాండ సంపుటించి 500 పేజీలు గల దానిని 500 ప్రతులు ముద్రింపించి వాటిని విక్రయించి తన్మూలముగ లబ్ధమయిన ద్రవ్యముతో మరి రెండు కాండములు తత్ప్రకారముగ మూడు అంచెలలో గ్రంథము సొంతముగ ముద్రితమగు నను సంకల్పముతో సర్వజనులను స్వేచ్ఛాప్రకారముగా ద్రవ్య సహాయము చేయకోరుచున్నాను.

శ్రీ రామాయ నమః

ఇట్లు సుజన విధేయుడు
పంతుల చినజోగారావు
రిటైర్డు స్టేషను మాస్టర్
బుచ్చిరాజుపాలెం, విశాఖపట్నం-530 008

# కృతికర్త



శ్రీ పంతుల చినజోగారావు



ధర్మపత్ని సుభద్రమ్మ

చ॥ దొసగులు గల్గు నా కవిత దోసమటంచును నెంచలేక నా
రసవను భక్తి భావము విరాజిత పద్య విశేష చాతురిన్
దశరథ రాజపుత్ర కరుణా కలితా కవితోక్తి బల్కెదన్
విశదము జేయువారమ కవీశ బుధాళికి నంజలించుచున్.

ఉ॥ భారంబుంచితి రామభద్రుపయి సర్వంబాలకున్నట్టి నా
తీరుల్ తెన్నులు గాంచి సత్కవి బుధాధీశుల్ క్షమింపంగ తై
వారంబుల్ ఘటియించు పుణ్యకథయై వర్ధిల్లు ముక్తిప్రద
శ్రీరామాయణ పారిజాతకృతి నే సేవారతిం జేసెదన్.

# విషయసూచిక

పుట

సర్వం శ్రీరామార్పణమస్తు

మత్కృత దోషసంతతమైన దుస్థితి
    విక్రమంబున ద్రోసివేయుటెని
యావదలందు సాహాయ్యంబు జేసెడి
    యట్టి బాంధవుడ వీవగుదువేని

గీ॥ సంగరమ్మునందు శత్రు సంక్షయమొనర్చి
వాటుగల చింతమాన్చి యుద్రేకజయము
గూర్పుమెంతయు సమయంబు గూడవచ్చె
ఘోరబలసాద్రి ఘోరదుర్వార ధీర. 166

-: కుంభకర్ణుడు రావణు నూరడించుట :-

క॥ అని సంక్షోభించుచు నా
దనుజ విభుడు పల్కినట్టి దారుణగతులన్
విని ఘటకర్ణుడు రావణు
వినయంబుగ సేదదేర్చి వినిపించెనిటుల్. 167

చ॥ దనుజకులాధి నాథ వినుతంబగు సత్వము విక్రమంబు నా స
ఘన బలసంపదల్ గలుగ కార్యవిచారణ చింతయేల నీ
మనమున నగ్గల భీతినిక మానుము మానవనాథ పుత్రులన్
రణమున సంహరించెద పరాక్రమ ముల్లసిలంగ శీఘ్రమై.

చ॥ సలిపితి రాజనీతిని నృపాలకధర్మము బూని ఖ్యాతిపై
కలిగిన భక్తి భావమున గాంచిన బాంధవ బంధమేర్పడన్
దలపని నీ మనోగతిని దండనజేయక శత్రువీరులన్
నిలుతునె నీదు సన్నిధిని నీవిక చింతమువీడుమగ్రజా. 16[illegible]

చ॥ చిరుతతనంబు నుండి నను జేరగదీసి విశేషమైన యా
దరణము జూపియుండుట తదర్థముగా గను సంగరంబునన్
వరవరులన్ వధించియు వశాబులందోలి నృపాలశీర్షముల్
నరికియు నీవు సీతయు..గనంగను జూపెదు నిశ్చయంబుగన్ 1[illegible]

ఘనతర మద్భుజశక్తిని
దినవాథ తనూజు సమరధీరుని నేడే
రణరంగమందు జంపియు
దనుజాంతకు నీకు కీర్తి దద్దయు గూర్తున్. 1874

దనుజుల మత్తుల్యుల నే
మను మందగ చింతగలిగి నొవ్వగనేలా
దనుజాధిప భయమున్విడి
మును మందిన రీతి మోదమున నుండుమికన్. 1875

ఏనున్నతుండనైన ధరణీశుని జంపుదు నిన్నుగాని నే
ప్రాణమైలోన నుందుటను రాముఁడు నీకు నొకించుకైనయున్
హాని నొనర్పజాలఁడు సహాయమికేల రణంబుజేయఁగా
నేనొకరుండ పోవ రజనీచరశేఖర యాజ్ఞనీయవే. 1876

అనిమిష లోకనాథుఁడు కృతాంత సదాగతి వహ్నిరుద్రులన్
ధనద సముద్రులడ్డపడి తాకగ వచ్చిన రామలక్ష్మణున్
రణమున నుగ్రమూర్తినయి గ్రక్కన ద్రుంచి జయించుగాన నీ
మనమున చింతబాయు మభిమానము గొందక రాక్షసాధిపా. 1877

గిరిసంకాశ శరీరధారినయి శక్తిం జూపుచున్ హస్తమం
దురు శూలంబును దాల్చి సంగరములో దోర్గుండనై పోవ నా
దరి నెవ్వాఁడును నిల్వఁగల్గు నొకొ చంద్రార్కుల్ డగిరాదులన్
పరువెత్తున్ నను గాంచినంతట జగత్ప్రఖ్యాత ధీరోత్తమా. 1678

పరిఘ గదాసి శూలములు పట్టిసపాశ శరాదివర్గముల్
అరయఁగ నాకువ్యర్థమగు నద్భుతశక్తి యుతంబుకైన నా
కరతల తాడనంబులను కాలునితంగి పడంతు శత్రులన్
సురపతికైన నీపదవి జారకు మింతయు నందియుంబలెన్. 1679

ఉ॥ నేఁట సీటుమండ రజనీచరశేఖర చింతయేలనన్
మూలుగ సంగరస్థలికి సంపుము తక్కి విదారణుండనై
దానవలోకమెల్లరకు ధర్మతగూర్చెదు నమ్ముమింత నెం
దావను సంతయింపకుము ధైర్యము బూనుము రాక్షసేశ్వరా. ౧౬

చ॥ రణతలమందు నేఁడు రఘురాముని లక్ష్మణు నార్యమానునిన్
ననిలతనూజు నీలు నలునంగదు జాంబవదాది ముఖ్యులన్
పనిగొని సంహరించి యిటువత్తును భూరి జయంబుగాంచి యో
యనుజ విచారమేటికి మహాత్ములు ధీరులు చింతనొందుదే. ౧౭

చ॥ అనిమిషనాథ వహ్నిధనదాది దిగీశుల పారద్రోలెదన్
వినతశి తారకాధరజేశ్వరి గూల్చెద వార్ధిజల్లెదన్
మనకులమై లరాతి పొడిగా నొనరింతు దిశాగజంబులన్
వినుతముగాగ గొట్టెదను బీటలుగాగ తదీయశీర్షముల్. ౧౮

మ॥ చిరకాలంబున మండి నుప్తిగొనుచున్ జీవించుచున్నట్టి నా
శిరగుంజూచి సమస్తభూతతతి భీతింబర్వ నేఁడాజిలో
నరపాలాత్మజులన్ కపివ్రజములన్ నంతంబు నొందించెదన్
స్థిరచిత్తంబున ధైర్యముంగొనుము కించిద్భీతి లేకుండగన్. ౧౯

చ॥ వరవశినందనుల్ రణముఖంబున గూలిన వారియాతలన్
ధరణిజ వీడియున్ తనకుదానుగ వచ్చివరించు నిన్ను నో
సురపతివైరి నీమనము క్షోభముగాంచక నిశ్చయుండవై
కరమును సర్వకృత్యములు గాంచుము మున్నటిరీతి నెంతయు

—: మహోదరుడు కుంభకర్ణుమతము దూషించుట :-

క॥ అని పలుకు కుంభకర్ణుని
ఘన వాక్యములాలకించి తదురయముగ వా
తని దూషింపగ నెంచుచు
ననియె మహోదరుడు రాక్షసాధిపుతోడన్. ౨౦

నయవతి రాజనీతియును వంచితదేశము కాలమానముల్
పరనిజతారతమ్యముల బాతినెరింగిన రావణాధిపున్
కరమును జుల్కజేసి యిటు గాథ తరోత్తులంబల్కనేలొకో
యరయగ కాలభావమున నాదగగూడునా రాక్షసోత్తమా. 1686

ధరలోకం బురుషార్థముల్ జరుపు సందర్భంబుగా కార్యముల్
మరపై రివక్రిత జేయుమంచు దెలుపన్ కారత్వధర్మంబె యీ
వరమహాప్రాజ్ఞుడు లోకదిగ్విజయ సంకావ్యంబు నేరిచిరా
పురుషుల్ చేసెడికార్యముల్ వలపు నీవూహింపు దైత్యోత్తమా. 1687

ధర్మమధర్మముంగనక కామరసాక్తిని సీతదెచ్చు నా
కర్మఫలంబె యీగతిని కారియబెట్టె నటంచు బల్క నీ
మర్మము నీవెరుంగవు సుమా ఋషియందున నిట్టి వాక్యముల్
పెర్మిని బల్కగాని గమసింపవు నెందు నిదర్శనంబుగన్. 16 8

నీ సుతఫలంబు కర్మముల నెందును గానము పాపకర్మ సం
చయముల జేయువారు సుఖసంగతి గాంచుట పుణ్యకర్మముల్
నయముగ నాచరించెడి జనాళికి దుఃఖము గల్గు చుంటయున్
నయనములం గనుంగొనమె వ్యాయమె బల్కగ దానవోత్తమా.

ఫలనియమంబు నెంచగనవచ్చునె కృత్యములందు గాన నీ
యలఘుడు దానవాధిపుడు నాత్మగతంబగు కామితార్థియై
యులికులపేక్ష సీత జనకాత్మజ దెచ్చెను మేము దానికిం
దలపము దుష్కృతంబనుచు దానవ ధర్మముగాగ నెంచుచున్. 1690

మరియును యుద్ధభూమి సమమానమొకించుకలేక యేకతన్
సరిగెదనంచు బల్కితివి యక్కట నీకదియుక్తమౌనొకో
కరము ససాధ్యమౌను నధికంబుగ గీడుమగల్గు గావునన్
వరయుము యుక్తకార్యగతి సంచితరీతి దలంచి నెమ్మదిన్. 1691

ఉ॥ మానవనాథుఁడా కపి యతిమాత్రము రోషముగల్గు వానర
స్థాన నివాసులెల్ల మును దద్దయు జిచ్చెర రామునే జగ
త్త్రాణ పరాయణుండతడు దానవలోకము జంపనెంచి తీ
వ్రావేశ పాయక నీ రణరంగమునందున నర్వఁజేసెడిన్. 166

చ॥ విను ఘటకర్ణ రాముఁడతివీర భయంకరు డగ్నితుల్యుడున్
రణతలమందు శౌర్యుఁడయి మృత్యువు భంగిని గాల్చువాఁడు వా
తనిపరిపోర నెవ్వఁడును దారుణశీలుఁడు నీకు నవశ్యగా
వున నొకరుంత వేగిన నపూర్వ విపత్తు జనించు దప్పకన్. 167

మ॥ ధర హీనార్థుఁడు ద్రవ్యసంపదలచే దర్పించియున్నట్టి యా
యరిపై వైరము బూననొక్క యటుల న్నత్యుగ్రశౌర్యంబు ధ
వరుతో బోరుట స్వల్పకార్యమనుచు న్బాలించుమం దాశలన్
కరమున్ గల్గినవాఁడు పోరఁడు సుమీ కార్యంబు నే దెల్పితిన్. 168

ఉ॥ ప్రాకృతుగాగనెంచి రఘురాముని బోరగ నెంచినాడవే
నాకవిభుప్రతాపుడు ఘనాస్త్రవిదుండు నుదగ్రకార్ముకా
టోపపరాక్రముండు అరిసూదను డాతఁ డటంచు నెంచకన్
నీకత బోరనేగెదవె హీనదశల్ ఘటియిల్లు దప్పకన్. 169

—: మహోదరుఁడు సీతావశీకరణోపాయము దెలుపుట :—

క॥ అని కుంభకర్ణుఁ డాడను
వినుచు మహోదరుఁడు దనుజనాథుని గని యి
ట్లనియెను రాక్షసనాథా
వినిపింతు నుపాయమొండు వినఁగలిగినచో. 170

సీ॥ వినుము మహేంద్రారి యేనును కుంభకర్ణుండు
మరియు విద్యుజ్జిహ్వ వరబలుండు
సంహ్రాదియు వితర్దనార బలోత్కటముల్
పందాగ్నులట్టుల వచ్చిరి నేడు

రాము పదార్థంబు రణమొనరింపంగ
జనుచున్న వారని సకలజనము
వీథ పురంబునఁ జాట జమపుము సేవుర
మును రణంబునకేగి మనతరముగ

రాముతోఁ బోరి యనలపురంబు జొచ్చి
తమవంటము రక్తముల జూపి ధరణిపథుం
బంపివచ్చితిమని నమస్కారములను
సీత జేసెద మత్తుఁ నీవు చూడు. 1697

మన్ననఁ జేసి రామలక్ష్మణులు సైన్య
సహితులై యుద్ధభూమిని జచ్చిరనుచు
జాట ఁపుము పురి నిశాచరులు వినఁగ
వార్తలు నావార్త దిశలందు బహువిధముల. 1698

వనమునకేగి యా మరణవార్తను జానకితోడ దెల్పియున్
ఘనతర రత్నభూషణ విశేష సువస్తు చయంబులన్ సమ
ర్పణము నొసఁ జేసి సాంత్వమగు వాక్యములన్ వశమైనరీతిగా
నొనరుప జానగావలయు నొప్పగ నీకపట ప్రవృత్తిచే. 1699

పతి గతియించుటన్ విని యుపాయము కీమిని ముద్గు రామె యం
చింగలి పొల్కజీవితము జేసినదాటను చంచలత్వ సం
గతి వగి తాఁజనంబులను గారణమౌటను సీత నీ వశం
గతమగు నీయుపాయమున కార్యములన్నియు దీరునెంతయున్.

-: కుంభకర్ణుడు మహోదరుని దూరుట :-

అనవిని కుంభకర్ణుడు కటా యిది యేమి యుపాయమౌను నీ
వంచన నేఁగి పెద్దభుజ బలంబున దున్మెదు శత్రువీరులన్
మనమున వైరభావమును మానియు రీతిపొలంగి స్వేచ్ఛమై
మనుమని కుంభకర్ణుడను మాటలు నెందుకు వ్యర్థమౌనొకో. 1701

ఉ॥ ఘనమతులై సదారణ ప్రగల్భములాడరు రాజసెంత దా
వినబడ దుష్కృవాక్యముల వీడకజేయుదు రూరులౌట యీ
చెవటి మహోదరుండిపుడు చెప్పిన మాటలు విన్న వాని వం
చనితమనౌట తథ్యము నిశాచరవల్లభ నమ్ము మెంతయున్.

ఉ॥ హితము నెఱుంగజాలక మహీపతి యొద్ద వచించు వాగతిన్
సతతము వల్లెయంచు ననుసారముజేయు మహోదరాది దు
ష్టతతుల మూలమిట్టుల విషాదము గాంచితి నీవుగాదె దు
ర్మతుల ప్రబోధనల్ విని యరాజక పద్ధతి గాంచెనెంతయున్.

క॥ వీరల మూలంబున న
ర్వారిష్టము లిటులగలిగె బాంధవకోటా
గారంబులు నష్టంబయె
తీరని కష్టంబువచ్చె తెలుప నికేలా.

-: రావణుడు కుంభకర్ణుని ప్రశంసించుట :-

సీ॥ వినుము మహోదర మనుడిమహోదరుడు
రామబాణానల ప్రాప్తినొంది
బాధితాంగుండయి భయ మనమ్ముండయి
యనిజేయ జాలక్లినియె గాక
నీవముండగు వానినెందున గాంచను
బలమున హితమున బాంధవమున
యాతుధానుల బ్రోవనగు సద్గిజాలంబు
నెంచె నీవును నెరిగితిపుడు

గీ॥ భువనభీతి కరుండవు బోజ్యుడవు
శత్రుసంహార శక్తి విఖ్యాతుడవును
కదనరంగంబునను వేగ గదలవలయు
ఘోరరణాగ్రిమ దుర్వార కుంభకర్ణ.

కరమున కాలమూని త్రిజగంబులు భీతిల బాణమాడ్కి నం
గరమున నిల్చె రాముడును నాతని తమ్ముడు లక్ష్మణుండు నా
హరిపతి నిమ్నగాంచి కపిసైన్య యుతంబుగ భీతిలెంది కా
జరవక యుండునే మఱిని జాలిని శంకలు దీర్పతంబునన్. 1706

దనుజవిభుండు వాగతిని తమ్ముని గూర్చి ప్రశంసవాక్యముల్
వినబడ బల్కి తద్యము లభించు జయంబని యెంచి కా పున
ర్జనితుని గా దలంచుచు శశాంకుని భంగి వెలింగె నత్తరిన్
దనుజకులం ప్రవీరులును దద్దయు సంతసమంది రత్తరిన్. 1707

కాంచన భూషితం బకళిశకము శాత్రవభీకరంబు ని
ర్వంచిత భీమమున్ సురుచిరంబు మహోజ్జ్వల సంప్రదీప్తమున్
వంచితయక్షకిన్నర దివాకరమున్ సురనాథ వజ్రమున్
మించిన దీర్ఘశూలము నమేయ బలాఢ్యుడు కుంభకర్ణుడున్. 1708

కరమున దాల్చి పల్కె దశకంఠుని గాంచుచు దైత్యనాథ యీ
కంతురగాదులన్ కటనిశాయము లేదు నాకు నొక్కడన్
నరనికరంబుఁబట్టి తనివారగ మ్రింగెదు నొక్కపెట్టునన్
దురమున నాకు నడ్డపడు దోర్బలుఁడెవ్వడు కీశగత్రయిన్. 1709

అనుజుడు పల్కువాక్యము దశాననుడవ్వుడు నాలకించి యి
ట్లనియెను వానరుల్ గడుబలాఢ్యులు యుగ్రులు గాన నీవు ని
ర్పవ మనవానవాదులను భూరిపరాక్రమ విక్రమాఢ్యులన్
గొనుచును సంగరక్రియకు నొప్పుగ నేగుము యుత్తమిత్తరిన్. 1710

-: రావణుడు కుంభకర్ణు నలంకరించుట :-

అనుచు దశాననుం డావన బుడుదిగ్గి
కాంచన మాణిక్యసంఘటిత రత్న
హారము మకుటద్యు మహిత కంఠంబున
గ్రాలగా వైచి కనకాంగదముల

శా॥ ఆ రీతిం గపులేయుగా దనుజవర్యుండు నిశ్చింతుడై
ఘోరాకారతనుండై భూధరము సంక్షోభింపకన్ వృష్టిచే
ధీరత్వంబుగ నుండు భంగి యమరద్వేషిన్ వడిందాకి యా
వీరానీకము వేయు గండశిలలన్ వృక్షాదులన్ భిన్నమై. 1728

చ॥ ధరణిని గూలె వానరకదంబ విముక్తమహీజశైలముల్
గురుతర కుంభకర్ణ పటుకోప దవాగ్నికి దోహదంబుగా
కరమును ప్రజ్వలించి కపికాండవనంబు దహింపజొచ్చె భీ
కరుడగు దైత్యుఁ గాంచి యధికంబుగ బారిరి కీశసైన్యముల్ 1729

ఉ॥ శోణిత సిక్తగాత్రులయి క్షోణిని గూలెడువారు పోరు సం
యూతక ప్రాణభీతిమెయి మోములు జాచుచు బోవువారునున్
కానగరాక పల్లములు డాయుచు దాచెడివారు పర్వత
శ్రేణులబ్రాకువారునయి శీఘ్రగతిన్ కపిసైన్యమత్తరిన్. 1730

శా॥ ఘోరాకారుడు కుంభకర్ణుడటు సంక్షోభంబు గావింపగా
భూరివ్యాఘ్రముగన్న లేళ్ళగతి సంభూతాతి భీతాత్ములై
పారంజొచ్చిరి సేతుమార్గగతులై వృక్షాచర గ్రామణుల్
దూరీభూత పరాక్రమక్రమ రణోద్యోగ క్రియాచిత్తులై. 1731

ఉ॥ వాలిసుతుండు వారల నివారణ జేయగనెంచి పల్కె మీ
రాలముజేయలేక యిటులం బరువంగను పౌరుషంబె ధీ
శాలుర కిద్ది లక్షణమె సాధ్వసమేలను ప్రాణముల్ గడున్
మేలని యెంచినారె రణమేదిని హీనతనొంద న్యాయమే. 1732

ఉ॥ ఎందులనుండి వచ్చెనొ యహీనబలాఢ్యుడు వీనిజూచి దా
డెందమునం గలంగియు విడెన్ రణభూమి వనేచరావళుల్
పొందిక వీరలన్నిటుల బోవకదెత్తుము రాక్షసాళి వే
చందమువోరిలో గెలువ శక్తుడనౌదు వటంచు నెంచుచున్. 1733

-: అంగదుడు వానరసేనల మరల్చి ధైర్యము జెప్పుట :-

ఉ॥ వనచరసేన గాంచి యట వానరనాథుఁడు బెగ్గడిల్లె భీతులై
రణమున పారు దొప్పగునె ప్రాణభయంబిదేల యీ గతిన్
జనినను శూరవర్యులు ననమ్మతినిందను జేయుగాదె యీ
దనుజుని బట్టి యందరము దక్షత బంధనజేయఁగావలెన్. 1734

ఉ॥ కరములఁ వాయుధంబులను గైకొనకన్ పెనుభీతి బారినన్
ధరణిని యట్టివారలను తద్యశితల్గని నవ్వరొక్కొ యే
తెరగున హీనజీవితవిధిన్ గడపంగను నోపువారు ప్ర
మ్మరుడు సుధీరచిత్తులయి క్ష్మాపతి కార్యము దీర్పనందరున్. 1735

ఉ॥ తరుచర వీరులార కడుధన్యత ముత్తమవంశ జాతులై
పరవగ గూడునొక్కొ యిటు ప్రాకృత వానరులట్లు విక్రమ
స్ఫురితులు నయ్యు నీగతిని బోయిన మిమ్ముల పందలందు రీ
ధరణితలంబునందు విబుధాళియు హేళనజేయు నెంతయున్. 1736

సమయము వచ్చె నిప్పుడు భుజాబలమొప్ప రణస్థలంబునన్
సమద బలారివర్గముల సాహసతం బెదరంగ వీరుడా
యమితముగా ప్రగల్భముల నాడియరిన్ నెదురేగువేళ ని
ష్క్రమణము జేయగూడునె పరాక్రమతిం దలపోయ నిద్ధరన్. 1737

దనుజుని బట్టిపోరియు వధంబొనరించిన భూరికీర్తి చే
కొనుదుము నట్లుగాక మడియన్ మృతివంతవమైన స్వర్గమున్
గొనుదుము వీరవర్యులు గమంగాని వద్దె వినీతి మార్గముం
గనుడు ప్లవాటులార రఘుకాంతుని కార్యముదీర్ప నెంచుడీ. 1738

రణమున పోరుచు రౌరవ
మున గూలుటకంటె తరముబోరాటి మృతిం
గని బ్రహ్మలోక సుఖముం
గొనుట యుత్తమంబు కీశకుంజరులారా. 1739

చ॥ అరయ మహోన్నతంబున విహంగముగూలి లయంబుగాంచు నా
తెరగున రావణుండు రణధీరుని దారుణ బాణవహ్నిచే
కరమును నాశమొందు ఘటకర్ణుని గాంచెద రింతలోపలన్
పరువిడనేల దీనజన బాంధవుడార్త శరణ్యుడుండగన్. 1740

చ॥ అని పలియింప నావనచరావళి వల్కెను వాలిపుత్రకా
దనుజుడు లోకభీకర విధంబు ఘటించి రణాంతరంబునం
గనుకమ సేయజొచ్చె నిక నేనికపైనను నిల్వవచ్చు నే
తనువున ప్రాణముల్ బహువిధంబుల దీపియ తన్నెరుంగవే. 1741

క॥ నీవెంత చెప్పినను నీ
రావణు సోదరుని జూచి రణరంగమునన్
జావునకై పోజాలము
భూవలయమునందు నిద్ది భూతంబున్నే. 174

చ॥ అని పరువెత్తు వానరుల కడ్డముగా జని యంగదుండు నా
యినకులవర్యరాముని యహీనబలంబును వత్రతాళ చే
ధనము విదర్శనంబుగను ధైర్యము బొందగ వారి జేయ వా
వనచర సేన అంగదుని వాక్యవిధానము సమ్మతించుచున్. 174

ఉ॥ వానరపోతుగ్రీవన మహార్యము నౌట వనాటసేన వం
ద్రావము గొంతవీడి భయదాకృతి బూనిన కుంభకర్ణు దై
త్యేశుని సోదరున్ జెనక ధీరతగాంచియు గ్రమ్మరెన్ రణో
ల్లాసము కన్కలై రఘుకులాంబుధి సోముని కార్యసిద్ధికై. 174

చ॥ అనిలతనూజ నీల నలమైంద గవాక్ష సుషేణులాదిగా
వనచరవీరలోకము అపారబలిను కుంభకర్ణుతో
రణ మొనరింపనేగిరి పరాక్రమ ముద్ధతిజూపి యేకతన్
ఘనవిజయంబొ మృత్యువును గాంచుటయో యని నిశ్చయాత్ములై
గా

ఉధరములేకమై విపులఘోరవగంబును తాకునట్టి యా
విధమున వానిదాకి వటువృక్షశిలాచల శృంగభాగముల్
తదనుచరాదులన్ వివరి దారుణరీతి రణంబుజేయు నా
యదనున్ గ్రహించి దానవకులాధిప సోదరు దుగ్రమూర్తియై. 1746

తనువును బెంచి హస్తమున దారుణమౌగద బూని త్రిప్పుచున్
పెనగగ వచ్చు వానరుల పేలకువేలుగ పృథ్విగూల్చుచున్ .
వణులను పై వతేయుడు విహంగముజేయుచు మ్రింగుభంగి నా
దనుజుడు విక్రమించె బలదర్పముల న్నిగుడంగ జేయుచున్. 1747

వళయముపేళ జీవులను మృత్యుముఖంబున జేర్పునంతకుం
బలె రణభాగమందు పలుభంగుల వీరవిహారుడైన క్రో
ఞ్చు పటకర్ణుజూచి కపివర్గములొక్కట భూరిభూరుహా
వళుల శిలాందులంబరపె వారకదానవవీరునియగన్. 1748

సాధనోపయోగ నౌకలు
గడిసిన చండమున రథనికాయము నొకటై
వదలక వానరసైన్యము
బొదివిరి వివిధాస్త్రగతుల పృథుజవమొప్పన్. 1749

## -: హనుమంతుడు కుంభకర్ణుతో బోరి మూర్ఛిల్లుట :-

అనిలసుతుండు సంత పతగాధిపుకైవడి మింటనుండి సం
జనిత విశేషరోషుడయి సాంద్రశిలాతరు వృష్టిసల్పరా
వణునసుజుండు క్రోధుడయి శూలముల... తేలబూని తు
త్తునియలుగాగ జేసె వటుదోర్బలశక్తి శిలామహీజముల్. 1750

అనిమిషవైరి గాంచి మరుదాత్మజు డవ్వాడు క్రోధమూమచున్
ఘనతరశైలమొందు ఘటకర్ణునిపై వడినేయ దాకె వా
దనుజుని దేహ మాతడును తద్గిరితాడిత రక్తదేహుడై
కవపడె ఘాతుకోళితవగంబును బోలుచు సంచలింపకన్. 1751

మ: మునుకొంపంబును గుంభకర్ణుఁడు నటువంటియాత ప్రతాపంబునఁ
బనిగా దాల్చినశూలంబు దానవుఁడు తంతచ్ఛూలముం గొంచు నా
యనిలప్రోద్భవు వక్షభాగమున నేయన్ విహ్వలుండై మహా
నినదంబున్ బొనరించి కూలె ధరణిన్ ఘూర ఘోరాకృతిన్.

క: హనుమంతుఁడు రక్తంబా
ననమునఁ గ్రక్కుచును గూలె నడిగని హాహా
నినదంబులఁజేయుచు న
య్యనఁ బరవసౌద గ భీతి హరిబలమంతన్.

వ: నీలఋషభ శరభగవాక్షగంధమాదనులు కుంభకర్ణునిచే మూర్ఛిల్లుట

క: వనచరసేనల నత్తఱి
వనచర బలవల్లభుండు బలుఁడగు నీలుం
డని వీడఁబోకు డంచును
ఘనమతి బిరిగొలిపి యొకనగంబును గొనుచున్.

క: ఘటకర్ణుపైని వేయగ
చటులగతిని దానిముష్ట్యశనిపాతమునన్
పటుతరగతి బొడిచిన ది
క్తటముల వెదజల్లె చూర్ణితంబయి యంతన్.

సీ: అని నీలునకు సహాయార్థులై ఋషభుండు
శరభగవాక్ష విస్తారబలులు
గంధమాదనుఁడాదిగా గపివీరులు
పంచాగ్ను లట్టుల ప్రబలి కుంభ
కర్ణుపై వెదలుచు ఘనశిలాతరు వృష్టి
గురియంగ జేసిన క్రోధమూని
ఋషభుని బాహుల గ్రుచ్చి త్రిప్పిన నతఁడు
పృథివిపై బడె రుధిరంబు గ్రక్క

ముష్టిఘాతని కరటుడు మూర్ఛఁ బొందె
గూలె నీలుడు నాతువంక్రోధమునను
కంపదొప్ప గవాక్షుండు ఘోరముష్టి
పిరపరకల్ల నిగతి వృథివిగూలం. 1756

వారణమూర్ఛఁ బొంద వనిచారణ రీతిని కుంభకర్ణు డి
ద్ధారతి కీశసైన్యముల సర్వవిధంబుల బాధపెట్టి నా
క్ష్మారుహఖండితరుల్ నచం హిమవుడ్రికరిని దైత్య వి
స్ఫారుని దేహసీమపయి సత్వరతన్నగజాత్రి రుద్ధతిన్. 1757

వారల మ్రింగఁబొచ్చినను వానరులంత్తరి నాసికాపుట
ద్వారములందు దొచ్చియును దద్దయు కర్ణబిలంబులందు వి
స్తారముగా నయల్వడుచు దారుణదంత నఖాళిచేత నా
ధీరుని బాధపెట్టగను తీవ్రతరంబగు రోషమూనుచున్. 1758

కాలము కేల బూని పటుశుష్కవనంబు దహించుపావకుం
బోలుచు వానరావళిని భూరివిపద్దశ బొందజేయ నా
వేళను నంగదుండు నొకవృధ్వీధరంబును గొంచు హుంకృతిన్
జాలగ జేసిపైచె దనుజాధిపు సోదరు మూర్ధమందునన్. 1759

అదిగని కుంభకర్ణుడు మహాకుపితుండయి పాదఘట్టనన్
పృథివి చలింప వాలిసుతు వక్షమునందున భూరిశూలమున్
వదయుత వేయ దానిగని యాతడు ప్రక్కకు తప్పుకొంచు దు
ర్మదుడగు కుంభకర్ణుని యమందగతిన్ నిజముష్టి నేసెనన్. 1760

దనుజుడు ముష్టిఘాతమున దక్షణమందున మూర్ఛఁ బొంది యా
పెనుకను తెల్వి గాంచి పటుభీకర నాదము జేసి వాలి పు
త్రుని నిజముష్టిచే దాకవ దుర్భరమైన తదీయఘాతిచే
రణతలమందు నంగదుడు రక్తము గ్రక్కుచు గూలె నత్తరిన్. 1761

మ॥ అటులన్నంగదు గూలనేసి మనరాహా విక్రమంబొప్పగా
పటుదర్పంబున శూలముంగొనుచు రావ్వత్ప్రాను వేయంగ న
మటితో గ్రుంథయి వానిపై నరుగ నాకంజాప్తసూనుండు ను
త్కటరీతి న్నాకశైలముంగొనుచు సుగ్రీవాఖ్యుడై తాకినన్.

-: సుగ్రీవుడు కుంభకర్ణునిచే మూర్ఛిల్లుట :-

చ॥ కరమున భూధరంబు గొని గాఢతరోద్ధతి వచ్చుచున్న వా
నరపతి జూచి యాదనుజనాథ సహోదరుడుగ్రరూపుడై
దురమున జేయసెంచి పటుదోర్బల శక్తిని జూపి సంగర
స్థిరుడయి నిల్చె భూదర సుధీరత సంచలనంబు బొందకన్.

క॥ వనచర కోటిత పిత్రాం
గుని వనచరలోకములను గొంకెడివానిన్
ఘనశైలకాయు ఘటక
ర్ణుని గని యినజుండు పలికె రోషంబెసగన్.

చ॥ బలమదమత్తతన్ గపుల బల్వ్యరమిగ్రింగితి కీశవీరులం
గెలిచితివంచు నీవు మదినెంచుచు నిట్టుల విర్రవీగుచున్
దలపడినావు నాయెదుట దర్పముగల్గిన మత్ప్రయుక్త మీ
యలఘు ధరాధరంబుగతి సైపుము నీదగు శక్తి జూచెదన్.

చ॥ అని పలుకంగ నా దనుజదత్తురి పల్కె వనాటనాథ యీ
వును తలపంగ ఋక్షరజపుత్రుడవున్ వలవద్మయోనికిన్
మనుమడవౌదు కీశకులమాన్యుడవున్ వతిబారుమందపై
రణమున నిల్పువాడవని వృక్షచరాగ్రణి నం చెరుంగుడున్.

చ॥ అనతనయుండు నంతట నహీన జవంబున వానగంబు చ
య్యన నటు ద్రిప్పి యాదనుజనందున నేయగ వానిరొమ్ముపై
చెనకియు భూమిపైబడియె శీఘ్రగతిన్ బహురీతి వ్రయ్యలై
దనుజులు సంతసిల్లి గడుదైన్యము నొందిరి కీశలక్షతిన్.

మ॥ గిరిశృంగంబున కాతికుండయును నా గీర్వాణవైరిక నో
దరు దుగ్రాకృతి శూలముంగొనుచు దోర్దర్పంబు రెట్టించి యా
వరసీతా పతిమీద వేయ నది వీక్షించి వాతాత్మజుం
డురు వేగంబున దానిబట్టి విరిచెన్ మోకాల నత్యుద్ధతిన్. 1768

శూలంబు భగ్నమైనను
నాలోకనజేసి వానరానీకంబుల్
మేలగు సింహ వినాదము
లోలిని జేయంగ దొడగి నుత్సుకమొప్పన్. 1769

మ॥ తన శూలంబటు భగ్నమైన గని యా దైత్యుండు కోపించి యు
గ్రనగం బొండుగ్రహించి యా వనచరోర్వీనాథుపై వేయ త
ద్ఘనపాతంబున సూర్యనందనుడు చైతన్యంబు గోల్పోయి పృ
థ్వని గూలెన్ కపిలోకముత్తరని దాళీకాత్ములై పారగన్. 1770

దనుజులు హర్షమొంది నినదంబులు జేయగ కుంభకర్ణు డా
ఘన జవమారుతంబు తమకంబున మేఘము ద్రోయు భంగి నా
యినసుతు బట్టి యెత్తియు నిజేచ్ఛ భుజంబులపైని యుంచె లం
కను వెసజొచ్చి యున్ గృహమునందున నుంచగ నిచ్ఛజేయుచున్.

దానింగని భీతిల్లియు
వానరలోకంబు కదనభాగము విడుచున్
నానావిధముల బారగ
నా నగచరవరుడు వాయునందనుడంతన్. 1772

మనమున చింతజేసె కపిమాన్యుడు మూర్ఛితుడై నిశాటుచే
తను బడి లంకకేగెడిని దారుణమయ్యెడి నేమిజేతునో
తనువును మేరుపర్వత విధంబుగబెంచి పదియముష్టిచే
వినిహతుజేతునో దనుజవీరుని స్వామిని రక్షజేయగన్. 1773

చ॥ అంత వినిర్గతంబగుచు నయ్యసవెల్వడు వట్టి వర్ష ధా
రల వలె దైత్యువక్త్రమున రక్తపుధారలు గారుచుండ బ్రో
జ్వల యమునన్ని భాకృతిని వాతరవర్గము మ్రింగుచున్న ధీ
కలితుని కుంభకర్ణు దశకంఠునహోదరుగాంచె వత్తరిన్. 178

మ॥ కని రాముండిటు పల్కె రాక్షస వినుస్ అందింతు నన్నచ్చురా
పన బాణంబున బాముగానెరుగు నన్ సంగ్రామ రంగంబునన్
నన నాక్షసుడుగ్రుడై కపులపొడ్రిశాంతంబుగా వార్పుచున్
ఘనవక్త్రంబును కోరలన్దెరచి యా క్ష్మాభర్తతో నిట్లనెన్. 179

మ॥ ఖరుడన్గాను విరాధదైత్యుడను నే గా నా కబంధుండగా
నరయన్ తాటకనందనుండగుట కావ్యంబింక నావాసరే
శ్వరుడౌ వాలినిగాను శ్రీసిత సుపర్వాధీశుడన్ సుమ్ము దు
స్తరుడౌ దానవభర్త రావణుని భ్రాతన్ కుంభకర్ణాఖ్యుడన్. 179

మ॥ సురగంధర్వ భుజంగ యక్ష విహగ స్తోమంబులన్ ఖేచరి
చర విద్యాధర కిన్నరపనివరులన్ సంగ్రామ రంగంబునన్
మరణంబొందగ జేసియున్న పటుసామర్థ్యంబున నొవ్వ ము
ద్గరమున్ వాయుడు జూడ మియ్యదియె నేదండించి నిన్ ద్రుంచెదన్

మ॥ పరిహాసంబును జేయబోకు చెవులన్ భగ్నంబులై నాసికం
బరిచే ఖండితమయ్యె నంచు రఘురామా నాశరీరంబునన్
వరశౌర్యంబు బలంబు మిక్కుటనుగా వర్ధిల్లుచుండెన్ నిశా
చర నాథుండగు రావణానుజుడ విస్తార ప్రతాపాఢ్యుడన్. 180

చ॥ తరభుజశక్తి జూపి నను వారకనేయుము నీతెరంగు నే
నరసిన పిమ్మటన్ బలములన్నియు పీడితవెన్క నిన్ను నే
హరణము జేతుమ్రింగి దనుజావళి మోదముబొంద రావణుం
డురుతర సౌఖ్యవార్ధి పరమోత్సుకతన్ పడిదేలు నట్లుగన్. 180

### -: రాముఁడు కుంభకర్ణుని వధించుట :-

దనుజుం డట్టుల బల్కి రాఘవుఁడు క్రోధస్ఫూర్తి బాణాసనం
బున వజ్రాయుధ తుల్యసాయకములన్ పుంఖానుపుంఖంబుగా
ననుసంధించుచు నేయఁగాఁ బొదఁగె వా దైత్యుండు ఘోరాకృతిన్
ఘనశైలాకృతి చంచలింపక మహాగర్వాంధుఁడై యుండఁగన్. 1802

గురుతర సప్తసాలముల గూర్చిన భూరిశరంబు వానరే
శ్వరు వధియించినట్టి శితబాణము వారక సాగరంబుపై
బరపిన కాండముల్ దనుజవల్లభ సోదరుపైని నేయఁగా
కరమును కుంఠితంబులయె కాయ మొకించుక చంచలింపకన్. 1803

దనుజుఁడు ముద్గరంబుగొని దానవలోకము సంతసింపఁగా
వనచరసైన్యముం బొదివి వారలమోదుచు నుగ్రరూపుఁడై
సునిశితరామ బాణముల నూటిదెరల్చుచు సంగరావనిన్
ఘనతర వీరవిక్రమము గన్పడ దా విహరించుచుండఁగన్. 1804

రాముఁడు దానిఁగాంచి ఘనరౌద్రరస స్ఫురితాంతరంగుఁడై
యా మనుజాశనుం గదియు నట్టితెరం గనిలాస్త్రమేసినన్
భీమగతిన్నిశాచరుని భీకరముద్గర యుక్తబాహువున్
నామెయిదాకి ఖండనమొనర్చెను ఘోర భయంకరంబుగన్. 1805

ఘననీలాచల శృంగభంగి దెగి ముక్తంబైన హస్తంబు వెం
టనె కీశావళిపైని గూలఁగ వనాటానీకముల్ పెక్కు లా
రణభూమిన్ హతులైరి రామదనుజప్రాముఖ్య సంగ్రామముం
గనుచుం గంపితగాత్రులై పరచె సేనానీకముల్ దిక్కులన్. 1806

కులిశ విఖండితంబునగు క్షోణిధరంబటులుండి యమ్మహా
బలుఁడొక సాలవృక్షమును బట్టి రఘూద్వహుపైని వేయ భూ
తిలకుఁడు నైంద్రబాణము గదియ కరంబున నేయ నాతఁడున్
విలులిత హస్తుఁడయ్యె రజనీచరవీరులు చూచుచుండఁగన్. 1807

మ॥ గిరిసంకాశ తదీయకాయమువడిన్ గీర్వాణవైరి ప్రజన్
తరుసంచారుల యందు ద్రొక్కి తనువుల్ ధ్వంసంబులై కూలె భీ
కర పాదంబులొనర్చుచున్ దమజుడా కాలంబునన్ రాముడిన్
దరియన్వచ్చెను మ్రింగనెంచుచు కరద్వంద్వంబు గోల్పోవుటన్.

ఉ॥ అమ్మనుజేశ్వరుండు దనుజాతను గాంచి సితార్ధచంద్ర బా
ణమ్ముల వానిపాదముల నత్తరినేయగ ఖండితంబులై
యమ్మహి గూలె భూరికుధరావళి దిక్కులనున్ ప్రతిధ్వనుల్
గ్రమ్మగ ఘోరనాదముల సల్పుచు రాక్షసుడంత గూలినన్. 18

ఉ॥ ఖండిత హస్తపాద ఘటకర్ణుడు రాదబవహ్ని రీతిగా
మండుచు వక్త్రముం దెరచి క్ష్మావరుపై శశి మ్రింగ రాహువు
ద్దండత జేరు తంగి గడు దర్పము సన్నరుదెంచ రాఘవుం
డుగ్రత గాంచి ఘోరసమరోత్సుకుడై దనుజాంతకాత్ముడై. 18

చ॥ దనుజు ముఖంబునందు నిశితాంబక రాజిని వర్షజేయ వా
ననగత తీవ్రబాణముల నత్తరి క్షోభము జెంది యేమియున్
గనగను పల్కలేక నదనాంతరమందు పరిభ్రమించె న
య్యనఘుం డత్యుదంత దనుజేశ సహోదరు ద్రుంచ నెంచుచున్. 18

మ॥ తరుణార్క ప్రతిమానమౌ బహుళ సంతాపంబు ప్రతాపమున్
సరిలేకాంతము వాయువేగ సమ వీర్యాధిక్యమున్ భూరి ని
ష్ఠుర కాలాశనిపాత తుల్యము మహాక్షోభైంద్ర బాణంబు భూ
వరుడత్యుద్ధతి మంత్రపూర్వకముగా వైరిన్ బ్రయోగించినన్. 1

ఉ॥ రామ విముక్త భూరిశరరాజము సర్వదిగంతరంబు తే
జోమయము న్నొనర్చుచును క్ష్మాధరాకృతి బోలు దానవో
ద్దాము శిరంబు ఖండనము తక్షణమందున జేసె నద్దియున్
వ్యోమ తలంబుపై నెగసె భూరి భయంకర నిష్ఠురంబుగన్. 1

మణిగణ కుండలప్రభల మండితమౌ తు పునర్వ్యమాదుకం
డున తెలవారు చంద్రుగతి దోచుచు భీతికరంబు లంకయం
దున గల గోపురాదులను నొక్కుచు గూలిన చూర్ణితంబుల
య్యెను ననిప్రాణముల్ విడిననిక నిశాచరలోక మత్తరిన్. 1814

హిమనగ తుల్యమైన దనుజేంద్రుని పోవరు కాయ మూనము
ద్రిమునను గూలి యందుగల గ్రాహ ఝషాహి తిమింగలాది జా
తము వడిదాకి మర్దనము దద్దయుజేసి మహాద్భుతంబుగా
నమిత వినాదమొప్పగను వంబుధి గూలె భయంకరాకృతిన్. 1815

రణమున కుంభకర్ణుడు పరాజితుడై నిహతుండునైన దా
నను మహినంచలించె గగనస్థలి దేవభుజంగ సిద్ధ సా
ధ్యనిచయ కిన్నరాదులు మహర్షులు రాముని విక్రమంబులన్
వినుతిని జేయుచున్ హృదయవీధిని హర్షము బొందిరెంతయున్.

మును హరినిగాంచి పారెడు
దనుజాలగతి రామచంద్ర ధరణీ విభునిం
గని రాక్షస సైన్యంబులు
రణభూమిని వీడిపారి రత్తరి భీతిన్. 1817

వనచర లోకంబత్తరి
ఘనవికసిత పద్మతుల్య కలితాననులై
మనుజేంద్రు బూజజేసిరి
వినుతగతిన్ హర్షహృదయ విస్మితులగుచున్. 1818

-: రావణుడు కుంభకర్ణు మృతివిని దుఃఖించుట :-

హతశేషులైన యా యాతుధానులు కొంద
రప్పుడు రావణు నధికభీతి
చేరి వచించె దనుజేంద్ర నీతమ్ముండు
కాలాయుధగుడు ముగ్రంబుగాగ

రణమున పెక్కండ్ర దునుమాడి దశరథ
తనయు బాణముంచేతను తరమున
పాదద్వయము డెక్క పటుదానవహ్ని చే
దగ్ధమయ్యెడు మహా తరువుభంగి

గీ॥ పూర్వభాగంబు శిరము లంకోర్వి బడియె
గాయమటు వనధిపై తరంగముల బడియె
దేవవిభుతుల్య రాముని తేజమునను
శాంతి ఘటకర్ణుఁ డొందె నిశాచరేంద్ర. 181

క॥ అనుజుడు రామునిచేతను
వినిహతు డయినట్టి వార్త విని దశకంఠుం
డనుపమ దుఃఖాత్ముండయి
తనువు మరచి ధరణిగూలె తన్మోహమునన్. 182

గీ॥ తన పితృవ్యుని మరణవార్తను వినంగ
త్రిశిరుడు నరాంతకుండును ధీరులైన
వారలతికాయ దేవాంతకోరు బలులు
రోదనమొనర్చె దశకంఠు సోదరునకు. 183

గీ॥ రామచంద్రుని చేత ఘోరాజియందు
భ్రాతమృతివిని యా మహాపార్శ్వ దనుజ
వరుడు మరిమహోదర వృధుబలుండు
శోక సంచలితాత్ములై క్షోభఁజెందె. 184

చ॥ దనుజవిభుండు మానవగతంబుగ గొంతట తెల్వి గాంచి యా
దనుజుని చింతజేయుచు మహావిపదంబుధి మగ్ని దీర్ఘ రో
దనము నొనర్చె వాని ప్రచండదర్పములన్ గొనియాడుచున్ విషా
దనయన భాష్పబిందువుల దద్దయు రాలగ వారిచెంగటన్. 185

హావీరాగ్రణి వైరిలోకహరణా హాభూరిబాహా బల
ప్రావీణ్యా దశకంఠసోదరుడవై భవ్యప్రతాపుండవై
దైవప్రేరిత శత్రురాఘవుని చేతం గూలి యీ రీతిగా
పోవంజాలితె నన్ను వీడి యనిలో పోరాడుచున్నద్ధతిన్. 1824

మనమున నాదుచింత మటుమాయము జేయక బాంధవాశ్రితుల్
దనుజుల రక్షజేయకయ దక్షతశత్రుల కీటణంపకన్
జనవిభుతీవ్రబాణముల దాపును బొందితి జంటనైన నీ
యనుజుని నన్ను వీడి యిటులక్కట యేగితె కాలవీటికిన్. 1825

తలపగ నాకు సంగరవిధంబున దక్షిణహస్తమేగ నీ
కలనజయింతు శాత్రవుల కార్యవిభంగము సంఘటిల్లె నీ
బలము బలాండవై త్రిదశవర్యుల యుద్ధమునం జయించి మున్
జెలగిన వీరవర్యుడవు చేటును బొందితె రాముచేతులన్. 1826

మును రణభూములందు బలముంగొని భీకరవజ్రపాతమున్
మనమున నూహజేయని యమందపరాక్రమ శాలివయ్యు నీ
మనుజుని రామబాణమున మాయమబొందుట చింతజేయగా
ఘనతర కష్టకాలగతి కన్పడె వింతగ నేమి జేయుదున్. 1827

కొండల నెంతయు బిండిచేయగ గల్గు
    పటుతరముష్టి యెవ్వనికి గలిగె
నసురవర్గంబుల నవలీలగా ద్రుంచు
    హరిచక్రమెవనికి హారమయ్యె
జీవుల ప్రాణముల్ జేకొను యమదండ
    మరయ నెవనికి సుమమాల యయ్యె
పాశిపాశంబులే బలభవ్యబాహుల
    కవదలంకార కాంగదములయ్యె

గీ। ధీరచిత్తుండవై మహాఘోర సంగ
రంబులందున విక్రమ క్రమము జూపు
వీరవర్యుండ వయ్యును విధివశమున
మనుజమాత్రుని చేగొంటి మరణమిపుడు.

చ। మునుపటి విక్రమంబులెట బోయెనొ సర్వసుపర్వలోకముల్
అనల పరేతరాజ ధనదాయక దేవతరాజ ముఖ్యులన్
మనముల మోదమందెడి ప్రమాదతః నాకిక పంచటిల్లె లం
కను వెసబొచ్చి వారలిక కష్టములం గలిగింతు రెంతయున్.

చ। విపుల పరాక్రముండ దివివీధి సుఖంబుల గోరనేల, లం
క పుడమికేల రాజ్యపదకాంక్షలికేలను సీతయేల నీ
ద్విప రథవాజిసైన్యములవేలను సర్వము గోలుపోయితిన్
నృపవరుచేత నీవిటు రణాంతరమందున గూలిపోవుటన్.

చ। నిను నని గూల్చినట్టి ధరణీశుని బట్టి వధింపకున్న జీ
వనమిక నేల నాకు బలవంతుడనయ్యును నిష్ఫలంబుగా
పున నరనాథుడుగ్రత నది పొందనిచో మరణంబుగొంట మే
లని తలపోతు నిన్ను విడి యక్కట జీవనమెట్లు జేసెదన్.

చ। మును చతురాత్ముడున్ మహిత పుణ్యుడు సోదరుడైన యా విభీ
షణుడు వచించు వాక్యముల నమ్మతి జూపక గర్వితుండనై
కనలితి వారివాక్యము లఖండగతి న్నిజమయ్యె కామ సం
జనిత విమూఢమానసుడు సాత్విక బుద్ధుల సమ్మతించునే.

మ। దురహంకారము బూని వానివతలో ద్రోయించి నిందించి యా
పురముం బాయగనాజ్ఞ జేసితిని యాపుణ్యుండు బోధించు బం
ధుర నీతి న్వినకట్టి వాదనయి యా దుష్కృత్య సంపాదనం
గరముంగుందుచు నుంటి కర్మఫల భోక్తన్నైతి నీ రీతిగన్.

అని పరిదేవన జేసెడి
దనుజవిభుని గాంచి త్రిశిరదైత్యుడు దశకం
ఠుని శాంతిబరుప నీగతి
వినిపించెను ధీరచిత్త వృత్తముగాగన్. 1034

ఘనబల శూరుడైన ఘటకర్ణుడు సంగర రంగమందునన్
దునిమెను పెక్కుకాత్రివుల దోర్బల విక్రమ జృంభమాణుడై
రణమున యుద్ధధర్మగతి ప్రాణములిచ్చెడి వానికిట్లు చిం
తనమును జేయగూడునొకొ దైత్యకులాధిప శత్రుశోషణా. 1035

భువన భయంకరుండవును భూరిబలుండవె కాక సర్వ శా
స్త్రవిదుడ విట్లు ప్రాకృతిని సంగతి దుఃఖము బొందగూడునే
దివిజులగెల్చినట్టి రణధీరుడ విట్టుల చింత బొందినన్
చివరకు జాల్కకేయు నిను శీఘ్రగతి న్నరివీరులెంతయున్. 1036

సరసిజగర్భ దత్తమగు శక్తులు భూరితరాస్త్ర శస్త్రముల్
పరిమితి లేకయున్న చతురంగబలంబులు గల్గియుండ నే
కొరతయు నీకు లేదు గద క్షోభము బొందగ నీకు గూడునే
యరిజనమర్దనా సురభయంకర రాక్షస లోకనాయకా. 1837

రణరంగంబున నాయుధంబు గొనకస్ ప్రాబల్యమొప్పారగా
దునుమంజాలిన దేవతానికరమున్ దోస్సారముంజూపుచున్
వినుకానేక సమస్తశస్త్రకర సంవేద్యుండనై నేడు మ
ర్త్యుని రాముం దునుమంగ జాలుటకు వీరోత్తంస చింతించెదే. 1838

దనుజవరేణ్య నీవిపుడు తాల్మివహింపుము నేనయొక్కడన్
రణమున కేగి ఘోరపటి రాజి విహంగమనాథు బోలికన్
ఘనతరలీల శత్రుచయ కాండములన్ వెసజీల్చివైచెదన్
దునిమెద జంభశాసనుడు దుంచిన రీతిని వానకీపతిన్. 1839

రావణుడు త్రిశిర నరాంతక దేవాంతక అతికాయ మహోదర
-: మహాపార్శ్వుల యుద్ధమునకు బంపుట :-

చ॥ అని త్రిశిరుండు బల్క దనుజాధిపు డత్తరి ధైర్యయుక్తుడై
తనకు పువర్ప్రపంబు ఘటితంబయె నంచు దలంచి వానినిన్
రణమునకుత్సహించియు నరాంతమహోదర ముఖ్యవీరులన్
పనిచె సహాయులై నిలుచుతంగి మహారణరంగమందునన్. 1840

సీ॥ అంత దేవాంత నరాంత మహోదరు
అతికాయుడును మహాలఘుబలుండు
నగు మహాపార్శ్వుండు నమిత దుర్వార సం
గర కోవిదాత్ములు గగనచరులు
రణ దుర్జయులు దేవరాజ వరాశ్రముల్
నిర్జిత గీర్వాణ నిపుణమతులు
భాస్కర సంకాశ పటుతరతేజులు
నవ్వర్ధనాములు నతులబలులు

గీ॥ నందు రావణు నందనులైన త్రిశిర
నాము డతికాయుడును మహోద్దామ బలులు
నైన దేవాంత నరాంతకాది దనుజ
వరులు రావణు దరిజేర వచ్చియుండె. 1841

చ॥ తనయుల తట్ర్వరంగని ముదంబున గౌగిలియందు జేర్చి భూ
షణములు తాల్పజేసి పటుహారములై తనువేదమంత్ర ని
స్వనముల దీవనల్ నలిపి తంగరభూమికి బొందటంచు వా
జ్ఞను బరపెన్ జయంబుగొని సత్వరతన్ జనుదెంచు రీతిగన్. 1842

గీ॥ తనయులకు రక్షణార్థంబు తమ్ములైన
యామహోదర మహాపార్శ్వు లనెడు దైత్య
వరులబంపెను నంత రావణుని చుట్టు
తిరిగిరి ప్రదక్షిణల్ నలిపి కరముభక్తి. 1843

సీ॥ నీలమేఘాకృతిఁ బోలు కాయము దాని
భూరిభూధరమును బోలు దాని
బహుళశక్తకాంత సంశోభితంబగు దాని
నైరావతాంశచే నలరుదాని
మదజలధారచే మహి పంకమగు దాని
కుధరంబుతోఁ దఁ దీకొనెడి దాని
దిగ్గజ కుంభవిస్తృతిని బొందిన దాని
పృథుదీర్ఘ దంతముల్ వరలు దాని

గీ॥ వతుల గంభీరమగు సుదర్శనాఖ్య గజము
పై వధివసించి యస్తాద్రియందు వెలుగు
భాస్కరుని బోలి యనికి దుర్వారగతి మ
హోదరుండేగె మృత్యువు సోదరుండు. 1844

క॥ వెనువెంటనె జనియెను గజ
గణముల తురగవ్రజంబు కాంచనరథముల్
ఘనవీర భటనికాయము
రణమునకై దనుజ రాజ లక్ష్యముగాగన్. 1845

మ॥ వర తురగాన్వితంబు మఱి భాసురమైన ధ్వజంబుగల్గి సం
భరిత సమస్త శస్త్రశరబంధురమై యలరారు దాని సుం
దరతుడి హేమనిర్మితమునైన శతాంగముపై వసించి భీ
కర ధనువంది యేగె ననికై త్రిశిరాఖ్యుడు కౌతుకంబునన్. 1846

చ॥ ఘనతర రత్నకాంచనవికారకిరీటముతైన మహాదు నా
దనుజుని మూర్ధభాగముల తళ్కులొసంగుచు మెఱసి యుంచు కొం
డనగల రత్నశృంగము లనంగను ఘోరవిశేషకారుడున్
జనియెను వానివెంటను గజాశ్వశతాంగ బలాదికంబులున్. 1847

సీ॥ అనిమిషలోక మే దనుజాపేరున విశ్వ
    సంతాపములగుచు సంచలనమొందు
అతిరథ శూరుడం చఖిల జనంబులు
    బెగడుచునుండు నే ఘోరబలుని
ధామతేజంబు సురపతి విక్రమంబులు
    నెవ్వానియందున నెగడుచుండు
శర్మగిరీంద్రంబు శంగి మగ్రంబునై
    తనువునెవ్వానికి దనరియుండు

గీ॥ రాజనీతి విరాజిత ఖ్యాతి యెవడు
భూరిబలవిక్రమాస్థాన భూమియెవడు
సంగర వినిర్జితామర చయుడెవండు
నట్టి యతికాయుడతుల వేగాన్వితముగ. 16

చ॥ కరిరథవాజి సద్భట నికాయము లొక్కట చుట్టుముట్టి భూ
ధరమును భూరివృక్షసముదాయము గప్పిన లీలనుండ భీ
కరగతి నవ్యకాంక్ష నతికాయుడు నేగెను జంభసూదనుం
డురుగతి దేవతా నికరయుక్తుడునై చనుదట్టి పోలికన్. 18

చ॥ అతనిపాటవంబు గమనాంచిత వేగము శౌర్యయుక్త ప్ర
స్ఫుత మతిజవంపదల వీక్షణజేసి దశాననుండు సం
జాత ముదాత్ముడయ్యెను రణాంతరమందు జయంబుదప్పకన్
నీతడు పొందునంచును ననేకవిధంబుల చింతజేయుచున్. 18

చ॥ సురపతి వాజియోయనగ శోభిలు సైంధవ రాజమెక్కి వి
స్ఫురదురు ఖడ్గముంగొనుచు భూషణముల్ ధరియించి మించి శ
కర సుతు డా కుమారుడు ప్రకాశగతిన్ శిఖినేగు రీతి జం
ధురముగ దానవాంతకుడు సుగ్రగతి న్మనికేగె శత్రురిన్. 16

క॥ అతని వెనుకను తురగ
వ్రాతము గజబలము వీరభట రథచయమున్
భూతల రజము నభోంతర
రీతిని బర్వంగవేగ దృఢగతి మిగులన్. 1852

మ॥ మును జంభారి ధరాధరప్రతతి దంభోళి న్విదారించు తీ
రున వజ్రోపమమాన భూరిపరిఘన్ బ్రోద్యద్గతిందాల్చి యా
వనజాతాక్షుడు మందరాద్రిగొని చేవన్నెత్తులీలన్ ఆన
ద్విసుతప్రక్రియ జన్యకాంక్ష నరిగెన్ దేవాంతకుండత్తరిన్. 1853

క॥ కరిరథతురగ వ్రజమును
వరభట సంతానములును బహుళముగాగన్
శరధిని బోలుచు వెంబడి
నరిగెను రణరంగభూమి నవ్వాడు జేరన్. 1854

మ॥ గిరిసంకాశ సుదీర్ఘకాయుడగుచున్ కేలంగదంబూని భీ
కరరీతిన్ వలయాకృతిం బరపుచుం గర్వాంధుడై యాధనే
శ్వరు చందంబున భూరిసైన్యయుతుడై సంగ్రామకాంక్షారతిన్
వరవేగంబున నేగె నత్తరి మహాపార్శ్వుండు ధీరాత్ముడై. 1855

చ॥ అరయగ సర్వకాలములయందు సముద్రముపొంగి వారిసం
భరిత మహానదీజనకు భంగి మహోదరకాంక్షచిత్తులై
వరచతురంగ భూరిబలవర్గము వెంటనురాగ బోయె బం
ధురగతి భూరజంబు గగనోర్విని బర్వుచు వాక్రమింపగన్. 1856

ఉ॥ రావణ పుత్రులంత నవరత్న సుకాంతుల భ్రాజమానులై
యావిధు భాస్కరాదిక మహాగ్రహరాజని బోలె దానవ
ప్రావృత సైన్యమధ్యమున భాసురరీతి వెలింగి రత్తరిన్
భావితశౌర్య ధుర్యులు రణాంతర భూమికి వేగవేగగన్. 1857

చ॥ దనుజ కరస్థమైన వివిధాయుధ వర్గములెల్ల శ్వేతఖాం
తినిగొని శారదాభ్రముగతిన్ జెలువొందుచు నాకసంబునన్
ఘనమగు రాజహంసతతి గ్రాలెడుభంగిని దోచియుండెడిన్
రణమునుజేయ వెడలె రావణసైన్యము చిత్రయుక్తమై. 185

చ॥ మరణము బొందుటో యరుల మర్దనజేసి వధించుటో యటం
చరయుచు నిశ్చితాత్ములయి సంగరభూమికి వేగఁజొచ్చె ధీ
కరగతి రావణాత్మజుల కార్ముక నాదములం ఘటించుచున్
నరిబల మర్దనాతురత సద్భుతరీతిని క్ష్మాచలింపగన్. 100

చ॥ కులగిరి గహ్వరంబు లధికోన్నతమై ప్రతినిస్వనంబులం
జెలఁగగ సాగరాంతర విశేష తరంగములంత బొంగి భూ
స్థలము నతిక్రమింప పరుషాహతి కుంభము భగ్నమైన రీ
తుం బటహోద్భవాంతము విధూతము నొచ్చును బీటలొందగన్. 86

చ॥ కరిచయ ఘీంకృతుల్ తురగ గాఢ సముజ్జ్వల హేషలున్ రథో
త్కర గురునేమి నిస్వన మృదంగ మహాభట సింహనాదముల్
తరుచయి భూరిభేరి నినదంబులు మిన్నును ముట్టనొక్కటన్
సరిగిరి రావణాధిపుని సందమలత్తరి సంగరోత్సవమై 116

చ॥ పురమును నిర్గమించి యటుపోవగ వారలుగాంచె భూరి భూ
ధర శిఖరంబులన్ తరులదర్పము మీరగ దాల్చి సంగర
స్థిరులయి ఘోట్టవారు చనుదెంచురొ యంచు నిరీక్షజేయు వా
నర నికరంబులన్ ఘనుల సంతకతుల్యుల నుగ్రరూపులన్. 862

-: వానర రాక్షసుల యుద్ధము :-

ఉ॥ భూరితరోగ్ర గంధగజ [illegible] హయరాజి [illegible] పంక్తులన్
వీరభటాళి గూడి [illegible] కంపము బొంద [illegible]
ఘోర [illegible] క్షోభకుబేళ్ల [illegible] రాక్షసా
వారముతోడ వచ్చు బలవర్గము గాంచెను కీశసైన్యముల్.

దనుజాధీశ వటాటరాజ బలముల్ దర్పోద్ధతిన్మొండొరుల్
ఘనగర్జా నినదంబు నల్పుచును వీకందాకి రత్యంత భీ
షణ సంగ్రామము జయాభిలాషలగుచున్ పర్వంతహో చక్రమా
జనితోదగ్ర రణప్రభావమునకున్ చాంచల్యముం బొందగన్. 1864

వానరసైన్యమంత బలవర్ధితులై విజయంబు గోరుచున్
దానవసైన్య రంగమును దాకుచు సంగరముఖ్యమందు పా
షాణ తరుప్రకాండముల సత్వరతం గురిపించి పూర్వ గి
ర్యాద బలంబులన్ జెనకె రగ్నదశం ఘటియింపజేయుచున్ 1865

లపడి రెండు పక్షములు దర్పము మీరగ పూర్వ పశ్చిమం
ులల గల వార్ధులట్లు రణభూమిని ఢీకొనె కిరలంత ప్రో
ద్యల వివిధాయుధాళిరణ భాసితులైన నిశాటసైన్యమున్
సతులజేయ బొచ్చిరి యతంద్ర భుజాబలజాతరోషులై. 1866

హుపాదపాకీర్ణ పృథ్వీధరంబుల
రథికులపైకి పర్వంగ విసరి
రిసంఘముల మీద ఘనసాలవృక్షముల్
భూరి జవోద్ధతి బోలవైచి
హస్తితుల్య ప్రమాణంబగు పాషాణ
ములను నాశ్వికులపై బోవరువ్వి
మారితరోగ్రంపు ముష్టిఘాతంబుల
భటసంచయంబుల ఒట్టి హొడిచి

రవిక్రమ మొప్పగ దారుణముగ
సంగరక్రీడ వనచర సైన్యమపుడు
సలవ దానవ నిశాచర సైన్యమందు
వివిధభంగుల దీనత భీతిగలిగె. 1867

చ౹ శిరములు భగ్నమై మఱియు శీర్షములొక్కట ఖండితంబులై
కరములు చూర్ణితాంగులయి క్ష్మతలిగూలిరి రోషకోంటు వా
నర నికరంబు చే దనుజనాథు బలంబులు నష్టమైన దా
నిని గమనించి యుద్ధమది నిర్భరమై రణ సాహసంబునన్.

మ౹ శరజాలంబులు పాశిసముద్గర గదా జాలాదిక వ్రాతముల్
బరపెన్ వానరపై నిశాచరులు కంఠద్వేగమ్మైపర్వత
చ్ఛిరముల్ ధీకొనుచున్ విఖండితములై చేష్టావిహీనంబులై
ధరణిం గూలెను దానవాళి రణస్థానంబునం దత్క్షణన్.

సీ౹ అంత నా రణభూమి యమిత రక్తప్రవా
హంబయి యట పర్వతంబు భంగి
దనుజ వానరలోక మృత కళేబరములు
గాకతత్వెత్తు మహోగ్రంబుగాగ
మాంసాస్థిమగ్నమై మఱియు విఖండిత
వివిధశస్త్రాస్త్ర విక్షతమయ్యె
నుభయపక్షంబులం దుగ్రులు పెనగొని
పోరాడ దొడగిరి భూమిపదము

గీ౹ దనుజులెంతయు వివిధాస్త్ర తతులచేత
వానరుల శైల శిలవృక్ష వర్షములను
నొందురుల దాకి వేసిరి యుద్ధమపుడు
దనుజ బలమందు క్షీణత గలుగనయ్యె.

క౹ దానిని గనుచును సురసం
తానంబులు గగనతలము నందున కపులన్
మానుగ స్తుతియించిరి యుధి
కానందము మీర సమధి కాశ్చర్యమునన్.

-: అంగదుడు నరాంతకుని వధించుట :-

చ॥ కనుమదె యంగదా దివిజ కంటకుడైన నరాంతకుండు వా
జిని వసియించి ప్రాసమున జెందగ జొచ్చె వనాటసేన గా
వున వడినేగి వానిరణభూమి నెదిర్చి వధింపుమింక వా
జిని విహరింపజొచ్చె మన సేనలు భీతిలి పారుచుండెడిన్. 1878

చ॥ అనవిని యంగదుండు జలదంబులనుండి వినిర్గమించు భా
నుని గతి కీశసైన్యముల నుండి బయల్పడి ధాతుశోభితా
ద్రిని పరిబోలుచున్ మదకరింగని సింహము ఝుమ్మి వారణం
బునకయి గర్జజేయుచును బోయెదిరె వడి నానరాంతకున్. 1879

చ॥ కని యిటు పల్కె నోరి దశకంఠ కుమారక దర్పలాత్ము లౌ
వనచర లోకమున్నిటుల బాధలబెట్టుట శౌర్యమెక్కొ నీ
కును గలదేని దోర్బల మకుంఠిత తేజుని నన్ను దాకి యా
జిని విజయంబు గాంచుము నిశాచరాధమ మాటలేటికిన్. 1880

ఉ॥ దాన నరాంతకుండు కుపితాత్ముడునై పగగొన్న పాము చం
దాన మహోగ్రతంగి బలధాముని యంగదు దాకి ఖడ్గమున్
బూనిక పై చివన్మిగుల భూరిపటిష్ఠము వజ్రసన్నిభం
బైన వనాటవీర హృదయస్థలి దాకియు వ్రయ్యలై పడెన్. 18 1

శా॥ ప్రాసంబిట్టుల నేలగూలిన గని ప్రాముఖ్యదర్పేశ నా
వేశం బొప్ప నరాంతకాశ్వము ను వృథ్వింగూలగా ముష్టిచే
నేసెన్ నాగతి ప్రాసమున్ హయము దానెంతేని గోల్పోయి వం
త్రాసంబొందక వానరాంతకుడు యుద్ధాయత్తుడై యుగ్రతన్. .8'2

చ॥ కులిశ నిభంబునున్ వసాధికోగ్ర విభీషక ముష్టిచేత న
య్యలఘుని వాలిసూను శిరమందున తీవ్రతనేయ ఘూర్ణిచే
చలనము బొంది నెత్తురు వెసంగడు గ్రక్కుచు నంగదుండు భూ
స్థలిపయి గూలె వజ్రహత క్ష్మాధరమొక్కట గూలు పోలికన్. 1883

మునిగిన మూర్ఛనుండి కపిముఖ్యుడు వెంటనె తెల్విగాంచి యా
దనుజుని వక్షమందు గదదక్షత భూధరశృంగతుల్యమౌ
ఘనతరముష్టిచే బొడువ గ్రక్కున వాతడు భిన్నవక్షుడై
తనుగతమైన ప్రాణముల తక్షణమందున వీడెనంతయున్. 1884

రుధిరముచేత గూడ పృథివీధరమట్లు నరాంతకుండు నం
గద ఘనముష్టిచేత కదనాంతర మందున గూల దానవుల్
బెదరుచు పారజొచ్చె వినువీధిని నంగదు సంస్తుతించిరా
త్రిదశులు సకలలోకములు తీవ్రతజేసెను హర్షనాదముల్. 1885

ఘనబలు డంగదుండు దశకంఠసుతున్ వధియించి రామభ
ద్రునకు హితంబు గూర్చియును తుష్టిని బొందక వీరరాక్షసా
ది నికరమున్ వధింపగ మదిం దలపోసి ప్రచండ విక్రమం
బున విహరింపజొచ్చె రణభూమిని యుద్ధసముత్సుకుండునై. 1886

పరితప్తుండయి భ్రాతగూలుటను క్రోధస్ఫూర్తి దేవాంతకుం
డురు వేగంబున నంగదుంగదిసె నాయుద్వేగమున్ జూచుచున్
పరిరక్షింపగ వాని సోదరులు సంతదీప్తిమై నా మహో
దరుడున్ త్రిశిరాఖ్యుడున్ వెడలె యుద్ధాయత్తులై యుత్తరిన్.

దానవవీర త్రితయము
నూనంబుగ చుట్టుముట్టి యంగదు దాకన్
వానరశ్రేష్ఠి సుతాత్మజు
డానెరగని క్రోధమూర్తి యానతుడగుచున్. 1888

-: అంగదుడు దేవాంతక మహోదరులతో పోరుట :-

భూరిక్షోభము నొందుబట్టి కపులంబొందంగ రాక్షసోద్ధముల్
ధీరప్రీతియ వచ్చుచున్న దనుజున్ దేవాంతకున్[illegible]
తీరుం జూచి త్రిశీర్షు డత్తరిని వందిప్పైక బాణంబునన్
వారించెన్నది తున్కలై పడగ భూభాగంబునందెంతయున్. 1889

ఉ॥ ఘోరుహమల్లు భగ్నమయి పోవుట నంగదు డుగ్రమూనుచున్
ధారుణశైల వర్షమును దానవుపై గురిపింప దాని దు
ర్వార శరంబులందునిమి భగ్నముజేసె త్రిమస్తకుండు నీ
తీరున సంగరంబు గడుదీవ్రతరంబుగ సాగుచుండగన్.

సీ॥ త్రిశిరుడత్తరిని సుదీర్ఘకంబు బూనుచు
నంగదునేసె తీవ్రాంబకముల
గజమును డీకొల్పి ఘనమహోదరుడంత
తోమరాంకుశముల తోడనేసె
పరిఘంబు గొనుచు దేవాంతకుం డత్తరి
వానరవీరుపై వైచె మిగుల
దానవవీర త్రితయము నొక్కటగూడి
వాలితనూజుపై బడిన నతడు

గీ॥ నేకవీరత్వ మంగీకరించి విక్ర
మించి దంతోశ కఠినంబు మించు ముష్టి
యా మహోదరుడెక్కిన హస్తినేయ
రక్తములగ్రక్క కూలె సంగ్రామతలిని.

-: నీలహనుమంతు లంగదునికి తోడువచ్చుట :-

ఉ॥ పోరటుసాగు చుండగను మువ్వురు దానవులొక్కపెట్టునన్
ఘోరత వాలిసూనువయి క్షోభఘటిల్లెడు భంగిజేయ నా
తీరును జూచి మారుతి సుధీరుడు నీలుడు తీవ్రవేగులై
జేరగవచ్చె నంగదుని జేయగజన్య సహాయమత్తరిన్.

క॥ దానవవీర త్రితయము
వానరవీరత్రియంబు పటుబలమొప్పన్
నానావిధ సంగర పా
రీణత పోరాడసాగి రెంతయువీకన్.

-: హనుమంతుడు దేవాంతకుని జంపుట :-

గీ॥ అంత దేవాంతకుండు భుజాంతరమున
భూరితరుశాఖ పరిఘము బోలికొనుచు
వచ్చు హనుమంతు గదిసె దుర్వారభంగి
దానిగాంచి సదాగతి తనయుఁడంత. 1884

ఉ॥ ఘోరమహాశని ప్రభమ గూడిన దారుణ ముష్టిఘాతి యా
క్రూరుని దేవాంతకుని గుండియలన్ బగులంగ నేసి గ
ర్జారవమున్నొనర్పగ పరాక్రమమంతయుఁవీడి దానవుం
డా రణరంగమందు రుధిరాంచిత ధారల గ్రక్కి కూలగన్. 1885

చ॥ అనిలతనూజ ముష్టిహతుడైన సురాంతకు జూచి రోష సం
జనిత మహోదరుండు గిరిసన్నిభ భద్రగజంబునెక్కి తో
డను త్రిశిరుండురాగ గుణటంకృతుల న్నొనరించుచున్ మరు
త్తనయుని దాకి రుగ్రశర ధారణి భూరిపరాక్రమంబునన్. 1886

చ॥ అరయగ శక్రచాప గతమై జలదంబు గిరిస్థలంబునన్
గురిసినరీతి నీలుపంబు ఘోరశరప్రకరంబు నేసినన్
తరుచరసైనికాధిపతి దార్ఢ్య తనుండయి భిన్నగాత్రుడై
మరచెను చేష్టలన్ క్షణికమాత్రము పిమ్మట తెల్విగాంచుచున్. 1887

-: నీలుడు మహోదరుని జంపుట :-

ఉ॥ నీలుడు వృక్షయుక్త మవనీధరమొందు పెకల్చియంత మ
ద్వేల జవంబుతో దనుజవీరు మహోదరునేయ నుగ్రతన్
శైలము వానిదేహమున శీఘ్రగతిం బడె దానవాతడుం
గూలె గతాసుడై పవినిగూలెడు భూరినగంబు కైవడిన్. 1888

-: హనుమంతుడు త్రిశిరుని జంపుట :-

చ॥ ధరపయి గూలియుండిన పితృవ్యు మహోదరుగాంచి కిన్కమై
పరపెను తీవ్రబాణములు పావనిపై నదిగాంచి యంజనా
వరతనయుండు వృక్షయుత పర్వతమొక్కటి గొంచు వానిపై
వరువడి నేయ దానిగని భగ్నమొనర్చెను బాణవృష్టిచే. 1889

గురుతరఖడ్గముంగొనుచు కుండలభూషణయుక్తమైన యా
శిరముల మూటి ఖండనముజేసిన యంబరమందు నుండి వి
స్ఫురితములైన తారకలఁబోలుచు భూస్థలియందుగూలె వా
నరుఁడదిగాంచి హర్షులయి వాదములన్నొనరించి రొక్కటన్. 1906

-: ఋషభుడు మహాపార్శ్వుని జంపుట :-

మున్ను రణభూమిని హతులై పోయినటి
యా మహోదర దేవ నరాంతకులను
త్రిశిరపంచత్వగతిని చింతించియంత
నా మహాపార్శ్వ ఁడుగ్రుడై యనికి జొచ్చె. 1907

అరిలోకాతి భయంకరంబు తపనీయాంచత్ప్రకాశంబు ని
ష్ఠుర కాలాంతక దండతుల్యము మహాక్షోభాకరంబున్ గదన్
నురువేగంబున ద్రిప్పుచున్ తరుచర వ్యూహంబులం దోలుచున్
నరుదెంచెన్ ఋషభుండునున్న యెడకున్ నత్యంతరోషంబునన్.

పారావార సుధీరుడౌ ఋషభునొంపంగన్ మహాపార్శ్వ డా
ఘోరాజిన్ వడిదాకి వజ్రనిభపంక్షోభంబుగావించు వి
స్తారంబౌ గద బూని వానరుని వక్షంబందు వేవ్వే పితన్
వీరుండక్షతి గూలె వాతచలితోర్వీజాతముం బోలుచున్. 1908

తెలివిని గాంచి యంతటపె ధీరుడు నాఋషభుండు భూరి దో
ర్బలుఁడయి వాని హస్తగత భవ్యగదన్వెస నంగ్రహించి క్రో
ధ్యంగతి దానవప్రవరు వక్షమునేయ పతండు నంగర
స్థలి రుధిరంబుగ్రక్కుచు గతాసుడునై వడిగూలె నంతటన్. 1910

సురనాథు వజ్రనిహతిని
ధరణీధరము గూలుభంగి దానవుడంతన్
ధురమున గూలుట గని వా
నర లోకంబెల్ల హర్షనాదము జేసెన్. 1911

ఉ॥ దానవుడట్లు గూలగను దానవసైన్యము లస్త్రశస్త్రముల్
బూనక పారవైచి రణభూమిని వీడుచు పారజొచ్చె డెం
దాన విభీతులై బహువిధంబుల వారిధి భిన్నమై మహా
ధ్వానము జేయుచున్ బరచు భంగిని భూరి భయంకరంబుగ॥

-: అతికాయుడు యుద్ధమునకేగుట :-

సీ॥ రణభూమియందు నరాంతక దేవాంతక
త్రిశిరమహోదరా దికులు మరియు
నామహాపార్శ్వుండు నంతమొందుట విని
బ్రహ్మదత్తవరుండు పటుబలుండు
నతికాయు డచలంబు గతిదార్ఢ్య కాయుడై
రవితుల్య కాంచన రథముసెక్కి
శక్రచాపము బోలు చాపంబునుందాల్చి
కటక కుండలకిరీటముల దాల్చి

గీ॥ గడసె వానరసైన్యంబు కదనకాంక్ష
వానిరూపంబు గాంచి యావానరాళి
తిరిగి జీవితుడై యరుదెంచె కుంభ
కర్ణుడని దలచుచును పారగాదొడంగె.

చ॥ పరచుచు నొండొరుల్ దగిలి పృధ్విని గూలుచు భీతచిత్తులై
శరణికులాబ్ధిచంద్రుడు గుణధాముని రాము జయాంతరంగునిన్
శరణము జొచ్చిరంత దనుజాధిపసూను రథాంతరస్థు భీ
కర నినదాతివీరు నతికాయుని గాంచెను రాముడత్తరిన్.

-: రాముడు విభీషణుని అతికాయు వృత్తాంతమడుగుట :-

చ॥ దమజవరా ధరాధరవిధంబున ధాతు సుశోభితాంగుడై
మణిమయ సత్కిరీటరుచి మండితుడై బహువాజి యుక్త కా
చన రథమందు చాపమును సాంద్రగతిం ధరియించి సంగరం
బునకును వచ్చుచున్న పటుభూరి బలాఢ్యుడెవండొ తెల్పుమా.

క॥ శూలము చేతం గ్రాలగ
శైలజాధిపతిని బోలి సత్వరతమ వా
లీలగతి నిశాటులు భూ
తాళియు గొలువంగ వచ్చు ధైర్యుని గనుమా. 1916

క॥ కాలోగ్ర భూరిజిహ్వం
బోలు శక్తిదాల్చి రథ సముమన్నతుడయి శం
పాలతిక యుక్త జలదము
లీలగ్రాలు దనుజవీరు రీతినిగంటే. 1917

క॥ మదిఖాంచన మయరథమున
ఘనమగు కార్ముకశతంబు ఘటితంబయి యిం
దుగ్రని కార్ముకంబు భంగిని
దనరారుచు వెలయు నా విధంబున గంటే. 1918

చ॥ మరియును రాహు కేతనము మానుగదాల్చి దివాకరప్రభన్
కరమును నల్దిశల్వెలఁగగా రథమందు వసించి వహ్నితో
సరియగు బాణజాలముల సత్వరతన్ బరపించుచున్ వనే
చరులను బాధబెట్టెడు నిశాచరవీరుని గంటె యుత్తరిన్. 1919

క॥ వనచరసేనలు బెబ్బులి
గనిన లేళ్ళకరణి పారగాజొచ్చెను నీ
దనుజుండెవ్వడొ మరి యీ
తని వృత్తముతెల్లముగను దగబలుకుమికన్. 1920

-: విభీషణుడు రామున కతికాయుని వృత్తాంతము దెలుపుట :-

చ॥ అనిన విభీషణుండు మనుజాధిపుతో నిటులల్కె నా దశా
ననుడెవ ధామహాత్మ్యధననాయకు తమ్ముడెవండు శూరుడుం
దన జవిఖుండెవండు రణదక్షుడు గూర్తుడెవండు నట్టి రా
వణునకు నాత్మజుండు బలవంతుడు నున్నతికాయ నాముడౌ. 1921

చ॥ జనక సమానవిక్రముడు సర్వమహాస్త్రవిశారదుండు నా
జిని పటుదుర్జయుండు రణసీమ శతాంగ గజేంద్రవాజులన్
ఘనతరయుద్ధమున్ జరుపఁగల్గు సమర్థుడు మంత్రవేత్త యీ
తని పృథుశక్తికి నెంత పటుదర్పితమై యెదురాడు నెవ్వడున్. 1922

చ॥ మఱియును ధాన్యమాలి యను మానిని యందు దశాస్యతేజ సం
జనితుడు వీడు మున్ను జలజాసనుగూర్చి తపంబుజేసి యా
తని కరుణన్ శతాంగ వివిధాస్త్రములన్ గవచాది వర్మమున్
గొనియెను నిర్జరాదులను గూడని మృత్యువు నాజియందునన్. 1923

మ॥ నరనాథోత్తమ మున్ను వీడు బహు సంగ్రామంబులందున్
సుర గంధర్వ భుజంగ యక్షగరుడ స్తోమంబులన్ దోలె వా
సర లోకంబును భూరిసాయకములన్ సత్వంత ఘోరాకృతిన్
గరముం ద్రుంచుచు నున్నవా డిక నుపేక్షం జేయగా రాదియే. 1924

-: అతికాయుడు వానరసేన జంపుట :-

చ॥ మసలక తావక శితశర
విసరంబుల దనుజవీరు వృద్ధిని గూలన్
వెసనేయ కార్యమిత్రం
దశరథవరనాథ తనయ దక్షతమీరన్. 1925

మ॥ అతికాయుండు మహోగ్రచాపుడయి తీవ్రానేక బాణంబు లు
ద్ధతిమై పర్వగజేయుచున్ గపులవంతం బొందగా జేసి గ
ర్జిత నీలాంబుదభంగి భూరినినదాభీలుండునై యా రణ
క్షితిలో స్వైరవిహారమున్ సలుపఁజొచ్చెన్ ఘోరదుర్వారతన్. 1926

ఉ॥ ఆ గతి వచ్చుచున్న దనుజాధిప నందను గాంచి విక్రమో
ద్యోగపరాయణాభిరతు లుగ్రులు నౌ నలనీలమైందులన్
నాగవయాదులన్ శరభ వానరయూథపు లెంత యోధియున్
వేగమె భూరిశైల శిలవృక్షములం బెకలించి దాల్చుచున్. 1927

అతికాయునిపై వానర
తతి వృక్ష శిలాదికముల దద్దయు నేయన్
దితిసుతశేఖరుడన్నిటి
నతుల శరాగతుల బరపి యంతము జేసెన్. 1928

అరయ దవానలంబు రయమారగ శుష్కతృణావన స్థలిన్
కరము దహించురీతి శితకాండములం బరపించి శీఘ్రతన్
తరుచరసైన్యకాననము దగ్ధమొనర్చె సురారి యత్తరిన్
మరల ననంతకీర్తిమాత్ములయి చూడగ నంగర వృక్షజాతమున్.

శానుడు దగ్రతీక్ష్ణ శరసంతతుల భూరిజలాశయంబు నే-
మానము మీర శుష్కరుయమౌ గతిజేయు నా యట్టిరీతి దా-
దానవశేఖరుండు పటుదారుణ బాణములేసి శీఘ్ర వం
శాఖ తటాకమున్ బహువిధంబుల నింకెడు భంగి జేయగన్. 1930

మఱియును చిత్రవృష్టిగతి మార్గణముల్ బరపించి వానరో
త్కరశిరముల్ మహోగ్రశర ఖండితమై రణభూమి చుట్టునన్
పరువడి దట్టమై పడియె భవ్యరణం బొనరించుచు న్నిశా
చరుడు రణాంతరంబునను స్వైరవిహారము జేసె నత్తరిన్. 1931

కేసరి మృగజాలంబుల
కాసుర విక్రమత భంగపోటు తటుల వి
న్యాసము గూర్చుగతి మను
జాశనపతి సుతుడు స్వైరసంగతి నొప్పెన్. 1932

దానవశర తాడితులై
వానరవర్గంబు జేయు పనిలేక మహా
దీనాత్ములగుచు వలలో
మీనవ్రజముండు భంగి మెలగిరి యంతన్. 1933

చ॥ రణతల సంచరుండయి విరాధు కబంధు ఖరున్ కపీశ్వరున్
దునిమినవాడెవండు లవణోదధి గర్వమడంచె నెవ్వ డా
యినకులరాము జూపుడిక హీనులతో వరిబోరరాదు నా
ఘనతర బాణరాజి రఘుకాంతునిపై బడనేయనెంచితిన్. 193

చ॥ అనుచును గర్వితాంధుడయి యారఘువీరుని రాముజేరి యి
ట్లనియెను మున్ను వాలిపయి లక్ష్యవిశుద్ధిని సేయు బాణమున్
వననిధినేసినట్టు పటుబాణ పరంపర నేడు నాపయిన్
గొనుపుము నీబలోద్ధతుల జూపుము నేడు రణాంతరంబులన్. 194

చ॥ రణమొనరింప వచ్చితి శరాసనముం ధరియించి యిందు నే
సురలకజయ్యుడన్ దనుజ శూరుడ రావణపుత్రుండ సం
గరమొనరింప రమ్ము బలగర్వములుండిన వానరాళి నా
సరియగు వాని నేనుగనజాలను జాలము జేయనేలకో. 195

క॥ అని గర్వాలాపంబుల
దనుజుడు పల్కంగ రాముదరి నుండిన ల
క్ష్మణు డది విని సక్రోధా
రుణితాక్షుండగుచు వేగ సమరోత్సుకుడై. 196

మ॥ ధనువున్ సజ్యమొనర్చి వల్మికగతోద్యద్భూరినాగంబు భం
గిని తూణీరగతంబు బాణము ను దాకేతస్వదిన్ లాగి వెం
టనె సంధించి గుణధ్వనుల్ దిశలయందత్యంతమున్ మ్రోయ జే
సిన నానాదము సోకి దానవులు వాసిందక్కి భీతిల్లగన్. 197

-: లక్ష్మణుడతికాయునితో యుద్ధముజేసి వాని వధించుట :-

చ॥ ఘనతరమౌర్వి మ్రోయ నతికాయుని వీనుల సోక నుగ్రుడై
ధనువునుకేల బూని పటుదక్షత సజ్యమొనర్చి యంత భీ
షణ నినదంబు జేయుచును సంగరకాంక్షను జేసి లక్ష్మణుం
గని యిటుపల్క జొచ్చె నధికంబగు దూషణ భాషణంబులన్. 198

చ॥ అరయఁగ నీవు బాలుఁడవు నాహవపాండితి లేదు దోర్బల
స్ఫురిత పరాక్రమంబు గడుశూన్యము కాలునిబోలు నన్ను నం
గరమున బోరఁజాలవు వికారములింకను మాని వేగమై
తరలుము రాముఁ జెంతకు యథార్థము పల్కితి రాజనందనా. 1940

మ॥ నిదురం బోయెడు కాలసర్పమును వంచింపంగ మేల్కొల్పి నా
వద సంజాతమువాను గాదె యటులన్ దవ్యప్రతాపుండ నన్
నెదిరింపంగను వచ్చినాఁడవు మఱిన్ భీతేమియుం గానకన్
కదనాపేక్షను వీడిపొమ్ము ధనువున్ సంధింపకన్ బాలకా. 1941

చ॥ అనిమిషనాధ మారుత యమానల వైశ్రవణాది దిక్పతుల్
ఘనహిమశైల మందర నగాధిపులైన రణాంతరంబునన్
తను సహియింపజాలరు వినంగను బుద్ధులుగల్గి యుండినన్
రణతల భూమి వీడు మిక ప్రాణములందున నిచ్చ జేయుచున్. 1942

చ॥ రణమొనరింప సంగరతలంబున నిల్చిన మచ్ఛరాహతిన్
నిను యమపీఠికిన్ బరపనేర్తును వీక్షణమందు గావునన్
తనువున నాసకల్గిన రణావని వీడుము లేక నిల్చినన్
సునిశిత మచ్ఛరాళి చవిజూచును నీ తనురక్తధారలన్. 1943

క॥ అని యతికాయుడు పలికిన
విని లక్ష్మణుఁడంత కోపవేగాన్వితుడై
దనుజునితో రోషోక్తుల
ననియెను సంగరముజేయ నతినిష్ఠురతన్. 1944

ఉ॥ ఓరి దశాస్య పుత్రక రణోర్విని యిట్టి వృథాప్రలాపముల్
శూరులు పల్కరెవ్వరును జూచెద వింక మదీయశక్తి దు
ర్వార శరాళి చాపమున నద్ది రణంబొనరింప వచ్చితిన్
వీడదపైన నీబలము వీర్యముజూపుము నీక్షణంబునన్. 1945

ఉ. వాదముజేయనేల రణభాగమునందున వాక్యసంతతిన్
సాధనజేసినట్టి శరజాలముతోడ రణంబొనర్ప న
త్యాదరణీయమౌను గద దాంభికవృత్తిని వీడి నీవు మ
ర్యాదగతిన్ రణోన్ముఖుడవై చరియించుట ధర్మయుక్తమౌ. 1946

ఉ. దనుజవిభుండు నీదుపిత దప్పక మున్న నజేసి నిన్ను నా
ఘనతర హేమసాయక నికాయములన్ భవదీయ మూర్ధమం
దనమును జేయువాడను గనంగను తాళఫలంబు మారుతం
బున దెగి భూస్థలిన్ బడెడు పోలిక రాక్షస రాజపుత్రకా. 1947

క. కనకమయ శిలీముఖములు
దనుజాధమ నిన్ను దాకి తనువుజీల్చి భీ
షణగతి నీరుధిరంబును
తనివిదీర గ్రోలగలవు దానవముఖ్యా. 1948

మ. తను బాలుండని యెంచి చుల్కన గనంగానేల నీప్రాణముల్
గొనగావచ్చిన కాలుడంచు మదిసంకోచింపక నెంచుమా
యనలంబొక్క కణంబు మాత్రము దహింపం జాలదే తూల రా
శిని యో దానవ రాజపుత్ర రణ సంసిద్ధుండవై రమ్మికన్. 1949

ఉ. బాలకుడంచు నన్ను బహుభంగుల హేళనజేయ నేల మున్
బాలకుడైన వామనుడు భాసురరీతి త్రివిక్రమాకృతిన్
నేలను సర్వదిక్కులను నిండి బలిం బదద్రొక్కలేదె నీ
పాలిట మృత్యువంచు నను భావన జేయుము మూఢమానసా. 1950

చ. అనుచు సుమిత్రసూనుడు రయాన్వితుడై శరమొండు చాపమం
దున ఘటియించి నాదనుజు నొవ్వగనేసిన దానవుండు భీ
షణమగు కార్ముకంబుగొని లక్ష్యమొనర్చి శరంబునేసె ల
క్ష్మణుపయి వాకటింగొను మృగాధిపుదాకు గజంబుభీతిగన్. 1951

అతిరథవర్యు లిర్వురు మహారణము న్సొనరించ నా రణ
క్షితి తలమందు దీకొనిరి కిన్నరయక్ష నిలింపసాధ్య సం
తతుల మహర్షులాదిగ రణంబును జూడగ నిచ్చలై వియ
ద్గతులయి చూచుచుండె నిందర్పితులివ్వరొ యంచు నత్తరిన్. 1852

ధనుజ్జాధీశ తనూజుడత్తరిని కోదండంబు చేబూని వి
స్వనముల్ మౌర్వినిజేసి ఘోరతర సర్పాకార వక్రాకృత దా
రుణ నారాచము లక్ష్మణుంగనుచు నారూఢిం బ్రయోగింప నా
ఘనబాణంబు వియత్తలాంతరగతిన్ గాఢోద్ధతిం బర్వుచున్. 1853

తనుదాక వచ్చు శరమును
గని లక్ష్మణుడర్ధచంద్ర శరవరమునన్
తునియలుగా జేసెను నది
యని గూలెను కృత్తభోగమగు ఫణిభంగిన్. 1854

చ। కనలుచు దానిజూచి శితకాంతములన్ బయనాలుగిన్నికి
న్నెనయగు వానిఁజేసె మనుజేంద్రసహోదరుమీద వాని నా
జనపతి నందనుండు పృథుశక్తిని భీమనిశాత సాయకా
ఘనవనముదాయ సంతతుఁ జక్కటి గూలఁగజేసె నత్తరిన్. 1855

ఘనతియును లక్ష్మణుండు శితమార్గణమొక్కటి వఱ్ఱిసన్నితం
బడిపయి వేయుగా నిటం భాగముదాకి చలింపజేసె ని
ష్ఠురగతి రక్తసిక్తుడయె రాముడునౌటను ధైర్యమూని భూ
వర! సుతులక్ష్మణుంగనుచు భాషణజేసె సమంచితంబుగన్. 1856

ఎంగితి నీపరాక్రమము నింతటి వీరుడవంచు గాన సం
గరగతి శ్లాఘనీయుడవు గంటిని నీదగు విక్రమంబు నీ
వరపెదు నావరాక్రమము నాహవరంగమునందు బోర నా
సరియగు వాడులేడని విచారము జేయుము తాలునిమ్మనా. 1857

శా॥ కోదండంబును మండలీకృతముగా ఘోరాకృతిం దీవ్రమున్
వాదైత్య ప్రవరుండు సూర్యకర సంకాశాస్త్ర జాలంబులన్
భూదారాత్మజుపైని వేయ గని యా భూపాలసూనుండు వి
చ్ఛేదించెం బటుతీవ్ర బాణములం రాశీభూతమై కూలగన్. 195

ఉ॥ వారక దైత్యుడంత పటుతాసుర సాయకమొండు దాల్చి దు
ర్వార దివాకరాస్త్రమున బ్రిస్ఫుటరీతిని గూర్చి లక్ష్మణున్
భూరి శరోగ్రభంగి రణభూమిని గూల్చగ నెంచుచుండగన్
భూరమణాత్మజుండు ధనువుగ్రత బూనుచు శీఘ్రకర్ముడై. 195

చ॥ విలయమువేళ కాలుడతి భీకరదండమునేయు భంగి క్రో
జ్వలుడయి లక్ష్మణుండు దనుజాధిప నందనుపైని భూమి సం
చలనము బొందనేసె పటుసార మహోజ్వల వహ్నిబాణమున్
నలుకవహించి యాదనుజ దత్తరి శౌర్యవిశేష చిత్తుడై. 196

మ॥ దనుజుండంత దివాకరాస్త్రమును సంధానంబుగావించి యా
మనుజాధీశతనూజు దాకవదలెన్ మార్గాంతరంబందునన్
ననలాస్త్రంబు దివాకరాస్త్రమును సంగ్రామంబు గావించె భూ
జనముల్ ఖేచరులున్ విభీతమతులై చంచద్గతిం బర్వగన్. 196

చ॥ ఉరగము గృధ్రముం గదిసి యొండొరు లుగ్రతబోరు భంగి నా
శరములు రెండు ఢీకొని దిశావలయంబు వతిక్రమించుచున్
గురుతరరీతి బోరుచును కొండొకవేళకు దాక తేజముల్
పరిహరణంబులై ధరణి భాగమునందున గూలె విస్ఫురన్. 196

చ॥ దనుజుడునంత నల్గి పటుదర్పమునన్ రజనీవరాస్త్రమున్
జనవిభు సూనుపై యడి సత్వరతం బనుదెంచుచుండ ల
క్ష్మణుడనిలాస్త్రమేసియు విఖండన జేసెను దానవాస్త్రమున్
రణతల భాగమందున పరస్పర మిట్టుల బోరుతల్పగన్. 196

। జలదము వర్షధారలను సారతరంబుగ రాల్పఁగ ని
స్తులమగు బాణవృష్టి బలసూదనువైరి తనూజుఁ డేయ నా
యలఘుఁడు సంచలింపకయ యద్భుతరీతిని సంచరించె ని
ష్ఫలితము లౌచు వ్యర్థమయి శస్త్రములన్నియు రాలె ధూర్జటిన్.

। శరవర్షంబుల నించుచేనియును దాచాంచల్యముం బొందకన్
స్థిరుడై యున్న నిశాచరాధిప సుతున్ వీక్షించి యాలక్ష్మణుం
డరయన్ లేకను కారణంబు నటు సంగ్రామాంతరంబందునన్
కరముం జింతనుజేసె వానిగని వేగన్వచ్చె వావాయువున్. 1965

। అనిలుఁడు వచ్చి పల్కె వసుధాధిప నందన వీఁడు ధాతచే
తను గొనియెన్ నవధ్యమగు దార్ఢ్యతరంబును వజ్రయుక్తమున్
ఘనకవచంబు గావున వినాశవిహీనము లౌచు శస్త్రముల్
పనిగానవయ్యె వేరగు నుపాయము దెల్పెదు రాజనందనా. 1966

। దనుజుఁడు చావడింత వివిధంబగు బాణములెన్ని యేసినన్
వినుము పితామహాస్త్రమును వేగ సమంత్రక పూర్వకంబుగా
పనివడి నేయ నీ యసుర భర్త తనూజుఁడు గూలుఁ దావ చిం
తనమును జేయనేల రణధారుణి వేగము సంహరింపుమా. 1967

క। అనిలుని యుపదేశము విని
జననాథ తనూజుఁడంత సత్వరగతుఁడై
వనజోద్భవాస్త్ర మా దను
జుని మీదను నేయఁదలచి శూరత్వమునన్. 1968

। రయమున బ్రహ్మనామక శరంబు సమంత్రక పూర్వకంబుగా
జయవిజిగీషుఁడై దనుజ సంహరణార్థము లక్ష్మణుండు వే
నియతిని గూర్చి మౌర్విని ధ్వనింపగజేసెను సర్వలోకముల్
భయమును జెందె నా నినదభంగికి నోర్వఁగలేక యెంతయున్. 1969

ఉ. జలధులు తల్లడిల్లె గులశైలములున్ జలియించె దారకా
వళియు గ్రహంబులున్ గతుల బాసె దివాకరసోములంబర
స్థలిని గలంగె భూమి పతుసారుల గంపమునొందె లక్ష్మణుం
డలుగుచు బ్రహ్మనామక మహాస్త్రము రావణసూను వేయగన్. 1970

చ. భువన భయంకరోగ్రగతి భూరిమహానలకీల దీప్తమై
భవునయువాగ్ని యో యనగ భవ్యగతిన్ గతదానిలాకృతిన్
జవమును గల్గి యద్దనుజ నాథ తనూజుని దాకనేగ దా
నవుదది గాంచి మానవమునందు గలంగక ధీరచిత్తుడై 1971

చ. పనివడి వాలముద్గర కృపాణ పరశ్వధ శక్తి కుంతముల్
దనుజుడు పూనిపై చినను దామరచూలి వరాస్త్రమున్నితిన్
తనరుచు మిగ్రంగి వేగ నతికాయు శిరంబు తిలంతిలంబుగా
నొనరిచె వేల్పులెంతయు గనుంగొని మెచ్చగ నంబరస్థలిన్. 1972

—: అతికాయాదుల మృతివిని రావణుడు దుఃఖించుట :—

క. ఘనగిరి శృంగము కైవడి
దనుజుని శిరమపుడు ద్రెళ్ళి ధరణింగూలెన్
జనిత భయభ్రాంతులునై
యనిమిష శాత్రవులు పారిరత్తరి వేగన్. 1973

క. వానరులత్తరి హర్షం
బూనుచు లక్ష్మణుని బొగడి పూజించి రొగిన్
దానవ వనాట యుద్ధం
బీ నియతిని జెల్లె దినములెన్మిది కాగన్. 1974

క. అష్టమదివస రణంబున
నష్టండయి చనిన తనయు నతికాయునికై
కష్టాత్ముడగుచు దనుజ
శ్రేష్ఠుడు రావణుడు చింతజేసెను నిటులన్. 1975

సీ॥ రణతలమందు నింద్రాదుల గెల్చిన
యా విరూపాక్షుండు నంతమొందె
కులపర్వతాళి ధిక్కృతి పిప్పిజేసెడు
పటుదంష్ట్రుండును పృథ్వి వీడె
కాలునైనను తిరస్కారంబు జేసెడు
ఘను డకంపనుడును తనువు వీడె
సకల రాక్షస సేన ప్రకటిత సేనాని
యగు ప్రహస్తుండు కాలంబు జేసె.

గీ॥ కంపనోద్యోగి కుంభకర్ణుండు నేగె
నరివిమర్దనుడా మహోదరుడు జచ్చె
నతులబలుడు మహాపార్శ్వు డవని వీడె
దనుజవరుడగు ధూమ్రలోచనుడు మడిసె. 1976

ఉ॥ మరియు నరాంతకుండు ససమానబలుండు సురాంతకుండు సం
గర తలకోవిదుండు నతికాయుడునున్ త్రిశిరుండు పుత్రకుల్
సరిగె యమాలయంబునకు సాగతిబోయి రనేక వీరులా
సురనికర ప్రతంజనము జూడ మహాద్భుతమేమి జేయుదున్. 1977

శాసనమేమజేయు శిరసావహించియు శౌర్యధుర్యులా
ప్లావము మీర నేగి రణరంగమునందు పరాక్రమాది వి
ఖ్యాపములం బెసంగ హతులైరి నరాధిపుచేత భుజవం
వాసులచేత హీనదశ వచ్చెను దానవరాశి కెంతయున్. 1978

మరయగ భూరితేజులగు వట్టి సురారుల భూరివిక్రమ
స్థిరుతగు రాముచేత మడిసెంగద యట్టి బలాఢ్యు రాముతో
సరిగలరీతి బోరగల శక్తియుతుండు దలంపలేడు మ
త్పురమున నేమి జేయుదును దుష్పహదుర్యోమ కార్యమిత్రంబ్.

చ॥ అనిమిషలోక నాథుని రణాంతరమందున దోలికట్టి వా
తనయుడు నింద్రజిత్తు బలదర్పుడు రాముని నాగపాశ బం
ధనమున గూలజేసి వను దానొకయించుక కీడు జెందకన్
రణతలమందు బోరుచును వానరులన్ వధియించుచుండెడిన్. 1

చ॥ అనిమిషనాథ కింపురుష యక్ష భుజంగ పతంగులైన యా
ఘనతర నాగపాశముల గట్టుబడుం గద యట్టిపాశ బం
ధనముల ముక్తులై పమరధారుడి కోలిబడుచున్నవార లా
యివకుల వర్యులౌ దశరథేశుని పుత్రులు వింత గొల్పెడిన్. 1

చ॥ అరయగ నేను బంపిన మహాబలులైన నిశాచరోత్తముల్
దురమునకేగి యంధరును దోర్బలమొప్పగబోరి చచ్చె, నా
క్కరుడును లేడు గాదె రఘుకాంతుని లక్ష్మణు వీరవానరో
త్కరమున నొక్కనైనను వధంబొనరించెడు వాడు చూడగన్. 1

ఉ॥ మాయయొ మంత్రమో మరి యమానుషమైన మహాత్రప్రభావ
జ్ఞేయముగాదు దానవ విశేషపరాక్రములైన వారు భూ
నాయక హస్తపాలిత వనాటనుధీరులచేత జచ్చె నెం
ధాయకమయ్యె శంక బలదర్పులు జచ్చి రికేమి జేయుదున్.

ఉ॥ రాముని బాహువిక్రమ పరాక్రమ దక్షత యస్త్రశస్త్ర వి
ద్యా మహనీయ సాంద్రత మహారణపాండితి శౌర్యధైర్య తే
జోమయ సంపదల్ విమలశోభను గూడ జగత్త్రయంబులన్
నేమనవచ్చు వాని సరి యెందునలేదు వినిశ్చయంబుగన్.

–: రావణుడు లంకకు కాపు బెట్టుట :–

మ॥ అని చింతించుచు నెంత నిల్వడివ దైత్యానీకముం జూచి యి
ట్లనియెన్ మీరలు జాగరూకులయి లంకా పట్టణంబెంతయున్
గమచుండవ్వలె శత్రువీరులు గడుం గర్వించియున్నారు యా
జవకాధీశ తనూజు గాచికొనుచున్ వర్యత్ని గాపాడుడీ. 1

చ॥ మఱియును వానరుల్ దిరుగు మార్గములన్ దిశి యుగ్రదుర్గతులన్
నరయుచు నుండగావలయు వాజవకాత్మజ చెంతకెవ్వఁడున్
దఱియగ వచ్చెనేని గనిదండన జేయుడు వారి, వేగ ను
స్థిరబలులైన దానవుల శీఘ్రము బంపుడు రక్ష జేయఁగన్. 1886

మ॥ అని యాజ్ఞాపన జేసి యాత్మనిలయంబందున్ బ్రవేశించి యా
రణభూమిన్ హతులైన వారి ఘటకర్ణానేక శూరాత్ములన్
మనమందున్ స్మరియించుచున్ విపుల సంతాపంబునం బొక్కుచున్
ఘనమౌ రామజయంబు దానవ తిరస్కారంబు జింతించుచున్. 1887

క॥ ఘోరంబగు బహు శోకా
పారావారంబునందు బడి మగ్నుండై
పారంబు గాంచలేకను
దారుణగతి తిరుగజొచ్చె దానవుఁడంతన్. 1888

-: రావణుని ఇంద్రజిత్తు సెద దేర్చుట :-

క॥ జనకుని వేదన గని యా
యనిమిషపతి జిత్తు జనకు నరయుచు నోదా
ర్చెను శూరవాక్య పటిమను
దనుజులకును జయము గను విధంబు నత్తరిన్.

ఉ॥ దానవలోక నాథ పరితాపము బొందగనేల నీకు గీ
ర్వాణ సురాధినాథులను భగ్నమొనర్చినవాడు వీరుడున్
భానుసమాన విక్రముఁడు బాహుబలాఢ్యుడు నింద్రజిత్తు నీ
సూనుడు నుండగా నరుల జూర్ణము జేసెద నీక్షణంబునన్.

చ॥ వినుమిక వేగనేగి రణవీధిని భూరి నిశాతబాణ సం
జనిత మహానలంబున నిశాచరవైరుల రాము లక్ష్మణున్
ఘనతరలీల దగ్ధపఱచి గాత్రులఁజేతును చింతయేల నీ
తనయుఁడు నింద్రజిత్తు వివిధంబుల నీకు సహాయమీయగన్. 1891

క। జనకునకు మేఘనాధుఁడు
ఘనధైర్యము దెల్పి సమర కాంక్షామతియై
జనియెను బహుబలముల గొని
దనుజతతులు మనమునందు ధైర్యముబొందెన్. 19

చ। కనకమణి ప్రభాపటు వితానము మధ్వజ ధర్మ మంటికా
నివద విశేషయుక్తము పవేళ బవాన్వితవాజి శోభితం
బును సమలంకృతంబు నగు భూరితతాంగమునెక్కి వేగమై
దనుజ వరాత్మజుండు రణధారుఁడికేగె జయాభిలాషియై. 1

—: ఇంద్రజిత్తు యుద్ధమునకు వెడలుట :—

చ। వెనుకను నంటిపోయె బహువీరులు వాగరథాశ్వపంక్తులన్
ఘనరుచి రాస్త్రశస్త్రము లఖండముగాగను దాల్చి హుంకృతి
ధ్వనుల నొనర్పుచున్ ఒహ విధంబుల మత్తగజేంద్ర ఘీంకృతి
ధ్వనములు వాజిహేషలను హద్యమహాధ్వను లంత మీరగన్. 1

చ। గురుతర ఖడ్గబాణచయ కుంత వరశ్వధ శూలభూరి ము
ద్గర పరిఘాయుధంబుల ప్రకాశగతిం ధరియించి ప్రోజ్వల
త్కరినిచయంబు లొగి భటకాండములేగిరి సంగర క్రియా
తురమతులై మహేంద్రజితుతో ధరయుత్తరి పంచలించగన్. 189

గీ। శంఖకాహళ భేరికా ఘాంకృతులను
వీరభటహుంకృతులను వావేళ గలిసి
మిన్ను ముట్టంగమ్రోసె నమేయగతిని
ఘోరసంగ్రామ సూచన పూర్వకముగ. 18

క। దశకంఠ తనూజునిపయి
శశివర్ణపు ఛత్రమప్పుడు చక్కగ దోచెన్
నిశియందు పూర్ణశశి యా
కసమున జెలువొందురీతి ఘనకాంతులతో. 189

స్వర్ణమణిమయ భాసుర చామరములు
నుభయపార్శ్వంబులందు మహోజ్జ్వలముగ
నలరి రావణవిభు సుతు నతులగతిని
భాసితుంజేసె పటు రణోల్లాసుడగుట. 1998

దినకరు డంబరస్థలిని తేజముతో వెలుగించు భంగి నం
తను నిజసుప్రకాశమగు కాంతులవెల్గ జేయుచున్ పురం
బును వెస నిర్గమించి రణభూమికి జేరగబోయి ముందుగా
జనరహిత ప్రదేశమున చయ్యనతేరును డిగ్గి యుత్తరిన్. 1999

తనకును భంగమొందని విధంబున భూరి బలాఢ్య దైత్యులన్
ఘనులను కాపుబెట్టి యధికారుణ వల్కలమాల్య గంధ ధా
రణమొనరించి పావకుని ప్రస్ఫుట భంగి ప్రతిష్ఠజేసి సం
జనిత విశిష్ట నిష్ఠుడయి సంగరభూమి జయాభిలాషియై. 2000

పనిగొని యాజ్యము లాజలు
ఘనహోమ ద్రవ్యవితతి గైకొని వహ్నిన్
జనిత విధియుత హోమం
బును జేసెను నగ్నికతుణ బొందగ నంతన్. 2001

వరవిని హోమముల్ సలిపి భాగమునొక్కటి సర్వకృష్ణమై
పరగె ప నట్టివాని గళభాగము ఖండనజేసి రక్తమున్
స్థిరమతి హోమకుండమున జేర్చుచు వ్రేల్చిన నగ్నిదేవుడున్
గర...ను దృప్తినొంది యట గన్పడ నొప్పె విధూమరూపుడై.

అనల ము మధ్యమందున హుతాశనకీలల నావృతుండునై
ఘనమణి కుండలాంచితుడు కాంచనవర్ణ మదేహుడై రణా
వని విజయంబు గల్గునను భావము మోమున దోప నాహుతా
శనుడు సుదర్శనీయుడయె శక్రవిరోధి తనూజుముందటన్. 2003

చ॥ దనుజుఁడొసంగు హవ్యముల దః ప్రియమెయిం గ్రహించి చాప
మున కవచంబునున్ రథము కాంచనగర్భ మహాస్త్ర రాజమున్
గొనుమని యిచ్చి యేఁగిన నకుంఠితమైన తదీయ శక్తులన్
గొనుచును విక్రమంబు నతిశోన్నతి మీరగ శీఘ్రగామియై.

చ॥ అనలాగ్నివేశ ధత్త్రిమ్యఘ్నశక్తి ధథ్రుబు పితామహాస్త్రమున్
మునకవచంబు గొంచు లయుక్షాత్రుని తంగి శిక్యంబమా బుతై
చనియును వియత్తలంబునకు నద్వబిశాచర సైన్యవాహినిం
గనుఘనను గిట్టు పత్రె భుజగర్వము మీరఁగ భీషణాకృతిన్.

ఉ॥ ఏనిట నుండ మీకు భయమేలను మీరలు వేగనేగి యూ
వానరసైన్యముం జెనకవచ్చును ఘోరి కృపాణచాప నా
నా నిశితాంబకంబుల గనంబడకుండ వియత్తలంబునన్
నేను జరింతు మీకభయమిచ్చితి పోపుడు యుద్ధభూమికిన్.

-: ఇంద్రజిత్తు మాయా యుద్ధము జేయుట :-

చ॥ అనిమిషవైరి యిట్టు లభయం బొసగగన్ రజనీచరుల్ మహా
నినద మొనర్చి వేగ కదనేచ్చను వానరసేనదాకి సం
జనిత పరోషులై వివిధశస్త్రములన్ బటుదారుణాకృతిన్
జెనకగ జొచ్చె రింద్రజితు వీక్షణజేయుచు నంబరస్థలిన్.

శా॥ మాయోపాయమున న్నదృశ్యుడయి కుంభచ్ఛాపముం బూని
నేయుం జొచ్చెను ఘోరబాణవితతిన్ నేర్పుంగదుం బూపుచున్
నేయుంతంబున గానరాక కపుల న్నిచ్ఛాపరిహారంబుగా
ధీయుక్తిన్ వధియింపజొచ్చె దనుజాధీశాత్మజుం డెంతయు

గీ॥ అతని ఘాతంబులను మీరునట్టి బాణ
వితతి తెయ్యంగ దొడగె పృథ్వీజచరుల
పంచలత మొందె వానర సైన్యమంత
ఘోరశర ఘాతకాంగులై భువిని గూలె.

చ: అతుల గుణాఢ్యనుల్ పటుతర యుక్తశక్త గర్వులుగాగ రత్నమం
డిత తపనీయ భూషణ ఘనేకము లంపులుగాగ విక్రమ
స్థితినలరారు నింద్రజిత్తు చేటును గూర్చెడు కాలమేఘమై
క్షితిజ వరాదులన్ గురియజేసెను భీకర బాణవర్షమున్. 2010

చ: విలయ దివాకరోగ్రకరభీకర బాణములేయు నొక్కటన్
ప్రళయ మహానలంబుగతి పర్విడు కాండములేయు నొక్కటన్
కులిశనిభంబులైన యధికోజ్వల సాయకరంబు లొక్కటన్
బలయుతుడైన యింద్రజిత్తు పల్మరునేసె వనాటసైన్యమున్. 2011

దానవు శస్త్రశస్త్ర చయధాటికి నోర్వగలేక భీతి నా
వానరసైన్యమంత బహుభంగుల పాటును జెంది యారణ
స్థానమునందు గూలిరి సుధార్థము మున్సురరాజి పూర్వగీ
ర్వాణుల చేతగూలుగతి వంచితులై రణరంగమందునన్. 2012

వెండియు నింద్రజిత్తు రణవీధి నయిన్ పటుమాయ బూని యు
ద్దండగతిన్ శిలాదులను దారుణవృష్టిని వర్షజేయగా
ఖండితమూర్తులై దళితకాయులునై యతిచూర్ణితాంగులై
భండన భూమిగూలె పటువానరసైన్యమునందు కొందరన్. 2013

ఉ: దానిని జూచి వానర కదంబము లా రణవీధి వీడుచున్
పార్చవిభీతి పర్యలిత వాలిసుతుండు నలుండు నాదిగా
వానరయోధు లాతపుల బాధల నాపగలేక క్రుద్ధులై
దానవవీరుపై తరువితాన శిలాదులరువ్వి రేతతన్. 2014

చ: తనలుభు నింద్రజిత్తు పటుకార్ముకమం గొని కాలదండ వ
హ్నినిభ శరంబులేయుచు సహిత జవంబున కీశయోధులన్
[illegible]
రణమొనరించ పాగి పతులంబగురీతి విభీతకంబుగన్. 2015

సీ॥ నలుని తొమ్మిదిబాణములచేత నొప్పించి
మైందుని పంచబాణాగ్ని నడచి
అష్టాదశమహోగ్ర మగు శరంబులనేసి
గంధమాదనుని విక్రమముడించి
పటుతర మార్గణ పంచకంబుమ నేసి
గజుడనువాని దోర్గర్వమడచి
నీలుని ముప్పది కోలల బాధించి
ఋక్షపాలుని శరారూఢినొంచి

గీ॥ ద్వివిదు మరియును ఋషభుని దినకరాత్మ
జుని కుముదు నంగదుని రణోత్సుకత మీర
పృథ్వి బడగూలనేసె వావృదు బలుండు
రావణసుతుండు నింద్రజిదాఖ్యసుండు. 2016

చ॥ రణమున గూలి భిన్నతనులై రుధిరాంచితగాత్రులైన యా
వనచరసైన్యమున్ కదనవర్యులగాంచి మహేంద్రజిత్తు దా
మతమున నుత్సహించె ననమాన జయంబును గంటినంచు నం
జనిత క్రుధాత్ముడై యరుల సర్వవినాశము జేయనెంచుచున్. 2017

మ॥ దనుజుండౌటను రాత్రిభాగమున విస్తారంబు తేజోబలం
బును వృద్ధిన్గనరించి మేఘముల సంభూతంబు గావించి దా
ద్భున కోదండము బూని వంగరకళాట కోపంబు దీపింప గ
ర్జనలన్ జేయుచు కాలవర్ణనిభశస్త్రాస్త్రంబుల న్నేయగన్. 2018

చ॥ ధరణిధరంబు లాకులిశధాటికి ధారుణి గూలుచుండగా
తరుతతులున్ తుషారహతి ధారుణి ఖేదవదేత్ము రీతిగన్
వరకలవాలహేతిదెగి వ్రాలిన రంభమహీజముల్ ననన్
సురపతి జిత్తు బాణముల సూదనులై తెగి గూలె వావరుల్. 2019

కరచరణంబులన్ తలలు ఖండితమై ధువివ్రాలువారు బీ
తరగతి మూర్ఛితాంగులయి కాయము వీడెడువారు భగ్నులై
యురచెడువారు దానవుతరావళి శాకిడికోర్వలేక సం
గరవిముఖత్వ మొందుచు రణావని వీడుచు పారువారలున్. 2030

ధనుజుఁడెందున నున్నవాడమచు దావృష్టినివ్వలోకించుచున్
గనరామిన్ వెతజెందుచున్ శరచయాక్రాంతంబుగా నా రణా
వని యయ్యోన్ దవవహ్ని జిక్కిన మృగవ్రాతంబు భంగిన్ భయా
జనితభ్రాంతులునై యుపాయములనే చందంబునం గానకన్.

మఱియును నింద్రజిత్తు శితమార్గణముల్ పరగించి యంజనా
వరసుతు నీలు నంగదు గవాక్షు దివాకరసూను జాంబవ
చ్ఛరభ సుషేణరంభుల గజద్వివిదాదిక యోధవర్యులన్
వరవర పుత్రులన్ రణమునందున మూర్ఛను బొందజేసెవన్. 2032

అన్నను గూడియున్న మనుజాధిపురాముని పైని రోష సం
జనితమనస్కుడై పృథులసాయక వర్షము వర్వజేయ నా
జనవిభుడత్తరిన్ చలన సంగతి బొందని పర్వతంబు భం
గిని స్థిరుడై సురేంద్రజిత్తు కృత్యములం బరికించి లక్ష్మణున్. 2033

రాముడు బ్రహ్మాస్త్రమును మన్నింపవలెనని లక్ష్మణుతో దెలుపుట

కని యిటు పల్కె వీడు పటు గర్వితుడై విధిదత్తమౌ వరం
బున కమలాసనాస్త్రమును బూని తదీయ బలంబుచేత నీ
వనచరసైన్యమున్ సుబలవర్గము గూలగనేసె మాయచే
మనగతుడౌచు సంగరముఖంబున నేయుచున్నవాడొగిన్. 2034

వలువ వరంబుచే జలదనాథుడు విక్రమమొప్ప నీగతిన్
జెలగుచునుండె సంగరముజేయ నసాధ్యము వీనితోడ ని
శ్చలతను బూనివీని శరజాలములన్ సహియించి సంగర
స్థలమున యూరకుండుటయె తప్పని కార్యము చింతజేయగన్.

చ॥ రణమొనరింపకున్న సురరాజ జితుండు నివృత్తయుద్ధులౌ
మనలను జూచి తా సమరమందు జయంబును గందినంచు సం
జనిత సుహర్షుడై పెలుచ సంగరభూమిని వీడి లంకకుం
జని విజయంబుగల్గెనని చాటును గావున మార్గమిద్దియే. ౭౫

చ॥ అనుచును లక్ష్మణాన్వితుడునై రఘురాముడు దైత్యనాథ నం
దనుడటులేయు బాణముల ధాటికినోర్చుచు విక్రమించవకన్
రణతలమందు నుండగ సురారి మదించదలపోసె రామల
క్ష్మణులు విషాదమొందిరని చంచల చిత్తుడునౌచు నత్తరిన్. ౭౬

క॥ ఆ రాత్రి యుద్ధమందున
దారుణగతి విక్రమించి దానవుడు మహా
వీరుల వానరయోధుల
గూరగతిం గూల్చి లంకకుంజనె నంతన్. ౭౭

–: విభీషణుడు వానర వీరులకు ధైర్యము దెలుపుట :–

చ॥ అతులిత బుద్ధిమంతుడు మహాగుణశాలి విభీషణుండు నా
యతగతి సంగరస్థలము నందున రావడి బాణలోక తా
డితతనులై విభీతులయి డెందమునందు గలంగు వానర
ప్రితతులగాంచి వారలకు భద్రత గూర్పగ నెంచి యిట్లనున్. ౭౮

చ॥ వనచరవీరులార రణభాగమునందున రామపేశ్వరుల్
తమపుల దప్పి కూలిరని తల్పగ బాడియె యింద్రజిత్తు నే
డనుపమ బ్రహ్మనామక మహాస్త్రము ధాత వరప్రసాదుడై
కొని రణమాచరించెను నకుంఠిత భూరిపరాక్రముండునై. ౭౯

చ॥ వనజభవాస్త్రమీజగతి వంద్యము గావున దానిమన్నవన్
గనులయె యుత్తమంబని ప్రకాశముగా దలపోసి సంగరాం
గణమున దైత్యనాథసుతు నస్త్రములం బడినట్టి భంగి యా
యినకులు లిర్వురున్ సమధికేచ్ఛను గూలిరి మీరెరుంగరే.

చ॥ అని పలుకంగ వత్తరి మహాబలనూతుడు తెల్విగాంచి యా
వనజభవాస్త్ర రాజమును శాపము నందు దలంచిమ్రొక్కి రా
వణుని సహోదరుంగనుచు బల్కె మహాత్మక సంగరంబునన్
దనుపున ప్రాణయుక్తుల వనాటుల జూడగనొప్పు నిత్తరిన్. 2032

చ॥ అనుచును నిర్వరున్ రణతలంబున గూలిన వీరవర్యులన్
గనగ నపేక్షజేసి నిశిగావున నుల్కను బూని సంచరం
బును నటుజేయ గానబడె భూరివివద్దశ గూలియున్న సై
న్య నికరమున్ విఖండిత మహారుధిరాయత సిక్తదేహులన్. 2033

సీ॥ ఖండితమధ్యోరు కంఠభాగంబులు
దళిత పాదాంగాది కలితమగుచు
విచ్ఛిన్న మూర్ధముల్ విడిన కేశంబులు
విదళిత కరభుజ వదనములును
శరవర్షపూరిత గురుదేహ భాగులై
వజ్రవేగాహ పర్వతచయంబు
భంగి రాశీభూతపాటవంబును బోలి
బహురక్త ధారా ప్రవాహములను

గీ॥ గలిగి రావణిచేత రణతలమునందు
గూలియున్నట్టి సుగ్రీవనీలమైంద
ద్వివిద రంభాంగద సుషేణ వేగదర్శి
వినత నల తార పనసాది వీరవరుల. 2034

గీ॥ జన్యతలమందు గూలిన సప్తషష్టి
కోటివానర నికరంబు క్షోభగాంచి
వృద్ధుడైనట్టి యా జాంబవంతుడెచట
నున్నవాడొకో యని చూచుచుండునంత. 2035

-: జాంబవంతుడు ఆంజనేయు కుశలమడుగుట :-

మ॥ శరవిచ్ఛిన్న శరీరుడై ధరణిపై శాంతాగ్ని చందంబునన్
చిరజీవిన్ వృద్ధు ధాతసుతునిం ధీమంతునిం జాంబవ
ద్వరవీరాగ్రణి గాంచి దానవకులాధ్యక్షానుజుం డత్తరిం
గర సంప్రశ్నను జేసి పల్కె మిముమౌ కంఠోక్తిమై యాతనిన్. 2036

కం॥ భల్లూకరాజ దానవు
భల్లంబుల నీవు మృతిని బడయక యిచటన్
మెల్లంగ గూలియుంటివె
కల్లోలితమైన యట్టి కదనమునందున్. 2037

చ॥ అనుచు విభీషణుండు సమయోచితరీతిని బల్కె నాతడా
తని పలుకాలకించి తమతాపము గొంత శమింపుకొంచు గొం
తున వ్యసనమున్ సముంచితము నొప్పగ దిద్దుచు ధీరతన్ విభీ
షణుగని పల్కె కష్టదశ సంభవమౌటను సంగరస్థలిన్. 2038

చ॥ వినుమిక రాక్షసాన్వయ వివేకమతీ యతిరావణాత్మజుం
డని మము నేయు బాణముల నక్కట దృష్టిని రాకయుండె గొం
తుమ విని యావిభీషణుని శోకముగాగ నెరింగినాడ నే
మును గనియుంటలేదు తలభూమిని నిట్టి విషాదబాధలన్. 2039

చ॥ దనుజకులావతంస బలదర్పుడు నంజనదేవి యందువన్
ననిలసుతేజసంభవుడు నాత్మవివేకుడు వానరాళిలో
వినుత పరాక్రముండు పరవీర భయంకరు డాంజనేయుడీ
దురమున ప్రాణయుక్తుడయి తోడున వీరలు కానిగొంటిరే. 2040

ఉ॥ అంత విభీషణుండు చతురాక్షర భాషణశాలి పల్కె భూ
కాంతులు రామలక్ష్మణులు ఋక్షవరాధిపు డంగదుండు ధీ
మంతులు కీశనాయకులు మాన్యగనుండగ నీవు నా హనూ
మంతుని నెంచనేల గుణమ్ముందవ దెల్పవె భ్రాతృవత్సలా. 2041

నావిని యావిరించి సుతుడత్తరి బల్కెను రాక్షసేశయా
పావని జీవయుక్తుడయి భాసిలెనేనియు సర్వవానరుల్
చావును బొందియుండియును చావనివార మతండు వచ్చినన్
జీవములుండియున్ మనము జీర్ణదశంగని చట్టులెంచెదన్. 2042

అనిలసుతుండు జీవయుతుడై తనరారిన యుద్ధమందునన్
మనలను రక్షజేయగ సమర్థుడు గావున వానినెంచి నే
దనుజ వరా వినంబడగ దద్దయు మున్మగ బల్కెనాత వా
తనికిని గల్గు దక్షత యథార్థము జూడలేదు నేరికిన్. 2043

అనవిని చెంతనున్న మరుదాత్మజు డప్పుడు జేరవచ్చి యా
వనజభవాత్మజుం గనుచు వచ్చెను నియ్యది మారుతాత్మజుం
డని పలుకంగ నాతడు మహాముదమందుచు తెల్వితో పున
ర్జనితుడునైన భంగి పటుసారగతిన్ వచియించె నీగతిన్. 2044

-: జాంబవంతుడు హనుమంతునితో సంజీవకరణి దెమ్మనుట :-

వనచరవీరవర్య భువి ప్రాకృత కీశుడవీవుగావు నీ
యనుపమ విక్రమంబు ధరయందున నేరికిలేదు సంగరాం
గణముల గూలియున్న కపికాండములన్ నరనాథపుత్రులన్
మనుపగ నీవుదక్షుడవు మారుత నందన శత్రుమర్దనా. 2045

మారుతపుత్ర నీదు మహిమాన్విత విక్రమ భూరిసత్త్వమున్
నేరుపు జూపగల్గుటకు నిప్పుడు కాలము సంఘటిల్లె నీ
వారయ నొక్కరుండవె మహారణమందున గూలియున్న భూ
దారుల సర్వవానరుల త్రాణము జేయగ నుద్ధరింపగన్. 2046

వీరలజీవయుక్తులుగ వేగమె చేసి దిగంతరంబులన్
భూరివిశాలకీర్తులను బొందుము రాముడు నిన్ను మెచ్చ దు
ర్వార బలుండవున్ రఘువరాధిప కార్యధురంధరుండవున్
మారుతనందనుండ వనమాన పరాక్రమ విక్రముండవున్. 2047

సీ॥ కపివరసేవు నాకాశ మార్గంబున
  వారిధి దాటి యావలకు బోవ
హిమవంతమనెడి మహీధర మొప్పును
  నాగిరీంద్రము దాటి యవల జనిన
కైలాసవృషశాఖ్య శైలద్వయంబుండు
  నారెంటి మధ్య విరాజమగుచు
సాంధ్యాగోపమ స్థలము నొప్పారును
  సర్వ దివ్యౌషధ స్థానమగుచు—

గీ॥ సందునను మృతసంజీవని యను విశల్య
కరణి సావర్ణ్యకరణియు మహితంబు
నైన సంధానకరణియు నరుదుగుండు
నాల్గుదివ్యౌషధంబు లానగమునందు. 204

క॥ దీపములభంగి వెలుగుచు
దీపించుచు నుండు నాల్గు దిక్కులయందున్
నాపలికిన మార్గయుతిన్
నోహొనని యుత్తకేగు మాజ్వలమతివై. 20[illegible]

ఉ॥ వాటిని సంగ్రహించి యిటువచ్చి రణాంతరమందు గూలి యే
మాటలనాడకుండ స్మృతిమాలిన వారిని బాధితాంగులై
పాటులబొందువారి మృతిబొందినవారిని రక్షజేయుమో
మేటివనాటవీర కనుమింకను భూరివిశేషకీర్తులన్. 20[illegible]

—: హనుమంతుడు సంజీవని దెచ్చుట :—

ఉ॥ వలువ తనూజుచే ననిలనందనుడత్తరి ప్రేరితుండునై
బలమును వృద్ధిజేసి పటువర్షపువేళల సంబుదంబు ని
స్తులగతి వృద్ధిబొందుగతి దోవ శరీరము పెంచుచున్ మహా
విలయ సమీరతుల్యమగు వేగము దాల్చుచు హుంకరించుచున్. 2[illegible]

అరయఁగ పర్వకాలమున యందు సముద్రము పొంగు భంగి కే
సరితనయుండు వార్ధితటి శైలము నెక్కి ద్వితీయశైలమున్
కరణిని త్రొక్కి నిల్చి పదఘాతములన్ కుధరాంతరస్థమౌ
తరువులఁగూల్చె భిన్నమయె దారుణగండశిలాదిసంతతుల్. 2052

మరియు విహంగముల్ గగనమందున గుంపులుగట్టి పారగన్
వరుసది వన్యసత్త్వములు ప్రాణభయంబున వేగనొందు భూ
ధరమును జేరనేగె దివి దిగ్గిరిగౌండల జేయు ఖేచరుల్
వరమిథునంబు లాగగన భాగము వంజెను భీతచిత్తులై. 2053

నిండగ పద్మరాజములు భీమవిషాగ్నులు గ్రక్క సమ్మహా
క్రాంతనయుండు దద్గిరిని పాదవిఘట్టనజేయ ఘాతముల్
గలిగి మహాధ్వనుల్ పల్లవ గాయము మెంచుచు ఘోరనాద ము
జ్జ్వలగతి జేయ కంపనము బొందెను లంకను సర్వభూతముల్. 2054

మననమున రాక్షసాళి నఖముల్ నిశితాసి భుజంగకల్పమౌ
ఘన నిరవాలముల్ బిగువుగాగను పీడమునెత్తి కర్ణముల్
పగిగొని నిక్కబెట్టి నిజపృష్ఠము వంచియు దూరదృష్టి కా
ననమున దిప్పి పైకెగసె నాగగణంబును మిన్నుగకై వడిన్. 2055

అతులజవాన్వితుండగుచు నంబరమందెగయంగ వాయుదా
గతిసుతు దేహవేగగతి క్షోణిజ శిలాదులు సర్వ భానితో
నతిశయ మొప్ప నట్లు చని యావయివేగము వీడ్మికిందటన్
పతనము జెందె వార్ధి తరంగుల ఘోరవినాదయుక్తమై. 2056

గురుతర సమాన వేగుఁ డయి కాలభుజంగ సమానదాహుండున్
హరికర ముక్తమౌ సురుచిరంబగు చక్రము భంగి రామ భూ
వరకర ముక్త భూరిశరభంగిని తంత్రి జవంబు దాల్చియున్
కరమును నేగె నంత దివనాథుని మార్గమట్టి యుగ్రతన్. 2057

చ॥ ధరణిధరంబులన్ నదుల దారుణ కానన వృక్షవర్గమున్
పురతతులన్ తటాకముల పుణ్యతపోవన పల్లెసీమలన్
త్వరితగతిం గమించుచును తామర చూలిసుతుండు బల్కి ను
త్తరదిశకున్ జనెన్ తుహినధారధరంబును గాంచి యంతటన్. 2058

క॥ అమిత మనోహర మగుచును
నమృతతుల్య విమలజల మహారుచిరంబై
ప్రమదంబు గూర్చె హిమగిరి
ద్రుమచర పుంగవున కతులదృఢ గాత్రునకున్. 2059

చ॥ కనకసమాన కాంతులను గ్రాలెడు నావృషభాద్రి యందునన్
మును జలజాసనాత్మజుడు పొంగదెల్పిన యోషధీతతుల్
గని మరుదాత్మజుండు నధికాద్భుత మొందుచు సంచరించుచున్
ననుపమ దీపితౌషధుల వహ్నిరుచిం బరికించుచుండగన్. 2060

ఉ॥ ఆ నిశియందు దీపముల యట్లు వెలింగెడు నోషధుల్ మరు
త్సూనుడు వచ్చుటంగని యదృశ్యములయ్యెను దానిగాంచి యు-
వానరపుంగవుండు క్రోధవర్ధిత వహ్నిసమాననేత్రుడై
యానగరాజు ముంగని మహానినదంబున బల్కె నీగతిన్. 2061

ఉ॥ లోకహితార్థమై ధరను బ్రోద్భవమందిన రామభూవరా
స్తోకమనీషు కార్యమునదోహదమిచ్చుట మానివేగమై
యీ కపటంపువృత్తి నటియించిన నేమి ప్రయోజనంబులన్
జేకురు నీకు నిన్నుగొని జేర్చెదు శ్రీరఘురాము చెంతకున్. 2062

చ॥ శిలలెరుగంగనేర్చునె యశేషమనీషల సత్ప్రభావముల్
కులగిరిధీరులెందునను గొల్వగనేర్చునె నిన్ను నా యచం
చలమగు రామభక్తిని నెపంగొని బోయెదు మద్భుజాబలం
బుల నెరుగంగ జాలె దపూర్వముగాగ మహాద్భుతంబుగన్. 2063

ఉ॥ అనుచును నాగిరిన్ వలయితంబుగ వాలముజుట్టి భూమికం
బనమును బొందురీతి రఘువర్యునిపైగల భక్తికోడుగా
ఘనతరు సత్వసంయుత నగంబును వేటెకలించి యెత్తె నా
యనిమిషవర్గముల్ గనుచు నద్భుత మంచును సన్నుతింపగన్. 2064

చ॥ కరముల సంగ్రహించి మదిగాంచిన ప్రీతివశోంతరంబుపై
గరుడజవాన్వితుండగుచు గ్రక్కున నిర్గమనంబుజేసె ని
ర్జరుల శరంబు లక్క గ్రహరాజపథంబును బట్టి పోవగా
హరివరుడొప్పె నంత జలజాప్తుని కైవడి నంబరస్థలిన్. 2065

వరచక్రంబు ధరించిన
హరిపగిదిని యొప్పె మారుతాత్మజుడంతన్
కరగతగిరి సంవాసిత
సురుచిర కాంతులను మిగుల శోభితుడగుచున్. 2066

-: రామలక్ష్మణులు సర్వవానర సహితంబుగ విశల్యులగుట :-

వినువీధిం జనుదెంచువీరవరునిన్ వీక్షించి యా వానరుల్
ఘనహర్షా నినదంబులన్ సలుప నుత్కంఠంబున న్నంజనా
తనయుండార్చెను సింహనాదమును సంతృప్తాత్ముడై పట్టు భం
గిని యంతన్వెలుగొందు నాగిరిని నుంచెన్ వారిమధ్యంబునన్. 2067

తను కృతకృత్యుగా దలచి తామరసప్రియసూను జాంబవ
ద్వనచర వీరవర్యులకు దండనమస్కృతు లాచరించె నా
వినుత మహౌషధాళి ప్రభవించిన గంధ సమీరణంబు సో
కిన వెనువెంటనే నృపులు కీశులుదెల్వివహించిరెంతయున్. 2068

అంత విశల్యులయ్యె మనుజాధిప సూనులు యుద్ధభూమిలో
వంతము బొందియుండిన వనాటచయంబులు చేవయుక్తులై
వింతగలేచె దేహరుజవీడగ రాత్రి నిద్రబోయి ని
ద్రాంతమునన్ ప్రభాతమున దద్దయులేచెడి వారిపోలికన్. 2069

మ॥ రణమారంభమునాటి నుండియు కపివ్రాతంబుచే గూలి నా
దనుజానీకము లెక్కజేయ బహుళత్వంబున్ జనవ్రాతముల్
గని భీతావహలోకటంచు దధి గూలందోయుటం జేసి యా
రణభూమిన్ హతదానవావళికి పునర్జాతంబు లేదయ్యెడన్. ౨౦

చ॥ అనిల తనూజుడీగతి ఘనాటచయంబుల జీవనంబులన్
మనగమజేసె భూవర కుమారకు లంత విశల్యులై రణాం
వని వెలిధీరులై నిలచి తద్విమహౌషధి పర్వతంబు వే
గను గొని యుంచె పూర్వగతిగా వృషభాద్రి సమీపమందునన్.

-: సుగ్రీవుడు లంక ముట్టడింప వానర సైన్యమును పురిగొల్పుట :-

చ॥ అనిల తనూజుగాంచి తపనాత్మజుడత్తరి పల్కె మారుతీ
దనుజవిభుండు నందనుల దానవయోధుల మంత్రి వర్గమున్
రణమున గోలుపోవుట నిరంతర చింతను దుఃఖమగ్నుడై
యని నొనరింపరాదు సమయంబిదె లంకదహింప వేగమై. ౨౦

ఉ॥ కావున నీవు లంక నిక గాల్పగ వానరవీరవర్యులన్
భూవినుతప్రతాపులను ఘోరబలాఢ్యుల బంపుమింక నా
రావణు డుగ్రకోపుడయి లంకకు రక్షనొసర్చువేగ యు
ద్ధావని కేగుదెంచును నిశాటయుతంబుగ నాలసింపకన్. ౨౦

చ॥ అనవిని యాంజనేయుడు రయంబున యూథపులందరున్ వినన్
నినసుతు నాజ్ఞగా దహియింపగ నొప్పను లంకవీధులన్
గొనుడిక నుల్కలన్ బుడుతు ఘోష నొనర్పగ వారలందరున్
పనివడి నుల్కలంగొనుచు పారిరి లంక దహింపనత్తరిన్. ౨౧

మ॥ పురిబాగంబును చేరి చుట్టుకొని యేపుంజూపి యుల్కాగ్నులన్
కరముల్ తత్పురహర్మ్య గోపుర మహాగారంబులన్ వహ్ని వి
స్తరితన్ రగులంగ గల్పవే మహాదావాగ్ని తుల్యాకృతిన్
పరివృద్ధిన్ దహియించె లంక బహుళ జ్వాలామయంబై కడున్.

మించు చిర రత్న మరచిత విశద్ధకవాట గవాక్ష జాలకల్
పరిమళ చందనాదులను భక్ష్యచయంబుల కంబళంబులన్
కరిరథవాజి వరతతుల కాంచన భూషణసంగరక్రియా
పరికరవస్తు సంతతుల సర్వగుణంబుల తోరణంబులన్. 2076

ధనురాదికములన్ సుసాయక శతఘ్నీకంబులన్ పొక్కుత
ర్కనిరాయంబుల రోమకంబళములన్ ప్రాసాదజాలంబులన్
మనకుద్గాయుధ వర్గతాలములను రత్నానేక సంపత్తులన్
వినుతానేక సమస్త వస్తుతతులన్ విధ్వంసముంజేయుగన్. 2077

పురిగలవారలంత్ర ప్రభూత భయావహచేష్టితో వెసన్
పరువడి పారజొచ్చి నిజవర్గములంగొని నిద్రితాత్ములన్
కరముల నెత్తికొంచు నధికంబగు తానవిశేషమత్తతన్
పరువడి శక్తిలేక పలుతంగుల పాటున జెందిరత్తరిన్. 2078

అనలము వృద్ధిబొంది జనులాదిగ భూరిగృహాంతరంబులన్
మణిమయ హాటకాతతము మంజుల వేణుమృదంగ జాలముల్
ఘనతరజాలతంతుగతి గ్రాలెడు భూరివిమానపంక్తులన్
దనుజవిభుప్రసాదముల దగ్గమొనర్చె మహాద్భుతంబుగన్. 2079

భూరితరాగ్ని తోరణ సముచ్చయముల్ గనవొప్పె నివ్వడిన్
వారిదమందు కంపలు విభాసిలుచుండగ కనక గోపుర
ద్వారకవాటముల్ మిగుల పృథ్విని గూలెను జాజ్వలితమై భ్రం
దారకనాథుచే దెగెడు తారకసంఘము వోలుచున్నతిన్. 2080

పురమున వీధులన్ని శిఖిపూరితమై పరమౌషధీలతా
కర హిమపర్వతంబుగతి గానగ నయ్యెను కొన్ని భాగముల్
గరముగ పుష్పితంబగు పలాశవనంబుల బోలిదగ్ధమై
మెరయుచునుండె లంక పరుషంబుగ నేయగ వహ్నికానలల్. 2081

ఉ॥ మరియు నయంబువేళల బ్రమాదభయంబున వారి రాశిలో
దిరిగెడు నక్రచక్రపవిధిన్ బురమందున బంధముక్తమై
కరితురగాదివర్గములు గాఢతరోద్ధతి బారజొచ్చె నా
కరనిధి లోహితోదకము సంగతి దాల్చె విభీతకంబుగన్. 203

మ॥ పుతసంక్షోభము నొంది దానవులు నా భూమిస్థలిన్నిల్వ లే
క రయంబొప్పగ బాహ్యపీమలగు మార్గాన్వేషులై పారగా
వరిశీలించి వనాటలోకములు శంఖత్రక్రియం బాకె నం
గరముంజేయగ నా నిశాంతరముల న్నత్యంత ఘోరంబుగన్. 204

క॥ జలదములభంగి నిశిచర
బలములును వనాటబలము పటుతరముగ గ
ర్జలు సలుప నా రవంబులు
కలయంగా దిశలబర్వె క్ష్మాకంపించెన్. 205

ఉ॥ క్ష్మావర సూనులత్తరి విశల్యులునై ఘనకార్ముకంబులన్
శేవదలిర్ప దాల్చె రఘుశేఖరు యాముని మౌర్వి మ్రోయగా
భూవలయంబు కంపనము బొందెను దానను దానవాళి భీ
తావహచిత్తులైరి కపిరాజి మహాముదమందె నత్తరిన్. 206

క॥ కైలాసాచల సన్నిభ
మౌలంకానాథు గోపురంబును నేలం
గూలంగజేసె పటుశర
జాలంబుల రామచంద్ర జనవిభుడంతన్. 207

క॥ దాలింగని కుపితుండై
దానవపతి కుంభకర్ణ తనయుల రణపా
రీణుల కుంభ నికుంభుల
పేనాతతితోడ రణముజేయగ బంపెన్. 208

-: రావణుడు కుంభనికుంభుల యుద్ధమునకు బంపుట :-

వారికి సహాయకారులై పరగఁ గోటి
శాక్త యూపాక్షులను బలదర్పయుతుల
మరియు కంపనప్రజంఘులన్ మహితశక్తి
యుతుల నల్వురఁ బంపె రఘోర్వికంత. 2088

ఉ। వారలఁగాంచి పల్కె సురవైరి నిశాచరులార వేగమై
మీరలు వేగి యుగ్రరణమేదిని శాత్రవరాజి గూల్చి మీ
భూరిజయాంకముల్ దెలుపుఁబోలిక భీకరసింహనాదముల్
వీరతఁజేయు డేనువిని వేడ్కవహించెదు తావమారగన్. 2089

అని యీ రీతిని బంప నార్వురును యుద్ధాయత్తులై యస్త్రశ
స్త్ర నికాయంబుల గొంచు మేఘగతి గర్జారావముల్ జేయుచున్
జనె ప్రత్యూషమువేళ భూషవితతుల్ శస్త్రాస్త్రజాలంబులున్
గన చంద్రాతప జారకాస్ఫురితమై గ్రాలంగ నావేశలన్. 2090

మ। కరవాలాస్త్ర వరశ్వధంబులను తీక్ష్ణానేక నానాయుధో
త్కరముల్ దాల్చి వచ్చుదానవుల వీక్షించి యా వానరుల్
కరముందాకిరి రెండువర్గములు నాకాలంబునన్నొప్పె సా
గరముల్ రెండును పొంగి ఢీకొను మహాగాంభీర్య శౌర్యోద్ధతిన్. 2091

-: అంగదుడు కంపను వధించుట :-

శా। శైలాకారులు వానరవ్రజము నిస్సంధ్రప్రకారంబునన్
శైలంబుల్ తరుసంతతుల్ విపులపాషాణంబులం గొంచు ను
ద్వేల ప్రక్రియవైచె దానవులపై వీరత్వముం జూపుచున్
నాలంబప్పుడు చెల్లె నిర్వరతు ఘోరాభీల దుర్వారమై. 2092

। దనుజ బలంబులంత జలదంబు సువృష్టిని జేయుభంగి భీ
షణ కరవాల శూల బహుశక్తివరశ్వథముద్గరంబులన్
వనచరసేనపై ప్రబల పౌరుషయుక్తిని నేయఁజొచ్చె దా
రుణముయె వారణంబు గడురోష యుతంబుగ రెండువాగులన్. 2093

చ॥ కరచరణాదుల న్దునిమి ఖండితమై దళితోత్తమాంగులై
తరుచరవర్గముల్ రణముధాత్రిని గూలఁగఁ జొచ్చె వీర వా
నర వరులంత దోర్బలము నం దనుజవ్రజ మస్తకంబులన్
జనిత పరోషులై యదిమి క్ష్మాతలి గూలఁగఁజేసె గ్రుమ్ముచున్. 2084

చ॥ బలములు రెండు నీగతిని బాయక తాము పరస్పరంబుగా
జెలఁగుచు పోరుచుండ రణసీమ భయావహ దృశ్యమయ్యె ని
శ్చలతను బోర నాగతి నిశాచరసైన్యము కొంతసేపటన్
జలనము బొందె నష్టధన సంభవమయ్యె విభీతతంబుగన్. 208

క॥ భగ్నధ్వజ కవచంబై
నష్టపటాభరణ దీన నాదాంచితమై
కష్టాకుల చిత్తంబయి
పుష్టిదక్కి దనుజ బలము పోరొనరింపన్. 20

మ॥ రణధీరుండగు నంగదుండపుడు ఘోరాకారతం బోరు కం
పను డాసెన్ రణమాచరించ బలగర్వప్రోద్ధతుండౌటన్ వడిం
దనుజుంతత్తరి కేలనున్న గదతో తాడించె నాయంగదుం
దపువంధున్ ప్రతితప్పి యంగదుడు కొంతందెబ్బనింబొందుచున్

క॥ ధారాధర శిఖరంబును
దారుణముగ దెచ్చివైచె దానవుపై బృం
దారకపతి పౌత్రుఁడు నా
తీరుగాంచి దానవుండు తీరున కెక్కెన్. 2

చ॥ అరదగతిన్ నిరంతర శరావళి సంగమునేయ నాతఁడు
న్మరుజవ మొప్పగా దవతలోపలి భాగముపైకి దూకియున్
తురగచయంబు పాదముల త్రుంచి శరాసన మార్గణంబులన్
హరణముజేసి శత్రువు కరంబొనరించెను ముష్టిఘాతిచే.

దానిగని శోణితాక్షుడు
వానరవరు దాకె వరకృపాణము గొని యా
మానంబుగాంచి యతని కృ
పాణము గొని యంగదుండు పటుజవమొప్పన్. 2100

దనుజుని నా కృపాణమున తాడనజేసి విభీతపింహ గ
ర్జన మొనరించి యంతకుని చందముగాగ సురారి వర్గమున్
జెవకగ దొచ్చె నారణము సీమను డ్రెక్కి యనేక రాక్షసుల్
వినిహతులయ్యె దానిగని భీతిల శోణితనేత్రు డత్తరిన్. 2101

శోణితాక్షునకు సహాయమౌ నటంచు
వెడలె యూపాక్షు డంగదు వీరవర్య
వాక నంత ప్రజంఘుండు దారుణముగ
పరువిడుచు వచ్చె సౌకాయాతదముగాగ. 2102

మ॥ దనుజశ్రేష్ఠులు మువ్వురిగతి రణస్థానంబునన్ నంగదున్
జెనకన్నగిన వారిరుధ్యను కపిశ్రేష్ఠుండు గప్పట్టిటిన్
విధువీథిన్ శశియూధికాళినడుమున్ వెల్గొందు తంగిన్ రణా
వని మైంద ద్వివిదులాశిరంగుగని తుల్యద్వేగసంరంభులై. 2103

-: అంగదుడు ప్రజంఘుని జంపుట :-

వానవసుత పుత్రునకు
బాసటగా జవిధి కీశవరు లాప్తకన్
క్రాసకరంబగు రణవి
న్యాసంబులవొప్పె దనుజ నగతరులంతన్. 2104

హరి యూధపముఖ్యుల్లా ఖది
తరు పంకాపములదెచ్చి దద్దయునై చెన్
వరశాత కృపాణంబున
త్వరితగతి ప్రజంఘుడన్ని తత్తుమునేసెన్. 2105

క॥ గురు పాషాణములం గొని
కరిరథతురగముల చెనకగా నేయంగన్
వరబలుడా యూపాక్షుడు
పరువడి సితహయకముల భగ్నము జేసెన్.

క॥ హరివరులేకత ముప్వురు
గురుతర పాషాణవృష్టి గురిపింపంగన్
సురవైరి శోణితాక్షుడు
కరతల గదచేత వాని ఖండవజేసెన్. 2

క॥ భూరికృపాణము గొంచుమ
దారుణగతి వాలిపుత్రి దాకె ప్రజంఘుం
డా రాక్షసు తీరుంగని
వీరవరుం డంగదుండు వృక్షమునొకటిన్. 2

చ॥ పనివడి దెచ్చి వానిపయివైచియు వాపయి ముష్టిఘాతిచే
తనువునుగ్రుచ్చ గూలె రణధారుణి కొంతట మేలుకాంచి పం
జనిత నరోషుడై మరల సత్వయుతుండయి ముష్టిఘాతిచే
వనచరవీరు నంగదుని వక్షమునేసెను దారుణంబుగన్.

చ॥ హరివరుడంత మూర్ఛిలియు నంతన వేగమె తెల్విగాంచి తా
కరగతమైన ఖడ్గమున ఖండనజేసె వప్రజంఘుశీర్షమున్
సురపతిమున్ను తానముచి సూదనము న్మొనరించు భంగి పం
గర తలమందు నాశిరము ఖండితమైపడె రాక్షసుల్ గనన్. 2

—: మైంద ద్వివిదుల యూపాక్ష శోణితాక్షుల జంపుట :—

గీ॥ అటు వప్రజంఘుండు నంగదు హస్త ఖడ్గ
ధారగూలుట గని దుఃఖ పూరితాత్ము
డగుచు క్రోధంబు రెట్టించి యమరనాథ
శాత్రుదాకెను యూపాక్ష పరబలుండు.

॥ భూరికృపాణ హస్తుడయి ప్రోజ్వలతం గని వచ్చు రాక్షస
కూ్రరుని యూపనేత్రుగని కోపమునం ద్వివిదుండు ఘోర హుం
కార మొనర్చి హ స్తిని మృగాధిపుడుద్ధతి బట్టురీతి దు
ర్వారగతిన్ వెసందవిలి పట్టెను దోర్బల జృంభమాణుడై. 2112

ఉ॥ అదిగని శోణితాక్షుడు మహాగదచే ద్వివిదోత్తమాంగమున్
వృథుజవ శక్తిచేయ రుధిరంబును గ్రక్కుచు వేష్టదక్కియుం
వదవడి తెల్విగాంచి సురవైరి గడంగొని మైందుడంత దు
ర్మదుడగు యూపనేత్రుని శిరంబును తాడనజేసె నుద్ధతిన్. 2113

శా॥ యూపాక్షుండును శోణితాక్షుడును వత్యుగ్రంబుగా మైందుచే
నాపైనన్ ద్వివిదాఖ్యుచే వృథుల బాహాపీడభగ్నాంగులై
యేపుందక్కుట జూచి యత్తరిని నూహించెన్ కపిశ్రేష్ఠులా
పాపుల్ శక్తులు గోలుపోయిరమటన్ బాహాబలస్ఫూర్తిమై. 2114

చ॥ ఘనతర వజ్రసన్నిభ నఖంబులచే ద్వివిదుండు శోణితా
క్షుని వదనంబుజీల్చి బలకారత చేతుల బట్టి త్రిప్పి చ
య్యన విసరన్ వతండు రణమందున గూలెను భగ్నదేహుడై
తనుగత ప్రాణముల్ విడెను దానవులత్తరి దుఃఖమందగన్. 2115

మ॥ బలసంపాదవజేసి మైందుడు రణవ్యాపారు యూపాక్షు భూ
స్థలిపై త్రెళ్ళగద్రోచి పాదతల హస్తవ్రక్రియన్ మర్దనల్
వలుపన్ నాతడు భిన్నకాయుడయి ఘోరాజిన్ మృతింగాంచె వి
హ్వలులై పారెను దానవుల్ కపుల కాహ్లాదంబు పంధిల్లగన్. 2116

గీ॥ ఆ శోణితాక్ష యూపాక్షు లంతమొంద
దనుజబలములు భయగతి దాటులిడుచు
పారజొచ్చిన దనుజ విస్రాతుడై వ
కుంభకర్ణ తనూజుడు కుంభుడంత. 2117

-: మైంద ద్వివిదాంగదులు కుంభునిచే మూర్ఛిల్లుట :-

చ॥ కరువడి వచ్చువచ్చి పటుశంగుడధైర్యము లెక్క సైన్యమున్
సిరతను లిల్యజేసి రణభీమునెదిర్చె యతుండు కీశసైన్యమున్
దరుముచు ఘోరకార్ముకము ధారణజేసి శిలాంబకంబులన్
తరుచరసైన్యమున్ కదనధారుణి గూలగజేసె నత్తరిన్. 2118

మ॥ ఘనకోదండము బూని తీక్ష్ణతర సంకాశంబులౌ చిత్రకాం
చన పుంఖంబులు గల్గు తీవ్రశరముల్ సంధించి యుగ్రాకృతిన్
జనిగా నాద్వివిదున్ నిరంతర శరవ్రాతంబుచే ముంచినన్
ఘనశైలంబు చలించు చందమున నాకంపించుచున్ కీశుడున్. 2119

క॥ జవనశ్వంబులు తొంటిగ
ద్వివిదుని దేహంబునరెదు దెగిన నతండున్
భువిగూలె దానిగని దో
నవ శోకము హర్షమొదవె నతులిత బలగిన్. 2120

చ॥ అనుజుడు భంగమొందగని యుగ్రుడు మైందుడు జాతకోపుడై
ఘనగిరి శృంగమొండు గొని గాఢతరోద్ధతి కుంభుపైన్ వై
చిన గని దానవుండు చటులక్రమ్మిగల్గిన్ శరషంచకంబుకన్
తునియలుగాగ జేయుచును తోడన దానవవీథు పేషినన్. 2121

క॥ కుంభశర ఘాతచేతం
కుంభద్వయ పాండ్రదర్పయుక్తాక్షోభ మైందు డా
కుంభిని వ్రాలెను నట తన్
బంధయ విశ్రాంతి పొంది రుత్కటరీతిన్. 2122

గీ॥ మైందుదును ద్వివిదుడాగతి మహిని గూల
దాని వీక్షించి యువ్వాలి సూనుడలుక
భూరి నిష్ఠుర పాషాణ వృక్షతతుల
కుంభుపై వేసె వాతని గూల్పవలచి. 2123

కనలుచు కుంభదంత శితకాండము లం బరపించి యంగదున్
ఘనతర తీవ్రతరంబులను గాయము వెట్టిన నంగదుండు నా
యనిమిషనాథ పౌత్రుడు మహాద్భుతిమంతుడు చంచలింపకన్
పనివడి నేయు బొల్చె శిలవృక్ష పరంపర లేకఘాతిగన్. 2124

దనుజుడు కుంభదంత పటుదారుణ కాండములేసి యన్నిటిం
దుళియలు గాగజేసి నిజదోర్బల ముప్పతిలంగ వాలినం
దను నిటలంబునన్ సునిశితాస్త్రములన్ బరపింప నాతడున్
వ్రణవదనుండునై గళితరక్తము నేత్రములందు నిండగన్. 2125

నయనయుగంబుపై శరము నక్షరచేర్పుచు నొందువేళచే
రథమున వృక్షము ంగొని యుద్ధనిష్ఠుడై కుంభుని నేయ నాతడున్
భయరహితుండునై చలకరత్నకృతంబుల ఛేదనేసె దు
ర్జయుతడు భూమిజమున్ ఘనినిష్ఠురతన్ వటుచేర్చియు విక్రమించుచున్.

మరియును కొంతకల్గి యుపశూంత శరంబులు వాలిసూనుపై
పరువడి నేయ తచ్ఛరము వానరపుంగవు మేనవాడివన్
వరవశమొంది యూరకొని బాహుబలంబున దరగూలె యామినీ
చరులు మహాట్టహాసములు సంతసమొప్పగ జేసిరత్తరిన్. 2127

కరనిధి తప్పకమైనగతి సంగరభూమిని బాధితాంగుడై
హరివరుడట్లు సొంగగ వనాటులఖండితబుద్ధి దుఃఖమంది స
త్వరమగ రాముజేరి యొరపుండు ధుని పొత్తుగిడు కొంతకరిచే
ధరణమున వేసలిన్మరలి దుర్ఘటగాంచె నటండు బల్కగన్. 2128

అనవిని రామభూవిభుడు నంగదు రక్షణజేయనెంచి యా
వనచర [illegible] శ్రీకవర్యులం
గని [illegible] కాళ్ళమునగాగ రణంబుజేసి యా
యనిమిషనాథ పౌత్రుని [illegible] డెంతయున్. 2129

చ॥ అనవిని యావనాటచయ మా రఘువర్యుని శావనంబువన్
జనిత వరోషులై విలయసంగత మేఘచయంబులోలె గ
ర్జనలను జేయుచున్ దనుజరాజ సహోదరపుత్రకుంభునిన్
రణతలమందు దాకిరి కరంబుల వృక్ష శిలల్ ధరించుచున్. 213

చ॥ వనచరవీరు లేకమయి వచ్చుటగాంచియు నిర్భయుండునై
కవచము కాలుభంగి శితకాండముల న్నిగిడించి భూరి వా
హినిగతి భూరిభూధరము వెంతయు బంధనజేయు భంగి నా
దనుజవరుండు వానర కదంబము నాపె మహావ్రతాపుడై. 21?

చ॥ అతుల బలాఢ్యులయ్యును రణావని నేర్పరులయ్యు నిర్జర
ప్రతతికసాధ్యులయ్యు మకరాలయ బంధనులయ్యు సాహసో
ద్ధతులయు వేలదాటుఘనతన్ గనలేని సముద్రభంగి నా
క్షితిజ చరాగ్రణుల్ దనుజుచేతను జిక్కిరి నిష్ఫహాయులై. 2.3

–: సుగ్రీవుడు కుంభుని జంపుట :–

చ॥ దనుజకరవ్రయోగ పటురాజుణ శస్త్రచయంబులన్ వనా
ట నికరముల్ బలాధిపుల దవ్విన జూచి దివాకరాత్మజుం
డనుపమ క్రుద్ధుడై కదనమందున గూలిన వాలిసూనునిన్
గని దరిజేరి భీకరనినాదము జేయుచు విక్రమంబునన్. 21?

ఉ॥ మేరుగిరీంద్రమందున నమేయగతిం దిరుగాడు దేవతా
వారణ రాజముద్ధతిని బట్టు మృగేంద్రము రీతి దేవతా
వైరి నికుంభునిం గదిసి వృక్షచయంబుల వృష్టిముంచె దు
ర్వారగతి న్నిశాచరుడు వాటిని ఖండనజేసె గ్రక్కునన్. ?

మ॥ చలవంబొందక కుంభుడ తరి మహాస్త్రాళిన్ మహోగ్రంబుగా
నళినీబాంధవ పుత్రునేయ నతడున్ వారించుచున్నంతకుం
బలె రోషంబు వహించి కేతకిగతిన్ వర్తించి యాతుంధు వ్రో
జ్జ్వలరీతిన్ గదిసెన్ కపివ్రజము సంభ్రాంతాత్ములై చూడగన్ 21?

చలమున వానిదాకి భుజశక్తి పటుత్వము మీర కార్ముకం
బలఘుగతిన్ హరించి తునియల్ నొనరించెను దానవుండు చం
చలుడయి భగ్నదంత కరిసామ్యము గాగను దోచె వానితో
వళిన హితాత్మజుండనిటు వాతడు రోషము బొందు రీతిగన్. 2136

అమరాధీశుని గాలు సాగరుని ప్రహ్లాదున్ బలిన్ శ్రీదునిన్
సమతంబోలను నీపరాక్రమము నెంచన్ దానవశ్రేష్ఠ వి
క్రమమందుం ఘటకర్ణ తుల్యుడవు నీగాథ ప్రతాపంబు మా
కమితానందము గూర్చె రావణునెడన్ గాంచంగలే దీగతుల్. 2137

వ॥ ధనువుమకేల బూని రణధారుడి నిల్వగనిన్ను జూడగా
ననిమిషవర్గమైన వెనుకాడును గాదె భవచ్ఛరావళీ
జనిత మహానలంబునకు సారతరాత్ముల వేదితవ్యమున్
గను గొనలేని యట్టి జననాథుం బోలిక కుంభదానవా. 2138

అనిమిషవర్గముంగెలిచె నాదశకంఠుడు ధాతచే వరం
బునుగొని కుంభకర్ణుడను ఘోరశరీరముచే జయంబులం
గొనియెను సింద్రజిత్తు తనకున్న ప్రతాపముచేత శత్రులన్
రణమున సంహరించె తతులంబగుశక్తి భయంకరాకృతిన్.

తలపగనీవు కూడ వరదాన బలంబున శక్తియుక్తులన్
గెలిచితిమున్ను దైవత దిగీశనికాయ చయంబునెంతయున్
విలువగ్రహించినాడ వతివీరుడ వంచును దానవాదులం
దెలిసెను నీవరాక్రమము శేటవడంగమ కుంభదానవా. 2140

అవి తలపంగనేల సమరంబున మద్ధతివమ్ము దాకుమా
దివిజపతిం బలుండు పటుధీరత దాకిపళంగి పోరగా
భవదవమాన శస్త్రపరిపాటిని కార్ముక కోవిదత్వముం
దవులంగ జూపునావమని తథ్యముగా నిపుడాంపింపకన్. 2141

కరలాఘవంబు మెరయగ
సురవైరియు కపివిభుండు శూరతమీరన్
దురము నొనర్చిరి యుభయే
తర కర్షణముష్టియుద్ధ తాడన విధులన్. 2148

ఉ॥ పోరటు సాగుచుండ కపిపుంగవుడుద్ధతి బాహులన్ మహా
శూరుని కుంభుబట్టికొని చుట్టును త్రిప్పి మహాజవంబునన్
వారిధిలోనికిన్ విసరె వాడు బడెన్ జలరాశియందునన్
ఘోరినగంబు మందరము మున్హరిచే బడునట్టి రీతిగన్. 2149

ఉ॥ పతన జవంబు గల్గుట ఫపారముపైకి ... తర్షాతలంబు దా
కి తనువుపైకి వచ్చె తమ్మకించుచు ... నుగ్రుడై
యతి ... ముష్టి తపవాత్మ ... తీవ్ర కాయుడై
ధృతివిడనాడకుంభ ... మున్ముఖుడౌచు నుద్ధతిన్. 2150

॥ పవితారోగ్ర కఠోరమై శిలయు ... ఘోరంబునై
రవిసంకాశ సుతీక్షమై పరగుతీ ... ముష్టిన్ నము
ద్భవరోషంబున కుంభువక్షమును ముక్కోండంబుగా నేసె దా
నవు డాఘాతము ... పడె ... ంతరంబందునన్. 2151

మ॥ జవభత్వంబులు వీడియున్ దళితుడై ... చందంబునం
దివిభాగంబున మండి జారిపడు నందీప్తోల్క తోయంబునన్
నవనింగూలెను కుంభు డత్తరిని యాశ్లె లాటవీయుక్తమౌ
భువికంపించెను సాగరాంతరములన్ బొందెన్ మహాక్షోభముల్.

క॥ మృతిగాంచిన కుంభుని గని
ధృతివిడి రాక్షస బలంబు రయమున బోయెన్
గతియించిన వనుజుని గని
యతులిత క్రోధ నా నికుంభుడత్తరి పెలచన్. 2153

-: హనుమంతుడు నికుంభుని జంపుట :-

క॥ కనలుచు కోపానలమున
శివసుతుని దహించురీతి నిగుడ జూచుచున్
రణమాచరింప వచ్చెను
రణావనికి నందు వానరాళి జెనకుచున్. 21

మ॥ పరిఘంబుంగొని ఘోరనిష్ఠుర మహాధ్వానంబు గావించుచున్
వరవక్షోగత నిష్కయుక్తుడగుచున్ శర్మాంగదాధారుడై
స్ఫురితానేక విచిత్రభూషణుడునై పొల్పారు సత్కుండలాం
బర సంశోభితగండభాగుడగుచున్ భవ్యప్రతాపోన్నతిన్. 21

మ॥ పరిఘాగ్రంబున దత్తమారుతములన్ ఖండించుచున్ నుగ్రుడై
సురగేహంబుల దేవతాపురిని సంక్షోభంబు గావించుచున్
వరగంధర్వపురంబు తారకలు నక్షత్రపుండు చంద్రాదులుం
గరిముం గంపముబొంద జేయుచును సంగ్రామైకపారీణుడై. 1

చ॥ మరియును వింధ్యాచలగతమైన మహాంబుదరీతి ఘోష సం
భరితవిధూమపావకునిభంగి నయంబగువేళ భూరి వి
స్ఫురిత హుతాశనం బలెను క్రోధఘటిల్ల రణంబునందు సం
చర మెనరింపసాగె కపిసంఘములాతని జూచి పారగన్. 2

ఉ॥ మారుత సూనుడత్తరిని క్ష్మాధరముం బలె సంచలింపకన్
భూరిగజేంద్ర హస్తనిభముల్ వగు భీకర బాహుసంగతిన్
దారుణసాలవృక్షము దాల్చిన జూచి నికుంభుడంత దు
ర్వారగతిన్ మరుత్సుతుని వక్షముపై పరిఘంబువేసినన్. 2

క॥ ఆహావని వక్షంబున
నావరిఘము దాకి పరియలై భువిరాలెన్
చూపరుల కంబరస్థలి
నేపుదక్కి గూలినట్లు నియతిని దోచెన్. 2

అనిలసుతుఁ డపుడు వడిఁ గుం
భుని తాడితుఁ జేయ నతఁడు భూధరమౌటం గం
పన మొందునే భూకంపన
గవగమ్ముల కులశైలంబు కదనమునందున్. 2160

అనిలసుతుండు భూరిజవ ముద్ధతశక్తి ఘటించి క్రోధ వ
జనిత మనస్కుఁడై కులిశసన్నిభ ముష్టిని దాల్చి యుద్ధతిన్
దనుజు నికుంభు వక్షమును దట్టిన రక్తపరీతమయ్యె నీ
షణగతి [illegible]గను నవల శోభచు పంగతక్రియన్. 2161

తాడితుఁడై నిశాచరుఁడు దారుణవృత్తియు తెల్విఁగాంచి యా
గాడుపు పట్టి పైకెగిరి గాఢతరోద్ధతి వానిఁ బట్టఁగా
కీడుమతిల్లె నీగతిని కీశనకంచు నికుంభుమెచ్చుచున్
వాడిమగంటిమిన్ దనుజవర్గము నాదమొనర్చె నత్తరిన్. 2162

వారల హర్షనాదముల వాయుసుతుండు మహోగ్రుఁడై మహా
దారుణ ముష్టిఘాతమున దానవునేసిన [illegible]
ధారుణిగూలె వేష్టలను దక్కుచు వాయుతనూజుఁ డంత భ
గ్నోరుశరీరు దానవుని క్రోధమనస్కుఁడునౌచు జేరుచున్. 2163

కరతల పాదఘట్టనల కాయము మర్దనజేసి వాని పె
న్నురమున గూరుచుండి శిరము [illegible] త్రిప్పి భూ
ధర శిఖరంబులోలె పటుదానవు మూర్ధము [illegible]
తరగతి [illegible] గన్. 2164

-: రావణుఁడు మకరాక్షుని యుద్ధమునకుఁ బంపుట :-

రణమొనరింప మాని యటరాక్షససైన్యము వేగఁబారె రా
వణు దరియంగ నేగి రణభాగము సేరి [illegible] కుంభులన్
జనియెనటంచు బల్కఁబడియె [illegible] రావణుం
డనుపమ దుఃఖకోపముల నాగ్రహ [illegible] యుంబునన్. 2165

ఉ॥ ఆదరి యున్నవాని మకరాక్షుని యా ఖరసూనుఁ జూచి పం
పాటిత శక్తివంతుడవు వారక నాదగునాజ్ఞగాగ నా
శీఘ్రమువాన్ప యుద్ధమునకేగి బలంబుల బంపి రామ భూ
నాథుని వానిసోదరుని నంతముజేయు మటంచు పల్కినన్. 2166

ఉ॥ రావణుడట్లు పల్క, మకరాక్షుడు నాతనిగాంచి పల్కె నో
దేవ భవన్నిమిత్తము విధేయుడనై భవదీయ యాజ్ఞగా
దేవదలిర్ప వేగ రణసీమకునేగి నృపాలపుత్రులన్
నావన భాగపంచరుల నంతము జేసెద చూడుమిత్తరిన్. 2167

క॥ అని పలికి కైకసీ పు
త్రునకు ప్రదక్షిణల సలిపి తోడన గల యా
దనుజ బలపతిని గనుగొని
ఘనబలముల స్యందనంబు గడుశీఘ్రముగన్. 2168

క॥ తమకూర్చి తెమ్మటంచును
క్రమతం బలుకంగ నతడు గడు శీఘ్రగతిన్
సమదగజ తురగ రథ భట
సముదాయము గొంచువచ్చె సంగరకాంక్షన్. 2169

చ॥ రణమొనరింప నంత మకరాక్షుడు సారథిగాంచి పల్కె నే
జనగము దాశరథంబునిక సంగరభూమికి దోలుమంచు నా
దనుజులగాంచి పల్కె తను దాశరథీతుల జంపబంపె రా
వణుడు వనాటసైన్యమును బట్టి వధింపుడు మీరలందరున్. 2170

సీ॥ అని పలుకు మకరాక్షదనుజ వీరుని వాక్య
ముల విని రాక్షస బలములపుడు
కామరూపముల విక్రమమొప్ప దాలిచి
దంష్ట్రాకరాళ వక్త్రముల గలిగి

మత్తమాతంగ ఘంటల్లీల ఘీంకార
    రావముల్ వలుపుచు రణఉత్సాహ
లాయత్తులై మకరాక్షు పరివేష్టించి
    ఘనతర భేరికా స్వనములెలగ

తలవని తలంపుగా బ్రకోదంబుసూతు
కరమునంజారి పడె శతాంగధ్వజంబు
విరిగిధరగూలె తురగముల్ వీగి వడిచె
నయనములయందు నశ్రుకణాశిరాల. 2171

అనిలోందు తపనభావము
గనవరచుచు భూరజంబు గ్రైకొనివీచెన్
రణమునకు జనెడువేళను
దనుజవరుడు వీరుడగుట తలపకవానిన్. 2172

కరిమహిషాంగ తుల్యఘనకాయులు రాక్షససేనలత్తరిన్
పరువతివచ్చి యొక్కొకడు బల్కుచునేసవధింతు వృక్ష సం
చర నికరంబులన్ననుచు సర్వవిధంబుల పాదఘట్టనన్
ధరణిచలింప జేయుచును దర్పయుసాగిరి యుద్ధభూమికిన్. 2173

రణమునుజేయవచ్చు మకరాక్షుని దూరమునుండి చూచి యా
వనచరసేన లత్తరి యవారణశీల తరూపలాదులన్
ఘనగిరి శృంగముల్ కరముఖంబుల దాలిచి భీకరాకృతిన్
రణమొనరింప సాగిరి కరంబు జయూంతురులొందు నుద్ధతిన్. 2174

దనుజుల్ వంతట నిల్వలేక సురసంతానంబుతో దానవుల్
మును యుద్ధంబొనరించినట్టి గతి నంభూతోగ్రనాదంబులన్
జెనకం జొచ్చెను రెండువాగులును పక్షిణవ్రాతంబులన్
రణముంజేయగ సాగె భూరజము సంగ్రామస్థలిం బర్వగన్. 2175

చ॥ పృథివి చలించునట్లుగ మకరాక్షుడు మౌర్వి మ్రోయజేయుచున్
కదనతలంబునందు శితకాండ సహస్రము వెంట గూర్చుచున్
విదళనజేయ జొచ్చె నొకవేయని వీరరసంబు నిగ్గలన్
మదయుతుడౌచు సల్పెను ప్రమాదము గూర్పగ వానరాళికిన్.

మ॥ ఆ మకరాక్షుప్రేరిపున నహంకృతి బూనుచు దైత్యసేన ఉ
ద్దామగతిన్ విశృంఖల విధానమున న్విహరింపజొచ్చె సం
గ్రామతలంబునన్ కపిబలంబుల జెందుచు బాల్చ చిత్తులై
భీమనినాదముల్ సలిపె భీకరనర్తన మట్టహాసులై. 2177

ఉ॥ దానవధాటి కోర్వక యథంద్రి పరాక్రమశాలియగ్గు వానరుల్
పారిన భయంబునన్ బరువు వారగ రాముడు జూచి వర్ష సం
తాన మహోజ్జ్వలంబులగు దారుణ బాణచయంబులేసి యా
మానవ భక్షసైన్య గతి మందము గొందగజేసె దక్షుడిన్. 2178

ఉ॥ రామశరప్రయోగ శరరాజికి నోర్వగలేక దానవ
స్తోమము పారబోవుచున్న మదోద్ధతిమై మకరాక్షుడుగ్రుడై
యామెయి వారిజాప్తకుల మ్రాగాధిపుజేర గజంచి క్రింగరయి
రాముని జేరి పల్కెను తిరస్కర దూషణ భాషణంబులన్. 2179

-: మకరాక్షుడు రాముని తిరస్కరించుట :-

చ॥ మానవనాథ యీయెడలు మాటికి జెల్లెదు నీటు నీమ భూ
రాశ్రితులైన వారలతోడ ద్వంద్వయుద్ధమున్
[illegible]
దేని రణంబునన్నిలువుమా గిటజిగించెద నాకరంబులన్. 2180

మ॥ సుర గంధర్వ భుజంగ సిద్ధ గరుడ స్తోమాదులున్ వ్రాలి నీ
పరపెట్టెన్ నెన్నడి ధాటికోర్వక బలవ్యాకుల్యతుడై పట్టి యా
ఖరునాశంబది ప్రాపించె నవ్వినిను నే గాంచంగ గోరెద నం
తరమందుం గనె వృద్ధిబొందెదిని యుక్తాయుక్తహీనాత్మకా. 2181

దండక కాననాంతర వధంబున నేను వహాయకారినై
యుండమి జూచి మజ్జనకునోర్చి రణంబున జంపియుంటి నే
నుండిన నీకు సాధ్యమగునొక్కొ మదీయమహాస్త్రరాజిచే
ఖండన జేయకన్ విడువగల్గుదునే విను సంగరంబునన్. 2182

మాటలు పల్కనేల నిలుమా యిక సంగరరంగమందునన్
బోటరిపేరి పోరుమిక పొల్పవలారగ వాపశ్రీలాపమున్
తాటకవైరి నీదుబలదర్పములిత్తరి సర్వలోకముల్
మేటిగ జూచుగాదె మనమిర్వుర మిప్పుడు పోరు సల్పగన్. 2183

తడవిక జేయగనేలను
గదువడి శరబాహు యుద్ధ ఖడ్గవైఖరిన్
విడువక జూపుము నాపయి
జడియను నీబింకములకు క్ష్మాతలనాథా. 2184

అనుచు ప్రలాపములాడెడి
దనుజుని మకరాక్షు జూచి దశరథసుతు డా
తని పరిహాసముజేయుచు
వినబల్కెను ధీరవాక్య విధి నాపేళన్. 2185

విను మసురాధమా భువనభీకరు నిన్ ఖరునీదుతండ్రి దూ
షణు పదునాల్గువేల బలసాంద్రుల దండకజంపు కార్యమున్
వినుతకృతంబు గాదు రణవీధిని నేడువధింతు నిన్ను భీ
షణగతి నీదుమాంసము పెనందిన జంబుకకాకఘూకముల్. 2186

–: రాముడు మకరాక్షుని వధించుట :–

ఖరదైత్య కుమారకు డపు
డురు మేఘము గురియు మాడ్కి నుగ్రశరంబుల్
గురిపింపసాగె రణభీ
కరుడయి రాఘవుని మీద గడు ధైర్యముగన్. 2187

కం॥ దినవాథ సుతుడు వాలిని
ఘనతర శరవర్షమేసి గగనతలముననన్
తునియలుగా నొనరించెను
వినుతగతిని వానరప్రవీరులు బొగడన్. 21

చ॥ జలధులు పొంగిపారగను క్ష్మాతలి కంపము నొంద నంబర
స్థలము విశలగస్తై యుదత దానవవర్గము శీర్షస్త్యమూల్
చలిత హృదంతరాళులయి పంగరభూమిని వీక్షజేయగా
జెలగెను నద్భుతంబగు విశేషరణంబులు ద్వంద్వమై ఖలిన్. 21

చ॥ అరయ వియత్తలంబున మహాంబుదముల్ గతి భీకరాకృతిన్
గురుతర గర్జలన్ సమధికోజ్జ్వల పుంఖమయూఖ శంపలన్
సురుచిర శక్రచాప సమశోభిత భూతిశరాసనంబులన్
దురమున వల్పరిర్వును దోర్బలమొప్ప జయాభిలాషలై. 21

కం॥ దనుజుని శరజాలంబుల
జనపతి భగ్నంబు సేయుపొగి రాముతే
తను విడువబడిన శరముల
ననిమిష శాత్రవుడు భగ్నములు జేయుంగన్. 21

కం॥ ఒకరికొకరు వెనుదీయక
ప్రకటీకృత నత్యులగుచు రణవిద్యాలం
పటు చిత్తులగుచు పోరిరి
వటు విన్యాసముల వివిధభంగిమలొప్పన్. 21

ఉ॥ పోరటు సాగుచుండగను భూపలలాముడు చాప విద్య వి
స్తారుడు సాయకాస్త్రమున దానవు వింతిని దున్మివాజులన్
సారధి జంపి రాత్రిచరు పొరతలోత్తమ గాడ సేసివవన్
వీరవరుండు నొట రణవీధిని బారకగెంతి భూమికిన్.

క। కాలానల సన్నిభ మా
భీలము సంధాన్రిన శరము వృధుశూలంబున్
కేలంగొని యా రఘు భూ
పాలునిపై త్రిప్పిత్రిప్పి పై చెంబెలుచేన్. 2194

క। దానింగని రాముడు శిత
బాణంబుల మూడిసేసి భగ్న మొనర్చెన్
దానిగని దానవుడు ను
గ్రానల కోపుండు తగుచు రఘువర్యునిపై. 2195

। ఘనమగు ముష్టిబూని బలగర్వితుడై చనుదేర రాఘవుం
డనల మహాస్త్రముం ధనువు నందున సంఘటితంబుజేసి చ
య్యన మకరాక్షునేయ నదియద్భుతరీతిని వానిదాకె మిం
టను బహువహ్నికీలల ఘనంబగు రీతిని వ్రజ్వలించుచున్. 2196

। అనలాస్త్రంబున దగ్ధకాయుడగుచు న్నత్యంత శీఘ్రంబుగా
ధరణిభూమిన్ మకరాక్షు డీల్గె దనుజ వ్రాతంబు భీతిల్లె నా
వనపందారులు హర్షమొందె దివిజుల్ వ్రజాహతింగూలు భూ
రి నగంబుంబలె నవ్వ దైత్యుగని స్తోత్రించెన్ రఘూత్తంసునిన్.

–: రావణుడు ఇంద్రజిత్తును యుద్ధముజేయ బంపుట :–

। ఖరసుతుడట్టు గూల దశకంఠుడు చంచలితాత్ముడై మనోం
తరమున శోకరోషముల దగ్ధుడు భీతిలి కొంతసేపు దా
శిరమును వాల్చి యేమిటిక జేసెదువాడ నటంచునెంచి యా
దరిగల యింద్రజిత్తుగని తాపమునొందుచు బల్కె నీగతిన్. 2198

చ। దనుజులయందు నత్యధిక ధైర్యయుతుండవు శౌర్యవీర్యులం
దున నధికుండవున్ పరులదృష్టికి గానగరాక రామ ల
క్ష్మణులను దృష్టిగోచరుల జరపెదయు శారికృతంబుగాగ జ
చ్చిన దనుజప్రవీరులకు శ్రేయము గూర్చుచు దృప్తిగొంటగన్.

చ॥ రణమున దేవరాజుని పరాక్రమమొప్ప జయంబుగొన్న య
త్యనుపమ విక్రముండవయు దారుణ ఘోరరణంబునందువన్
మనుజుని వానరాశ్రితుని మర్దనజేసియు చంపకుండ నే
లను విడవాడి పుచ్చితివి రాక్షసవీరుల గూలిరిగటిన్. 2200

క॥ దనుజాధిపుడు తనయుని
గని యీ గతి బల్కి నతడు గడుదర్పితుడై
జనియెద నంచును జవమున
కని యాసదనంబువీడి కడు దక్షుండై. 2201

ఉ॥ రణమున జేయ నా యసురరాజ సుతుండు మఖోర్విజేరి యం
దనలుని శాస్త్రరీతి వరదానముబొంద ప్రతిష్ఠజేసి పూ
జనముల జేయు ద్రవ్యముల సంగ్రహణంబు నొనర్చి రక్తభూ
షణవట మాల్యగంధముల సాదరమొప్ప ధరించి యంతటన్. 2202

సీ॥ అందు ఖట్వాంగ ధ్వజంబు సంస్థాపించి
దండోపవీతముల్ దాల్చి మరియు
పటుకపాలాసన భాసియైనుస్రుక్స్రువం
బుల గూర్చి యినుప పాత్రలను జేర్చి
యందు రక్తమునిడి యమరత్రికోణమై
పరగువేదిక యామ్య భాగమందు
రక్తపాత్రలనుంచి ప్రకట మౌనముదాల్చి
మరి యథర్వణవేద మంత్రములను

గీ॥ జదివి తిలలను సమిధల శాస్త్రనియతి
హోమమొనరించి యావీతిహోత్రు దృప్తి
వరుస నొకకృష్ణవర్ణమై పరగు ఛాగ
గళము ఖండించి యాహుతి గాగ నిచ్చె. 2203

చ॥ అనలుడు దృప్తిఁబొంది విజయాంచిత లక్షణముల్ ఘటించి యా
దనుజుఁడొసంగు హవ్యములఁ దాఁ గ్రహియించి రథంబు వస్త్రముల్
ఘనశరశతంబు చాపమును గైకొననిచ్చిన వాని దాల్చి యా
యనిమిషనాథవైరి సుతుఁడాయరదంబును నెక్కె యుగ్రుఁడై. 2204

మ॥ ఘన మౌర్వీరవమున్నినదద్భుతము శంఖారావముల్ దిక్కులం
దున పర్వన్ వటుసింహనాదములు నత్యుగ్రంబుగా జేయుచున్
దనుజస్త్రీలిరువంక చామరములన్నత్యంతమున్ వీవగా
ఘనము ల్తామయ ఛత్రిభాగ గతుఁడై గాంభీర్యుఁడై ధీరుఁడై. 2205

సీ॥ వివిధాట్టహాసముల్ విలసిల్లఁ రణరంగ
భీమమై వచ్చు దనుజేశు సుతుని
చాపప్రదీప్తంబు చతురశ్వయుక్తంబు
తప్తకాంచన వరితంబునగుచు
నర్ధచంద్రాకారమగు శరంబులు గల్గి
వైడూర్యకేతు వంశాఢ్యమగుచు
బాలసూర్యుని బోలె భాసిల్లు రథమును
దవ్వులఁజూచి యా తపనసూను

గీ॥ సైన్యములు భీతిఁజెందె నా శక్రజిత్తు
రథముతోడన గగనమార్గమున కెగసి
దనుజసేనల జూచి నిస్తంద్రగతిని
బలికెనీరీతి గంభీర భాషణముల. 2206

చ॥ వినుఁడిక నేఁడు సంగరము వీథిని రాజతనూజులన్ మహా
ఘన శరరాజి గూల్చి కపికాంతుని వాలితనూజ ముఖ్యులన్
వనచర యూధపాగ్రణుల బట్టి వధించి యవాహరంబుగా
దానవులు వృద్ధి దైత్యవిభుఁడున్నతుఁడై జయలక్ష్మిఁబొందఁగన్. 2207

-: ఇంద్రజిత్తు మాయాయుద్ధము సేయుట :-

చ॥ అనుచు నగోచరుండయి వియత్తల భాగగతుండునై రణా
వనివడి జేరి కీశచయవర్గములందు మహోగ్రముద్ధతిన్
ఘనశరవృష్టిజేయు గతిగా శితకాండ పరంపరంబులన్
దనుజవరాత్మజుండు పటుదారుణ రీతిని సేయజొచ్చెనన్. 2208

చ॥ శిరములు పైకినెత్తి వినువీధిను జూడగలేక భీతులై
శరనిధిపార్శ్వకన్ వెడలసాగిరి కొందరు రామభూవరున్
శరణము వేడ బర్వెడెను చాటుగ మాటుగ నున్న భూమికిం
గిరి గత కందరంబులకు నేగిరి యార్తనినాద యుక్తులై. 2209

మ॥ దనుజుండీగతి కీశసైన్యముల యుద్ధ ప్రక్రియంజెందుచున్
వినువీధిం జరియించుచుండ కడిన రీ ... మధ్యభాగంబునన్
ఘనశృంగోజ్జ్వల భూధరంబులగతిం గంభీరులై యున్న యా
జనవాధాత్మజులన్ సుధీరులను వీక్షంజేసి యున్మత్తుడై. 2210

... వీరలెరామలక్ష్మణులు వీరినుపేక్షను జేయునేల నం
చారజనీ చరేశసుతు డాగ్రహమొందిరణాం... గవి
ద్యారతుడై శరాసనమునందు ఘటించి యనే... యుణా
వారముల నిగిడ్చి రఘువర్యుల నెయదొడంగె న...తన్. 2211

చ॥ మరియును మంత్రశక్తి వినుమార్గమునందు రథస్థుడై నిశా
చర వరుడేయుచున్న శితసాయక రాజిని సూర్యభాలకన్
నరవరసూనులుండిరి రణోద్భవరక్త పరీత గాత్రులై
స్థిరులయి రక్తపర్వత విధిన్ నిలుచుండిరి యేమి జేయకన్. 2[illegible]

చ॥ నరవరులట్టులుండి యిక నాలసమేలను జేయునంచు ప
త్త్యరులయి కాలదండ సమతం దుడుదూగెడు నాల్గుబాణముల్
సురపతిపైరి సూను బలసూదన జిత్తును సేయునాత ద
త్త్యరుతర కోపమూని సమరోత్సుకతన్ గగనాంతరంబునన్. 2213

దనుజమాయా విశారదోద్దండుఁడగుట
భూనభోంతర గతసర్వ భూతచయము
దృష్టికిని గానరాని విధంబుగాగ
ఘోరజీమూత గాఢాంధ కారమపుడు. 2214

చ॥ పనివడి సృష్టిజేసి ఘనభాగములందు జరించుచుండ నా
తని రథనేమి ఘోషము శరాశనరావము వీనులందునన్
వినబడెగాని రాత్రిచరవీరుని కాయము గానరయ్యె నా
దనుజుడు బ్రహ్మదేవ వరదాన బలంబున మాయలూనుటన్. 2215

చ॥ దినకర తుల్యబాణములు తీవ్రముగా నిగిడించి రాజనం
దనుల శరీరముల్ దగుల నట్టుల నేసెను పర్వతంబుపై
జనిమొదు వృష్టిభంగి మనుజాధిపసూనులు సంచలింపకన్
వినుతలమందు జూచుచును విక్రమవంపద పెంపుజేయుచున్. 2216

మ॥ స్ఫురదానేక విచిత్రకాంచనమణీ పుంఖాను పుంఖంబులన్
వరనానాస్త్రపరంపరల్ దనుజుపై పైవంగ వేనేగి యా
సురపై రిపుప్రభు సూనుఁడాకి పెలుచన్ క్షోణీతలంబందునన్
వరువంగూలె నికృత్తభోగఫణులన్ భావంబు దోపింపగన్. 2217

ఉ॥ దానను కోపమొంది బలదర్పము జూపి నిశాటరాజనం
దానవరుండు కాంచన విధాన మణిస్ఫురితాళిగాళి సం
ధానము జేయుచున్ మనుజనాథతనూజులపైని వేసె మౌ
ర్వీనినదంబు దిక్కులను పిక్కటిలంగను క్ష్మాచలింపగన్. 2218

మ॥ దనుజుండేయు శరంబులన్ గడిమహోద్యద్దీప్తి నా రాజనం
దనులున్ తీవ్రతరోగ్రబాణముల నా రీతుల న్వాని ఖం
దనజేసెన్ దనుజుండు దానిగని జన్యప్రోద్భవోద్భాసియై
వినువీధిన్ గటుమాయలూనుచును దోర్వీర్యంబు రెట్టింపుచున్. 2219

సీ॥ తనువును నొకకేల్ తళతళ మెరపించు
నొక దిశ సాయక ప్రకరమేయు
సింహగర్జనమును జేయును నొకవంక
మఱియొండు దిక్కు గోచరుడునగును
చిత్రసంగరమొండు సీమను జేయును
శిలవృష్టిని పేరుజేయ సాగు
నిజనామమును నొక్క నికటంబునను దెల్పు
నుగ్రరూపము జూపు నొక్కతరిని

గీ॥ నవ్వు నొక భాగమునయందు నొవ్వలలరు
నొక్కతరి భీకరుండయి యుక్కుజూపు
విష్ణుపదమున బహురీతి విబుధవైరి
సంగర విహారుడయ్యె నిస్తంద్రగరిమ. ౨౧

క॥ నరనాథ తనూజులు భీ
కర దానవ ముక్తకర నికాయక్షతలన్
పరలిరి పుష్పిత కింశుక
తరువులగతి సంగరంబు ధారుణియందున్. ౨౨

మ॥ తనకాయంబు శతాంగ మశ్వముల చందంబున్ పతాకంబు సూ
తుని రీతుల్ గనరాకయుండుగతి యుద్ధోన్మత్తుడై మాయచే
రణముం జేయుచు కీశసైన్యముల నిర్వక్రప్రకారంబునన్
దునుమంజొచ్చె నసంఖ్యులై రణమునందున్ గుప్పలై కూలగన్.

ఉ॥ గగనతలంబునందు దశకంఠసుతుండు నిజేచ్ఛమై కడున్
నగచరసేన గూల్చుటను నత్తరిగాంచి సుమిత్రసూను డా
నగవతుధీరు రాముగని నొయ్యన విన్నవజేసి దానవుం
దగటిత మాయబూనుచు వనాటుల జంపదొడంగె నంచునున్. ౨౩

ఉ॥ వారల జింతజేయుచు నవారణ దుఃఖము జెందివీక యా
ఘోరమహాత్మజద్వయము పుచ్చెదు కాలునివీటికంచు దు
ర్వారగతిం బలంబులను రమ్మని వారలతోడ పశ్చిమ
ద్వార ముఖంబునన్ వెడలె దానవనాథ సుతుండు జెచ్చరన్. 2230

మ॥ దనుజుండప్పుడు రామలక్ష్మణులు యుద్ధాయత్తులై యుండఁటన్
గనిపేరొండు నుపాయమార్గమున నీక్ష్మానాథుల న్మాయచే
దునుమ న్వచ్చునటంచు మాయయగు నుద్యోగంబునన్ మాయచే
జనకాధీశతనూజ జేసి సమరోత్సాహుండునై యత్తరిన్. 2231

శా॥ మాయాసీత శతాంగభాగమున దంభస్ఫూర్తి గూర్చుండగా
జేయంజేసియు సంగరోర్వి జనె నక్షీణ ప్రతాపంబునన్
నాయుగ్రుం దశకంఠసూనుగని క్రోధాయత్తులై వానరుల్
చేయం జొచ్చిరి భూజరాజిని శిలానీకంబులన్ బెక్కులన్. 2232

-: హనుమంతుఁ డింద్రజిత్తుతో బోరుట :-

సీ॥ మారుతి రావణి మార్కొనగా బోయి
యాతని రథమున నంతగాంచె
పతివిరహవేదనా భరమున పరితప్త
కృశయయి కమలనేత్రములు గలిగి
శోకబాష్పంబు లస్తోకంబుగా రాల
కరమొకగండ భాగముననుండ
భూరజఃకలితాంగములు గల్గి మలినాంబ
రమున నాహార నిద్రలకు దొలగి

గీ॥ పవన విచలిత పవలత వంగి చలిత
భావమున నున్న యామాయ భామగాంచి
రూపములనెంచి సీతగా రూఢిదలచి
క్రోధదుఃఖాత్ముడగుచు నాకులతజెంది. 2233

చ॥ జనకజనేమిజేయగ నిశాటుడు స్యందన భాగమందునన్
పనివడి దెచ్చెనొక్క యని వాయుజుడప్పుడు కీశయుక్తుడై
చెనకగనేగ నింద్రజితు శీఘ్రగతిన్ దమియించివారలన్
గనుచునునిట్లు బల్కెనధికంబగు రోషము పెంపుజేయుచున్. 2234

చ॥ సమరముజేయనేల తరుసంచరులార వినుండు దేనికై
ప్రముఖబలుండు రాముడిటువచ్చెనొ యట్టిలతాంగి సీత యీ
రమణి యటంచెరుంగుడు శిరంబును నే దెగవ్రేయువాడ వి
క్రముడగు రాముడార్తిగొని కావతు గ్రమ్మరు నట్లుజేసెదన్. 2235

మ॥ అని శార్దూలముచెంత కృష్ణమృగ మత్యంతంబుకంపించు రీ
తిని గంపించుచు బాష్పధారలొలుకన్ దీనత్వముం జూపుచున్
ఘనరావంబుల రామరామయనుచున్ కంఠంబునం బర్వగా
జను మాయా ధరణీజ జూపుచును వేగంబట్టి వేరొక్క కే
లను కేశంబులబట్టి దీర్ఘకరవాలంబుస్ వడింజూపగన్. 2236

క॥ ఆ రీతి గాంచి మారుతి
దారుణ మంచరచి క్రోధతర దుఃఖములన్
నీరముల గార్చి కన్నుల
దూరెను రాక్షసుని ఘోర దురితాంతరునిన్. 2237

ఉ॥ ఓరి నిశాట నీ వసురయోని జనించినవాడవయ్యు నీ
రేరుహగర్భువంశమున పృథ్వి జనించితి రామపత్ని నీ
తీరున కేశముల్గొనుచు తెంపరివై యొక ఘోరకర్మకున్
దారిని తీయనెంచితివె దానవ నీచ కఠోరమానసా. 2238

ఉ॥ ఇట్టి దురంత దుష్కృతిని నీవొనరించిన విన్నవారు నిన్
దిట్టుమ గాదె సర్వజగతీతలవాసులు క్షుద్రుడంచు నీ
రట్టడి మానుమింకను పరాక్రమహీను డపండింతుగా
బిట్టుగ ధిక్కృతుల్ సలుపు వీరవరేణ్యులు నీకుపాడియే. 2239

చ॥ రణమున శక్రునంతటి పరాక్రమశాలిని గెల్చి యింద్రజి
త్తనెడి సుధీరనామమును దాల్చినవీరుడవయ్యు గర్వితం
బనకయె యిట్టి దుష్కృతికి బాల్పడ నీకొక సిగ్గులేదె యీ
జనకజ నీకునేమిటను సల్పెనుదుష్కృతి నీవె చెప్పుమా. 2240

చ॥ ధనమును రాజ్యసంపదలు త్యాగముజేసియు రాజ్యలక్ష్మికై
మనమున చింతలేక పతిమార్గము బట్టి యరణ్యసీమలో
తనపతిబాసి దుఃఖముయుతన్ వ్యథబొందెడు రాజపత్ని నీ
కనయము నేమిజేసెను దురాత్మక యీమెను జంపజేటితిన్. 2241

ఉ॥ ఈమెను నీవుజంపి ధరణీగతి శాశ్వతముల్గడింతువ
ద్రామ మదీయబాహువుల దండనకోర్వదవాడు నీచ యీ
రాముని జంప శక్తుడె దురాగ్రహదుష్కృతుడు జంపి పాపుడై
యేమహి కేగు నట్టి మహి కేగెదు మౌర్ఖ్యుల పల్కరీతిగన్. 2242

క॥ హనుమంతుడటుల బలుకుచు
వనచర బలయుతుడునగుచు పటుసాహసుడై
దనుజునిపై గదిసెను సం
జనితమహాక్రోధగతిని సంగరమందున్. 2243

క॥ దానింగని దనుజాధిప
సూనుండు మహోగ్రగతిని క్షోభాకరమౌ
నానాస్త్రంబుల నేసెను
వానరసైన్యంబు వెనుకబడునట్టి గతిన్. 2244

-: ఇంద్రజిత్తు మాయాసీతను ఖండించుట :-

చ॥ శరములనేసి వాయుసుతు సాహసదర్పము జూచిపల్కె నో
హరివర నీవు రాఘవుడు నరేంద్రుడున్ మరి జాంబవంతుడున్
అంచితుండు సైనికయుతంబుగ వారిధిదాటి దేనికై
పురమును జేరినారొ యవనిజాని వధింతును నామెకుత్తుకన్. 2245

ఉ॥ సీతను జంపి యంత రణసీమను రాఘవు వాని తమ్ము కం
జాత హితాత్మజున్ నిను వనాటచయంబును నావిభీషణున్
నాతత బాణపంక్తుల మహాజవమొప్ప వధించి దేవతా
నేత విరోధికిన్ ముదమునిప్పుడ గూర్చెదు నద్భుతంబుగన్. 2246

క॥ వనితలను జంపవలదని
వనచర పల్కితివి నీవు బాధాకరమై
కనుపించు దాని హరణం
బొనరించుట యుక్తమౌను భూతలమందున్. 2247

మ॥ అనుచున్ రావణియేడ్చుచున్ కుములు మాయాసీతనుంబట్టి చ
య్యన ఖడ్గంబున దున్మెంచె చూడగను వాయుక్షోవవీతంబు ధా
రణముంజేసెడి భంగి నావయిని సంగ్రామస్థలిన్ద్రోచి యా
తనువున్ వాయుజుగాంచి పల్కెమ మదాంధత్వంబు సంధిల్లగన్.

చ॥ వనజహితాన్వయోద్భవుని భార్యను సీతను జంపినాడ మీ
పనులిక భగ్నమయ్యెను నృపాలతనూజుల కివ్విశారమున్
వినబడ బల్కుమింక తదవేలను జేసెదవంచు బల్కి గ
ర్జనమును జేసె కీశ నికరంబులు భీతిలి కంపమొందగన్. 2.49

-: హనుమంతుడు ఇంద్రజిత్తుతో పోరుట :-

క॥ కరిచయము సింహముంగని
పరువిడు చందమున కీశవర్గముపడి సం
గర భూమి విడుచు పారగ
హరివరుడగు వాయునూను డత్తరి వారిన్. 2250

ఉ॥ వారణజేయుచుంబలికె భవ్యబలాఢ్యులు నయ్యు మీర లీ
తీరున బర్వ మిమ్ముగని ధిక్కృతిజేయును గాదె లోకముల్
పోరగరండు ముష్టుగను బోయెద నేనొకకొండ బట్టుచున్
జేరుడు నాదువెన్క దనుజేశసుతాగ్రిజు కిటణంచగన్. 2251

ఉ॥ మారుతి వాక్యముల్ విని ప్రమాదవివర్జిత చిత్తులై మహా
భూరి శిలాదులన్ తరుసమూహములంగొని వానరావళుల్
వారిదపంక్తి గర్జల ననారతలీల నొనర్చుచున్ మహా
దారుణ వృత్తిమైగదిసె దానవసేనల ధూళి క్రమ్మగన్. 22[illegible]

చ॥ విలయమువేళ నంతకుడు భీకరవృత్తి ఘటించుచోల్కి న
య్యలఘుడు వాయుసూనుడు చపాటయుతంబుగ రాక్షసావళిన్
జెలగుచు దాకిదావశిఖి శీఘ్రగతిన్ వనభూమిగాల్చు రీ
తులను నిశాటలోకమును దోర్బలమొప్ప నశింపజేయుచున్. 22[illegible]

మ॥ గిరిశృంగంబును నొరదుదాల్చుచు దశగ్రీవాత్మజున్ నేయ న
త్తరి దానింగమనించి వ్యోమపథగత స్థానంబునన్ వ్రేడగన్
త్వరతం ద్రిప్పిన శృంగమప్పుడు మహోద్యద్రీతిమై యా నిశా
చర సైన్యంబుల మీదద్రుళ్ళి కడు నాశంబొందగా జేసెనన్. 22[illegible]

చ॥ వనచరసైన్యమంత తరువర్గ శిలాదులగొంచు భూరి భీ
షణ నినదంబులన్ రొదిపి శక్రజితున్ ననిజేయవచ్చు దా
నవులపైకి వైచిన నతండ్రిముగాగను వారిదాకి తు
త్తునియలు జేసె దానవులతోడన వారలు పారజొచ్చినన్. 22[illegible]

చ॥ తన బలముల్ పలాయన విధంబు ఘటింపగ శక్రజిత్తు దా
గనుగొని వారినిల్పి శితకాండపటాలిన్ శరవాతరూల భీ
షణమువలాదులంబరపి శౌర్యసమగ్రుడై యునిజేయసాగ వా
నచరసేన భీతిలుచు పారగజొచ్చెను సంగరంబునన్. 22[illegible]

క॥ దనుజవిభు సుతుని విక్రమ
మునుగని దానవులు భీతిబోవక నిలిచెన్
వనచర నికరముపై బడి
యనుపమ రణమాచరించె నద్భుతభంగిన్. 2[illegible]

## -: హనుమంతుడు రాముని వద్దకు బోవుట :-

చ॥ అనిలతనూజుడంత కపిసైన్యము గాంచి వచించె మీరలిం
కను రణమాచరింపక గనంగను నేగుడు రామభూవిభున్
జనకజ జంపె యింద్రజితు సాహసవృత్తి విషాదవార్త రా
మునకు నెరుంగఁ జెల్కదము తోరౌ నరింపగనేల నిత్తరిల్. 2258

మ॥ ధరణీజాత గతించెనంచి మనమందాలోచనంజేయు భా
స్కరమానున్వెనగూడి యాపయిని నేకార్యంబు యుక్తంబొ యం
చరయుంజాలిన పిమ్మటన్ నతని యాజ్ఞంజేసి యుద్ధంబులన్
జరుపన్వచ్చు నటంచు క్రమ్మరె రణస్థానంబు బోవీడుచున్. 2259

క॥ హనుమంతుడటుల చనుటయు
దనుజవిభుని సుతుడు చూచి దలచె నీమరు
త్తనయుడు జనుటను మంతటు
గనరానిక విఘ్నమెట్టి కార్యము లందుల్. 2260

ఉ॥ కావున తంత్రయుక్తమగు కార్యము చేసి ధరాంతరంబునన్
భూవిభు గెల్వబోలునిక బోమ నికుంభిలక్షణము చేగి యా
పావకునందు నిల్పి పట్టుబద్ధ నిర్మూలిత రక్తమాంస ము
ద్యావిధులల్ సమర్చన విధానము లంబరితుష్టి జేయుచున్. 2261

శా॥ హోమంబట్టుల సాగుచుండగ రణోద్యోగంబునన్ రాక్షస
స్తోమంబున్ నెదిరించు వాయుసుతు డందొక్కండె యుద్ధ్వృత్తి నం
గ్రామంబందున నిల్చియుండె నమచున్ రాముండు చింతించియుం
డామై యున్న విధాత్రునందమని సందర్భంబుగా బిల్చుచున్.

చ॥ బలయుత జాంబవంత యట పశ్చిమ దిక్కున వాయుసూనుతో
దలపడి దానవుల్ పలువిధంబులు యుద్ధము జేయసాగె నా
యాలము నకున్ సహాయుతుడవై చనుమీ తను ఋక్షసంఘముల్
బలిసియు వెంటరాగ బలశంగుల జూపుచు సంగరక్రియన్. 2263

మ॥ అన భల్లూక విభుండు మారుతి సహాయార్థంబు వాత్సీయమౌ
ఘనభల్లూక బలంబులంగొనుచు నేగన్ మధ్యమార్గంబునం
గనియెన్ వాయుతనూజు సంగరగతిన్ వైముఖ్య వార్తాననున్
వినుతానేక పరాక్రమాలసుని నిర్వీర్యప్రభావాత్మునిన్. 22

చ॥ అనిలసుతుండు భవ్యబల భల్లుక సంఘముతోడవచ్చు నా
పవనజభవాత్మజుం గని నివారణజేసి బలంబు ద్రిప్పి యా
వనజహితాన్వయోద్భవు ప్రభావసమన్వితు రాముచెంతకున్
జనియెను దుఃఖపూరిత విషాద మనస్కుడునౌచు నత్తరిన్. 22

చ॥ వినతి యొనర్చి పల్కె రఘువీర రణంబొనరించుచుండ నా
దనుజవరాత్మజుండు వటుదారుణవృత్తి శతాంగమందునన్
జనకజదెచ్చి మాయెదుట చయ్యన ఖండనజేసె భూరి చిం
తనమునగుంది వచ్చితిమి దానవుకృత్యము నీకుదెల్పగన్. 22

మ॥ హనుమంతుండటు దుఃఖవార్తదెలుపన్ నత్యంతశోకాంబుధిన్
మునిగెన్ రాముడు శోకబాష్పములు సంభూతంబులై యక్షులం
దున రాలెన్ వివశాత్ముడై పవననిర్ధూతావనీజంబు చా
ద్పున గూలెన్ భువియందు వానరులు సంభూతార్తులై యుండగన్

క॥ శీతలజల జోదకముల
నాతరుచరులంత దెచ్చి యతివేగమునన్
సీతాపతిపై చల్లిరి
స్ఫీతాగ్నిని వారిజల్లు విధమునభీతిన్. 22

మ॥ పతితప్తుండయి యున్న రాముని కరద్వంద్వంబునంగ్రుచ్చి సో
దరుడంతం దనయుంక పీఠమున భద్రంబొప్పగానుంచి యా
తరుణీరత్నము సీతమిత్తిగొనుటన్ తాపంబునం గుందుచున్
వరయుం ధర్మపథంబు నర్థరహితం బంచున్మదిన్నెంచుచున్. 29

-: లక్ష్మణుడు రామునకు ధర్మవధమనర్థమని చెప్పుట :-

ఉ॥ రణసంభన్నని నింద్రజిత్తువయి నే బ్రహ్మాస్త్రమున్నేయగా
జనువేళన్ నతిధర్మహానియనుచున్ శాసించుటంజేసి రా
వణి యాదుష్కృతి జేసె లేని యెడలన్ పంచత్వముంబొందడే
గనగాధర్మము ధర్మముల్ జగతిలో గవ్పట్టవెంతేనియున్. 2270

క॥ అని లక్ష్మణుండు రాముని
గని ధర్మాధర్మములకు గలుగు ఫలంబుల్
గనవనుచు హేతువాదం
బునను నిరూపణము జేయ బూనుచు ననియెన్. 2271

ఉ॥ కరగత రాజ్యసంపదలు కైకకొసంగిన యట్టి ధర్మముల్
వరమునివృత్తి బూని వనవాసము జేయు మహత్వదీక్షయున్
కరమును తండ్రివాక్యమునకై పలుకష్టములొందు వృత్తమున్
నరవర ధర్మమార్గములనంగను జెల్లియు దుష్ఫలంబులౌ. 2272

క॥ అరయంగ ధర్మమిద్ధర
నిరర్థకము కష్టదంబు నిష్ప్రమాణమం
చెరిగితి ప్రత్యక్షముగా
జరుగని ధర్మంబులెట్లు సత్యంబులగున్. 2273

ఉ॥ ఫలములు దర్శనీయములయి వర్తిల సార్థకమౌను ధర్మ భా
షలకు గనంగలేమిని యసత్యములై చనుగాదె భూమిలో
పల సచరాచరంబులును వర్తిలి గోచరమౌనుగాదె యు
క్తుల గవరాని ధర్మఫల సూక్తుల నేను నిరాకరించెదన్. 2274

వ్యక్తంబుగాని ధర్మపు
సూక్తుల నమ్మంగనెటుల చొప్పడు ధర్మా
సక్తునకు నిన్ను బోలెడి
వ్యక్తికి గష్టములుగల్గు భంగి దలపుమా. 2275

మ॥ అన భల్లూక విభుండు మారుతి సహాయార్థంబు నాత్మీయ సౌ
ఘనభల్లూక బలంబులం గొనుచు నేగన్ మధ్యమార్గంబునం
గనియెన్ వాయుతనూజు సంగరగతిన్ పైముఖ్య వార్తానమున్
వినుతానేక పరాక్రమాంసుని నిర్వీర్యప్రభావాత్మునిన్. 226

చ॥ అనిలసుతుండు భవ్యబల భల్లుక సంఘముతోడవచ్చు నా
వనజభవాత్మజుం గని నివారణజేసి బలంబు ద్రిప్పి యా
వనజహితాన్వయోద్భవు ప్రభావసమన్వితు రాముచెంతకున్
జనియెను దుఃఖపూరిత విషాద మనస్కుడునౌచు వత్తరిన్. 227

చ॥ వినతి యొనర్చి పల్కె రఘువీర రణంబొనరించుచుండ నా
దనుజవరాత్మజుండు పటుదారుణవృత్తి శతాంగమందునన్
జనకజదెచ్చి మాయెదుట చయ్యన ఖండనజేసె భూరి చిం
తనమునగుంది వచ్చితిమి దానవకృత్యము నీకుదెల్పగన్. 228

మ॥ హనుమంతుండటు దుఃఖవార్తదెలుపన్ నత్యంతశోకాంబుధిన్
మునిగెన్ రాముడు శోకబాష్పములు సంభూతంబునై యక్షులం
దున రాలెన్ వివశాత్ముడై పవననిర్ధూతావనీజంబు చా
ద్పున గూలెన్ భువియందు వానరులు సంభూతార్తులై యుండగన్

క॥ శీతలజల జోదకముల
నాతరుచరులంత దెచ్చి యతివేగమునన్
సీతాపతిపై చల్లిరి
స్ఫీతాగ్నిని వారిజల్లు విధమునభీతిన్. 229

మ॥ పతిత ప్రుండయి యున్న రాముని కరద్వంద్వంబునంగ్రుచ్చి సో
దరుడంతం దనయంక పీఠమున భద్రంబొప్పగానుంచి యా
తరుచీరత్నము పీతమిత్తిగొనుటన్ తాపంబునం గుందుచున్
నరయం ధర్మపథంబు సర్దరహితం బంచున్నదిన్నెంచుచున్. 230

-: లక్ష్మణుడు రామునకు ధర్మ వధమనర్థమని చెప్పుట :-

మ॥ రణసంభన్ముని నింద్రజిత్తువయి నే బ్రహ్మాస్త్రమున్వేయగా
జనుపేళన్ నడిధర్మహానియనుచున్ శాసించుటంజేసి రా
వణి యీదుష్కృతి జేసె లేని యెడలన్ పంచత్వముంబొందడే
గనగాధర్మమ ధర్మముల్ జగతిలో గన్పట్టవెంతేనియున్. 2270

క॥ అని లక్ష్మణుండు రాముని
గని ధర్మాధర్మములకు గలుగు ఫలంబుల్
గనవనుచు హేతువాదం
బునను నిరూపణము జేయ బూనుచు ననియెన్. 2271

చ॥ కరగత రాజ్యసంపదలు కైకకొసంగిన యట్టి ధర్మముల్
వరమునివృత్తి బూని వనవాసము జేయు మహత్వదీక్షయున్
కరమును తండ్రివాక్యమునకై పలుకష్టములొందు వృత్తమున్
నరవర ధర్మమార్గములవంగను జెల్లియు దుష్ఫలంబులొ. 2272

క॥ అరయంగ ధర్మమిద్దర
నిరర్థకము కష్టదంబు నిష్ప్రమాణమం
చెరిగితి వ్రత్యక్షముగా
జరుగని ధర్మంబులెట్లు సత్యంబులగున్. 2273

చ॥ ఫలములు దర్శనీయమయి వర్తిల సార్థకమౌను ధర్మ భా
షలకు గనంగలేమిని యసత్యములై చనుగాదె భూమిలో
పల సచరాచరంబులను వర్తిలి గోచరమౌనుగాదె యు
క్తుల గనరాని ధర్మఫల సూక్తుల నేను నిరాకరించెదన్. 2274

క॥ వ్యక్తంబుగాని ధర్మపు
సూక్తుల నమ్మంగనెటుల చొప్పడు ధర్మా
సక్తునకు నిన్ను బోలెడి
వ్యక్తికి గష్టములుగల్గు భంగి దలపుమా. 2275

చ॥ వినుమది గాక రావణుడు భీతినివీడి యధర్మచారుడై
పనిగొని ఘోరకృత్యముల వర్తిలె కష్టములేదు వానికిన్
ఘనతర సత్యధర్మనిధి గా ధరణీశ నీకు కష్టముల్
జనితములౌట జూడ మదిశంకజనించెను రెంటియందునన్. 22

మ॥ ధర్మంబంచు నధర్మమంచు వచనందర్పంబులం జూచినన్
ధర్మోరక్షతి యన్న భావము విరోధంబౌచు చూపట్టు దు
ష్కర్ముండెందును కష్టముల్ గొనక సౌఖ్యంబందుటన్ జూడ మే
కర్మంబుల్ ఫలితంబునిచ్చునను చున్ భావించుటల్ వ్యర్థమౌ. 2

మ॥ ధరలో కంటకుడైన రావణున కత్యంతంబుగా సౌఖ్యముల్
వరధర్మారతి నున్న నీకు విపులంబైనట్టు కష్టంబులున్
పరిశీలింపగ గల్గె గావునను సంభావింప ధర్మంబునన్
మరియుందల్ప నధర్మమున్ మృషయనన్ బాటించెదన్ భూవరా

చ॥ మరియును ధర్మకర్మల సమాదరణంబున చేయువారికిన్
జరిగిన సౌఖ్యముల్ జగతిసర్వజనంబులు ధర్మకర్మముల్
జరుపు నధర్మకృత్యులకు సంజనితంబగుచేటి కష్టముల్
దురితము జేయజాలరు విశుద్ధమతిం దలపోయ నగ్రజా. 2

క॥ ధరధర్మము నొనరించెడి
నరులకు కష్టములు గల్గువట్టి విధంబున్
దురితులు నధర్మరతులకు
పరమ సుఖంబులును గలుగు భంగిని గనుమా. 2

గీ॥ ధర్మమే యుర్వి వశ్యమై జరుగునేని
ధర్మనిష్ఠాపరుండవై దనరు నీకు
కష్టమించుక యైనను గలుగకుండ
వలయు గావున ధర్మంబు వృథయయగును.

చ॥ మరియును ధర్మకృత్యముల మానుగజేయను మూలమర్థమై
వరగుమ నట్టి యర్థమును బాసితి రాజ్యము వీడి దండకన్
జరమును జేయువచ్చుటను సంభవమయ్యెను నర్థహానియున్
కరమును దానిచేత నధికంబగు ధర్మవిఘాత మెంతయున్. 2282

చ॥ అదియునుగాక సౌఖ్యప్రద మంద విముక్తిఁ బొంద పూర్వ సం
పదల దలంచి యర్థము ప్రవృద్ధిని జేయదలంచి రాజు దు
ష్పథమున న్యాయమార్గము విచారణవీడి ధనార్జనంబుకై
మొదలిడి దోషమొందును నపూర్వము కాదు జానకీవరా. 2283

క॥ విడువదగ నట్టి రాజ్యము
విడిచినచో పూజ్యమెట్టి విధమున గలుగున్
సిడుముల బొందక రాజులు
పుడమిని భోగములు బొందబోలును గాదే. 2284

చ॥ అరయగ నిర్ధనుల్ జగతియందు నొనర్చెడు కార్యరీతులన్
కరమును నర్థహీనతను కార్యవిశంగము బొందుగాదె దు
ష్కరమగు నెండవేసవిని స్వల్పజలంబులు నిమ్నగాదులన్
పరువడి నింకుభంగి వని పండితులాడ వినంగ లేదొకో. 2285

ధనవంతుండగు వాని బాంధవులు మిత్రానీకముల్ భూజనుల్
మునివంశంబులు భూసురోత్తములు నున్ భూమీశులున్ మేటిగా
గొనియాడున్ పురుషోత్తముండును లసత్కృత్యుండు ప్రాజ్ఞుండు స
ద్గుణుడున్ వేద్యుడు నార్యుడంచును మహోద్యోగుండునం
చెంతయున్. 2286

కానకువచ్చువేళ నిది కార్యము గాదని యెంత చెప్పినన్.
మానక రాజ్యమున్ విడిచి క్ష్మావరునాజ్ఞను సత్యధర్మ మా
ర్గాన చరించువాడనని కానకు వచ్చుటజేసి యీ గతుల్
దానవుచేత సీతయు హృతంబును బొందుట గంటిమెంతయున్. 2287

చ॥ అరయగ ధర్మవర్తులకునై లోకసౌఖ్యము గల్గబోదుగా
పరమున సౌఖ్యముల్ గొనుట భావనయౌను దలంచదృష్టి గో
చరమును గాదు శ్రేయముల సాధనమైన ధనంబు వీడుటన్
నరవర యిట్టి కష్టము లనంతములై ఘటియిల్లె నెంతయున్. 2288

చ॥ కరగత రాజ్యమున్ విడిచి కానలకున్ బితృవాక్యపాలనా
పరతను వచ్చి ప్రాణసమ భార్యను గోల్పడియున్న నీ వుదా
హరణము గాదె ధర్మమను నట్టి యొకానొక మార్గగామివై
గురుతర కష్టజాలముల గొంటివి కాదె భవత్ప్రతాపనన్. 2289

శా॥ నీకుంగల్గిన ఘోరకష్టములకున్ వేనిత్రకన్ సన్నదా
స్తోక ప్రౌఢ్యల బాహువిక్రమగతిన్ జూపించి కాపాడగా
లోకాతీత యొకర్పు వాద నుడి శౌర్యోత్సాహములం జూపుమా
క్ష్మా కవ్యాహత వార్తవేగలను దుఃఖంబీవు వర్జింపుమా. 2290

ఉ॥ నేను భవత్ప్రియార్థము జనించినవాడను జానకీసతీ
ప్రాణములేగెనన్న యొకవార్త వినంగ సహింపలేక చిం
తాన నుపన్యసించితిని ధర్మమధర్మ విఖండనంబులన్
మానవనాథ వాటినిక మానసమందు దలంపనీటుమా. 2291

శా॥ క్ష్మావర్యా ధరజీజ మృత్యువు ప్రతీకారంబుగా లంకకున్
నేవేగంబున నేగి రాక్షస జనానీకంబులం జంపెదన్
దేవారిందలద్రుంచి తత్పుతుని మిత్రింబొందగా జేతు నా
నావిభ్రాజిత లంక భస్మమయతం గావించెద న్నిత్తరిన్. 2292

క॥ అని భ్రాతృ వత్సలత్వం
బున లక్ష్మణు డవని విభునిమోమును గనుచున్
జనితశ్రమ నోదార్చెడు
పదితుల నతి వినయగతిని భాషించునెడన్. 2293

-: విభీషణు డింద్రజిత్తు మాయాసీతను వధించెనని చెప్పుట :-

ఉ॥ వనచరసేన గన్గొనుచు వారలతున్న భయంబు బల్కుచున్
తన సచివాదులం గలసి దానవనాథ సహోదరుండు రా
ముని గని దుఃఖమొందుటకు మూలము నెయ్యదియంచు బల్క ల
క్ష్మణుడు నితాంతదుఃఖమయ గాత్రుడునై వచియించె నీగతిన్.

ఉ॥ అనుచు విభీషణుండడుగ నత్తరి లక్ష్మణు డార్త బాష్ప లో
చనుడయి పల్కెనేమని విచారకరం బగు వార్త దెల్పుదున్
జనకజ నింద్రజిత్తు వటుసాహసుడై వధియించెనన్న వా
ర్తను హనుమంతుడుందెలుప రాముడు నీగతి శోకమందెడిన్. 2295

ఉ॥ వినుమిక యింద్రజిత్తు వృథిపీసుత జంపిన వార్తఛంతమై
చను దనుజాధిపుండు జలజాయతలోచన సీతజంపగా
జవడది సత్యమైచనను జానకి నిమ్మని యెంతజెప్పినన్
వినడయెమున్న గాన పృథివీసుత జంపగ జాలడెంతయున్. 2296

ఉ॥ అదియును గాగ జానకి వశాగతచిత్తను జేయనెంచి దు
ర్మదుడయి పెక్కురీతులమ ప్రార్థనజేసియు సామదానముల్
కుదరని భేదమార్గముల కోరియొనర్చియు నామె దేహమున్
వదన దశంబుగల్గు సురవైరి స్పృశింపగ జాలడెంతయున్. 2297

ఉ॥ జనకజ మిత్తిబొందుట యసత్యము రావణి సంగరంబునన్
ఘనవిజయంబు గైకొనగ కాంక్షనొనర్చి నికుంభిలాస్థలిన్
పనిగొని యాసురంబయిన పద్ధతి హోమముజేయబూని యీ
వనచరసేన మూర్ఛగొన భవ్యశరంబులనేసె నెంతయున్. 2298

ఇంద్రజిత్తు నికుంభిలయందు హోమము జేయుట
-: విభీషణుడు రామునకు దెలుపుట :-

ఉ॥ అతడు నికుంభిలన్ రణజయార్థము హోమమొనర్చుచుండె నా
హుతవహుడాత్మతుష్టి గొనహోమము సాంతమునయ్యెనేని ది
క్పతులకునైన సంగరముఖంబున రావణి జూడలేరు వి
శ్రుతమగు విక్రమంబుగొని క్షోభఘటించు వనేకభంగులన్. 2299

చ॥ దనుజుడు జేయుహోమము విధానము పూర్తిని బొందకుండగా
ఘనబలముల్ వెసంగొనుచు గాఢతరోద్ధతి జేరి యందు రా
వణికృత హోమవిఘ్నము నవారణరీతి నొనర్పగావలెన్
జనవర యానతిమ్ము పెలుచం జని విఘ్నమొనర్తు హోమమున్.

చ॥ జనవర మిథ్యవార్తను విషాదము బొందిన నిన్ను జూచి యీ
వనచర బృందముల్ ధృతినిబాసి నిరంతర చింతగుందెడిన్
గమకను నీవు దుఃఖమును గాంచక స్వస్థతగూర్చి ముమ్ము ల
క్ష్మణ సహితంబుగా బనుప చయ్యన విఘ్నమొనర్తు హోమమున్

చ॥ వనుషము నీసహోదరుని భవ్యపరాక్రమశీలి గావునన్
దనుజుల జంపి రావణి సితాస్త్రపరంపర కాఁ వీటికిం
బనిచియు హోమకృత్యముల భగ్నముజేయును లేకయున్న రా
వణి నిజహోమకృత్యముల బాయక పూర్తినిజేయు దప్పకన్. 23

చ॥ ధరణిజ యంతమొందెనను దారుణవార్తను విన్న రాముడ
త్తరి స్పృహదప్పియుండుటను దావివడయ్యె విభీషణుండు సం
గరమున నుత్సహించుటను కర్తములన్నొకయింత సోటిటన్
దనుజుని గాంచి పల్కె మదిదాల్చిన తెల్వియె మూరువల్కగన్. 2

చ॥ అనిన విభీషణుండు మనుజాధిపుగాంచి వచించె మీరు చిం
తనమును జేయబోడియె యదార్థత నంతనముందు వేళలన్
వనచరసేనలన్ని బలవృద్ధి జరించెడి దానవాధిపున్
రణమున జంపి యా జనకరాజ కుమారిక బొందు మిత్రరిన్. 2

చ॥ నరవర యింద్రజిత్తు కదనంబున సీతవధించుటంతయున్
కరమవృతంబు సుమ్ము కృతకంబగుసీతను జంపుగాక ప
త్వరత నికుంభిలన్ నతడు దారుణహోమము జేయుచుండె ని
త్తరి వెసబంపు లక్ష్మణుని దానవు హోమము భగ్నమొందగన్.

చ॥ మును పరమేష్ఠిచేత వరముం గొనువేళ పితామహుండు దె
ల్పెను నికముందు కుంభిలను వేదికహోమము పూర్తిజేసినన్
గొనుదువు సంగరస్థలికి గోరినరీతి రథాస్త్ర సంపదల్
వనియటు పూర్తికానియెడ వధ్యుఁడవౌదువు సంగరంబునన్. 2306

చ॥ అని పరమేష్ఠి పల్కుటను నా దశకంఠ సుతుండు కుంభిలన్
జని పరివారయుక్తముగ శాస్త్రవిధిన్ జపహోమ కృత్యముల్
పనివడి జేయుచుండెను విభంగమొనర్పగ వేగబంపు ల
క్ష్మణుని యనేక వానరనికాయము తోడుగ నేము పోయెదన్. 2307

క॥ హోమంబు పూర్తిజేసిన
కామితముం బొంది విజయ కాంక్షామతి సం
గ్రామమున మనల జంపును
హోమము విఘ్నంబుజేయు మూహం[illegible]. 2308

క॥ ఈతండు చావ లంకా
నేత మృతిని బొందినట్టి నియతింగనుమా
యాతత పటుబల మాయా
న్వితుండీ యింద్రజిత్తు విబుధస్తుత్యా. 2309

క॥ అనుచు విభీషణుడాడిన
ఘనవాక్యము లాలకించి క్ష్మాతలనాథుం
డనియెను కలతందేరుచు
దనుజవిభుని సుతునియతుల దర్పోద్ధతులన్. 2310

చ॥ దనుజవరేణ్య రావణి విధానము విక్రమబాహుశక్తులున్
ఘనతర బాణకౌశలము కాంక్ష జయాంతర చిత్రజాతమున్
మనమున నెంచినాడ సురనాథ యమాదులకైన వానితో
రణమొనరింప కష్టమగు కాదుఁ జయింపగ మాయబూనుటన్. 2311

చ॥ రథగతుడై వియద్గతి పరాక్రమమొప్ప చరించువేళ నం
బుదములచేత గప్పబడు పూషుని భంగి నదృశ్యమానుడై
కదనముజేయగల్గు దశకంఠ తనూజు దసాధ్యుడౌను నే
ర్పొదవగ వాని జంపనగు బ్రౌఢ్యులు డీతడటంచు లక్ష్మణున్. 2312

-: రాముడు ఇంద్రజిత్తు వధింప లక్ష్మణు నియోగించుట :-

చ॥ కనుగొని పల్కె వీరవర కాంక్షదలిర్ప నిశాటనాథ నం
దనుని దురాత్ము మాయికు రణావని ఘోరశిలీముఖంబులన్
దునిమి యశంబుగొమ్ము రఘుదోహదముం ఘటియింపనీదు పెం
టను జనుదెంచు భీకరవనాట చయంబులు సంగరోర్వికిన్. 2313

చ॥ అనిలసుతుండు నంగదుడు నంబుజమిత్ర తనూజుడున్ సుధీ
వినుతుడు జాంబవంతుడు వివేకులు కేసరి నీలరంభులున్
నిను బురికొల్పవచ్చెదరనేక చమూపతు లుగ్రిదానవున్
దనుజవరాత్మజాగ్రణి వధార్థము నీకు సహాయకారులై. 2314

గీ॥ దనుజ మాయావిధాన సందర్భములను
గనగ జాలెడు నీ విభీషణుడు నీకు
తోడుగావచ్చు సచివ యుక్తుండునగుచు
యాగభూమిని జూపు నియ్యసుర వరుడు. 2315

క॥ అనుచును రాముండత్తరి
తనతమ్ముని దీవనలను తగనొడరిచె ల
క్ష్మణుడంత నగ్రజుని పద
వనజములకు మ్రొక్కి వినయపద్ధతి బలికెన్. 2316

మ॥ భవదీయాజ్ఞను బూని సంగరకళా పాండిత్యముంజూపెదన్
దివిజారిన్ దశకంఠసూనుని బలోద్రేకంబులం జూపుచున్
రవివహ్ని ప్రభ మానతీవ్రతర నారాచంబులం గూల్చెదన్
దవవహ్ని క్రియ దానవాటవిని నేదగ్ధంబు గావించెదన్. 2317

౯౦ ఆ లంకాపురిపైని ఘోరతర తీవ్రానేక బాణంబులన్
జాలం బర్వగ జేతు షష్ఠ్యరిది హంసశ్రేణులన్ బ్రాలు నా
లీలన్ సర్వనిశాటలోకములు వార్తింబొంది కూలంగ ని
ర్మూలింతు న్నరినగ్గముస్ జయము గూర్తున్నీకు పీఠాధిపా. 2318

మ॥ అనుచు వ్రతక్షమించి యమణాజ్ఞను గైకొని వజ్రతుల్యమౌ
ఘనకవచంబు దాల్చి కనకాంచిత చాపము బూని ఖడ్గముస్
గొని శరవంచయంబులను గూడగ దావొదియందు బెట్టి రా
వణి వరసెంచి లక్ష్మణు దవారణలీల జనంగ జొచ్చినన్. 2319

సీ॥ పవనసుతుండంత బహుళ సహస్రంబు
లగు కీశయోధులు నమసరింప
జాంబవంతుండు నీలాంబుద సమకాయ
భల్లూక బలములు బలిసిరాగ
సచివచతుష్టయ సంయుక్తు డగుచును
దనుజరత్నము విభీషణుడు నడుప
నిఖిల మర్కటవాహిని గణోపేతులై
యూథపాగ్రే సరులొప్పు మీర

తే॥ ధనువు కేలను బూని లక్ష్మణుడు నేగ
వానిచుట్టును ముట్టి యుదార్యగతిని
గదల బహుసైన్యపదతల ఘట్టనమున
జదల కెంధూళి బర్వె నిస్తంద్రముగను. 2320

మ॥ దూరంబట్టుల నేగి యందు ఘనసందోహంబులీలన్ మహా
ఘోరాకారత వీరరాక్షసగణ క్షోణాయమానంబులై
భూరిస్యందన వాజినాగ కలితవ్యూహంబు శస్త్రాస్త్ర వి
స్తారంబైన నికుంభిలావనము వీక్షం జేసిరప్పట్టునన్. 2321

క॥ దానిగని విభీషణు డా
మానవపతి నందనునకు మానుగ బలికెన్
దానవుల రక్షజేకొని
దానవపతి సుతుడు హోమతత్పరుడయ్యెన్. 232

క॥ కనుమది లక్ష్మణ దా దనుజకాండములన్ చతురంగశక్తులన్
దనకును జుట్టునుంచుకొని దానవభర్త సుతుండు కుంభిలన్
ఘనవిజయంబు గైకొనగ కాంక్షనుజేసి యచంచలుండునై
పనివడి హోమకర్మమతి భక్తినొనర్చుచు నున్న వాడొగిన్. 233

ఉ॥ దానవ సంతతిం ధనువుదాల్చి శరంబుల జీల్చకున్న చో
గానగరాడు శక్రజితు గావున తీవ్రశరంబు లేసియున్
వానరసేవలేగి రణభంగిని బోరకయున్న హోమమున్
దానవనాథ సూనుతతి దక్షత సాంతముజేయు దృప్తిమై. 23

క॥ పారము బొందక హోమము
ఘోరదైత్య విశిఖతతుల గూల్చుము రణదు
ర్వారుడు మాయికు డతి బల
సారుడు గ్రూరుండు రాక్షసావలి యందున్. 23

-: నికుంభిలయందు వానర రాక్షసుల యుద్ధము :-

క॥ అనుచు విభీషణుడాడిన
ఘనకార్ముక పాటియగుచు ఘనశితశరముల్
దనుజులపై బరపెను ల
క్ష్మణుడత్తరి కీశసైన్య సంతతులంతన్. 236

చ॥ శిలలను వృక్షముల్ నచలశృంగములన్ గొని కీశయుక్త ధీ
రులు పటు సింహనాద మతులోద్ధతిజేయుచు వీరవిక్రమం
బులు గనుపట్టగా కిరి యభూతము గాగ నిశాటసైన్యమున్
బలయుతులైన యా దనుజవర్గ మెదిర్చిరి యా యుధంబులన్.

క॥ ఉరువాగులటుల దాకగ
వరువడి సమరంబు ఘోరభంగి జెలంగెన్
ధరగిరులు వడకె లంకా
పురమున నతిదారుణములు భూతంబయ్యెన్. 2328

చ॥ దనుజులు ప్రాసముద్గరగదా కరవాల శిలాంబకంబులన్
వనచరసేనపై బరప వారలు భూరి శిలామహీజముల్
గొనుచును దానవావళిని ఘోరతరంబుగదాకి వారలన్
దునియలుగాగ జేసె నతి దోర్బలశక్తి విజృంభమాణులై. 2329

క॥ పోరటుసాగగ వానర
వీరవరులచేత సమరవీధిని దనుజుల్
ఘోరాకృతి హతులయ్యెను
మీరుచు పారంగదొడగె మిగిలినవారల్. 2330

ఉ॥ దానవులట్లు భీతిరణ ధారుణి పారుట జూచివేగమై
పూనికజేయు హోమపరి పూర్తినిజేయక మున్నలేచి యా
దానవరాజ సూనుడు నరేంద్ర పరాక్రమశీల వృక్ష సం
తాన గతాంధకారమున దాగక పైకి విజృంభణక్రియన్. 2331

చ॥ తనదరి మున్నునుంచిన శతాంగముపై జని భీమకార్ముకం
బును గొని క్రోధరోషముల బూని మహారుణ లోచనుండునై
ఘనశరవర్షముల్ కపినికాయముపై బరపింప సాగె దా
నిని గని దానవుల్ తిరిగి సేర్పువహించిరి పోరుసల్పగన్. 2332

ఉ॥ మేరు సమానకాయుడు నమేయ బలాఢ్యుడు వాయుసూను డా
తీరుమగాంచి భూరుహము దెచ్చి నిశాట కదంబకంబులన్
భోరున గూల్పసాగె వనమున్ దహియించు దవానల క్రియన్
నా రజనీచరాగ్రణులు నాగ్రహమందుచు దాకె మారుతిన్. 2333

సీ॥ శూలంబులను కరవాలంబులను శక్తి
తోమర పరిఘ సందోహములను
పట్టిన ముద్గర పరశు చక్రంబుల
ముసల గదా ప్రాసములను మరియు
వివిధాయుధముల నుద్వేగంబుగా బరపె
నాయుధ హీనులై పట్టి వారు
నఖ ముష్టిదంత సంఘాతంబులం దెగి
మారుతాత్మజుని గ్రమ్ముంగనతడు

గీ॥ వృష్టి చలనంబుగనని పర్వతము భంగి
యచలుడై వారి శస్త్రాస్త్ర నిచయములను
సంగ్రహించుచు వారి నిస్సంద్ర గరిమ
దునుమజొచ్చెను రణతలోద్యోగుడగుచు. 2354

-: ఇంద్రజిత్తు హనుమంతునితో బోరుట :-

క॥ హనుమంతు డుగ్రరణమున
దనుజుల దునుమాడ జూచి దానవపతి నం
దనుడంత పొరధింగని
జనితక్రోధుడీడు నగుచు చయ్యన బలికెన్. 2355

చ॥ కనుమదె వాయుసూను డధికంబుగ సేనల దున్మజొచ్చె గా
వున రథమింక వానిపయి బోవగనిమ్మని లంక నాథుడున్
పనివడి దోలె స్యందనము పావని బోరొనరించు భూమికిన్
వనిమిషవైరి సూనుడు మహాగ్రహమూనుచు నేర్పు పెంపునన్ 2356

మ॥ శరసంధానముజేసి తీవ్రతర విస్తారోగ్రనారాచముల్
గురుశూలంబుల ప్రాసపట్టిన గదాకుంతంబుల న్మారుతిన్
కరముస్నేత్ర యుదొడంగె కీశుల సవక్రస్ఫూర్తి దుర్వారుడై
శరవర్షంబున ముంచె విగ్రహియనుచున్ సామీరణింజేగన్. 2357

ఉ॥ అమరారి ప్రవిముక్త ఘోరశరవిన్యాసంబులన్ మీఁద హ
స్తమునం బట్టుచు పారవైచి ఘనరౌద్ర స్ఫూర్తి వా దానవ
ప్రముఖుం జూచుచు మారుతాత్మజుఁడు దుర్వారక్రియం బల్కె నో
కుహకీ నీదగుమాయ చెల్లదిక నాతోఁ జిక్కినావిత్తరిన్. 2338

చ॥ విను కుటిలాత్మ మాయ పృథివీసుత జంపి రణాంతరంబునన్
నను భ్రమియింపజేసితివి న్యాయగతిన్ రణమాచరింపకన్
గనుకను నా మతంబునను గల్గిన కక్ష మదీయవృక్ష తా
డనమున నిన్ను జంపెదు విడంబనవీడుము రాక్షసాధమా. 2339

మ॥ కనవా మున్ను నశోక కాననము భగ్నంబేను గావించి నీ
యనుజుం ద్రుంచి పురంబు గాల్చి ఘనబాహాశక్తి విక్రాంతిపై
దనుజవ్రాతము కోట్లజంపి శరధిన్ దక్షుండనై దాటి యే
గిన భంగిన్ బ్రతుకంగజాలవిక నా కేలారి నీచాత్మకా. 2340

శా॥ ఆలస్యంబిక జేయనేల ఘనబాహా యుద్ధముంజేయగా
నో లంకాపతి పుత్రకా గనుము మాయోద్యోగముల్ మాని నా
కేలం జిక్కి కృవింక బోవగను నీకిలారియున్ లేదు దు
శ్శీలా! కాలుని వీటికంపి నిను శోషింతున్ నిశాటావళిన్. 2331

క॥ దనుజపతి తనయుడత్తరి
జనితక్రోధుండు నగుచు శరజాలములన్
హనుమంతునిపై నేయుచు
వనచరసైన్యముల ఘోరభంగిని దునుమన్. 2342

ఉ॥ అంత విభీషణుండు మనుజాధిప సోదరుగాంచి పల్కె దు
ర్దాంత పరాక్రముండయిన రావణసూనుడు వాయుసూనుతో
పంతము మీర పోరు సలుపంబడదాగెన్ నిశాటాంతకంబుల
న్నంతముజేయు దాశరథి నాతఁడు మాయికు డెన్ని భంగులన్.

చ॥ అనుచు శరాసనంబుగొని యత్తరిమన్న సుమిత్రసూను తో
డ్కొని చని కుంభిలావనము క్షోణికి జేరి విశేషమైన యా
దనుజుని హోమకర్మమును దృష్టులకుం గనుపట్టఁజూపి యి
ట్లనియెను వెండియున్ దనుజరాజసుతాగ్రజు హోమకర్మమున్.

చ॥ జనపతినందనా యిచట సాహసుడై యల శక్రజిత్తు దా
వనజుని దృప్తిజేసి వివిధంబగు రీతిని భూతతృప్తులన్
నొనరిచి వహ్నిదత్త రథమున్ముద నెక్కి యదృశ్యమానుడై
దునుముగఁ జొచ్చె సైన్యముఁ దుష్టనిశాటుడు మాయికుండిలన్. 234

చ॥ కనుమిదె యగ్నిగుండమున గ్రాలెడు వెల్వడు వింతతేరు నం
వది యిక నీస్థలంబునకు వచ్చినకీడు ఘటిల్లు గాన ని
వనువమ కాలదండ నిశితాంబకముల్ బరపించి యింద్రజి
త్తును వధియింప బూనుము మదోత్కటు బాధలఁబొంగునట్టులన్. 234

చ॥ అన విని లక్ష్మణుండు దనుజాధిప సూనునితో రణంబుకై
ఘనతర కార్ముకంబుగొని గాఢతరోద్ధతి మౌర్వి మ్రోయు న
ట్లనుపమ రీతిజేయగ మహానినదంబు గ్రహించి దైత్యనా
థుని తనయాగ్రజుండు మతిదోచిన రౌద్రముతోడ నత్తరిన్. 234

చ॥ రథగతుడై మహాకవచ రక్షితుడై తురగాన్వితుండునై
ప్రథన జయాభిలాషుడయి భవ్యశరాసన బాణధారియై
పృథుల పతాకుడై సమరభూమిని దోచెను శక్రజిత్తు బె
ట్టిదముగ రామసోదరుని ఢీకొని యుగ్రరణంబు జేయగన్. 2348

చ॥ దనుజుని జూచి లక్ష్మణుడు దండధరాకృతి బూని పల్కె నీ
వనయము మాయజేసి రణరంగి నెరుంగుదువింత మాయలన్
వనిగొన జాలవెందు నినుబట్టి వధింపగ వచ్చినాడ గా
వున జననొప్పు ద్వంద్వరణభూమికి శూరత గల్గియుండినన్. 2349

## -: ఇంద్రజిత్తు విభీషణుని నిందించుట :-

చ॥ అనుమను లక్ష్మణుండలుక నాడిన మాటల క్రోధమూని చెం
తను గల యా విభీషణుని దృష్టుల గాంచి సుతీక్ష రక్తలో
చనుడయి వానితోడ పటుసాంద్రగతిం బహుదూషణంబులన్
వినబడ బల్కె నీగతిని వీరుడు రావణసూనుడత్తరిన్. 2350

క॥ ఘనతరకీర్తి పౌరుషము గల్గిన యీ దనుజాన్వయంబునన్
జనితుడవై దశాస్యునమజన్ముడవై యటుపైన నీకు నం
దనుడనునైన నాయెడల దల్పగగూడునె కీడునెందునన్
దనుజ కులంబునండకట తప్పకపుట్టితి వీవుజూడగన్. 2351

ఉ॥ జాతియు మానమున్ మరియు జ్ఞాతివిధంబులు ధర్మసౌహృద
ప్రీతియు పౌరుషంబులును విఖ్యాతకీర్తులు వీడి యీగతిన్
నీతి విదూరవుడవయి నీచుల నమ్ములసేవజేయ నీ
కే తగుగాక దానవుల కేరికినైన నమన్వయించునే. 23.2

చ॥ తన పరివార బాంధవ కదంబములన్ విడి యన్యసేవలన్
పనిగొను కార్యభంగి హెచ్చాటని నీవు గ్రహించలేని దు
ర్జనుడవు గిట్టి కార్యములు సల్పనె సజ్జనులెందునైన గా
వునను భవత్కృతంబునను భూరి విపత్తులు గల్గె నీగతిన్. 2353

మ॥ తన వర్గంబులు దుష్టులైనను పరుల్ ధర్మాత్ములైనన్ ధరన్
గనగా స్వీయజనంబులన్ వదలి యన్యంబైన పక్షంబులన్
జనగా గూడునొ స్వీయపక్షమెపుడున్ సర్వత్ర భద్రంబునై
దనరుంగాదె తలంపవాగతిని దైత్యాధిప తమ్ముండవై. 2354

చ॥ పరులను నమ్మి స్వీయజన పక్షమువీడి తరాశ్రయంబునన్
కరమును స్వీయవర్గమును కారియబెట్టి వధించు పిమ్మటన్
పరహితుడంచు నమ్మకము పట్టి వధించును రాజ్యతంత్రముల్
జరుగుచునుండు నీగతిని సారవిచార వివేకహీనుడా. 2355

మ: తన వారింగల మర్మకర్మముల సందర్భంబులూహించి సం
జనితోత్సాహుడవౌచు శాత్రవులకున్ సర్వంబు జెప్పంగ నీ
దనుజానీకమునందు నొక్కడవె నిందార్హుండ వెంతేనియున్
గనజాలన్ నినుబోలు దానవుని లోకవ్రాత మందెందునన్. 2356

—: విభీషణుడు ఇంద్రజిత్తునకు ప్రత్యుత్తరమిచ్చుట :—

ఉ: దానవనాథ పుత్రక మదాత్మను శీలమెరుంగనట్టి చం
దాన నుపన్యసించెదవు ధర్మ మధర్మమెరుంగ జాలకన్
దానవవంశ సంభవుడనయ్యును గ్రూరగుణంబు వీడి నే
నూనితి సాధుమార్గమును మూర్ఖుడ నీవెరుగంగజాలవో. 2357

ఉ: మీరలు ఘోరకర్మల నమేయము జేసి యధర్మమార్గ సం
చారము జేయుచుండిరిక సర్వవిధంబుల ధర్మవృత్తమున్
మీరక నేను వర్తిలుదు మిమ్ములగూడుట సాధుశీలికిన్
నేరముగాదె కావున వినింద్యులగూడక వీడిపోయితిన్. 2358

క: దురితుని ధర్మచ్యుతు నిన్
పరమ పాపమతిని దుష్టవర్తను నీచున్
గరయుత ఫణిజంపిన యా
కరణి జంపి సౌఖ్యమందగా దగడొక్కో. 2359

చ: వినుమిక హింసయున్ పరులపీడన జేయుట యన్యకాంతలన్
బనిగొని బాధబెట్టుటయు వంశ వినాశన హేతువంచు స
జ్జనులు వచింపగా వినవె సారవిచారుడు వీరి వీడు సం
జనిత మహాగ్ని దగ్ధమగునట్టి గృహంబును వీడు పోలికన్. 2360

చ: దునుముట మౌనులన్ బలమదోద్ధతి దైవత విగ్రహంబు దు
ర్జనములతోడి కొత్తు వరసంపదలందున మత్సరంబు నీ
జనకునియందు నిల్ప వృధుశైలమునందు మహోగ్ర సంఘముల్
పనిబడి నిల్పుభంగి దశవక్త్ర తనూజుడ నీవెరుంగవే. 2361

క॥ ఈ దోషంబులు జీవిత
బాధా కరమగుట వాటివలన విముక్తుం
గా దైతేయ కులాధిపు
నేదక్షత జేయనెంచి వేరుపుమీరన్. 2362

క॥ ఎంత నివారించిన నీను
మంతయు వినకుండ దుష్టమార్గరతుండై
పంతమున నన్ను ద్రోసిన
చెంతనెటుల నుండు గాన శ్రీమ్రము విడితిన్. 2363

ఉ॥ కాలుడవీవు నీతికిని బాహ్యుడవై యిటు పల్దిదంబువా
చాలక జూపుచున్ బలుకసాగదు నమ్మిక నేడు దప్పకన్
కాలుని పాశబంధనము గాంచెదు గావగరారు నెవ్వరున్
జాలమదేల యుద్ధమును పల్పుము లక్ష్మణుతోడ నిత్తరిన్. 2364

చ॥ తిరిగి పురంబుజేరకుము తీరె నికుంభిల హోమపద్ధతుల్
జరుగవు నీడుమాయాః లిక సర్వము భగ్నములయ్యె దానవే
శ్వర తనయుండవౌట రణధారుడి వీడక నీ పరాక్రమ
స్ఫురణము జూపమింక బలసూదను గెల్చినవాడవే కదా. 2365

చ॥ అనుచు విభీషణుండు దనుజాధిపు సూనునితోడ నాడ సం
జనిత మహోగ్రరోష దయి చాపము ద్రిప్పుచు తీరుపర్వగా
పనిచిన మంగళంగినియె వాయుతనూజు భుజంబులందు ల
క్ష్మణు నుదయాచలంబు వయిగ్రాలు దివాకరురీతి దోపగన్. 2366

చ॥ దనుజ వరాత్మజుండపుడు దర్పమెలర్ప సుమిత్రసూనునిన్
ననిలతనూజు వాని దరియందున నున్న విభీషణున్ వవా
ట నికరయూధపత్రజము డాయుగ నేగియు వారిగాంచి యి
ట్లనియె మహోగ్రభంగి వనలాక్షుడునై పటుగర్వమూనుచున్. 2367

ఉ॥ మీరలు చూడుడింక రణమేదిని వీడక వన్మదీయ దు
ర్వార కఠోర బాణమయవృష్టి నిరంతర వర్షముంబలెన్
ఘోరతరంబుగా బరపి గూలగజేసెదు మిమ్ములంగనన్
మీరుచు నగ్ని తూలమయమేదురరాశిని గాల్పనట్లుగన్. 2368

చ॥ పరిఘగదాసి పట్టిస దివాకర తీక్షశరాళి మీరగా
దురమున మిమ్ము జంపెదను దృష్టులజూడుడు నేడు మద్భుజా
గురుతర శౌర్యవర్ధితుల ఘోరరణంబున శక్రుగెల్చి సు
స్థిరతర కీర్తిగాంచిన విశేషుడ నంచును మీరెరుంగరే. 2369

చ॥ ధనువు నినాదరీతి జలదంబుల గర్జలుగాగ హేమ భూ
షణతతి శంపలై పరగ సారశరంబులు వృష్టిగాగ రా
వణియను కాలమేఘమును భవ్యబలాఢ్యులునయ్యు నెవ్వరున్
రణతలమందు దాకిన పరాజయమొంది నశించు తప్పకన్. 2370

చ॥ మును రణమందు మీపయి నమోఘ శరంబులనేసి మూర్ఛలన్
పనివడి జేసియున్న వరిపాటి తలంపగ గుర్తులేదొకో
ఘనభుజగంబు మేల్కొలుప గాంచు ఫలంబులు గాంతురింక కా
లుని పురిజేర యీ రణతలోర్వికి వచ్చిరి నిశ్చయంబుగన్. 2371

-: లక్ష్మణ యిందుజిత్తుల పరస్పర దూషణ :-

క॥ అని గర్జించుచు రావణి
రణతల భాగమున తందరన్ దూషింపన్
జననాథ తనయుడగు ల
క్ష్మణు డత్తరి కోపరక్తమయ నేత్రుండై. 2372

శా॥ ఓరీ దానవ క్రిందుమీదుగనక న్నుద్రేకివై దాంభికా
చార ప్రక్రియ నల్కటెంతయును తప్పించౌను కార్యంబులన్
శూరత్వంబును జూపి యుద్ధజయ మిచ్చొంగొమ్ము వాక్యంబులం
జేరంజాలదు సంగరావని జయశ్రీ దుష్ట రాత్రించరా. 2373

మును మాయంగాని తస్కరుండవయి నీమోమైన గాన్పింపకన్
రణభాగంబున పారవశ్యగతి గూలంజేయుటల్ సామ్యమే
వినుమింకం బిధురోపమాన శరముల్ వీరత్వ సంపాదినై
దునుమన్నే సెదు నిన్ను నేడు కదనోద్యోగంబు రెట్టింపుచున్. 2374

పటుకుల జయములు గలుగునె
నిలుపుము రణభూమి బలుకనేర్చుట వృధయౌ
బలమును వీర్యము జూపుము
కలదేనియు తడయనేల కర్బురనీచా. 2375

అన నా రావణి దండతాడిత భుజంగంబట్టులన్ రోషతన్
గని వల్కెన్ నరనాథపుత్రక విషోగ్రింబైన నారాచముల్
తనువుంగుచ్చగ బంపి మృత్యుగతి బొందంజేసెదన్ కాక ఘూ
క నికాయంబులు నీదుకాయమును వేడ్కన్నేదు భక్షింపగన్. 2376

వటుబాణంబులనేసి నీకవచముం భగ్నంబు గావించియున్
తుంటిలోనం గరయుక్త చాపమును నిర్ఘాతంబు గావించి యు
త్కటరీతిం దలద్రుంచి పైచెదను సీతానాథు డీభూమికిన్
చటులవ్యచ్ఛను గాదె శక్తుతనుజున్ సందర్శనంజేయగన్. 2377

అని పరుషవచనముల ల
క్ష్మణునాడిన గినిపియతడు మారగురీతిన్
దనుజ విభవయుగాంచుచు
వినిపించెను వీరధర్మ విధివాక్యములన్. 2378

బిరుసుగ మాటలాడినను పెంపువహించుటె శౌర్యముండినన్
స్థిరముగ నిల్చి యుద్ధము ను జేయుము నీవిపుడన్న మాటలన్
శరము నొనర్పగల్గినను గాంతు జయంబును వట్టి మాటలన్
వరులకు హానిగల్గదు నిశాటకులాధమ రావణాత్మజా. 2379

క॥ నీకు గల శస్త్రచయములఁ
బ్రాకటముగ జరపుచున్న వధియింప తుదిన్
నాకు గల శక్తి జూపెదు
నాకాధిపవైరి నిన్ను నంతము జేయన్. 2380

చ॥ పలుమరు వాగ్వివాదములు పల్కిన నేమి ఫలంబుగల్గు ని
స్తులపటు బాణపంక్తులను జూపుము వాదము వీరవర్య లీ
యిలపయి యుద్ధముల్ సలిపి యేర్పడజూపు పరాక్రమంబు నీ
చులగతి రిత్తమాటలను చూపరు గాదె పరాక్రమంబులన్. 2381

-: లక్ష్మణ యింద్రజిత్తుల యుద్ధము :-

చ॥ రవినిభతేజుడైన రఘురాముని సోదరుడంత మీరి రౌ
ద్ర వడసుద్దె సువర్ణమయుతం దనరారెడు చాపమూని భూ
రి విష మహానలప్రభల రేగెడు పంచశరంబులేసె నా
దివిజ విరోధినందమని తీవ్రతరంబుగ మౌర్వి మ్రోయగన్. 2382

మ॥ క్షతవక్షుండయి దానవుండపుడు రక్తంబెంతయుంగ్రక్కి వి
వ్హ్వలతిఁ గూలెన్ రథమందు గొంత వడికిన్ జైతన్యముంగాంచి యా
యత వజ్రాభశరత్రయంబులను లక్ష్యప్రౌఢి నా లక్ష్మణున్
చతురత్వంబున నేసె దిగ్వలయమున్నాకాంతంబు భేదిల్లగన్. 2383

మ॥ బలసంపన్నులు విక్రమాధికులు శుంభద్వీర్య గాంభీర్యులు
జ్వల కోదండధరుల్ మహాస్త్రవిదులున్ సర్వత్ర భద్రాత్ములై
చలనంబందక పోరు సల్పిరి జయాసక్తి వ్యోమవీధి ద్ర
ష్టుల సారించుచు జూచుచుండె దివిజస్తోమంబులప్పుట్టువన్. 2384

ఉ॥ పోరటుసాగుచుండ ధనువుం బిగియించి సుమిత్రసూతి దు
ర్వారశిలీశరంబు దానవునిపై వడినేసిన వానిదాకి యా
వీరుని నొవ్వజేసెను ప్రభవించి వీతియు దీనవక్త్రుడై
యా రజనీచరుండు మనుజాధిప నందను జూచుచుండగన్. 2385

క॥ దీనాననుఁడై యుండిన
దానవపతి సుతుని జూచి తత్పరపరుఁడై
మానుగను విభీషణు డా
మానమెఱిఁగి లక్ష్మణునకు మానుగ దెలిపెన్. 2386

చ॥ జనవరనందనా వినుము సర్వవిధంబుల గానవచ్చె నీ
దనుజుడు దుర్నిమిత్తముల దాల్పుటయున్ ఖలసూచనంబులున్
మనలకు గల్గుటన్ దలపమృత్యువుబొందు నితండు గావునన్
జనివడి తీక్ష్ణబాణచయ పంక్తుల బంపి వధింపుమిత్తరిన్. 2387

క॥ అనవిని సుమిత్రాసూనుడు
ఘననారాచములనేసె కర్బురవరుపై
తనువున నాటిన నాతఁడు
మనమున క్షోభించి యరదమందున వ్రాలెన్. 2388

చ॥ తెలివినిగాంచి కొంతవడి తేరిశరీరము వ్రాసికొంచు ప్రో
జ్జ్వలమగు చాపమూని శితసాయకముల్ బరపించియేయుచున్
బలికెను లక్ష్మణుంగనుచు పార్థివనందన నాబలంబు చిం
తనమును జేయజాలక వృథాయిటు లోరెనరింప నేటికిన్. 2389

ఉ॥ తొలి దివసంబు రాత్రి నినుతోడుగ నీయనుజన్ము రామునిన్
బలవదనేక నాగశరపాశ నిబద్ధుల జేసియుంటి ని
స్తుల పటుసాయకంబులను దూలగనేసితి మున్న విస్మృతున్
గలిగెనె యింతలోన నధికంబుగ మాటలనాడ నేలొకో. 2390

ఉ॥ నిదురంబోయెడు కేసరింగని మదాంధీభూతచేతంబునన్
నిదురన్ లేపి తదీయకేసరములన్ నిర్మూలముం జేయు న
ట్టిదయా నన్నిట సంగరస్థలమునన్ ఢీకొట్టగా వచ్చుటన్
తుద ముట్టించెదు నిన్ను నేడు సమరోద్యోగంబు గావించుచున్.

మ॥ అని యా రాక్షసరాజనందనుఁడు శౌర్యోగర్వమేపారఁగా
ఘనవారాచక సప్తకంబును మదగ్రిస్ఫూర్తి నాలక్ష్మణున్
చెనకన్ వైచె దళాంబకంబుల మరుత్సంజాతునిన్ వా విభీ
షణు నిస్సారు శరంబులన్ బరపె నిస్తంద్ర ప్రకారంబుగన్. 2:

క॥ వాటిని లక్ష్యము జేయక
మేటిబలుఁడు లక్ష్మణుండ షేయు రణకళా
పాటవమున బాణంబుల
నూటిగ నాదనుజు నేసి క్షోభఘటించెన్. 2:

చ॥ దనుజుని నొవ్వజేసి మదిదాల్చిన రౌద్రరసంబుఁబాపి యా
ననమున మందహాసము గనంబడ దానవుతోఁడ నిట్లనున్
రణమున వింతముల్ పలువంతనె నీకు జయంబుగల్గువే
మునపటి పంతముల్ బలుకబోకుము రాక్షసరాజనందనా. 2:

క॥ బలవంతుఁడవని పలికితి
పలుమరు ప్రల్లదములాడి పలికినరీతిన్
వలుపము సమరంబును ని
శ్చలతను నీబుజుండుదేమి శౌర్యము చెపుమా.

మ॥ అనుచున్ సాయకముల్ విగిడ్చి సమరవ్యాపార పారీణుఁడై
యనిమేషారిని మాటిజేసి కవచంబారూఢిమై యేసినన్
ఘనతారాగణ మంబరంబువిడి వేగన్‌రాలు చందంబువన్
దనుజాధీశతనూజ వర్మమటు చూర్ణంబౌచురాలెన్ భువిన్. 2:

క॥ శరతాడిత కవచుండయి
శరీరంబు ప్రజపరీత వంక్షోభుఁడై
వరభూధరశంగివి సు
స్థిరుడయి దానవుడు క్రోధను జేకొలియుంతన్. 2:

మ॥ వరచాపంబును బూని వజ్రసముదుర్వారాస్త్ర లోకంబులన్
నిశనాథాత్మజు డాకనేసిన నతండగ్నిస్ఫూర్తిమై తాకి భూ
వరుడీహంబు విబేధనంబుగనె నత్యంగిన్ మహావీరు లి
ద్దరు నన్యోన్య జయాభిలాషులగుచున్ బోరట్లు గావింపగన్. 2398

క॥ దాశముఖి దాశరథులటు
నేపరక మృగాధిపతుల విధివిక్రములై
యీసున బోరాడిరి సం
త్రాసకరముగాగ నతుల దర్పోద్ధతులై. 2399

క॥ మదమాతంగ ద్వయమన
బొదవుచు నొండొరుల భూరిభుజబలమలరన్
విదళిత భూపాతతులై
తుదిమొదలును లేకపోరదొడగిరి యంతన్. 2400

క॥ క్రమయుని యరయుక పటు రౌ
ద్రము గోవి లయుకాల రుద్రుంనదగురీతిన్
క్రమతం బోరాడిరి ర
క్తమయాంచిత దేహులగుచు దర్పితులగుచున్. 2401

చ॥ కరశర లాఘవంబులధికంబుగ జూపుచు బోరునల్ప నం
బరమున హేమపుంఖముల భాసురరీతి జెలంగె పావక
స్ఫురిత మహాగ్నికీలలన వృద్ధిని గూలెడు వేళతారకల్
త్వరితగతిన్ లయంబుగొను భంగిని గూలెడు నట్టి పోలికన్. 2402

క॥ ఘోరంబగు లయవేళల
దారుణమగు వశనిపాత తతులోయనగన్
వీరులొనర్చెడు వృథు మౌ
ర్వీరావములొప్పె నతుల భీకావహమై. 2403

ఉ॥ పోరటు సాగుచుండ రణభూమి శ్రమంగొనియున్న దేవతా
వైరిని జూచి లక్ష్మణునిపైఁగల ప్రీతి విభీషణుండు యు
ద్ధారతి భీకరాత్మకము దాల్చి శిలాంతక మంత్రుతేయుచున్
ఘోరతరాకృతిన్ దనుజకుంజరులన్ దునుమాడె నెంతయున్. 2404

క॥ సచివ చతుష్టయ యుతుడై
యచల ధీరుడగుచు రావణానుజుడంతన్
విచలితులజేసె దానవ
నిచయంబుల భూరిబాణ నిచయంబులచే. 2405

క॥ ఆ కరణినేసి వానర
లోకంబును గాంచి పలికె రూపు మాపుడీ
నాకారి, దానరావణు
జేతత మరణించు వానికెవ్వరు లేమిన్. 2406

సీ॥ కుంభకర్ణుండును కుంభనికుంభులు
వజ్రదంష్ట్రుండు దేవాంతకుండు
జంబుమాలి ప్రహస్త సంహ్రాది వికటులు
నశనిప్రభుండు మహామాలియు
యజ్ఞకోపుండు మహాపార్శ్వ తపనులు
వగ్ని కేతుండు నరాంతకుండు
ధూమ్రాక్షుడు మహోద్దామ సుప్తఘ్నుండు
పతికాయ యూపాక్ష యజ్ఞశత్రు

గీ॥ లును విరూపాక్ష మహోదరుండు సూర్య
శత్రులాదిగ దనుజ విస్తారబలులు
రణతలమునందు గూలె దారుణముగాగ
దానవబలంబులీగతి దగ్ధమయ్యె. 2407

మీరలు రణార్ణవంబును
ధీరతమై దాటవచ్చితిరి శేషంబు
న్నారయ గోష్పద మంతటి
మేరకు తరియింపవలయు మీరుచు మీరల్. 2408

ఈ శక్రజిత్తు గూలిన
నాశేషము పూర్తియగుమ నగచరులారా
వేపరక వీని గూల్పగ
నీ సమయమునందు విక్రమింపుడు వేగన్. 2409

నే పితతండ్రినై తనయునీగతి జంపగరాదుగాని సీ
తాపతి కార్యచింతగొని దానవుజంపిన జంపజేసినన్
పాపముబొందజాల నదుపాయమెరింగి సుమిత్రసూనుచే
నీపనిజేయువాడను వినింద్యము వయ్యుమగాక యుండినన్. 2410

శిలలను వృక్షముల్‌గొని యశేషముగాగను దానవాళిపై
జలదము వృష్టులన్ గురియు చాడ్పున వే బరపించి దానవా
దుల మరణింపజేయుడు రథోర్విని నున్న మహేంద్రజిత్తు ని
స్తుల బలుడైన లక్ష్మణుడు సూదనము న్నొనరించు నిత్తరిన్. 2411

అనవిని యా వనాటుల లయావసరంబున మీరు మేము వం
క్తిని పరిబోల గర్జనల తీవ్రతరంబుగజేసి యుద్ధతిన్
ఘనమదమత్త కుంజర నికాయముపై పరువెత్తు సింహముల్
వనగను దాకె నెంతయు నిశాట బలంబుల భీకరంబుగన్. 2412

దనుజులు ప్రావపట్టిన గదా ముసలాదుల తోమరంబులన్
గినియుచు వేగదాకిరట కీశనికాయము బోరు తీవ్రమై
యనిమిష దానవాదులకునైన రణంబును బోలియుండె నా
వనజభవాత్మజుండు నిజబాహుబలంబున వంగరస్థలిన్. 2413

క. చొరబడి నిజబలములతో
గురుతర మేఘంబువృష్టి గురిసెడు భంగిన్
తరుచగు పాషాణంబుల
బరపెను నాదైత్యసేనపయి బడిబావన్. 2414

క. దానిగని దనుజవీరులు
నానాస్త్రచయంబు బ్రహ్మనందను నేయన్
బూనుచు రోషము మారుత
సూనుడు లక్ష్మణునిడించి క్షోణీతలికిన్. 2415

శా. సాలంబుగ్రత దెచ్చి దానవులపై సారించుచున్ వారలన్
గూలంజేసెను నొక్కవ్రేటునకు బెక్కుల్ చచ్చుచుండావ నా
లీలన్ వాయుజుడుగ్రమూర్తియయి దుర్నిక్ష్యప్రభావుండునై
యాలంబందున విక్రమించినను దైత్యాధీశ పుత్రుండొగిన్. 2416

చ. ఘనశరవర్షమున్ కపినికాయముపై యటనున్న యా విభీ
షణుపయి నేయుచున్ సమరసాహితి జూపుట జూచి వాయునం
దనుడు సుమిత్రసూను నిజబాహ్య భుజంబులనుంచి సంగరం
బునకయి శక్రశత్రుపయి బోయెను విక్రమముం ఘటించుచున్.

క. ఆ వీర శిఖామణులకు
భూవలయమునందు మున్ను బొడగాంచని క్రో
ధావిర్భూతోజ్జ్వల రణ
భావము సంభవమువయ్యె పటుసాంద్రముగన్. 241[illegible]

ఉ. కాలఘనాంతరంబులను గన్పడరాని శశాంకసూర్యులం
బోలుచు సాంద్రబాణతతి భూరిశరీరులునై యదృశ్యులై
కాలమహోగ్ర తీవ్రతర కాండములేయుచు నొండొరుల్ మహా
భీలగతిన్ రణంబునఁగడువృద్ధిని బొందుచు బోరుసాగగన్. 241

మ॥ వినువీధిన్ దివిజుల్ గనుంగొనుచు నిర్వాణాగ్రణుల్ నాఁ డొరుల్
రణముంజేయ సమానులౌదురొకొ లక్ష్యంబుగా దోరగా
ఘనసంత్రాసకరంబు నయ్యెనని సంగ్రామంబు వీక్షించుచున్
మనమందున్ దలపోసె రామజయమున్ గాంక్షించుచున్ శీఘ్రమై.

క॥ ఈతండు నోడుననియును
సీతండు జయంబుగాంచు నెంతయునని యే
రీతిని దెలుపంజాలక
యాతుధానపై రుణుండి రత్తఱి దివిపై. 2421

మ॥ పరమర్షుల్ నిఁ పాయుత్రై విపులసంత్రాంతాత్ములై ఘోర సం
గరముం గాంచుచు గోద్విజాదులకు నాకాలంబునన్ శ్రేయముల్
వరలుంగాక యటంచు బల్కె సుజనవ్రాతంబువర్ధిల్ల ని
ష్కరుణుండౌ దివిజారి యంతమిక వేగంగాంచునంచాడుచున్. 2422

ఉ॥ ఆ రణభూమిఁ జూచి భయదాకృతి దేవగ యక్షనాగ బృం
దారక సిద్ధసాధ్యులును వచ్చటికిం జనుదెంచి యందు భూ
దారసుతుఁ స్మరించుచును దానవపురావతి వేగజంపు ము
ర్వీరమణాత్మజా యనుచు బీతిని దీవనలిచ్చి రత్తఱిన్. 2423

ఉ। దంనాథాత్మజుఁడంత ఘోరశరము న్నాయుత్తముంజేసి యా
సురపై రి ప్రభు సూనుపై సగతమై శోభిల్లునావింటిపై
గురిగా సేసిన ఖండితంబునయి యుక్షోణీతలిన్ రాలె భూ
వరసూనుండది గాంచి పిదక రణవ్యాపార పారీణుడై. 2424

మ॥ శరసంధానముజేసి దానవు రథస్థంబౌ పతాకంబునున్
మరియున్ నాల్గుశరంబులన్ హయములన్ మాయించి యాసారథిన్
గురుబాణంబున జంపి దానవపరిక్షోభంబు గావించుచున్
రణభూమిన్ విహరించె లక్ష్మణుడు ఘోరాకారుడై యత్తఱిన్. 2425

చ॥ వినిహతవాజియై విగతభీకరకార్ముకుడై వినష్టసూ
తనుడయి నిస్సహాయుడయు దర్పమువీడక నొండువిల్లు చే
తనుగొని వేరుస్యందనము దాల్చి రథంబును దానె తోలుచున్
రణమును జేయజొచ్చెను శరంబుల లక్ష్మణుపైని నేయుచున్.

ఉ॥ రావణి యట్లుఘోర కనులందున రక్తిమదోప నుగ్రుడై
భూవరనందనుండు రయమూనుచు భూరిశరంబులేయ నా
దేవవిరోధి మూర్ఛిలియు తెల్వివహించెను కొంతవేళకున్
జీవదొలంగి దైన్యమున జింతనుజేయ దొడంగె నత్తరిన్. 2427

మ॥ శరచాపంబుల దాల్పశక్తి గనకన్ చాంచల్యుడై రాముసో
దరునిన్ లక్ష్మణు జూడజాలకయు చింతాస్వాంతుడై యుండగన్
తరుసంచారులు హర్షమందిరి రణస్థానంబునందున్న యా
శరభుండాదిగ వీరవానరులు రోషావేశ చేతస్కులై. 2428

చ॥ శరభుడు గంధమాదనుడు సారణుడుం ప్రమాథిరంభుడున్
గిరిగత శృంగముల్ గొనుచు గిష్పతివైరి రథంబుపై బడన్
గురిగొని యేయదాకియును ఘోటకకేతన ఛత్రయుక్తమౌ
యురదము చూర్ణమయ్యె దనుజాధిపసూనుడు నంత గ్రక్కునన్.

మ॥ ధరలంఘించి పరాక్రమక్రమము సంధానంబు గావించి భూ
వరుపై తీక్ష్ణశరంబులన్ బరపె నాథంగిన్విలోకించి నం
గర చాతుర్యము మీర రావణిని దాకన్నేగి వాయిర్వురున్
గరముం ఘోరదొడగి స్వీయజయ కాంక్షాయుత్తులై యత్తరిన్. 2430

క॥ వారట్లు పోరుచు నుండగ
వారి పార్శ్వగతుల దనుజ వానరసేవల్
పోరాడ సాగిరుత్కట
దారుణ సంగ్రామసరణి దప్పక మిగులన్. 2431

ఉ॥ కోరటు సాగుచుండ దలపోసెను రావణి యంధకార మీ
తీరున సర్వశాత్రవుల దెల్పక వేగపురంబులోనికిన్
జేరుట యొప్పు దానవుల జేయుచునుండు రణంబునంచు చిం
తారతి జేసి సైన్యముల తక్షణమందున జూచి యిట్లనెన్. 2432

ఉ॥ దానవవీరులార రణధారుణి నిల్వ రథంబులేదుగా
నేను పురంబుజొచ్చి తపనీయరథంబును నెక్కి వచ్చెదన్
పూనికతోడ మీరు రణమున్నొనరింపుడు వచ్చునంతకున్
గానగరాక శాత్రవులకంటికి బోయెదు లంకలోనికిన్. 2433

మ॥ అని మాయావిధిబూని లంకజని శస్త్రాస్త్ర ప్రయుక్తంబు కాం
చన సందీపితకేతనంబు జవవిస్తారాశ్వ సంబంధమున్
ఘననానామణి భూషితంబు గిరి సంకాశంబునౌ స్యందనం
బున వచ్చెన్ రణభూమిజేరగను దుర్మోహంబు వన్నెత్తరిన్. 2434

క॥ వానిగని విభీషణుడును
వానరవర్గంబు మనుజపతి నందనుడున్
మానసమందున విస్మయ
మూనిరి యాతండు యుద్ధభూమిని జేరన్. 2435

చ॥ రణతల భూమిజేరి యొకరమ్య శరాసనధారియై సుధీ
వినుతగతిం జరించుచును భీకర బాణములేసి వేసవిన్
నినుడొక కొంతనీరమును నింకగజేసెడిభంగి నుగ్రుడై
వనచర సేనలందునిమె వారు భయంబున బారునట్లుగన్. 2436

చ॥ జనులు ధరిజాపతిన్ జగతి సర్వశరణ్యుని భీతిజెంది వే
గను జని వేడుభంగి కపికాండములంత సుమిత్రసూనునిన్
బడిపడి వేగజేరి శరణంబును వేడిన వారిగావగా
ఘనతరబాణమేసి యరికార్ముకమున్ వెసద్రుంచిపైచినన్. 2437

క॥ దనుజుండు వేరు బాణం
బును గొనియేయుటను జూచి భూపాలసుతుం
దనిమేషవైరి దావము
ఘనబాణత్రయమునేసి ఖండించె వెసన్. 2438

చ॥ ధనువునుద్రుంచి బాణసముదాయమునేసియు వానికత్తళం
బును దునిమెన్ పదంపడి యమోఘశరంబుల వానికాయమున్
చెనకగ నేయసాగెను నశేషగతిన్ని విదారి దానవున్
వ్రణకలితాంగు జేసె రుధిరంబు శరీరమునందు గారగన్. 2439

క॥ నరపతి నందన శరముల
విరహిత కవచుడును నయ్యు విపులశరంబుల్
గురుతర మేఘము వర్షము
గురిసిన చందమున నమధికోన్నతినేసెన్. 2440

క॥ దానవుడేసిన శరముల
మానవపతి నందనుండు మడియగజేసెన్
భానుండు తనదు కరసం
తానంబుల తిమిరతతుల వడచినభంగిన్. 2441

క॥ అరయంగ హిమము భానుడు
విరియంగా జేయుభంగి విపులోజ్జ్వలమౌ
శరసముదయముల నేయుచు
సురవైరి ప్రవల తనూజు క్షోభితుజేసెన్. 244[illegible]

క॥ శాతశివ తప్తుండయ్యు క్షత
గాత్రుండై యసురవరుడు గవలుచు వే భీ
మిత్రిని మనిశిత శరముల
రాత్రించరనాథ సుతుడు రయమున నేసెన్. 244[illegible]

చ॥ దానవుడేయు బాణముల తాకిడికిన్ త్రిధయాని వానిపై
బాణపరంపరన్ బరపి వానిరథస్థుని సూతు జంపి ప్ర
జ్ఞా నిధియైన లక్ష్మణుడు సాయకముల్ నిగుడించి యశ్వ సం
తానము నొవ్వ జేయ నవిదారుణ దర్పి చరించె నత్తరిన్. 2444

ఉ॥ కనలి సురారి బాణదశకంబును లక్ష్మణు వక్షభాగమం
దున గురిజేసి యేయ నవితోడన వర్మముదాకి భూతలం
బున బడియెన్ గడుంగనలి పోడిమి మీర శరత్రయంబు ల
క్ష్మణు గురిజేసి ఫాలఫలకంబును గాఢగనేసె నత్తరిన్. 2445

ఉ॥ నరపతి సూను ఫాలమున నాటె శరత్రయమంత జూడగా
వరగిరి హేమభూధరము పై యలరారు త్రిశృంగశంగియై
కరము ను శోభిలెన్ కనలి కంజహితాన్వయు డుగ్రమూర్తియై
గురుశరపంచకంబు నధికోన్నతిమై పరపించె వానిపై. 2446

ఉ॥ కనలి విభీషణుండు గదగైకొని సాహసవృత్తి వాని స్యం
దనము వయిన్వడి న్మరికి తద్ధయవాజుల జావమోదినన్
దనుజవరాత్మజుండు విగతాశ్వుడునై ధరపైకి వేగ లం
ఘనము ను జేసి యాదనుజనాథ సహోదరుజూచి యత్తరిన్. 2447

మ॥ రధశక్తింగొని పిన్నతండ్రిపయి దుర్వారంబుగా నేసినన్
పృధివీనాథ సుతుండు దానిగని తీవ్రంబైన బాణంబునన్
చదలన్ వ్రయ్యలు జేసె నత్తరిని నిస్తంద్రంబుగా రావణిన్
బొడిచెన్ రావణసోదరుండపుడు సంభూతోగ్రచిత్తుండునై. 2448

క॥ అనిమిషవైరిని సునిసిత
ఘనశరములనేయ నతడు గనలి పితృవ్యున్
రణభూమిని వధియింపగ
పనిగొని ఘోరాస్త్రమేసె ప్రస్ఫుటభంగిన్. 2449

క॥ వెంటనె లక్ష్మణుఁడది గని
తుంటరి వే విడువఁబడిన దుర్భరాస్త్రమున్
మింటను వ్రయ్యలు జేసెన్
గెంటించుచు ఘోరశరము నేసియు నంతన్. 2450

చ॥ అనిమిషవైరి యంతట జయాంతరుడై విజిగీషచిత్తుడై
మును గొన కాలుడిచ్చిన యమోఘ శరంబును గూర్చి ఘోర భీ
షణగతి లక్ష్మణుంజెనక చయ్యన నేసిన దానిగాంచి ల
క్ష్మణుడు రయంబుమీర మహమందున దాని తిరస్కరించుచున్.

క॥ నరవాహనుండు కలలో
సురదానవలోక తతికి దుస్సహమగుచుం
బరగెడు భూరిశరంబును
కరము తనకు నొసగియున్న కరణి దలంచెన్. 245

క॥ ఆ మహనీయ శరంబును
భూమీపతి సుతుడు వలభుక్ప్రతి సుతుపై
భీమంబుగవిడిచిన వది
వ్యోమంబునవచ్చు దానవుని శితశరమున్. 245

ఉ॥ తాకి మహాగతిన్ గగనధారుణి ఘోరానరింపసాగె న
స్తోకగతిన్ రవిద్వయము తోయమునన్ బహువహ్నికీల లు
ద్రేకత రెంటియందున విజృంభణ జూపుచు సర్వలోక భీ
తాకరమౌ తెరంగున విధానములందు సమానశక్తులన్. 245

క॥ ఒండొంటి దాకి యీ గతి
ఖండనంబు నలుప కొంతవడి భగ్నములై
ఖండిత తేజములయి భూ
మండలమున బడియె నొండు మార్గము లేమిన్. 2 5

అది గాంచి లక్ష్మణుడు కా
ర్యధనుడు కోపించి యుగ్రశరరాజంబున్
వదలెను రాతజసుతుపై
కదనభయంకరుడు దాశకంఠుడు గూలన్. 2456

ఆ శరముగాంచి వెంటనె
దాశకంఠు డుగ్రకోప తత్పరుడగుచున్
వేసెను రౌద్రాస్త్రంబును
దాశరథి శరంబు భగ్నదశ బొందంగన్. 2457

దనుజవరాత్మజుండు భుజదర్ప మెలర్ప హుతాశనాస్త్రమున్
మనుజ వరాత్మజుం డెనకుమార్గము జూచియు నేయ నాతడున్
ఘనమగు నీరబాణమున ఖండితమయ్యెడు భంగినేపినన్
కనలుచు నింద్రశత్రు వటు కార్ముకముంగొని ధీరచిత్తుడై. 24.8

ఘోరాకారుడునై ధనుర్గుణము సంక్షోభింప లోకంబులున్
వీర ప్రక్రియ సర్వదానవతతుల్ వీక్షించి స్తోత్రింపగా
సారస్ఫూర్తిని వాయుబాణమును చంచల్లీలనేయంగ వా
తీరుంగాంచి మహీవరాత్మజుడు పంధిగ్దంబు లేటుండగన్. 2459

వాపవబాణంబును పం
శ్రీనకరంబుగను వేసి ధైర్యాన్వితుడై
వేసరక పమీరాస్త్రము
వాపిగ ఖండించె దానవావళి గలగన్. 2460

అనిమిషవైరి యంత నురగాస్త్రమునేపిన దానిగాంచి ల
క్ష్మణుడు మహోగ్రగారుడము మౌర్వ్యని సంఘటితంబుజేసి యే
సిన వవి రెండుఃబోరి యతి శీఘ్రగతింభువిగూలె నాగతిన్
రణమునొనర్పసాగిరి పరాక్రమముల్ బ్రకటించు చాండొరుల్.

చ॥ ప్రళయము భంగిదోచె నెటువంకను జూచిన వ్యోమమందునం
గల మునివర్గముల్ దివిజకాండము లారసుపర్వలక్ష్మణున్
బలయుతు జేయగా విధివిధంబుల దీవనలిచ్చుచుండె దు
ష్పలితము బొందకుండ దనుజాధిపసూను వధంబుఁగోరుచున్. 24

ఉ॥ దానవుడంత నల్గి వసుధావర సూనునిపైని ఘోరమౌ
బాణమునాసురంబుగొని వైచిన నయ్యది భూరిశస్త్ర సం
తాన ఘనాసిముద్గరగదాపరిఘాయుత శూలసంతతిన్
మానుగ బుట్టజేయుచును క్ష్మావరసూనుని దాకనేగినన్. 24

శా॥ ఆకాశంబును గప్పి యాయుధచయం బారీతిపై వచ్చుటన్
నాకంజాత హితాన్వయుండు గని బాహాశక్తి దీపింప ను
ద్రేకుండౌచు మహేశ్వరాస్త్రమును నాదిక్కున్ ప్రయోగింపగా
చీకట్లన్ తపనుండు తీర్చుపగిదిన్ జెండాడె నత్యుగ్రతన్. 24

-: లక్ష్మణుడు ఇంద్రజిత్తును వధించుట :-

క॥ ఆ యసురాస్త్రంబును నా
హాయబలుడు లక్ష్మణుండు నంతముజేసెన్
బాయక నట దేలదోసెను
నాయసురవర్గ నిశ్చయాత్ముఁడు నగుచున్. 241

సీ॥ అంతట భంగి రౌద్రాకారుడై ధను
ర్గుణ రవంబులు దిశల్ మ్రోయుసాగ
భీకర సింహనాదంబు గావించి మునుదేవ
దానవయుద్ధ సందర్భమందు
వావవుండెద్దాన వధియించె నసురుల
నవలపంతాశ ఘనుండంతకంబు
సర్వలోకవిభీత సంత్రాసకరమును
సరిపీరలోక సంహరణమగుచు

గీ॥ గురుతరాశీ విషానల ఘోరమగుచు
దైవతాలోక సంభావితంబునగుచు
సంగరంబున బహువిధ జయముతగుచు
నరగునైంద్రాస్త్రమును రఘువరుడు దాల్చె. 2486

చ॥ ధరకంపించె చరాచరంబులును విస్తారంబుగా భీతిలన్
సురగంధర్వ మహర్షినాగగరుడ స్తోమంబు స్తోత్రింపగా
నరపాలాత్మజు డామహాస్త్రము సమంత్రస్ఫూర్తి చాపంబునన్
పరిసంధించి నిశాటనాథసుతు గూల్పన్నెంచి పల్కెన్నిటుల్. 2487

ఉ॥ రామనృపాలచంద్రుడు ధరాస్థలి ధర్మరతుండునేని పు
ణ్యామలమూర్తియేని యమరావళికిన్ హితుడేని సత్యభా
షా మహనీయుడేని జనసన్నుతుడేనియు నీమహాస్త్రము
ద్దామగతిన్ మహేంద్రజితు దానవు శీర్షము ద్రెళ్ళజేయుతన్. 2488

క॥ అనిమిషపతి జంభునిపై
ఘనవజ్రము నేయు భంగి కర్ణాంతముగా
ధనువు బిగియించి యైంద్రం
బను శరరాజంబు నేసె మాయాసురుపై. 2489

సీ॥ ప్రళయకాలాగత విలయావలోద్రేక
బహుళకీలోజ్జ్వల భయదమగుచు
ధరయుగాంతపువేళ ద్వాదశాదిత్యులు
గుమిగూడి యుదయించు సమయమనగ
విలయవేళారంభ విపులజీమూతోగ్ర
దారుణాశనిపాత ఘోరమనగ
పర్వతోత్పాటనా ప్రళయోద్దండవాత
విపులవేగాన్విత విధమనంగ

గీ॥ నందనుఁడు జూచుచుండ మహాస్త్రమపుడు
గగనతలమున కెగసి యఖండగరిమ
రత్నకుండల కోటీర రాజితంబు
నింద్రజిచ్ఛీర్షమును ద్రుంచె నింద్రగతిని. 2470

కం॥ దనుజుని ఖండిత శీర్షము
గనపడియెను రక్తయుత కనకకందు కం
బునుబోలె దనుజులది గని
జనిత విషాదమున నేర్వసాగిరి యంతన్. 2471

కం॥ దనుజపతి సుతుని మరణము
గని వనచరసముదయములు కరమును విజయ
స్వనములు సలిపెను మనములు
ఘనముదమును గొనుచు పృథుల కదనతలమునన్. 2472

కం॥ అమరులు గగనతలంబున
సుమములు గొని పుష్పవృష్టి సురుచిరగతి భూ
రమణాత్మజుపై గురిపిరి
విమలామర నది మరుత్తు వీచె పవనముదున్. 2473

కం॥ స్తుతియించిరి పరమర్షులు
నతులితగతి నాట్యమాడి రప్సరసలు న
న్మతి పాడిరి గంధర్వులు
చతురత దుందుభులు మ్రోసె సంతుష్టులనై. 2474

తే॥ వ్యథగతమై సమలంకృత
వనసమువయి శోభితంబు సౌఖ్యప్రదమై
పృథివీస్థలి యొప్పెను దు
ర్మదుడగు రావణి రణాంతరంబున జావన్. 2475

అమరశాత్రవము బల్కిరంతటను దుష్టాత్ముండు నీదైత్యవే
శ్రమలంబొంది తపంబు లధ్వరములన్ సాలించి డాగున్న పు
ణ్యమునిశాత్రవము స్వేచ్ఛలంగొనియు సంహారంబులంజేయుచున్
క్రమతన్ ఘోరతపంబు లధ్వరములం గావించునెంతేనియున్. 24 6

రణమున తన్ను గెల్చిన పరాక్రమశీలుడు దుష్టచిత్తుడున్
దనుజవరాత్మజుండు బలదర్పుడు లక్ష్మణుచేత జచ్చుటన్
గని బలసూదనుండు నధికంబగు హర్షవ జెందె దేవతా
గణముని సిద్ధసాధ్యక నికాయము గొల్వగ నాకమందునన్. 2477

జలనిధి నిర్మల జలతరంగిణి యయ్యె
దిక్తతులన్నియు తెలివిగాంచె
గ్రహతారకలను నిర్మల నభంబలరారె
ధరణీతలంబు సుస్థిరత జెలగె
గర్జానినాదసంకలిత మేఘములొప్పె
విగతార్తియయ్యె పృధ్వీతలంబు
పుణ్యాశ్రమంబులు పుష్పసంభృతమయ్యె
జలజాకరములు నిర్మలతనలరె

భానుచంద్రులు ముప్పటివలెను దిరిగె
వాటముగవీచె శీతల పవనుడపుడు
లోకకంటకుడౌ దనుజలోక నాథ
సుతుడు సౌమిత్రిచే గూలుచున్న వేళ. 2478

ధరణీతల కంటకుడగు
సురవైరి సుతుండు గూల క్రోధవశించెన్
ధరణీసురులకు క్షేమము
పరువడి సీత గలుగుననుచు వలికిరి యమరుల్. 2478

చ॥ అడగినవీతిహోత్రుడన నారవిరశ్మివిహీనుడైన మా
దిక్కరి గతజీవితుండయి దిగీశ్వరవైరి సుతుండు శైలమో
యనగ రథంబునం బడిన యా రజనీచరశేఖరుం డరుం
గాని విగతశ్రియుండగుచు నొప్పెను లక్ష్మణు బాహుపత్రిచేన్. 24౯

చ॥ తన విజయంబునంత విశదంబొనరింపగనెంచి శంఖ ని
స్వనమును జేసి లక్ష్మణుడు జ్యానినదంబును ఘోరసింహ గ
ర్జనమొనరించె వానరులు సంతసమొందుచు సాధువాక్య భా
షణముల సంస్తుతించిరి దిశాపతివైరి సుతుండు గూలుటన్. [illegible]4

సీ॥ అంత విభీషణు డాలక్ష్మణుని గని
యాలింగనము జేసె హర్ష మొదవ
నలనీలహనుమ దంగద జాంబవత్కుశా
పనస సుషేణగవాక్ష గవయు
మైందద్వివిద గంధమాదన శరభులు
తారరంభాది దుర్వారభుజబలా
యూథపాగ్రేసరుల్ స్ఫుటప్రీతి మోద చూపి
సౌమిత్రిని శతముఖప్రశంసల బలికె

గీ॥ కొందరాలింగనము జేసికొనిరి మరియు
గానములు జేసె కొందరు తరమువాట
తంగిమల నొప్పె కొందరు పటుతరముగ
జయజయధ్వానములు పల్కె సాగిరపుడు.

క॥ హనుమ జ్జాంబవదాదులు
తను పరివేష్టింప రామదర్శన కాంక్షన్
జనియెను జయలక్ష్మీయుతు
డనఘుడు లక్ష్మణుడు విక్రమాన్వితుడగుచున్.

క॥ చని రాముని చరణంబుల
కును నభివందనము జేసి కూడిన భక్తిన్
వినమిత గాత్రుండగుచును
ననుజునితో బల్కె రాము డానందించన్. 2484

మ॥ నరనాథోత్తమ మీయనుజ్ఞ గొని యత్నంబేను గావించితిన్
సురవైరిప్రభు సూను నింద్రజితునిన్ క్షోభాకరున్ గ్రూరునిన్
దురితుండైన నిశాచరాధిపుని వేదింపంగ యత్నంబులన్
జరుపన్వేడెద వాత్మతీయపై మహానందంబు నందిల్లగన్. 2485

క॥ దరినున్న విభీషణు డా
నరవరునిన్ రాముగాంచి నయవినయములన్
కరఘటితాంజలి పుటుడై
పరమోత్సుక మొప్పబలికె వారనిభక్తిన్. 2486

క॥ భవదీయాజ్ఞను నీతడు
వివిధాస్త్రములేసి కదనవీధిన్ బలి దా
నవనాథుపుత్రు డనిమెను
దివిజానీకంబు మునులు దృప్తి వహింపన్. 2487

చ॥ తనదరి నున్న సోదరుని దగ్గరకున్నిజ బాహువంగతిన్
గొని తనయంక భాగమున గూర్చొనబెట్టియు హర్షబాష్పతో
చనుదయి పన్నీరధూళులను సారవచో విధి బల్కజొచ్చె ల
క్ష్మణు తనువందు గాడిన నిశాత శరక్షతరాజి గాంచుచున్. 2488

క॥ అనివిస్మృతి బొందుచు వెం
టనె తెల్విం గాంచి దనుజనాథ సుతుడు ల
క్ష్మణుచే ననిగూలిన కా
రణమున సంతోషమంది అక్ష్యవిశుద్ధిన్. 2489

ఉ॥ దానవనాథ పుత్రుడు ప్రధానుడు రాక్షసకోటికెల్ల యు
ద్ధావ పరంతపుండు బలదర్పుడు శక్రునిగెల్చి యుండుటన్
వాని రణాంతరంబున నవారితశక్తిని గూలజేసి యెం
తేనియు కీర్తి గాంచితివి ధీవరలక్ష్మణ మోదమయ్యెడిన్. 2480

క॥ తొలగెను భయములు దివిజా
వళికి మునులు బాధలుడిగి వర్తింతురికన్
గలిగెన్ క్షేమము లోకం
బులకున్ దివిజారి సుతుడు మృతిగాను కతనన్. 2481

క॥ తనయుడు మృతిజెందుట రా
వణునకు గల శక్తులన్ని భగ్నంబయ్యెన్
రణతలమున దశకంఠుని
పనిపడి తునుమాడి జగతి భద్రము గూర్తున్. 2482

చ॥ తనయుడు విక్రముండు రణధారుణి గూలుట రోషమూని రా
వణుడు రణంబుజేయ నికవచ్చును భూరి బలాన్వితుండునై
యనుపమ విక్రమక్రమ విహారముజేసి రణాంతరంబునన్
దునిమెదు సైన్యయుక్తముగ దుష్టుని రావణు నిశ్చయంబుగన్.

-: రావణుడు ఇంద్రజిత్తు వధ విని దుఃఖించుట :-

క॥ దనుజులు కొందరు నత్తరి
జని లంకకు దైత్యవిభుని సన్నిధికి సనిన్
తనయుని మృతవార్తను వా
తనికి నెరుగజేయ దుఃఖితాత్ములనగుచున్. 2484

సీ॥ చని గద్గదస్వనంబున నిట్లు పలికిరి
దనుజేంద్ర నీ ప్రియాత్మజుడు శక్ర
జిత్తు రణావని శిఖితుల్యసాయక
జాలంబులన్నేసి చండవిక్ర

మంబు ప్రకటించి యమంద దివ్యాస్త్రముల్
బాహుబలోద్ధతి బర్వజేసి
ఘోరంబుగా రణక్షోణిపై విహరించి
యమిత వనాటసైన్యముల గూల్చి

గీ॥ పోరు సల్పియు లక్ష్మణు దారుణోగ్ర
సాయకంబుల కోర్వంగ శక్తిలేక
ధరణిపై గూలి పడియె గతాసుడగుచు
నేమి చెప్పెదు దనుజేంద్ర యీ విధంబు. 2495

క॥ తనయుని మృతవార్తను విని
దనుజవిభుడు తెలివి దప్పి తదుపరి మనం
బున తెలివిగాంచి నిజసుతు
మనమున దలపోసి దుఃఖమయుగా నుండెన్. 2496

మ॥ విలపించె న్నిటులోతు సూరక సుధీవిఖ్యాత బాహా బలో
జ్జ్వల సంగ్రామ పరాక్రమా దితిజులవాతైక చూడామణీ
బలవచ్ఛ్రేష్ఠ కఠోరశాత్రవ గణవ్యాపార విధ్వంసకా
విలసద్బృందనభీమ భూవినుత సద్విఖ్యాత శూరాత్మకా. 2497

చ॥ అనిమిషనాథుడంతటి మహాబలశాలి రణాంతరంబునన్
నిను జెనకంగ నోడెగద నిర్భయుడౌచు ఖరుండు నేగతిన్
రణమున నిన్నెదిర్చియును పోవిషదుష్టుని వేసెనొక్కొ యు
ద్ధురముగ దోచుచుండె రణభూమి పరాక్రమమెట్లు నీదితో. 2498

సీ॥ నమువర్తిపై బోయి వంగరంబున వాని
కార్తి గూర్చిన శక్తి యనిమడిపెనె
యనిమిషనాథుని ఘనరథంబున గట్టి
తెచ్చినశక్తి యేందేగొనొక్కొ

బహుళదివ్యాస్త్ర సంపదలమరెడు శక్తి
రణభాగమందు విస్మృతిని గనెనె
శూరవరేణ్య సంస్తూయమానంబగు
నీవిక్రమంబు లెందెగె నాక్కొ

గీ॥ మనుజమాత్రునితో రణమందు బోరి
భూరి దుర్వార విక్రమంబులను జూపి
కదనతలమందు లక్ష్మణ శరవిముక్త
శరములను వీరనాక పంజరముఁగాంచె. 2499

మ॥ నా యాజ్ఞన్ శిరసావహించి రణమున్నా నక్తిమై జేయగా
నాయాభీష్టముదీర్ప శాతపులతో నత్యంతముం బోరి సు
జ్ఞేయంబయ్యెడి వీరనాకమునకున్ నీవేగితే పుత్రకా
నీయోధత్వము ధీరవర్యులు గణించెంతేగియున్ ధాత్రిలో. 2500

ఉ॥ వీరరణంబొనర్ప పృథివీతలమందున నీవు గూల బృం
దారక యక్ష కిన్నర రథాంగ భుజంగక సిద్ధసాధ్య భూ
దార మునీంద్ర భూసురులు దృప్తిని బొందుచు స్వేచ్ఛవృత్తి సం
చారము జేయుగాదె సుదిశంకల బాసి యనేకరీతులన్. 2501

ఉ॥ శివు గణింప నీధరణి నేర్పడియున్న యనేక జంగమ
స్థావర సంతయంతయును సర్వజగంబుల సాకు శూన్యమౌ
భావముగాగ దోష విభవచ్ఛ నిరంతరరోదనంబు లీ
దేవ విరోధి బాధముల దీనతరాక్షస శాంతతెద్యగవే: 2502

ఉ॥ దైవబలంబు చాలమి వధంబొనరించె నరుండు నిన్ను మున్
దైవతశక్తులం గొనుచు దండధరుస్ని దిరించి పెట్టి సం
భావిత శూరవర్యుడవు ప్రాజ్ఞుడవయ్యును కాటదెంతయున్
ధీవర నీకు మిన్నయయి వేదువధించెను దైవికంబుగన్. 2503

దారాపుత్రుల యౌవరాజ్యపదవిన్ దాయాదులన్ మిత్రులన్
గారాబంబుగఁబెంచినట్టి జననిన్ నత్యంత సౌభాగ్యతన్
మీరన్ రంజిలులంకనున్విడిచి తండ్రియొట్లు బో జాలితో
నేరన్ మున్నెపుడట్టి కష్టమును చింతింపంగ శూరాగ్రణీ. 2504

జనకుడు మిత్తిఁబొందగను సర్వధరిత్రికి నిత్రుతికర్మలన్
తనయుఁడొనర్చు ధర్మముగ దానివిరోధముగాఁగ నేడు నం
జనితమునయ్యె దుర్ఘటన సల్పగవచ్చెను నేను నీకు నో
వినుత పరాక్రమా కమలవీక్షణ జేయుట గల్గె నీమృతిన్. 2505

అని విలపించుచున్ తనయుఁడాజి గతించిన వేదనంబునన్
జనితమహానలంబు గతసాంద్రతరోగ్రుఁడునై స్వభావతన్
ఘనకలుషాత్ముఁడౌట నధికంబగు వేఁపవి చండభాను రీ
తిని నిజకోపవహ్ని నలుదిక్కులకున్ వ్యాపింపజేయుచున్. 2506

మరియును బడబా ముఖ సుత
గురుతర ధూమావృతంబు ఘోరాగ్నిగతిన్
కరమున భ్రుకుటీ యుగ వి
స్ఫురిత త్రివళియుమడగుచు పృథుకోపుండై. 2507

అనలజ్వాలిత వహ్నికుండికల తోయుంబొప్పు నేత్రంబులన్
జనితంబయ్యెడు తైలబిందువుల తోయంబొప్పు బాష్పంబులన్
దనుజాధీశుడు రాల్చుచున్ వదులంబున్ ఘటనోద్భూతే ని
స్వనముల్ బర్వగ వానిగాంచుచు భయభ్రాంతాత్ములై రందరున్.

విలయాంతకు భంగిని క్రో
ధ్వలితాకృతు డగుచునున్న హీనవక్త్రున్
కలితక్రోధాత్ముని వీ
క్షలఁ జేయఁగలేక పారిపోగిరి దనుజుల్. 2509

క। వారలు వారుటగని మన
సార భయము దీర్చనెంచి సారమేఘ గ
ర్జారవముబోలు పటుతర
ధీర భాషణముం బల్కె దీవ్రతరోక్తిన్. ౯౫

చ। తనజనకుంగురించి యనివారితభక్తి సహస్రవర్షముల్
ఘనతపమాచరించితిని కంజభవుండు ననుగ్రహించి నా
కును బొడసూపి కోరికల గోరుమటంచును నాజ్ఞజేయ నే
వినుతినొనర్చి కోరితిని వేడినవెల్ల నొసంగె నాతడున్. ౯౬

ఉ। అనలుని ప్రసాదమున నందితి వజ్రసమానమౌ తను
త్రాణము దానిదాల్చి రణధారుణి నిల్చిన సిద్ధసాధ్య గీ
ర్వాణ దిగీశులైన సమరంబొనరింప నశక్తులౌను గా
నేనిటువంగ భీతిలుచు నిగతిబారుట మీకు కూడునే. ౯౭

చ। మరియును నామహాత్ముడు దయాన్వితుడై వరమిచ్చె నాకు నే
తరిని సురాసురాదుల కృతంబగు మృత్యువులేని భంగి సం
గరమతులై సుధీరతమ గాంచుడు నేను రణంబునందు సం
హరణము జేతు రాఘవుల నాతనిసర్వ వనాటసైన్యమున్.

చ। మును వనజాసనుండు తపమున్ గని మెచ్చి యొసంగినట్టి యా
తనువు శరంబులన్ బహువిధంబగు వాద్యనినాదితోత్సవం
బున గొనితెండు నిగ్గొని పోవుడు భూరిబలంబుగొంచు నా
జనవిభు మానుషుల్ కపులసైన్యము సర్వము సంహరించెదన్.

మ। అనుచుం గ్రోధమయాత్ముడై పలికి న్యక్కక్షోణి ఘోరంబుగన్
దనువున్ వీడిన పుత్రునిం దలచి సంతాపంబునుం బొంది యా
జనకాధీశతనూజ యుం? మదిలో సంతాపమున్ మాన్పెద
న్మనమున్ బల్కె నిశాటలోకమును యుద్ధాయత్తులం జేయుచున్.

మ॥ మును మాయా ధరజీజ మస్త్రుతు దనిన్ మోదించి యా రామవం
చన పూర్వంబుగ జంపె తత్ఫలితముల్ సర్వంబు శూన్యంబయెన్
జనకాదిక్షతనూజ విక్కముగ నేపంహారముంజేసి యా
జనవాథాత్మజులన్ విషాదజలధిన్ పొందింబుగా ముంచెదన్. 2516

క॥ అని రోషావేశంబున
మనతర క్షరవాలఘంత గైకొని దారల్
వనితాజనములు సచివులు
దనవెంటను రాగవెడలె ధరణిజ కడకున్. 2517

క॥ దరినున్న భార్య రావణు
దురాగ్రహము జూచి నయవిధోజిత భంగిన్
సురవైరితోడ బల్కెను
కరముమ స్తుతియించి యుక్తకార్యము కొరకున్. 2518

-: రావణుడు సీతను వధింపబోవుట :-

సీ॥ శ్రీ ధనుజేశ్వరుం(డాదిత్య గంధర్వ
వసురుద్ర(పన్నగవరుల్ యక్ష
సాధ్య విద్యాధర చారణకిన్నర
తతులనెక్కండ్రి రణతలమునందు
భగ్నంబు గావించి(పబలశక్తుల జూపి
జగముల తనకు(వశంబుజేసె
నరనాథసుతుల(నిష్కరుడవై శితశరా
వళుల నాజిని గూల్చ బలుడు మరియు

గీ॥ నితనికి వముందు శూన్యమీక్షితి తలమున
నన్నిటను దక్షుడవ్వి శూరు ధనువముందు
నాతి జంపెదననెడి యన్యాయమొకటె
వెలితిగాదోచె నీదతుజ విభునియందు. 2519

మ॥ అని వారించుచు జానకీతరుణి నన్యాయంబుగా జంపుటన్
దనుజాధీశ్వర కూడదంచు బలుకన్ ధర్మేతరుండౌచు నా
జనకాధీశతనూజ యున్నవనికిన్ వంచద్గతిన్వేగ రా
వణుడంతన్ కరవాలహస్తుడగుచున్ పృథ్వీసుతం జంపగన్. 2520

మ॥ సురనారీసములైన కాంతలను సంక్షోభంబునం జంపగా
కరమన్యాయము పోరనుంచు బలుకంగా బంధులున్ కాంతలున్
సరకుంజేయక దుష్టమౌ గ్రహము విస్తారోగ్రరూపంబునన్
వరమౌ తారకరోహిణిం గతియు నాశంగిన్ మదోద్రేకుడై. 2521

క॥ జనకజ జంపగనేగిన
జనకజ యా దనుజవిభుడు సత్వరుడగుచున్
దను జంపవచ్చుటను గని
ఘనతర కంపంబు భీతిగాంచుచు బొందెన్. 2522

చ॥ మనమున చింతజేసె రఘునందను కాంత దురాత్ముడై యీ
దనుజుడు పారితుండయును దర్పమునన్నసి యూనివచ్చె వే
మని విలపింతు నింక దయమాలి యొకానొక క్రూరదైత్యుచే
తమ పరిమార్పనెంచితివె న్యాయ విచక్షణలేక దైవమా. 2523

చ॥ నుతమతి నేను రాముకనువ్రతనై యలరార వన్నె దు
ర్మతి యయి రావణుండు బలుమారులు వచ్చి వరింపుమంచు దు
ష్టతనము మీర బల్క నవిజాలగ నిష్ఫలమౌట జూచి యీ
గతి నను జంపవచ్చెడిని కల్మషచిత్తుడు నిర్దయాత్ముడై. 2524

చ॥ అరయగ నీపురంబు దనుజావళి భీషణ హర్షనాద సం
భరితమునయ్యె నుగ్రరణ భాగమునందున మన్నిమిత్రమై
మరణము బొందినారొ యనుమానము దోచెను రామలక్ష్మణుల్
మరియు కృతాంతుడీజగతి మాన్యుల హింసనొనర్చునేలొకో. 2525

చ॥ తన సుతుడింద్రజిత్తు రణధారుణి గూలుటజూచి రాజనం
దనులనెదిర్చి పోరగల దక్షతలేమిని నాతినైన వన్
జనకి మనోవ్యథన్ గడవ జింతనుజేసి దురాగ్రహంబునన్
పనిగొని వచ్చుచుండెనొకొ భావమువందు గ్రహింపలేనికన్. 2526

మ॥ మును వీరుండు మరుత్సుతుండు తను వీపుంజేరి కూర్చుండ రా
ముని జేరంజనువాడనంచు బలుకన్ మోదంబు బాటింవకన్
జనరాదావని యెంచు బల్కితని యా సామీరి వాక్యంబులన్
వినినన్ నీదురవస్థ జిక్కకయు వృథ్వీనాథు గొల్తుఁ గదే. 2527

సీ॥ వా నాథుడంతంబు నందిన వార్తను
వీనులసోక మద్విభుని తల్లి
యేకనందవ దశరథేశు పట్టపురాణి
రాముని జన్మబాల్యంబు యౌవ
నంబును ధర్మచింతనమును దలచుచు
విచలితహృదయయై విషము భక్ష
ణంబును జేసిడెు యగ్నిలో జొరబడి
యంతంబు బొందును కైక కతన

గీ॥ ననుచు విలపించుచును నాత్మయందు గుంద
బాష్పధారలు గన్నుల బయిలువెడల
దుఃఖియై యున్న జనకజ దుష్టరావ
ణుండు ఖండనజేయు నుద్దండగతిని. 2528

గీ॥ వాని గాంచుచు హాహారవంబులంత
దనుజవర్గంబుజేసెను వనిమిషులును
దైన్యతను దిగులుబడియె భూతంబులన్ని
భీతిజెందెను దిశలు కంపించెనంత. 2529

క॥ ఆ తరిని మహాపార్శ్వుడు
నీతికోవిదుండు సచివ నిపుణుం డంతన్
దైతేయువాఘు బట్టుచు
వాతనివారించి శాంతమగు వాక్యములన్. 2530

చ॥ పలికెను దైత్యనాథ పరిభవంబును గాంచితి బ్రహ్మవంశమం
దలఘు పులస్త్యపౌత్రుడవు నాత్మజుడౌదువు విశ్రవస్మహో
జ్జ్వలునకు సోదరుండ శివసఖ్యునికున్ బహువేద శాస్త్ర సం
కలిత విశేషచిత్తుడవు గౌరవనీయుడ రాక్షసావళిన్. 2531

చ॥ అనుపమధర్మముల్ విధిచి యక్కట నాతిని జంపబోవగా
జనునొకొ నార్యులున్ వినిన నవ్వు తిజేయును నింద్యకర్మ నీ
కనయము గూర్చు శాంగతి క్ష్మాజ నినున్ వరియించునేమొ యా
జనవిభుడాజిగూల పరుషంబగు కృత్యముజేయ బాడియే. 2532

చ॥ కినుకను బూననేల తమకించుచు నాతిని జంప కోపమున్
రణమున జూపనౌను రఘురాముని తోడను బోరువేళ నీ
ఘనభుజశక్తులన్ సమధికోన్నత శౌర్యము సంగరావనిన్
గనపడ జేయుటుత్తమము కాంత వధింపగ గర్హితంబయా. 2533

చ॥ కనుగొనుదేవ యీదినము కృష్ణచతుర్దశిగాన నేడుప
త్తనవనసీమనుండి శుభదంబగు లగ్నముతం దమాస ప్రా
ద్దున విజయార్థమేగి వటుదోర్బల శక్తి రణాంతరంబునన్
గనపడజేసి రాఘవుల ఖండనజేసియు గాంత బొందుమా. 2534

చ॥ అనుచును దైత్యనాథుని కరంబున నుండిన చంద్రహాసమును
గొనుచును భూరివహ్నిసమకోప నివారణజేసి వెన్కకున్
జనిచిన లంకజొచ్చి బలుమారులు పుత్రకునిం దలంచుచున్
ఘనమృగరాజు శంగి నధికంబగు కోపవిజృంభమానుడై. 2535

చ॥ కొలువున గూరుచుండి తనకుం ఘటియిల్లిన యా[illegible] యా
బలపతి ముఖ్యులంగనుచు వారి నమస్కరణంబుజేసి యం
జలి ఘటియించి యాననమువందువ దైన్యముదోప వారితో
బలికెను గద్గదస్వరము వర్తిల రావణు డా సభాస్థలిన్. 2536

చ॥ దనుజవరేణ్యులార బలదర్పులు మీరలు శక్తియుక్తులన్
రణమునుజేయ మీరు చతురంగబలంబుల తోడగూడి వే
జనుడు రణాంతరంబునకు సాహసమొప్పగ నాన్పపాలనం
దనులను దారుణాస్త్రముల దండనజేసి వధింపుడెంతయున్. 2537

చ॥ రణమున జావకున్న రుధిరంబులు గారగ నారసంబులన్
తనువులనొవ్వ నేయుడు ఘనంబగు కార్ముకమేనుగొంచు వా
జనపతి సూనులన్ పృథులసాయకముల్ నిగిడించి చంపెదన్
మనమున నున్న చింతమటుమాయము జేసెద నీదినంబునన్. 2538

–: రావణుని మూలబలములు యుద్ధమునకు వెడలుట :–

క॥ దనుజవిభు శాసనంబున
ఘనబలపతులంత సమధికంబగు నిజవా
హనముల గదలిరి రణతల
మునకును వివిధాయుధముల బూనుచు పెలుచన్. 2539

మ॥ మును దిక్పాలుర తోడబోరు సలుపం బోనట్టి యా మూలబ్ధి
దనుజానీక బలంబు లత్తరిని యుద్ధాయత్తులై భూరి –ం
చన ఘంటానినదోగ్ర హస్తిచయ మశ్వావ్రాతముల్ కాల్బలం
బును శైలాకృతిబోలు స్యందనములున్ బొల్పార వెన్వెంటరాన్.

చ॥ దురమును జేయబోయెను చతుర్దశినాటి నిశావసానమం
దరుణుడు రాకమున్న బడబానల తుల్యముగాగ నందరున్
పరువడి వానరావళుల భగ్నమొనర్పగ దాక్షిణాత్యసర్ముల్
గురుతర విక్రమంబు నధికోన్నతి జూపుచు పోరు సల్పగన్. 2541

మ॥ అదరెన్ కూర్మవరాహ శేషుల్లును గోత్రానీక దిగ్నాగులున్
పృథులీలన్ గగనంబుపై నెగయుచున్ వృద్ధ్యబ్ధి సంచారులున్
పృథివీజంబుల ఘూర్ణిగండశిల భూభ్రాంతించి వేవేగమై
గదిసెన్ పోరతిఘోరమయ్యెను దిశల్ గంపింప సుగ్రీవృతిన్. 2542

క॥ వనచరులేసెడి తరుతతులు
ఘనశిలలును దనుజులేయు గాఢశరంబుల్
వినుతలములను గప్పుచు సం
జనితంబయె తమము ఘోర సమరము పేరన్. 2543

ఉ॥ అందరు వీరవర్యులు మహారణధీరులు విక్రమాన్వితుల్
నందరు నాటిరంగములయందున శాత్రవలోకభంజనా
నందులు రెండువాగులను నారయనాగతి పోరుచుండ్రె సం
క్రందన సైన్యముల్ దనుజకాండము యుద్ధకఠోర కైవడిన్. 2544

చ॥ గిరిగిరితాకు చందమున కేసరి కేసరిపోరుచుంగి నా
గరములు రెండు ఢీకొనిడి కైవడి నాగము నాగముం బలెన్
పరువడి రెండువాగులును భవ్యరణంబొనరించె సాగె వాం
డొరులు జయాభిలాషులయి యూర్జిత తత్వ విజృంభమాణులై. 2545

సీ॥ త్వరితంబుగా రథోత్కరమును బరపించి
శరజాలముల కపిసైన్యమేపి
భద్రమాతంగముల్ వరుసది ఢీకొల్పి
తోమరంబుల తనుల్ దునిమిదునిమి
యశ్వసంఘంబుల నభిముఖంబుగ నేగి
ఘోరాసిచే తలల్ గూలనరికి
వీరభటాళి యుద్వృత్తిమై దాకుచు
శాత్రవఖండనా చతురులగుచు

గీ॥ భూరివిక్రమ శౌర్యసంభూతు లగుచు
యాతుధానులు వనచర సైన్యములను
దాకి యుద్దండగతి రణోత్సాహమొప్ప
రణవిహారంబుజేసి రుగ్రంబుగాగ. 2546

సీ॥ తోకలఁజుట్టి యుద్ధోన్మాదులయి రథ
రథికుల జిమ్మి దుర్వారభంగి
గిరిశిఖరంబుల కరిసంఘముల గూల్చి
పాదపంబుల హరివ్రాతమేసి
యశనిపాత సమానమగు ముష్టిఘాతిచే
పటువీరభటుల నుత్కటత బొడిచి
నఖములచేత ఘ్రాణముల కర్ణంబుల
నయనంబులను జీల్చి నతుఁ బలిమి

గీ॥ దంష్ట్రముల శత్రుకంఠముల్ దఁదికొరికి
నేలబడవైచి భీకరలీల పాద
ములను త్రొక్కియు గుండియల్ బొడిచి బొడిచి
వీరభటమాచరించె నావేళ కపులు. 2547

ఉ॥ ఈగతిబోరుచుండ దనుజేంద్రుబలంబులు మించి వానరో
ద్వేగ నివారణార్థమతి దుర్భర ఘోరశరాయుధంబు ల
ద్వేగముగాగ వానరుల తీవ్రతసేసిన వారిధాటికిన్
నాగగలేక రాముశరణంబునువేడిరి భీతచిత్తులై. 2548

-: రాముడు మూలబలంబును సంహరించుట :-

చ॥ తను శరణంబు వేడుచును దగ్గరజేరు వనాటసైన్యమున్
గని యభయంబుదెల్పి పృధుకార్ముకముంగొని నారిమ్రోయ ని
ష్వనమును జేయుచున్ గగనభాగగతుండగు భానుబోలి యా
దనుజబలంబు జొచ్చి పటుదారుణ బాణములేయజొచ్చెనన్. 2549

సీ॥ మందరాచలనిభ స్యందనవ్రాతంబు
రధికరధ్యములు సమరమున గూలె
పక్షయుక్తంబులౌ పర్వతంబుల బోలు
భద్రకరీంద్రముల్ భగ్నమయ్యె
మారుతజవతుల్య మహితాశ్వ దళములు
గ్రక్కునదెగియు సమరమున గూలె
కాలమేఘసమాన కఠినోరు కాయులు
వీరభటాళి రణ వీధిమడిసె

గీ॥ నెందుజూచిన దానవ నికరమపుడు
రామశరముక్త శితశర వ్రాతములను
దారితెన్నులుగానక ధరణి గూలె
రామువిభుడంత పంగరోద్దాము డగుచు. 2550

చ॥ అనిలుడు కాననాంతరము నందున గ్రక్కునజొచ్చి యేరికిం
గనబడరాక భూజతతి క్ష్మాతలి గూలగద్రోయురీతి వా
జనవిభు డాజి దానవులపై న్నమునంజొరనేగి యందు స్యం
దన గజవాజి సద్భట కదంబులం దునుమాడె నుద్ధతిన్. 2551

చ॥ ఇతలమందు రాఘవ కరవ్రవిముక్త శరాళిదాకి స్యం
దన గజవాజి సద్భటకదంబము గూలుటె కాని రాముడెం
దున గనరాక యుండె కదనోర్విని వేగయుతుండునౌట వే
దను గతుడై వెలుంగు పరతత్వము గాంచని యట్టి రీతిగన్. 2552

వ॥ ఇనకుంజుట్టుమ ముట్టియున్న దితిసంతానంబులంజూచి సం
జనితోద్రేకత వారిపై బనివడిన్ సమ్మోహనాస్త్రంబువై
చెమ దానం గనుపట్టిరాఘవుల రాశీభూతులై వేల పం
క్యను నారాక్షసవీరవర్యులకు సంగ్రామాంతరంబంద్ధవన్. 2553

శా॥ ఆ రూపంబుల జూచి యాతడె తురంగాదుల్ శతాంగంబులన్
వారించెన్ కరినంచయంబుల భటవ్రాతంబులంబోరిలో
ధీరత్వంబున గూల్చెనంచును మహోద్రేకత్వముం జూపుచున్
నారాముండని విభ్రమాత్ములయి తామన్యోన్యముం బోరగన్. 2554

క॥ తమలో తము బోరాడిరి
భ్రమగొని రాముండటంచు రణతలమందున్
నమితంబగు దనుజబలము
జమడిసె నమ్మోహనాఖ్య పృధుబాణమునన్. 2555

మ॥ దినమధ్యంబున తీవ్రభానుడు మహాదీప్తిన్ ప్రకాశించుచున్
ఘనతీక్ష్ణాంశుల పర్వజేయుకరణిన్ కాకుత్స్థవంశోద్భవుం
డనిమేషారులకుం గమంగొనగ శక్యంబైన గానట్టి రీ
తిని తీవ్రాస్త్రములేయజొచ్చె నతులోద్రేకంబు సంధించుచున్. 2556

సీ॥ ఈ గతి శరములనేయుచు రాముండు
విక్రమింపగ మహోద్వేగగతిని
నష్టంబుజేసె దినాష్ట భాగముపేళ
నూరును డెబ్బదియూరుకోట్ల
వణబదియొక లక్షబలములు చతురంగ
సహితంబుగా ధరాస్థలిని గూలె
గగనభాగంబున గనపడె ద్రుళ్ళిన
దనుజకళేబర తతులువాడ

గీ॥ రణతలంబంత హతచతురంగ బలము
వగుచు రుద్రుడు క్రీడించునట్టి రుద్ర
భూమి యననొప్పె దుర్వార భీమమగుచు
తనకెదురులేక విహరించె దాశరథియు. 2557

క॥ అనిమిష గరుధర్వాదుల
మునివరులున్ రామవిక్రమోజ్జ్వలరీతిన్
గని హర్షమొంది రత్తరి
వినుతించిరి రామవిభుని విక్రమపటిమన్. ౧

క॥ హను మజ్జాంబవదాదుల
నినతనయ విభీషణాదినీతి విదుల గ
న్గాని రాముడిట్లు బలికెను
వినుడు మదీయాస్త్రవృత్త విధము దెలిపెదన్. ౧౫

చ॥ అరయగ నేను శంకరుడు నద్భుతమై యలరారు నీ మహ
త్తరమగు నస్త్రమున్ నెరుగదక్షత గల్గిన వారమంచు మీ
రెరుగుడు మూడులోకముల నెవ్వడెరుంగడు శక్రదాది ది
గ్వరుల కసాధ్యమై బరగుగాదె జగత్త్రయమందు దల్పగన్. ౧౬

-: లంకలో రాక్షసస్త్రీల విలాపము :-

చ॥ రణతల భాగమందు చతురంగ బలంబులు భగ్నమైన లం
కను హతశేషులైన భటకాండము జొచ్చి యనేక రాక్షసుల్
సునిశిత రామబాణముల క్షోణిని గూలిరటంచు దెల్ప నం
జనిత విషాదచిత్తులయి సంతతులన్ పతులందలంచుచున్. ౧౯

క॥ దనుజాంగన లత్తరి సం
జనిత బాష్పపూర్ణలోచనంబుల పతులన్
తనయుల దలచుచు నీవిధి
ఘనశోకము మీరనేడ్వగా సాగిరాగన్. ౨౦

మ॥ జనవాథాత్మజుడున్ సుధీరుడు మహాస్త్రజ్ఞుండు పితాజ్ఞచే
వనభూమిం జరియింప శూర్పణఖ భూపాలాత్మజుంజేరి వా
నిని కామ్యేచ్ఛ వరింపగోరిన నతండెంతేని గోపించి ము
క్కును కర్ణంబులు గోసిపంపె నదియున్ ఘోరాకృతింబూనుచున్.

మ॥ అవమానంబు సహింపజాలకయ క్రోధాయత్తయై రామ భూ
ధవుపై యాఖరదూషణాదులను యుద్ధప్రక్రియంబంపగా
నవనీనాథుడు వారిగూల్చె నటుపై యారావణుండుద్ధతిన్
భువికన్యన్ గొనితెచ్చె రామవిభుతో పోరాడగా నీగతిన్. 2564

చ॥ మొదటను జూడ శూర్పణఖ మూలముగా విపరీతకష్టముల్
నొదవెను దానవాళికి వనూహ్యములయ్యెను గాదె యీ గతుల్
కదనతలంబునందు రఘుకాంతుని ధీకొనశక్తిలేక దు
ర్మదులగు రాక్షసావళి యమాలయ సీమను జేరిరెంతయున్. 2565

చ॥ దనుజవిభుండు ఘోరరణధారుణి దాశరథీశముక్త భీ
షణ శరపంక్తిదానటుల జావక సర్వనిశాటలోకమున్
రణమున జంపనేల నృపురాతికినై సమరంబునందు న
య్యనఘుని రాముతోడ నరియౌనొకొ యాతడు పోరువల్పగన్.

చ॥ మరియును దండకాగహన మార్గములందు విరాధుడొక్కటన్
ధరణిజ గొంచునేగ బలదర్పము జూపి వధించె రాఘవుం
డరయగ రావణుండు రఘునాథుడొనర్చిన పూర్వకృత్యముల్
దరమగు నొక్కొపీనికి యథార్థముగా రఘురాముదోరగన్. 2567

దండకావన జనస్థానవాసుల పేదు
    వాల్గువేలను దనుజ నాయకులను
ఖరదూషణ త్రిశిర వరుల సంగరభూమి
    తీవ్రశరాళి గడతేర్చుటయును
సురనాథసూను నిష్ఠుల శరంబునేసి
    రణభూమి గూలనేసిన విధంబు
దీర్ఘబాహుని బలాధిక్య కబంధుని
    ఘోరతరాసిని గూల్చుటయును

గీ. శరధి బంధించి లంకను జొరబడుటయు
శక్రజిత్తు కుంభకర్ణుడు జచ్చుటయును
రామువిక్రమమునకు తార్కాణమయ్యె
రామునితో బోరజెల్లునే రావణునకు. 2568

శా. దారన్ వీడియు ఋష్యమూకగిరిపై దైన్యంబునం గుందునా
నీరజోద్భవమిత్రసూనునకు నెంతే ధైర్యముం జెప్పి యా
వీరున్ వాలివధించి రాజ్యపదవిన్ విఖ్యాతమౌరీతిగా
స్ఫారోదారత నిల్పినట్టి రఘువంశాధ్యుండు సామాన్యుడే. 2569

చ. శరనిధి వాయుసూను డతిశక్తిని లంఘనజేసి జానకీ
తరుణిని గాంచి వాలగతదారుణవహ్ని దహించి లంక వా
నరవిభుజేరనేగియు వనాటబలంబుల తోడవచ్చె నీ
కరణి దలంపలేడొ దశకంఠుడు కామవిమోహితాత్ముడై. 2570

చ. హితమొనరింప బూనియు ననేకవిధంబుల నావిభీషణుం
డతుల సభాంతరంబున మహాత్ముడు రామునితోడ వైర మా
యితమగు హాని గూర్చునని యాడినమాటలు రావణుండు స
న్మతి వినివన్ స్మశానగతి మారదు లంక దలంపనీగతిన్. 2571

సీ. ఘనకాయుడగు కుంభకర్ణుండు నతికాయు
మేఘనాద ప్రహస్త మేటి బలులు
కుంభ నికుంభ రక్షోవీరులు నకంప
నుండు దేవాంతకు డుగ్రబలులు
మత్త యుద్ధోన్మత్త మకరాక్ష ధూమ్రాక్ష
త్రిశిర నరాంతకాధిక్యబలులు
రణభూమి గూలి రుద్రగంబుగా బోరియు
వీరిదుర్జయమున భూరికష్ట

గీ॥ కాలములు నిట్టులొందవె నిష్కారణముగ
దనుజవిభు కామితార్థమై దనుజలోక
మెల్ల నాశంబునొందె నింకేది గతియొ
తెలియజాలము లంకలో దిక్కులేక. 2572

ఉ॥ తనయులు భర్తలున్ హితులు తమ్ములు నన్నలుబాంధవాశ్రితుల్
రణహతులైరి స్యందన తురంగ గజాదిక సైన్యసంపదల్
వినిహతమయ్యె గాదె రఘువీర కరప్రవిముక్తబాణ సం
జనిత మహాగ్నికీలలను సర్వవినాశనమయ్యె జూడగన్. 2573

ఉ॥ దనుజాంతంబును జేయ నీధరను మర్త్యత్వంబు గైకొన్న యా
వనజాక్షుడొ పద్మసంభవుడొ గీర్వాణాధినాథుండొ యా
ధనదుండో త్రిపురాంతకుండొ వరుణాధ్యక్షుండొ కాలుండొ యీ
తని యాటోపము జూడ తక్కొరుడు దైత్యాంతంబు చేజాలునే. 2574

ఉ॥ తలపన్ దానవలోక మీగతిని యుద్ధంబందునన్ రామభూ
తిలక ప్రోజ్వల బాణసంతతుల సందేహంబు లేకుండ భూ
స్థలిలో నైక్యముబొందె దానవకులాంతంబయ్యె దిక్కేది యెం
దులకుం బోదము ముప్పువచ్చె దశకంఠోద్యోగ మూలంబునన్.2575

ఉ॥ వనజభవప్రసాదమున వచ్చిన భూరిబలంబుచేత నీ
దనుజవిభుండు మత్తిలి యధర్మరతుండయి యిట్టి దుష్కృతుల్
పనిగొనిచేయ సాగెను నృపాలునిచే మృతినొందు దప్పకన్
రణమునకేగువేళల గనంబడె నెన్నియొ దుర్నిమిత్తముల్. 2576

ఉ॥ మును తపమాచరించి వరముంగొనె నాపరమేష్టిచేత నా
యనిమిషదానవాళి నిహంబులచే మృతిలేనిరీతి దా
మనమున విస్మరించె బలమత్తత వానరమానవాదులన్
మనుజవిభుండు రావణుని మర్దనజేసి వధించుదప్పకన్. 2577

-: రావణుడు తన పరాక్రమము దెలుపుట :-

క॥ ఆ యార్త నాదముల దై
తేయప్రభుఁడు విని యా ప్రళయ తీవ్రంబగుటన్
జేయునది లేక ముఖమున
నాయతగతి చిన్నఁదగుచు నత్తఱిఁబలికెన్. 2582

చ॥ అనలకణంబులంత నయనంబులరాలగ భూరిఘోర ద
ర్శనములు గాగ నాస్యములు వస్ఫుటమౌ రదన స్వనంబులన్
ఘనతరలీల బర్వ లయకాలపు ముద్భవ వహ్ని రీతి వా
దనుజవిభుండు రాక్షసకదంబము జూచి వచించె నీగతిన్. 2583

గీ॥ బలపతులు దలపడలో విరూపాక్ష ముఖో
దర మహాపార్శ్వులును బిల్వ దరలుచుండ
కదనతలమున నేఁడు విక్రమము మెరయ
సంచరించెదు శత్రు సంక్షయము గాగ. 2584

చ॥ అని పలుకంగ వారలు రణార్థము రావణుశాసనంబు దె
ల్పిన విధి ధాయుధంబులను వేగమ దాల్చియు వచ్చి కైకసీ
తనయుని ముంగలన్ నిలువ దద్దయువారల గాంచి వక్రె సం
జనిత మహోగ్రదాహుఁడయి సంగరమందు జయాభిలాషుడై. 2585

చ॥ సురపతి దంతిహస్త సమశోభిత సత్కర చాపముక్త వి
స్ఫురిత లయాగ్నికీలలను బోలెడు భూరిశరంబులేసి యా
నంవత సూనులన్ రణమునందున ద్రుంచి కృతాంతు మందిరాం
తరమును జేరఁ బంపెదను దవ్వఁగ గాంచెదు నేఁడు జూడుడీ. 2586

చ॥ మరియును కుంభకర్ణు డసమాన బలుండగు నింద్రజిత్తు ధీ
వరులు నికుంభకుంభులును ఖాసిరి వారి రణంబు దీర్పగా
శరములనేసి యా యినజు సైన్యము సర్వము రూపుమాపెదన్
నెరపెదు విక్రమక్రమము నేఁడు మదీయ రణంబు దీర్పగన్. 2587

చ॥ ధరణిని వాతవంబు వివిధంబగు దిక్కుల సాగరంబులన్
గురుతరమచ్ఛరంబు లధికోన్నతి మేఘములట్లు గప్పి నం
గరతలమందు సూర్యకర కాంతులు గన్పడకుండజేతు మే
దురగతి సంగరక్రియకు దూరుడగానని మీరెరుంగుడీ. 2588

మ॥ వరగన్ మేఘుడు ఘోరతంగిని శిలావర్షంబు సాగించి యీ
ధరపై పర్వతతిన్ వినాశనము బొందంజేయు మాడ్కిన్ ధరా
వరుసైన్యంబులపైని శాతశరసంపాతంబు గావించి నే
హరియింతున్ హరిసంచయంబులను బాహాదర్పమేపారగన్. 2589

చ॥ అనిలసమాన వేగమున స్యందన మా గిరిమందరంబు రీ
తిని కెలరేగ చాపశరధిన్ శవమైన శరోర్మికాళివే
వనచరసేవయన్ భువిని వారకముంచెదు శీఘ్రగామినై
ఘనవిజయంబు గాంచెదను గాంచుడు మద్భుజవిక్రమంబులన్.

చ॥ అరయగ పద్మకేసర సమంచితవర్ణ కపీశసైన్యమున్
వరజలజాకరంబునను భద్రకరింద్రము జొచ్చి దాని ని
ష్ఠురగతి నొంచురీతి వతిసూదనము న్నొనరించి రాత్రిసం
చరులకు గూర్తుమోదమును సర్వవిధంబుల నేడు నమ్ముడీ. 2591

చ॥ రణమున గూలినట్టి పతులన్ సుతులన్ నిజజన్ములన్ మనం
బున దలపోసి దుఃఖమయ పూరితులై బహుళాశ్రు బిందువుల్
కనులనురాల్పు నీదనుజకాంతలకున్ ముఖమార్జనంబు నే
నొనరుచువాడ నేడు కదనోర్విని జూడుడు మత్ప్రభావమున్. 2592

క॥ ఘోర విషసర్పసమములు
దారుణ శరములను బరపి దగ్ధమొనర్తున్
భూరమణుని సైన్యంబును
మీరి గృధ్రజంబుకాళి మేసెడురీతిన్. 2593

రథమున్ సిద్ధముజేయుడింక సమరప్రాముఖ్యచాపంబు దు
ర్మద శత్రుప్రవిదారణాస్త్రములు దుర్వారోగ్రనానావిధ
ప్రధనోద్యోగ సమస్తశస్త్రముల దేవంబంపు డీ పట్టునన్
కదనోర్విం దరియంగ నావెనుక వేగన్ రండు సైన్యావళుల్. 1594

ఉ॥ అని శాసింపగ నవ్రిమత్తుతను దైత్యాధీశమిత్రుండు చెం
తను వాసించు బలాధినాధులకు యుద్ధారంబు లంకాపురిన్
జని గేహంబులనున్న వీరవర సంతానంబులన్ దేవగా
వనిచెన్ వారలు వేగి తెచ్చిరసుర శ్రాతంబులం జెచ్చెరన్. 1595

॥ కాలఘనాఘనంబులన గర్జిలిచున్ వతిఘోర రూపులై
శూలగదా కృపాణ వరతుప్రముఖోజ్వల భూరిశస్త్రముల్
దాలిచి దానవాధిపుని దగ్గరజేరిరి సూతుడత్తరిన్
మేలగు కాంచనప్రభల మీరు రథంబునుదెచ్చె చెచ్చెరన్. 2 96

॥ దనుజవిభుండు సాహసము ధైర్యముజూపుచు తేజమొప్ప స్యం
దనమునునెక్కి భూరిబలదర్పులు రాక్షససేన వెంట రా
జనియె రణావనిందరియ సత్వరతన్ శరచాపయుక్తుడై
ఘనమగు సింహనాదము లఖండగతి న్వొనరించి యంతటన్.2597

-: రావణుడు యుద్ధమునకు వెడలుట :-

॥ కమలాప్తుడత్తరి కాంతిహీనుండయ్యె
చీకటుల్ దిశలందు జిమ్మసాగె
తలలెత్తి మృగజాతి తల్లడిల్లుచునేడ్చె
క్ష్మాతలంబంత సంచలనమొందె
సశనిపాత సమానమగుచు నుల్కలురాలె
రక్తమయంబు వర్షములు గురిసె
గృధ్రజంబుక కాక ఘూకరవంబులు
వ్యసనంబుగా గూసె దిశలపర్వ

గీ॥ తురగముల తలలు ద్రెగ్గి సత్వరత వీడి
స్యందనము నందు గర్దనంచరము జేసి
వానులోన చనమదరె రావణున కపుడు
మేనుకంపించె వదనంబు దీనమయ్యె. 258

చ॥ మరియును మార్గమధ్యమున మృత్యుకరంబగు దుర్నిమిత్త గో
చరుడయి రావణుండు మదిశంకవహింపక దుర్నివారుడై
యరిగె రణస్థలంబునకు నాతని రాకనుగాంచి వానరుల్
కరమును హర్షమొందె రఘుకాంతుభుజా పరిపాలవంబువన్. 259

చ॥ అరయ మహాద్భవద్విత యమట్లు వనాట నిశాటసేన ల
త్తరి పటుఘోష యుక్తముగ దాకిరి యొండొరు లాహవంబు న
క్కరము వరస్పరంబు జయకాంక్షులునై పరిపోరజొచ్చి నా
ధరణిరజంబు నల్దిశల దద్దయునిండుచు నింగిదాకగన్. 260

చ॥ తరుచర సేవలంత బలదర్పిత విక్రములౌచు భూరి భూ
ధరశిఖరంబులన్ సముదదంతిసమాన శిలామహీజముల్
బరపి నఖంబులన్ వదకరంబుల దంత ముఖంబులన్ మహా
గురుతర ముష్టిఘాతముల గూలగజేసిరి రాక్షసావలిన్. 261

క॥ దానింగని రావణు డా
దానవసైన్యంబు జూచి తదయకమీరల్
వానరసైన్యంబులపై
నానాయుధవితతి బొదువ నరుగుండగ యెన్.

ఉ॥ రావణుడన్ భయానలము రాజి మహానిల యుక్తమౌచు వి
ద్రావితరీతి వానరకదంబక శుష్కిత భూరదాపమున్
జేపదహించె రావణుని జేరగ శక్యులులేక వానరుల్
బోవగ జొచ్చె వంగరపు భూమిని వీడుచు బెక్కు భంగులన్.

శరజాల ఖండితాంగులు
విరహిత శక్తులును కదనవీధిని రక్త
స్ఫురితాంగులు గతజీవులు
తరుచరవర్గంబు గూలె దశకంఠునిచే. 260

సీ॥ బలుగంధమాదను పదునెన్మిదిట నేసి
నలుని దశవిశిఖముల జ్వలత నేసి
మైందుని సప్తసాయకముల నొప్పించి
విముఖునిసైదు బాణముల గొట్టి
వాయునందనుని ముప్పది తూపులను నొంచి
నీలు దశశరముల గూలనేసి
మఱియు గవాక్షుని నిరువదియైదున
పనసునిపై పది కోలతులను

గీ॥ ద్వివిదుని నారుశరముల వీకనేసి
జాంబవంతుని సాయక సప్తమునను
వాలిసుతు బదియురెండు తీవ్రశుగముల
వినతు నెన్మిది మార్గణ వితతినేసి 2605

చ॥ శరచయ మగ్ని కీలలకు సైపగలేని విధంబునన్ మహో
జ్జ్వలతఁ దగు దైత్యనాథు శరజాలములన్ సహియింపలేక వి
హ్వలులయి పారి రంతట వనాటబలంబులు వార్ధిజేరగా
బలయుతు లయ్యు నక్కడన భగ్నము వీడుచు ప్రాణభీతులై. 2606

చ॥ రవికిరణాళిచేత తిమిరంబులు వీడిన భంగి క్రూర దా
నవవిభు తీవ్రబాణముల నత్తరి నిల్వగలేక వారలా
హవభువి వీడి పారిరి మహాబలు డుగ్రత మేఘమండలిన్
దవులుచు దోలునట్లి విధి దానవశత్రు రజేరె వారలన్. 2607

మ॥ అలఘుప్రక్రియ భూరివంగర కళావ్యాపారపారీణుడై
బలవంతుండగు రావణుండు కపులన్ బాధించియున్ జంపియుం
దలచెన్ రామనరేంద్రు జేరగ రణస్థానంబునం బోరగా
దెలిపెన్ సూతునితో రథంబుజన వృధ్వీనాథునిం జేరగన్. 2808

మ॥ అనివార్యుండయి వచ్చు రావణుని ధైర్యాటోప [illegible]ంజూచి యా
పవజాతా ప్రసుతుండు భూరితరుషత్కాంచి యంసస్థలిన్
బనిగా దాల్చి మదేభమట్టులను కుంభల్లీల భూమీతలం
బును కంపింపగజేయుచు న్నిటునటున్ బొల్పార వర్తించుచున్.

చ॥ తనకెదురొచు వచ్చు రణదర్పు దశాననుజూచి వానికిం
బనియెను నూటిగా తనువనాట బలంబుల యూధపాధిపుల్
వెనుకనిరాగ హస్తముల భీకరగండ శిలామహీజముల్
గొనుచును సింహనాదము లకుంఠితరీతిని పర్వజేయుచున్. 2810

మ॥ తనకున్న గ్రజుడైన వాలిగతి విస్తారోగ్రఘోరాకృతిన్
తనువిభ్రాజితుడై దిగంతముల నిండన్ భూరినాదంబులన్
ఘనగర్జాగతి జేయుచున్ పదతలాఘాతంబులన్ భూమి కం
పనముం బొందగనేగె రావణుపయిన్ ప్రత్యర్థిగా బోరగన్. 2811

చ॥ విలయ మహాబలుండు వటువృక్షములన్ పెనగూల్చుభంగి నా
యలఘుడు మార్గమధ్యమున నడ్డమువచ్చు సురారి పంక్తులన్
బలయుతుడొచు హస్తగతవృక్షముచేత వధించుచున్ మహో
జ్జ్వలగతినేగె వేగమ దశాస్యునితో రణమాచరింపగన్. 2812

మ॥ వనభాగంబున భూరిమేఘము శిలావర్షంబుచే వక్షులన్
దునుమంజేసిన భంగి దారుణ శిలోద్యోగంబుచే మీరుచున్
దనుజానీకము గూల్చె వానతుల మున్ధారాధరేంద్రంబు లా
యనిమేషాధిపు వజ్రహతి బడునట్లా యుద్ధరంగంబునన్. 2813

క. ఆ విధిని విక్రమించుచు
రావణు గతియుంగ వనచరాధిపుడేగన్
త్రోవకు వర్ధంబగుచును
చేవ విరూపాక్షుడంత జేరగవచ్చెన్. 2814

—: సుగ్రీవుడు విరూపాక్షుని వధించుట :—

మ. వనపంచాచ్ఛ కులాధిపుంగవుని విరూపాక్షుండు కామోగ్రుడై
యనియెన్ వానరనాథ నీకు జవసత్వాధిక్యముల్ గల్గినన్
రణము జేయగ రమ్మటంచు బలునారాచంబు లారూఢిమై
దిననాథాత్మజుపైని నేయదొడగెన్ తీవ్రప్రతాపంబునన్. 2815

మ. దనుజుండేయు శరాళికిం దొలగకన్ దర్పంబు పాటించి గ
ర్జనలంజేయుచు తచ్ఛరాళిముఖుడై పర్వతశ్రీ ధరస్థితిన్
జనియెన్ వానిరథంబుపై చటులదోస్సార క్రియన్ వాజులన్
దునిమెన్ రక్తముగ్రక్కుచున్ కదనమందుంగూలె నావాజులున్.

మ. దనుజు రథాశ్వముల్ దునిమి తక్షణమందున సూతుజంపె వెం
టనె దనుజుండు స్యందనము నందున నుండక భూమిపైకి లం
ఘనమొనరించె తోడన వనాటబలంబులు వారథంబు దు
త్తునియలుగాగ జేసె పటు దోర్బలశక్తి సురల్ నుతింపగన్. 2817

చ. ధరణికిదిగ్గి కార్ముకము ధారణజేసి సితాంబకంబులన్
తరుచరవాహుపై బరపె దానినిగాంచి సురారి రావణుం
డురు శరరాజివేసి దహనుండు వనంబును గాల్చురీతి నం
గరమును వీడుచున్ బరవగా దొడగెం గపిసేనలత్తరిన్. 2818

క. సురలు భయమంది వాడీ
ధరు శరణము వేడు భంగి తరుచరసేనల్
పురుషశ్రేష్ఠుని రాముని
శరణంబును జొచ్చె నా దశాననుభీతిన్. 2819

ఉ॥ ఆ దశకంఠుచేత సమయానుగతంబుగఁ బ్రేరితుండునై
యాదరిమన్న మత్తగజ మంధధిరోహణఁజేసి యస్త్రశ
స్త్రాదులఁదాల్చి సంగరవిశారదుఁడైన విరూపలోచనో
న్మాదుడు బాణసంగతి వనాటబలంబుల నుగ్గుజేయగన్. 262(

చ॥ వనచరనాథుపైఁ గనలి భవ్యభుజంగ సమానబాణమే
సిన నది తాకి వాని తనుసీమను కాడిన విద్ధగాత్రుఁడై
కినిసి విశాలసాలమును కేలను బూనియు యా విరూప నే
త్రుని వధియింపనెంచి పటుదోర్బల శక్తినివైవనెంచినన్. 262[illegible]

కం॥ దానింగని భీతిలి యా
దానవు డాగజము వీడి ధరలంఘించెన్
వానరపతి గజము శిర
స్థానంబున నేయ నదియు చయ్యన మడిసెన్. 262[illegible]

కం॥ తనకరి గూలుట గని యా
దనుజుడు కనలుచును ఖడ్గధారుండగుచున్
వనచరవిభునిం జెనకగ
జనుదెంచెను దోర్బలైక సారుండగుచున్. 262[illegible]

కం॥ దనుజుడు వచ్చుట గని యా
వనచరవల్లభుడు తాను వాలంబున భూ
రి నగ శిఖరమును సేసిన
ఘనవారాచమున దాని ఖండనజేసెన్. 262[illegible]

కం॥ చలియింత నినజు ఖడ్గం
బున నేయగ దెల్విదప్పి ముమ్మపటిష్టప్రహ వెం
టనె గాంచి దనుజు ఢీకొన
జనియెను కపిలోకవరుడు చంచద్ధృతియై. 26[illegible]

ఉ॥ ఒండొరులిట్లు దాకి తెగుచున్న తిఱిందిచి జయాభిలాషులై
దండిగ నెత్తికొంచు బలదర్పము మీర భయంకరాకృతిన్
భండన భూమిపై చుదుము ప్రాణభయం బొక యింతలేక మ
ద్దండత ముష్టిఘాతముల దారుణరీతి రణంబుజేయగన్. 2626

మ॥ ఆ రీతిన్ భయదాత్మకంబగు రణవ్యాపారులై పోర దు
ర్వారంబైన మహాశనిప్రభ సముగ్రంబైన ముష్టిన్ మహా
వీరుండైన దివాకరాత్మజుడు స్తంభీభూత వీర్యుండునై
ఘోరవ్రిక్రియ వానిమూర్ధమును పంక్షోభంబుగా మోదినన్. 2627

చ॥ శిరము విభిన్నమై రుధిరసిక్త శరీరుడునౌచు రక్తమున్
పరువడి గ్రక్కుచున్ ధరణి భాగమునందున గూల ప్రాణముల్
హరణములయ్యె వాతని యూర్ధము బొందిరి సూర్యసూను సు
స్థిరతర విక్రమంబును నుతించుచు పోరొనరించు నత్తరిన్. 2628

చ॥ తరుచరసేనలంత బలదర్పితులౌచు నిశాటసేనపై
తరుశిలసంచయంబులను ధారుణభంగిని నేయ జొచ్చినన్
సరసిజసత్రిన స్థితిని చంచలితాంబు కణంబులట్లు న
స్థిరత చలించుచున్ దనుజసేనలు పారదొడంగిరత్తరిన్. 2629

మ॥ బలముల్ భగ్నములైన రీతిని విరూపాక్షుండునుం గూలుటన్
బలవంతుండగు దానవుండుగని క్రుంక్రోధప్రచేతస్కుడై
పిలిచెన్ జెంతకు నాయ మహోదరుని దాపీక్షించి తత్కాలమం
దలఘుప్రక్రియ వానితోడ పలికెన్ వత్సాంతగంభీరుడై. 630

చ॥ దనుజవరా రణస్థలిని దాకి జయింపగనౌర్వ నీక చె
ల్లును కద యమ్మహాబలి తెలుగావలె తవారపేత గా
షవ సత్తువున్న నీబలము నోర్వక వేడు రణంబునందు సం
జనిత పరాక్రమంబునను సంపుము తర్వత నాటపేరులన్. 2631

చ॥ అన విని భూరివిక్రము మహాంబుధి లోపలజొచ్చునట్టి కి
తిని కపిసేనయందు పటుదీప్తితతాంగము దోలజేసి రా
వణునకు బ్రీతిబుట్ట కపివర్గము పాదములన్ కరంబులన్
ఘనవిశిఖప్రపంచమున ఖండనజేసె మహాద్భుతంబుగన్. 28

-: సుగ్రీవుడు మహోదరుని వధించుట :-

క॥ వనచరసేనల గొదువుచు
జను దమజుని గాంచి పంకజాప్తసూను డా
తనిపై గిరి శిఖరంబును
గొనివైచెను దానిగాంచి క్రూరదనుజుడున్. 28

క॥ శరమేసియు ఖండించిన
హరివిభుడౌత భూరిసాల మత్తరిగొని దా
గురిగొని రాక్షసునేసిన
పతియలుగా జేసె దనుజవరుడు శరమువన్. 28

శా॥ సాలంబట్టిన వ్రయ్యలైన తరుసంతారాధినాథుండు నా
వేళన్ వానిరథంబుపై దుటికి యాభీలాకృతిం జాపమున్
లీలన్ ఖండనజేసి వాజులను దోర్వీర్యంబునం జంపియుం
గూలంజేసెను సారథిన్ పటురణక్షోణీస్థలింజావగన్. 28

చ॥ కని రథమందుమన్న పరిఘంగొని వానరవల్లభుండు వా
దనుజుని జంపబోయిన నతండు పెవంథరదిగ్గి పెన్గదం
గొనుచును కీశనాథు నధికోన్నతి దాకియు ద్వంద్వయుద్ధమున్
బనిగొని చేయగాదొడగె భవ్యపరాక్రమముల్ ఘటించుచున్. 28

మ॥ ఘనసౌదామిని యుక్తమేఘములనంగా భూరిగంభీర ని
స్వనసంయుక్త త్వషద్వయుంబున ఘనధ్వానంబులం జేయుచుం
రణముంజేయగ సాగె నత్తరిని దుర్వారోద్ధతిన్ పెన్గదన్
గొనసాగించుచు దానవుండు విసరెన్-క్రోధాత్ముడై సూర్యజున్ 28

క॥ దానిగని సూర్యతనయుడు
బూనిక నిజహస్త కలిత భూరిపరిఘమున్
దానవుపై విసరిన రెం
డానతమందునను దాకి డస్సెవర్వియ్యలై. 2638

క॥ ఇరువురును నిరాయుధులై
సరిబోరగ జొచ్చె ముష్టిసంగతి నటులన్
వరవ్వరము ప్రహరించుచు
హరివరుడు మహోదరుండు నద్భుతభంగిన్. 2639

చ॥ పరిసరమందునంగల కృపాణము బట్టి మహోదరుండు స
త్వరగతి సూర్యసూనువయిపై చిన నెర్పున దాని బాలకిన్
గురి గొవకుండ దవ్వుకొని ఘోరకృపాణము గొంచు నమ్మహో
దరుని శిరంబునేయ నదిధారుణి గూలెను ఖండితంబునై. 26.0

చ॥ నళినదళస్థ నీరము లనంగను చంచలితాత్ములౌచు నా
కులగతి పారజొచ్చె పటుఘోషమొనర్చుచు రాక్షసావళుల్
జెలగెను వానరాధిపు డశేషజయప్రిత వాతిరేఖుడై
మెలగెను రాముడత్తరి నమేయ జయోద్భవమోదితాత్ముడై. 2641

చ॥ మరియును రావణుండు నసమాన బలాఢ్యుడునైన నమ్మహో
దరుడు రణంబునందు బలదర్పమువీతియు సూర్యసూనుచే
మరణము బొందుటం గని ప్రమాదకరంబని దుఃఖమంది యం
తరమున రోషఘూర్ణిత విధానుడునై పరితప్తదేహుడై. 2642

చ॥ హరివరుడామహోదరుని యంతముజేసి జయాన్వితుండునై
పరివృతుడై యనేకకపివర్గముచే రఘురాముజేరగా
నరిగెను నామహోదరుడు నంతమునొందుట జూచి మత్తుడన్
గురుబలశాలి దానవుడు క్రోధమయాత్ముడు నౌచు నత్తరిన్. 2643

-: అంగదుడు మత్తుని వధించుట :-

చ॥ తన రథమంత నాయినజు దగ్గరకున్ బరపంగ నాజ్ఞచే
సిన రథచోదకుండటులఁజేయగ నాతఁడు గానఁగామి వా
యునిమిషశాత్రవ పౌత్రుఁడగు నంగదు నాతని సైన్యవర్గముల్
జనకగ నొచ్చె దానవవిశేషుడు మత్తుడు మత్తచిత్తుడై.

చ॥ తరచయిమీరి గాలి యుగళ తాళఫలంబులఁ దెళ్ళఁజేయు నా
పరఁదని భూరికార్ముకము సంఘటితంబును జేసి వృక్షసం
చర నికరాళి కంఠములఁ సారశరంబులఁ ఖండనక్రియా
పరుఁడయి యేయసాగె నతి వాసవపౌత్రుఁడు గాంచి యు

క॥ పరిఘంగై కొని మత్తుని
నురఃస్థలమునందు వేయ నురుగతి దగిలెన్
ధరఁబడియె నోటనెత్తురు
పరువడి గ్రక్కుచును మూర్ఛవశుడై యంతన్.

ఉ॥ ఆ తరి జాంబవంతుడు మహాగిరి శృంగముఁదెచ్చి వేగ సం
పాతముఁజేసె తదీయ రథముపై తురగంబులు సూతుఁడీల్గె త
ద్ఘాతమునన్ వనాటక కదంబము లత్తరి సింహనాదముల్
ప్రీతినిజేసె నంత తెలివింగని మత్తుడు క్రోధమూనుచున్.

సీ॥ దశవిశిఖముల నుద్ధతి నంగదునినేసి
జాంబవంతుని పదిసాయకముల
నీలుని పదమూడు నిశితబాణంబుల
గవయుని పంచాంబకముల గొట్టి
రణముసాగింప పరాక్రమ శీలుండు
వాసవపౌత్రుండు పటుతరముగ
పరిఘంబుగొని దనుజుపై వేయ నదితాకి
వాని చాపమ్ము శిరస్త్రాణములను

గీ॥ భగ్నమొనరించె వానర ప్రభుఁ దంత
మకరకుండల విభ్రాజమయిన వాని
కర్ణమూలంబులను కరాఘాతమునను
గొట్టి యాతండు క్రోధంబుగొనుచు కనలి. 28

క॥ దనుజుండు శరశ్వధమును
పనివడిగొని దేవరాజ ప్రభుఁగని వేయన్
ఘనమగు నేర్పున దానికి
తనువును దప్పించికొని కృతాంతుని భంగిన్. 2864

మ॥ జవసత్వంబుల బెంచి యాదముఁ వక్షంబందు ఘోరాకృతిన్
పవిసంకాశపటిష్టముష్టిగొని ధుర్యాత్మ క్రియున్మె సినను
వివశుండై రుధిరంబుఁ గక్కుచును పృథ్వింగూలె నారీతి మృ
త్యువు బొందెన్ రణభూమి దానవులు వత్యుగ్రంబుగా బారగన్.

క॥ వనచరులు సంతసిల్లెను
దనుజవిభుడు శోకమొందె దగననిమిషులున్
ఘనహర్షనాదముల రా
ముని జయమును సన్నుతించె మోదమెలర్పన్. 2865

మ॥ పరిశీలించుచు భూరివీరుల విరూపాక్షున్ సుధీరున్ మహో
దరునిం దక్కిన దానవాధిక్షుల ఛిన్నత్వంజేసి దుఃఖించుచున్
సురవైరి ప్రభుఁడంత మానసగత క్షోభంబు బోవీడి సం
గరముం జేయుగ నిశ్చయించె జయకాంక్షాచిత్తుడై రాముతో. 2866

క॥ రణమును వలువగ స్యందన
మును దోలగ ఘాతుఁడెల్ప కుండలగలయా
దనుజులతో నిల్లనియెను
తన సంకల్పంబు వారు దద్దయు వినగన్. 2867

సీ॥ రాజవందమల నేరణముల దుఃఖించెదు
హతులైన వారిరుణంబు దీర్తు
వానరావళిచేత బాటిల్లు కష్టముల్
హరియింతునేడు సంగరమునందు
రాముడన్ వృక్షంబు భామిని యా సీత
ఫలమును కపిలోకవర్యులైన
దినకరాత్మజ వనప హనుమదంగద జాంబ
వంతులు మొదలగువారు దీర్ఘ

గీ॥ శాఖలగు, మూలము నశింప సర్వమైన
వృక్షసంపద నశియించు భంగిగాగ
రాముడు నశింప శత్రుహరంబునగును
నాతడొక్కడె బహు విక్రమాధికుండు. 2654

క॥ అని పలుకుచు స్యందనమును
దనుజవిభుడు దోలబనిచె దశరథసుతుఁ డుం
డిన రణభూమికి దిశల
జ్జను బీటలువార క్ష్మాతలంబు జలింపన్. 2655

చ॥ వినుతగతిం ద్రివిక్రముడు విక్రమముం బ్రకటించువేళ నా
దనుజులు వానిగాంచి భయదాకృతికిన్ బరువెట్టురీతి వా
వనచరవర్గముల్ దనుజభర్తరణంబును జేయవచ్చుటన్
గని యటు పారఁజొచ్చి రఘుకాంతుని పే శరణంబు వేడినన్. 2656

## —: రామ రావణ యుద్ధము :—

చ॥ శరణము వేడ వచ్చు కపిసంతతికిచ్చి భయంబు బల్కి భూ
వరుడు నిశాంతవేగముల బాణశరాసనధారియౌచు చా
తురిని వినీలమేఘగతిదోల రథంబునవచ్చు వాని సం
గరముఖుగాంచి పల్కె దశకంఠ సహోదరు జూచి యుత్తరిన్. 2657

చ॥ అరయగ నీలశైలము సమాకృతి దాల్చి శరాసనంబు బం
ధుర కవచంబుగల్గియు రథుండయి సేనల ద్రొక్కిగొట్టుచున్
పరువడి వచ్చుచున్న బలశాలి యితండెవడౌను దెల్పుమా
దురమున జేయవెంచితిని దోర్బలదార్ఢ్యము జూపి యెంతయున్. 2658

చ॥ అనిన విభీషణుండు మనుజాధిప యాతడు జూడ ధాతకున్
మనుమడు విశ్రవాత్మజుడు మాన్యుడు రాక్షసలోకమందు రా
వణుడు తుదేయసోదరుడు శస్త్రబలాంధు జగత్త్రయంబులన్
వనజభవప్రసాదమున వశ్యముగా నొనరించె గ్రూరుడై. 2659

ఉ॥ పాపుడు క్రూరచిత్తుడును బండితుడున్ ధీరుండు విక్రమా
టోపుడు దారుణాస్త్రవిదుడున్ శమరాదుల గెల్చి కూరినం
తాపముగల్గజేసె జగదాళికి వీనిని జంప శౌర్యమున్
జూపుము లోకకంటకుడు సుమ్ము వజయ్యుడు సంగరంబునన్.

ఉ॥ నా విని రామభూమిపతి దానినిమిత్తము తల్కనంత నో
ధీవర చూడు రాక్షసవధంబును దప్పక సంగరోర్విలో
దైవికపద్ధతి న్నిలుపు శారసమర్థ్యము వీనిజంపి యీ
భూవలయంబు నిత్యసుఖము బొందగజేసెద విక్రమించుచున్. 2661

క॥ అని ధనువున బాణంబును
ననుసంధానంబుజేసి యాదశకంఠున్
జెనకగ నేసిన బాణిని
గని భగ్నముజేసె మూడు కాండంబులతోన్. 2662

ఉ॥ రాముని బాణమా దనుజరాజశరప్రతతి భగ్నమైన కెం
కాంతులంత నయనంబుల దోపగ అక్షణంబందు ము
రన్ గుణారవము ధారుణి కంపముజెందగజేసి తే
జడౌచు పొక్క దనుజుల్ మదియుంగ శరంబులేయుచున్.

క॥ రణభూమి సంచలింపగ
గని రావణుడలిగి దీర్ఘ కరవాలంబున్
గొని లక్ష్మణుతో నిల్లనె
యనుపమ దుర్వార కోపితాత్ముం డగుచున్. 2664

మ॥ నరవాధాత్మజ మచ్ఛరంబున సువర్ణానేక రత్నాంచిత
స్ఫురితంబై తపనీయ పుంఖయుతమై క్రోధాకరంబై రణాం
తర శత్రుంజయ దక్షతంగలిగి క్రోధాభీల సర్పాకృతిన్
గరముంగ్రాలుచు నున్న రీతిగనమా కాలాంతకస్ఫూర్తిమై. 2665

శా॥ నారూపంబునుగాంచి భీతిగనకన్ సంగ్రామ రంగంబునన్
నారూఢస్థితి నిల్వుమింకను మదీయంబైన నారాచముల్
నీరక్తంబును ద్రావనెంచెడిని గంటిన్నిన్ను నేడా యమ
ద్వారంబున్ గనబంపెదన్ పృధుబలోత్సాహంబు దీపింపగన్. 2666

ఉ॥ నావిని లక్ష్మణుండు నరుణాయత లోచనుడౌచు పల్కె నో
రావణ కార్ముకంబును శరావళి శస్త్రములంధరించి సం
భావితరీతి నీవు రథభాగగతుండవు గాన సంగరం
బీవు ఘటింపుమింక తడవేలను జేసెదు తష్కవాక్తతిన్. 2667

ఉ॥ వాదముజేసినన్ జయము వచ్చునె విక్రమమింక జూపు దై
త్యాధమ పక్వమయ్యెడి ఫలాదుల ఘోరసమీరణంబు సం
పాదితశక్తి గూల్పగతి దివ్యశరావళిచేత నీతలల్
మేదిని గూలజేసెదను మేదుర సంగరమందు పోరుచున్. 2668

క॥ సుర అమృతంబును ద్రావెడి
కరణిని మత్కరవిముక్త కాంచనశరముల్
దురమున నీతనువందున
జొరబడి రక్తంబు ద్రావుజమ్ము నిజముగన్. 2669

క॥ దనుజవిభు డలిగి యంతట
ఘననారాచంబు తీక్ష్ణగతి లక్ష్మణుపై
పనివడి నేసిన దానిని
గని ఖండనజేసె నొక్క ఘనబాణమునన్. 2670

ఉ॥ కనలుచు రావణుండు సితకాండముల న్నిగిడించి లక్ష్మణున్
వినతనయున్ విభీషణు మహేంద్రుని పౌత్రుని వానరాళిన్
ఘనశరవర్షపాతమున గప్పుచు రాముని జేరనేగ వా
యినకుల భూషణుండు దనుజేంద్రుని దాకెను భీకరోద్ధతిన్. 2671

మ॥ మదమాతంగము సింహముంగదియు రంభత్ప్రక్రియన్ నుద్ధతిన్
త్రిదశాధీశ విరోధి దాకె నుభయుల్ తీవ్రంబుగా విక్రమా
స్పదులై ఘోరరణంబునన్ జయ జిగీషాయుత్తులై వీర భీ
తిదమై యొప్పె రణంబు నత్తతిని ధాత్రీచక్రమల్లాడగన్. 2672

ఉ॥ రామకరప్రయోగ శరరాజ పరంపర శక్తివేగ ము
ద్దామ బలంబు దక్షతయు పుణ్యజనాధిపు డంతజూచి సం
గ్రామ విశేషుడై బహుశరావళి నేసియు రామభూవిభున్
నామెయినున్న లక్ష్మణు మహాద్భుతరీతిని గప్పె నుగ్రుడై. 2673

చ॥ వనగిరి వార్ధియుక్తభువి భాగము సంచలనంబుబొంద నా
వనజభవప్రసాదమున వచ్చిన భూరి శరాస్త్రపంక్తులన్
ఘనవిలయాగ్ని తుల్య శితకాండములన్ లయకాలభంగి నే
సెను కపిసైన్యమున్ దనుజసేనలు నద్భుతమంది చూడగన్. 2674

క॥ శరతాడితులై బాధా
కరదేహులునై విశేష ఖండితతనులై
ధరపై గూలిరి పెక్కలు
తరుచరవర్గంబు సమరధారుణి యంతన్. 2675

క॥ బలవంతులంతట బోరిరి
చెలఁగె ధరణీరజము గగనసీమను దిశలన్
బలితంపు గాలిదూలిన
జలదము క్రియ కీశచయము చయ్యన బోరెన్. 2876

సీ॥ దనుజేంద్రుశత్రు ననిమిషాధిపు గూడి
వరలక్ష్మిని భంగి తరలువాని
లక్ష్మణయుక్తుఁడై గ్రాలు విద్యుల్లతా
యుతనీలమేఘంబు కరణి గాగ
భూరికార్ముకధరు పృధులకోపారుణ
నేత్రుని యుత్పీత దండధరుని
దీర్ఘబాహా దండదివ్యదేహము వాని
విజయశీలుని మహా వీరవరుని

గీ॥ లోకసామ్రాజ్య పట్టాభిషిక్త విభవు
రాజలక్షణలక్షిత రాజితాత్ము
దివ్యమంగళ విగ్రహు దీప్తశీలు
రమ్యగుణగాత్రు దశరథ రాముఁ గనియె. 2877

క॥ పరచెడు వానరసైన్యము
పరికించి శరాధిపుండు పటుతీవ్రముగా
మొరయించె నారి దానం
ధరయును దిక్తటులు కంపితంబులు నయ్యెన్. 2878

గీ॥ దనుజ విభుడంత రాజనందనుల జేర
రవికరాంశులమైన వ్యర్థాస్త్రములఁదిని
హీనతేజుండు నౌచును గానవచ్చె
వంశనాశకరుండు రావణుడు నంత. 2879

ఆ వేళన్ మితిమీరి లక్ష్మణుడు దేవారాతితో యుద్ధముం
గావింపన్ వ్రథమంబుగా దలచి తీక్ష్ణంబైన బాణంబులన్
నావిర్భూత వరాక్రమక్రమత నేయన్ వానిదైత్యుండు నా
నావిఖ్యాత శరంబులేపిదునిమెన్ నాకాశవీధీ స్థలిన్. 2680

ఎన్ని శరంబులం గినిసియేసిన క్రోధము బూని రావణుం
డన్ని శరంబులన్ గగనమందున భగ్నముగానొనర్చి పా
రోన్నతి తీవ్రబాణముల నుగ్రతనేయఁగ బొచ్చె లక్ష్మణుం
డన్ని కటంబునన్ జలనమందెను చిక్కులు సంఘటిల్లగన్. 2681

శరశర లాఘవంబులను కార్ముకకౌశలముఁన్ ఘటించి యు
ఱ్ఱురువది కన్నులందున నహీనహుతాశన కాంతులీన ప
త్వరతను లక్ష్మణున్విడిచి తామరసాక్షుని రాముజేరగా
వరిగెను ఘోరసంగరమువందున వాతని గూల్పనెంచుచున్. 2682

మేరుగిరి భాగమందున
భూరిమేఘమేగి వర్షమును గురిసెడి యా
తీరున రావణుడెంతయు
ఛూరమణుని బాణవర్షమున ముంచె వెసన్. 2683

దనుజవిభుడేయు శరముల
ఘనతరాస్త్రవిదుడు విమత గర్వభంజనుం
డనఘుడు సీతాపతి తు
త్తునియలుగా జేసె వాడితూపుల మీరన్. 2684

రాముని రావణుండు రఘురాముడు రావణునొందొరుల్ మహో
ద్దామశరాసనంబులను దాల్చి వరాక్రమముల్ ఘటించి సం
గ్రామము జేయఁజొచ్చె జయలక్ష్మిని కాంక్షనుజేసి యస్త్ర వి
ద్యామహనీయ పాండితి మహాద్భుతరీతి జెలంగ నత్తరిన్. 2685

సీ॥ సకలాస్త్ర విద్యావిశారదుల్ రణకర్మ
నిపుణులు విక్రమాన్వితులనగుచు
సవ్యాపసవ్య విస్తార వర్తనులయి
యన్యోన్య రంధ్రంబు లరసికొనుచు
కాలమేఘంబుల గతి శరవర్షముల్
గురియుంగ జేయుచు గురుతరముగ
శరపరంపరలు నంబరతలంబును గప్పి
గాఢాంధకారంబు గడలుకొనగ

గీ॥ విలయవహ్నికి సమమగువేడిమి యును
ప్రళయభానుని బోలు నుజ్జ్వలత మరియు
లయసమయవేళ ఝంఝా నిలంబనంగ
దండధరతుల్యలగుచు నుద్దండగతిని.

ఉ॥ వాసవపుత్రులన్ గరుడపన్నగముల్ పటు విక్రమంబునన్
కేసరినాగముల్ గలసి కీడలిమేలని యెంచకుండ సం
త్రాస కరంబుగాగ రఘురాముడు దానవనాయకుండు వా
రాశిపరీత భూమియదరంగను బోరిరి భీకరాకృతిన్.

చ॥ దనుజవిభుండు నత్తరిని దారుణమౌ శరమాలనేసె రా
ముని గురిజేసి ఫాలతలముం బగులంగను దాని భూవిభుం
డనుపమలీల తామరసహారమనంగను మూర్ధభాగమం
దున ధరియించి చంచలమునొందక రౌద్రరసంబు జూపుచున్.

చ॥ కనులను తామ్రరోచులను గ్రమ్మగ మంత్రజపంబుజేసి యా
మనుజవిభుండు మీరుచు సమంత్రక యుక్తిని భూరిరౌద్రమున్
మనశరమేయ ధూమము గనంబడరాని మహానలంబు చ
య్యన బరువెత్తి తాకెను దశాననువక్షము దారుణంబుగన్.

క॥ అనలపరంపర లాగతి
జని రావణుతనుత్రాణ సంగతిగని భూ
మిని గూలె వాని దేహం
బున కొర్గ్యాక్షప్రతిమి భూవిభుడంతన్. ౬౮౯౧

చ॥ సురరిపుడట్ల క్షేత్య కవచుండయి యుండుట గాంచి జానకీ
వరుడు సమంత్రకంబుగ ప్రభావసమంచిత దారుణాస్త్రముల్
త్వరితముగాగ నేయ నవిదాకియు రావణుదేహమందునం
జొరకయ నేలగూలె నిజకోశ విహీనతనెంతి యత్తరిన్. ౬౮౯౧

చ॥ దనుజవిభుండు రామశరతాడితుడయ్యు నభేద్యుడై శరా
సనమున దానవాస్త్రమును సంఘటితంబును జేసియంత మం
త్రనియతి రాము వేశ్వరు వధార్థము నేసిన సర్వదిక్కులన్
ఘనతిమిరంబు గప్పుచును గాఢతరోద్ధతి తమ్మభంబునన్. ౬౮౯౨

మ॥ హరిశార్దూల వరాహ కుక్కుట భంవ్యాళోగ్ర శల్లాక వి
స్ఫురదాశీవిషసాయకంబులటు సంభూతంబులై యంబరాం
తర మెల్లన్ భరితంబునైన గని సీతాకాంతుడుద్యద్గతిన్
బరపెన్ శక్తిమ్నా శరంబు మంత్రవిధి పాపాత్మునిం దాకగన్. ౬౮౯౩

మ॥ అటనీనాథుడు పావకాస్త్రమును జేయన్నందునన్ వేగ సం
భవమయ్యెన్ బహుళాగ్ని దీప్తము ఖముల్ వజ్రోవమానంబులున్
రవిసంకాశ సధూమకేతు పటన భ్రాజిష్ణముల్ విద్యుదు
ద్భవ తీవ్రాశుగసంచయంబులు నభోభాగంబునుం గప్పుచున్. ౬౮౯౪

క॥ భూవిభుడు ప్రయోగించిన
పావక బాణమున దానవాధిపు శరముల్
వే వేగను నిశ్శేషం
బై విలయముజెందె దనుజవరుడది కనుచున్. ౬౮౯౫

చ॥ అలిగినయుండు మున్ను తనకై సృజియించి యొసంగినట్టి యు
జ్జ్వల శరరాజమున్ మనుజవర్యునిపై బొదువంగనేయ నా
యలఘుశరంబునన్ శతములయ్యె గదాసికుఠారముద్గరా
దుల వివిధాయుధావళుల తోడన యంబరమంత నిండుచున్.

క॥ వివిధాస్త్రవిదుడు రాముడు
దివిజారి విముక్తశరము దృష్టిగని మహా
జవమున గాంధర్వాస్త్రము
దవులంగా వేసె భగ్నదశ వది బొందన్. 2697

క॥ తనతను మయుడిచ్చిన యా
ఘనశరము వినాశమగుటగాంచి రావణుం
డనుపను సౌరాస్త్రంబును
జనవిభుపై నేసె సమర జయ విజిగీషన్. 2698

మ॥ జనకంబయ్యె తదీయ బాణమున నిస్తంద్రంబుగా సూర్యచం
ద్ర నిశ్రప్రోజ్వల వహ్ని గోళములనంతంబై నభోవీధిపై
పెనుమంటల్ దిశలందు బర్వ కనదివ్యద్వీనాథుడీక్షించి ఘో
రనిశాతాస్త్రమునన్ హరించె సమరప్రాగల్భ్యముం జూపుచున్. 2699

-: రావణు శక్తిచేత లక్ష్మణుడు మూర్ఛిల్లుట :-

ఉ॥ ఆ సమయంబునందు సమరాంగణ కోవిదుడైన లక్ష్మణుం
డాశుగ చాపముల్ గొని గుహాంతరసీమను వీడివచ్చు నా
కేసరి రీతి రావణుని కిన్నదురై చనుదెంచె బోర సం
త్రాసకరంబులైన బహుళాస్త్రవరంపర వాని గప్పుచున్. 2701

సీ॥ సప్తజిహ్వుని బోలు సప్తసాయకముల
ఘనకేతు దండంబు ఖండనస్త
కంబుగా బడద్రోసి ఘనశరంబున సూతు
కంఠంబు దెగనేసి కఠినరోష

మానఁ జాపంబున మఱి పంచశరముల
బ్రవయ్యలుగా నేసె వైరిలోక
భంజనుండగు దశవదనసోదరుఁడు వి
భీషణుండంత నుద్వేగ మొప్ప

గదను సారించి రథముపై నాదివి రథము
హయములన్ మోది వాటి సంహరణజేసె
హతరథాశ్వుడు హతసూతుడగుచు దనుజ
విభుడు లంఘించె ధరణికి వేగముగను. 2702

అనలజ్వాల సమానకోపుడయి దైత్యాధీశుడా వేళ దా
నను జుం జంపగ భూరిశక్తి గొని యేయన్ దానినింగాంచి ల
క్ష్మణుడుగ్రంబగు భూరిబాణమును వేగన్నేసి ఖండించె నా
గనసంచారులు మోదమందె వర్ధిలధ్వానంబులం జేయుచున్. 2703

అనిమిషేంద్రానిల యక్షేశ యమ వహ్ని
వరుణాదులకు భయంబైన దాని
యుదాష్ట ఘంటారవ వ్యాప్తివే నజాం
డము బీటలుగ జేయునట్టి దాని
జతేజమున మహనీయమౌ సురదంతి
దంతప్రకాశమై దనరు దాని
పర్వవేళలయందు చందనపుష్పాక్ష
తంబుల పూజితంబైన దాని

దైత్యమాయా వినిర్మితంబైన దాని
ప్రబలశత్రు వినాశనంబైన దాని
భుజగరాజ కరాళ జిహ్వోపమాన
మశనిపాత నిభంబునై యుండుదాని. 2704

మ॥ పృథుశ_క్తింగొని రావణుండతుల దుర్వారక్రియన్ సోదరున్
తుదిముట్టంగను సేయ జూచినను దాదృష్టిన్విలోకించుచున్
హృదయంబందున ప్రాణభీతిగొని చింతాక్రాంతుడై యుండ నా
యదమం జూచి సుమిత్రనందనుడు బాహాలోపసంరంభియై. 270

చ॥ పనివడి చాపధారియయి బాణములన్ వవరించుచున్ విభీ
షణునకు నడ్డమైనిలిచి సాయకవర్షము దానవేంద్రుపై
పెనగొనుఠీతి సేయగను వీక్షణజేసి విభీషణున్ రణం
బున వధియింపలేక దితిపుత్రకులాధిపుడంత నుగ్రుడై. 270

చ॥ కని యిటుపల్కె రాజసుత గావగనెంచకు మీవిభీషణున్
రణతలమందు వీడుముటులన్ విడకున్న మదీయహస్త దా
రుణ మనశక్తినిన్ని షడు ద్రుంచెదు సంశయమిందులేదు నీ
వని యిక పూర్తియౌను యమపట్టణమేగెదు నిశ్చయంబుగన్. 270

సీ॥ దశకంరుదారిరి దర్పంబురెట్టించి
మహనీయశక్తి లక్ష్మణుని మీద
భూరిశక్తిని పైవ ఘోరకరాళమౌ
వక్త్రంబులను మహోజ్వలిత వహ్ని
కీలయుక్తంబయి గీర్వాణ పతివజ్ర
తుల్యమై వేగంబుతోడ వచ్చు
శక్తిని నారామచంద్రుండు వీక్షించి
నిర్మలుండగుచు చింతించె నిటుల

గీ॥ నీమహాశక్తి చేత సంగ్రామమందు
ప్రాణభయమొంద కుండెడి లక్ష్మణునకు
ననుచు సంకల్పమును జేయు నంతలోన
యా మహాశక్తి యనుజు వక్షంబుజొచ్చె. 27

ఉరమున దాకి లక్ష్మణుడు మూర్ఛ నిగూలిన వానిఁజూచి భూ
వరుఁడటు భ్రాతృశల్యమున వానిని దుఃఖముతోన గన్నులం
గరమున నశ్రుబిందువులు గారగ జొచ్చెను ధైర్యమూనుచున్
తరుణముగాదు దుఃఖమయితంగొను కాలము లిట్టివేళలన్. 2709

అనుచు శరాసనంబున మహాగుణరావము పర్వఁజేసి రా
వణుని ననేక భూరిశరవర్గములన్ దమియించుచున్ని వా
వారణమును జేసి భూస్థలిని రక్తమయాంగుడునౌచు గూలియుం
డిన నిజసోదరున్ గనగనేగెను వానిసమీప భూమికిన్. 2710

దనుజపతి ముక్తశక్తిని
వనచరులకు బెరుకశక్తి బలములు లేమిన్
గనుచుండగ రాముడు ల
క్ష్మణు తనుగతశక్తి బెరికె ఘనకరములచే. 2711

రావణుడంత రాముని శరాసనమందు శితాంబకంబులన్
జేవమెయిన్ ఘటించుచు ననేకములేయగ వానిగాంచుచున్
ఠీవి తృణీకరించి నృపుడేగి సహోదరుగౌగిలించి సు
గ్రీవ మరుత్సుతాదులను కేలుల గాంచుచు బల్కెనీగతిన్. 2712

తరుచరవర్యులార బలదర్పము వీడుచు దుఃఖమందగా
తరుణముగాదు మీరురణధారుణి లక్ష్మణుగాచి యుండుడీ
చిరతర కాంక్షితంబిపుడు జేకురె వేసవిబోవ చాతకం
బరయగ నీరబిందువున హాయిముదంబును బొందు రీతిగన్. 2713

వినుడిక నాప్రతిజ్ఞ పృథివీతలమందున రాముడొండె రా
వణుడననొండె గాని దలపంగను నిర్వురనుండబోరు నా
మనమున సత్యమార్గము సమాదరణంబున జేసి యీ ప్రతి
జ్ఞను నిటు బల్కితిన్ వరుల చంపకయుండిన వ్యర్థజీవియో. 2714

చ॥ ఘనతర రాజ్యహానియును కాననవాసము దండకావనం
బున దనుజాంతమున్ ధరణిపుత్రిక రావణుచేత జిక్కుటన్
దనుజులతో రణంబు గడుదారుణ కష్టచయంబులన్నిటిం
దనుజవిభున్ వధించి రణధారుణి బాపెదు కష్టపుంజముల్. 2715

సీ॥ సకలధారుణి వనీనికర కీశావళి
యెవ్వని జంపంగ బిటకువచ్చె
వాలినిగూల్చి యెవ్వాని వంతముజేయ
నర్కజు కపిరాజ్యమందు నిలిపి
సర్వవానరలోక సంఘంబు లొక్కటై
వవధి బంధించి రెవ్వానిజంప
మీరలందరు గూడి దారుణసంగ్రామ
మొనరించి యుండిరే మూధుజంప

గీ॥ దుష్టుడును పాపచిత్తుండు దూర్తలక్ష
ణుండు లోకాలకును కంటకుండు నైన
రావణుడు నాదుదృష్టిమార్గాన బడియె
బ్రతుక జాలడు సుమ్మిక రణముకందు. 2718

చ॥ వనచరులార మీరలిక పర్వతభాగములందునెక్కి యా
దనుజవిభుండు నేను భుజదర్పములం బ్రకటించుచున్ రణాం
గణమున విక్రమించుటలు గాంచుడు వేడుకయుంక్షిగొందు భూ
వినుత పరాక్రమక్రమము వీకను జూపెదు సంగరంబునన్. :717

చ॥ అనిమిషసిద్ధసాధ్యులను యక్షులు కిన్నరపక్షిపన్నగుల్
మునులును ఖేచరుల్ దివిజముఖ్యులు మత్కృతధారుణోగ్రమౌ
రణమును జూచి పల్కను కరంబును సన్నిక రామభద్రుగా
దనుజవిభున్ వధించెదను దండధరాలయమందు జేరగన్. 2718

మ॥ ధరయెందాక వసించు సాగరములెందాకన్ రహి న్నింకకన్
వరలున్నంతకు మేరకున్ సురలు మద్భవ్యవ్రతావంబు సం
గర భూమిందిలకించి నన్నుతిని నావారితులంజేయు ము
న్నరయంజాలని యట్టి రీతిగను బ్రహ్మానందముం బొందుచున్ 2719

క॥ ముసు దేవాసురు లందున
గనని ఘోరరణము మీరు గాంతురు జగతిన్
వినుతంబగు చరితంబయి
జనసంస్తుత్యంబునగుచు జరుగును నీపై. 2720

-: రావణుడు పరాజితుడై లంకకు బోవుట :-

మ॥ అనుచున్ రాముడు పంగరోన్ముఖత ప్రత్యాలీఢపాదస్థుడై
దనుజాధీశ సువర్ణమండిత నిశాతాభీల బాణావళిం
జెనకన్నీయ దొడంగె దాలిగని లంకేశుండు నానాస్త్ర శ
స్త్ర నికాయంబును రాముపై బరపె దుర్వార క్రియాటోపుడై. 2721

చ॥ నరపతి రాక్షసాధిపు లనంతఘనాగమ నొందొరుల్ మహో
త్తరముగ వేయుబాణముల దప్పక నొందొరుదాకి యంబరాం
తరమున ఘోషజేయుచును దద్దయు తున్కలనొచు కుప్పలై
ధరణినిరాలె భూధరవితానములో యన దారుణంబుగన్. 2722

ఉ॥ దానిని గాంచి రాముడు సతంద్రిత బోరెడు పంక్తికంఠుపై
మానములేని తీవ్రమయ మార్గణముల్ నిగుడించియేయ నా
దానవభర్త రాము శరఘాతికి నోర్వగలేక లంకకుం
బోవరుగంగనెంచి రణభూమిని వీడుచు పర్వె నత్తరిన్. 2723

చ॥ తనుపటు రక్తసిక్తమయి ధారుణి మూర్ఛనుగూలి పాము ధం
గిని దొరలాడు లక్ష్మణుని కేతనమూర్తిని గొన్నవాని గ
న్గొని రఘువంశశేఖరుడు కూరిమి పెంపుననందువన్ సుషే
ణుని గవిపత్కి దూతనయణోగ్రుతుడై మతిలోగలంగుచున్. 2724

క॥ ప్రాణములకంటె నాకి
ఘూనాథ సుతుండు మిన్న పుడమి నీగతిం
దానవుచే మరణించిన
నీనేటికి సౌఖ్యమేల నియమంబేలన్. 2725

శా॥ చాపంబుం దిగజారజొచ్చెను భుజస్కంధంబునందుండి సం
తాపంబందె మనంబు నస్త్రశత సంతానంబులన్ రాలెడిన్
నేపుంజూపుచు బాణజాలముల నేనేరీతిగా వేయుదున్
నా పేరాశలు దీరె సోదరుడు చింతాక్రాంతుడై కూలుటన్. 2726

క॥ జనులకు వ్యాపన్నవస్థల
తనువు వడకుథంగి యయ్యో తృతిశిథిలయెను నా
యనుజుం డీల్గిన నాడగు
ఘనవిక్రమమేల కార్ముకంబిక నేలా. 2727

క॥ నా నయనంబుల ముందట
మానధనుడు లక్ష్మణుండు [illegible] నాకి
ప్రాణంబులేల నిజసతి
జానకియును నేల యుద్ధసంగతి యేలన్. 2728

చ॥ కలుగు కళత్రముల్ మరియుగల్గును బంధువు మిత్రసంతతుల్
బలువిధ భోగసంపదలు భ్రాతృ సహోదరు డస్తమించినన్
గలుగడుగా ధరాతలముఖంబున సద్గుణ సహోదరుండు వీ
యిలపయి నేరికిం దొరకు నేమని [illegible]గన్. 2729

-: సుషేణుడు రాముని సేతదీర్చుట :-

మ॥ అని దుఃఖాబ్ధి నిమగ్నుడై [illegible] యున్
గని యందున్న సుషేణుడు [illegible]
క్షణముల్ జూడ మృత్యు [illegible] ప్రాణంబులం
దనువుం దాల్చిన వానిగా నెరుగు చింతం బొంద నీకేటికిన్. 2730

ఉ॥ కాయదు కాంతిదేహమున గాసురతన్నలరారె గాని చ్ఛాయయులేదు కాయమున సర్వవిధంబుల సుప్రసన్నతా
జ్ఞేయము వీనివక్త్రము నీతని చేతుల రక్తవర్ణమౌ
తోయజరీతి దాల్చెను మృతుండగునెట్టుల వీక్షజేయగన్. 2731

మ॥ మృతిలేం దోంచిన కాదుగాదు సుమజేందాత్రి లక్ష్మణుండింక భ
ద్రత సప్రాణుడు సుమ్ము దుఃఖమును బొందంబోదియే వీని హృ
ద్గతమౌ కంపన గాంచుచుంటిమని వేగన్నందునున్నట్టి మా
రుతినిం గాంచి సుషేణుండు పలికెన్ లోనున్న యుద్దేశమున్. 2732

-: హనుమంతుడు సంజీవని దెచ్చుట :-

క॥ మును జాంబవంతుడు దెలిపిన
ఘనమగు దివ్యౌషధములు గలిగిన శుభశైలం
బునకును వేగమ యేగియు
హనుమా యౌషధుల దేవనగు నీవిలన్. 2733

సీ॥ సంజీవకరణియు సంధానకరణియు
సరల విశల్య సవర్ణకరణి
యనెడి యౌషధుల నాయచలంబు గనుగొని
తాని వేగముతెమ్ము పవనతనయ
యనిన మారుతి వేగవంతగ నాగిరి గ్రుమ్మరు
సౌషధంబులగుర్తు నరయలేక
కాలంబు జేయ లక్ష్మణుడు హానినిబొందు
నరయనుదలచి యా యచలమెత్తి

ఆ॥ వేగపెకలించి వట్టి నింగిపై దికేగ్గని
భూరిజవమున లంకనా భూజవరుల
మధ్యమున నుంచి పలికె నీమహీధరమును
దెచ్చితిని యౌషధుల గుర్తుతెలియలేక. 2734

చ॥ అనిలసుతుండొనర్చు కృతికందరు నద్భుతమంది చూడగా
మనుడుసుషేణు డాదరిని గాంచిన యోషధులం గ్రహించి ల
క్ష్మణుని చికిత్సజేయగ విశల్యుడునై వ్యథవీడిలేచె దా
నినిగని సర్వవానరు లనేకవిధంబుల సంతసిల్లగన్. 273

చ॥ అనుజునిగాంచి రాముడు మహావిపదంబుధి వీడి సోదరున్
తనువున గ్రుచ్చి వత్స కడుధన్యుడనైతిని కాలువీటికిం
జనిన నిమంగనుంగొనక సారమతీ బ్రతుకేలనాకు నా
జనకజయేల రావణుని జంపుటయేలను రాజ్యమేలొకో. 273

—: లక్ష్మణుడు రాముని యుద్ధమునకు ప్రోత్సహించుట :—

చ॥ దినకరవంశరత్న బలధీరుడవై యిటు వల్కగూడునే
రణమున దున్మ రావణుని లంక విభీషను జేర్చుమింక నీ
వనచరవర్గమందు మునుబాస నొసర్చవరీతి జానకిం
గొనుము సుధర్మరీతి కులముల్ నిటుబల్కవె ధాత్రియందునన్.

మ॥ బలవ ద్రావణుడవయ్యు హీనుగతిగా బల్కంగ నీకొప్పునే
తలవన్ భూరిమ్రుగేంద్ర దృష్టగతులం దంతావళంబెంతయున్
నిలువన్నేర్చునె యట్టి భాతిని నవంది గ్ధంబుగా రావణుం
గెలువంజాలిదు భూరివిక్రమగతి న్నింతేని జూపింపుమా. 273

మ॥ అనుదప్రాద్రిని తేకతుంద దనుజాధీశున్ శఠున్ రావణున్
రణభూమిం దుమహూదు వానివధ నీలక్ష్యంబయేనిన్ మునున్
బనిగా బానసుజేసితేని ధరవంభావ్యంబయేనిన్ జగ
జ్జనరక్షా నియుతుంబయేని రణమున్ సాగింపుమా వీడకన్. 273

—: రామరావణుల కడపటిరోజు యుద్ధము :—

చ॥ అనుజుడు వట్లువల్క మనమందు విచారము దక్కి రాముడున్
తనువును దాల్చె, రావణుడు దానినిగాంచి శతాంగమెక్కి యా
యినుపయుతిం తమోగ్రహ మహీపత వచ్చెడు భంగిదాకి యా
జనవిభు తీవ్రతాత శరజాలముల న్నిగిడించి యేయగన్. 274

ఉ॥ మనుజవిభుండు నంత సితమార్గణ పంక్తి దశాస్యుపై మహా
ఘనజవ యుక్తినేసి దశకంఠు శరీరమునందు గాయముల్
గనవడజేయ రావణు డఖండపరాక్రమశీల రాజనం
దనుపయి క్రోధమూనుచు రణంబును జేయగ నుద్యమించినన్. 2741

మ॥ సురగంధర్వులు సిద్ధసాధ్యులు రణక్షోణిన్ రఘూత్తంసు డీ
ధరపై నిల్చొని పోరుచుండె నట దైత్యాధిపుడున్ స్యందన
స్థిరుడై పోరగఁజొచ్చెగా దనమతం జెల్వారు జన్యంబుగా
దరయన్నంచును బల్కె శక్రుడును దానాలించి యప్పట్టునన్. 2742

మ॥ ఘనహేమాంచిత రత్నభూషితము సంగ్రామోపయోగంబు కాం
చన ఘంటా నినదాన్వితంబు నిశసంకాశంబు ముక్తాతప
త్ర నిబంధంబును చామరధ్వజయుతో ద్దామంబు తీవ్రాంత వా
జినికాయంబులు పోలు వశ్యములతో జెల్వారుతేరొక్కటిన్. 2743

ఉ॥ అనిమిషనాథుడంప విజయార్థము మాతలి గొంచువచ్చి యా
రణతల భూమిపై దిగక రమ్యశతాంగమునందు నంబరం
బున నిలుచుండి యర్కకుల ముఖ్యునిగాంచి వచించె నీగతిన్
వినయవివేక వాక్యముల వీనులకింపు జనించు నట్లుగన్. 2744

శా॥ రామా నీజయకాంక్షియై పనిచె సుత్రాముండు నీతేరు సం
గ్రామ ప్రస్ఫుట మింద్రకార్ముకము నిష్టేంద్ర ప్రభావర్మమున్
ప్రాముఖ్యంబగు తీవ్రబాణచయముల్ భవ్యంబులౌ శక్తులన్
క్షేమప్రాప్తికరంబులౌట గొను మక్షీణంబుగా పోరగన్. 2745

ఉ॥ పై రవివాశవార్థమయి భద్రత నే రథమందునుండ పా
కారి రణంబునన్ దనుజ కాండములన్ హరియించు భంగి నీ
ఘోరుని రావణాసురుని గూల్చి జయంబును గాంచుమింక నీ
రేరుహపత్రనేత్ర విమలీకృత భవ్యచరిత్ర రాఘవా. 2746

మ॥ అనుచున్ మాతలిబల్క సర్వజగముల్ సత్యంత శోభావహం
బున జెంపొందగ రాఘవుండపుడు సమ్మోదంబుతో మ్రొక్కి స్యం
దనము న్నెక్కెను దానిగాంచి దశకంఠాధీశుడత్యుగ్రుడై
రణపారీణత మీర శస్త్రచయముల్ రామాధిపున్నేయుచున్. 274

క॥ దనుజుడు గాంధర్వ శరం
బును వేయగ రాఘవుం డపూర్వముగాగన్
వణచెను గాంధర్వంబున
దనుజవిభుడు దానిగాంచి దద్దయు పెలుచన్. 274

క॥ దైవశరంబును వేయగ
భూవరుడద్దాని దైవమున ఛేదించెన్
రావణుడు, రాక్షసము. సీ
తావిభు వేయుంగ నదియు తడయక వచ్చెన్. 274

చ॥ ఘనఫణి బృందముల్ విషముగ్రక్కుచు భూరివిషానలార్చు లా
జనవిభు దాకవచ్చునెడ శౌర్యరతిన్ రఘురాముడంత భూ
వినుతము గారుడాస్త్ర చయవీధి హరించెను రావణుండు సం
జనిత మహోగ్రుడయ్యె తనసర్వశరంబులు వ్యర్థమౌరెడగన్. 275

క॥ కనలుచు దనుజుడు పటుకాం
చనకేతువు గొట్టి యొక్క చేయముంపైకన్
అనిమిషసారథి రఘుకు
తనువుల వాటంగ కొంకతు లేయంగన్. 275

చ॥ కరమునసాధ్యమైన దశకంఠు విజృంభణ శక్తిజూచి యా
నరవరు డీశరావణుని శస్త్రం గాంచె విభీషణుండు హా
నరవరుడున్ మరల శయముచేంత రావణుడంతె గెల్చు యూ
ధరణీతలంబు గాంచ్చెనవి దద్దయుచింతిత శోకతప్తుడై. 275

సీ॥ రఘుకులాంబుధి సోము రాముని రాహువన్
దశకంఠు డత్తరి దాకువేళ
హరిదాంకువకు ప్రియంబగు రోహిణీతార
నాక్రమించెను బుధుం డతులగతిని
ధరకు పరివ్షసంధాయకంబుగ ధూమ
జాల సంకలిత నిస్తంద్ర భూరి
చలిత తరంగపంక్తులు సాగరంబున
గ్రహరాజు ధీకొను కరణి బొంగె

గీ॥ కాంతిహీనత రవి నీలకాంతిగల్గి
ధూమకేతువు చేత దోదూయమాన
గతిని ప్రాప్తుడయ్యె దశకంఠ భూరి
విక్రమ విజృంభణంబున పృథివి వణకె. 2753

గీ॥ అనకులం కార వావివాద్య కేంద్రైవ
తము విశాఖను కుజుడు నిస్తంద్రగతిని
బొదివె రాముని దమీశేండు కదనమందు
గెదయువేళను లోకభీకరముగాగ. 27.4

రాముడు రావణు కాంతమును భగ్నముజేయుట :-

మ॥ తనవర్గంబులు చింతబొందగని యుత్సాహంబు గల్పింప రా
వణు డామారుణ రక్తనేత్రముల దారుణ్యంబుగా వించు రీ
తిని వీక్షించెను సర్వభూతములు సాధ్వీరోత్తముం జూచి సం
జనితాఖిల వివీతులై రట జగత్సంహారమున్ చింతచే. 2755

చ॥ ధరణిచలించె సాగరము తల్లడిలెన్ పటుభూజయుక్తమౌ
ధరణీధరంబులతో ప్రబలె కౌశలికా ఖగాళి యంబరాం
తరమునన ఘోషజేసె జంతువులు గలంజెసె రావణా
మోఘమిషు రాముడాగకె పెట్రేగ వీయుగ నత్యుమందునన్. 275

చ॥ విలయభయానక భీమ రణ విక్రమముల్ బరికింపగా నభ
స్స్థలమున దేవదానవ కదంబము కిన్నరసిద్ధ సాధ్యులన్
పలువిధరీతి గుంపులుగ వచ్చిరి యత్తరి రామరావణో
జ్జ్వల రణరంగవిక్రమము ద్వంద్వరణ క్రియజూచు చింతమై. 2757

చ॥ అది గని రావణుండు మనుజాధిపు సంహరణంబు జేయ బె
ట్టిదముగ వజ్రసారము పటిష్ఠము శాత్రవనాశనంబు భీ
తిద మచలాగ్రతుల్యమును తీక్ష్ణము భూధరభేదనంబునై
బొదవెడు శూలముంగొనుచు భూవరుసేయగనెంచె నత్తరిన్. 2758

చ॥ శరమునసెత్తి క్రోధమున గర్జిలి లోకభయంకరంబుగా
నరవరు జూచి వల్కె రఘునందన యియ్యది వజ్రసారమై
పరగెడు శూలముం గనుము భ్రాతృసహాయుని నిన్ను సంగరాం
తరమున జంపి మిత్తిగని భక్తి నిశాచరరాజి జేర్పెదన్. 2759

చ॥ అనుచును శూలమున్ బరువ[illegible]ద్ది వేగమహోష్ణమంటికా
నినదముజేయుచు న్వెడలి నింగినిమండ రఘూద్వహుండు భూ
ర్వనలము వర్షధారపటలంబున నాశము బొందు భంగి యా
మనుజవిభుండు తీక్ష్ణమయ మార్గణముల్ [illegible]గిదించి యేసినన్. 2760

క॥ అనలము శలభచయంబుల
ఘనముగ దహియించు భంగిగా శరమాలన్
ల్లము మాయించుచు శూలము
జనవిభుపై రాగ శక్రశత్రుని గొనుచున్. 2761

మ॥ నరనాథుండు మహేంద్రశక్తిగొనుచున్ దైత్యేశు శూలంబుతో
గురిగా నేసిన ఘంటికారవము దిక్కోణంబులం బర్వ[illegible]వ
త్వరతన్ [illegible] నభోంతరంబున [illegible] చండాధిపన్
ధరణింగూలెను తున్కలై కపుల కుత్సాహంబు దీపింపగన్. 2762

॥ వరవరుడంత దారుణ ఘనాస్త్రములన్ శరగంబులేసి యా
సురరిపు వక్షముంబగులు చొప్ప ఘటించి సికాస్త్రమేసియున్
పరువడి రాక్షసాధిపుని ఫాలమునం దొశరంబులేసి వం
గరమున క్షోభగూర్చె రఘుకాంతుడు దానవలోక భర్తకున్. 2763

॥ శరవిచ్ఛిన్న దృఢాంగుడై రుధిరవిస్తారంబు గారంగ దా
పరితప్తాంగుడునై శరప్రకర సంబాధా కులప్వాంతుడై
భరియింపంగను శక్తిజాలక రణవ్యాపారహీనుండునై
దురమందుంగడు దుఃఖముంగ్రొమ్ము నత్యుగ్రాక్రుతింబూనుచున్.

-: రాముడు రావణుని నిందించుట :-

రావణుడక్షరి తీవ్ర శ
రావళి రఘువీరుపైని లక్ష్యతవేయం
గా వినువీధిని రాముడు
భూవినుతమ్ముగాగ శకలములుగ హరించెన్. 2765

॥ విలయకృశానుబోలి రఘువీరుడు భూరినిశాతబాణముల్
బలరిపువైరిపై బరుప వారక దానవశత్రు బోర్జ్వలో
జ్వలిత సికాంబకాళి రఘుత్తముని నేయుగ దాకి యొండొరుల్
కలితమహాంధకార గతిగా నొనరించెను సంగరస్థలిన్. 2766

శరజాలోద్భవ తిమిరాం
తరమున శాత్రవులు గ్రొరులు దృష్టింగనకన్
ఘర్షించెడు ఖద్యోతంబున
వరవరుడీక్షించి రావణాసురు బలికెన్. 2767

॥ చిరునగవున్ ఘటించియు విశేషము రోషముబూని పల్కె నో
దురితుడ నేనులేనియెడ దొంగిలి తెచ్చితి నాదుసాధ్విన
ద్వరగుణశీల మూఢతను భావ్యమె దానికి సంతసింతువే
యరయగ వీరధర్మమె సురారి నిముందెగటార్తు నెంతయున్. 2768

క౹ నీవేని యద్దివేళను
బాలామణి దొంగిలించు బాలిశ నీవుం
జాలగ నొకవీరుడవే
చాలును నీశౌర్యధైర్య సంపదలింకన్. 276

క౹ పతిలేనివేళ సతులను
హితమహితము గనక కామితేచ్ఛను గొనుటన్
దితికులనాథా నీకీ
గతిపట్టెను చోరవృత్తిని గావించుటచే. 277

శా౹ పారావార విదూర దుష్టచరితా చాంచల్య భావాంచితా
దూరీభూత సమస్తసద్గుణ మహాద్రోహైక చింతారతా
పరనారీహర దుష్కృతా విమతగర్వాంధా మహాదర్ప సం
భరితానేక వికార కల్మష కృతీ పాపీ జగత్కంటకా. 277

చ౹ ధనదుని సోదరుండవయి తామరసోద్భవ వంశమందునన్
జననమునంది శౌర్యగుణ శాలుడవై పటువీరుడంచు పే
రునుగని యీ జగంబుల నెరుంగగ నేమిటి సత్కృతంబులన్
దనుజకులాధిపా సలిపి తక్కట తెల్పుము నీవెరింగినన్. 277

చ౹ ధరణి జనంబులెల్లరును దద్దయు దిట్టదుతంగి నీవు దు
ష్కరములు జేసియుండుటను కాలముఖంబున పాపకర్మముల్
పరిణతి నొంది నేడుపరిపక్వ దశంగాను తత్ఫలంబులన్
దురితుడ పొందగా గలవు దూరములేదిక చావుతథ్యమౌ. 277

ఉ౹ పౌరుషమేమిలేక యొకపాటియు సిగ్గుమలేక నీచుడా
చోరుని వంగి నాసతిని శుద్ధమతిన్ హరియింప నెట్టులన్
గూరుడవౌదు నీవపుడు జూచిన నిన్ను కృతాంతుగేహముం
జేరగ బంపువాడగద చిత్తవికార దురాత్మ రావణా. 27

చ॥ తలవమదీయ భాగ్యముగ దృష్టిపథంబున వంగరావనీ
తలమున నిన్నుగంటి యమధామము జేరగబంపువాడ బో
జ్వలమణి కుండలప్రభల భాసిలునీశిరమింక నీదు భూ
తలమున రాల పక్షితతి దృష్టిని మీర భుజించునెంతయున్. ..75

క॥ ధరవయి గూలిన యూరమును
వరిపరివిధములను గృధ్రపరివారంబుల్
కరమును చుంచులజీల్చుచు
పరితృప్తిని రక్తమాంస భక్షణజేయున్. 2776

మ॥ వినతాసూనుడు పన్నగంబులను మద్వేగంబునంజెండు రీ
తిని వేడింక మదీయ బాణముల వంచేహంబు లేకుండ నీ
తనుభాగాంత్రచయంబులన్ పటులలోద్దాముండనై చీల్చు వ
క్షినికాయుంబులు దృష్టిమీరగను భక్షించున్ విమూఢాత్మకా. 2777

చ॥ నిరుపమధైర్యమూని ద్విగుణీకృత విక్రమమునుంపుటించి ను
స్థిరపరమాస్త్రవేది రణశీలుడు వర్వమహాస్త్రసంతతిన్
కరమును జింతజేయనవి కంజదళాక్షుని ముందునిల్చె మే
దురముగ దోచెవర్వ శుభదోజ్వల చిహ్నము లట్టివేళలన్. 2778

-: రావణుని రథమును సారధి మరలించుట :-

చ॥ అరి గెలువంగనెంచి మనుజాధిపు డత్తరి సాయకంబులన్
పరువడి వర్వవేయ దశవక్త్రుని హృద్గతి తల్లడిల్లె నే
తెరువును గాంచలేక బలశీలవిహీనుడునయ్యె దీనతం
బరగెను జేయుకార్యగతి పట్టక మానసమందు వేమియున్. 2779

మ॥ శరసంధానము జేయలేక యరికస్త్రాస్త్రంబులం దున్మలే
క రణోద్యోగముజేయలేక మదిలో కాయంబువన్ విస్మృతిన్
కరముం గాంచుచునున్న రావణుని నాకాలంబువన్ మాతుడున్
త్వరతన్ గాంచుచు మేలుజేయగను యుక్తంబైన మార్గంబుగాన్.

క॥ దనుజవరుడిందు నుండిన
మనుజవర్యుఁ బ్రేక్షిత నిష్ఠుర మతియునగుచున్
రణభాగ్యఘ్నుఁడు నిలుపక
తన రథమును నొంచుదిశకు దద్దయు దోలెన్. 2781

చ॥ రణతలవీథివీడి యటులన్ రథమేగుటగాంచి యా దశా
ననుడు క్రుద్ధాత్ముఁడై పలికె నన్నొక భీరునిగా దలంచితే
ఘనబల విక్రమం డనని కాంచవె నీమనమందు పౌరుషం
బును దిగవీడితంచును విమూఢత చింతనుజేసివాదవే. 2782

చ॥ రథమును శత్రుపన్నిది వరాక్రమలీలను నుంచకుండ నా
మథిగల యూహనేరకయు మద్బల పౌరుషశక్తి నెంచకన్
కదనతలంబునందు నధికం బవమానము గూర్చినాడవే
విధివశత త్రస్తమైన బహువిక్రమ శస్త్రము లస్త్ర వంవదల్
వధలెనె నన్ను యిట్టి వరిస్థాటిని గూర్చితె నన్నుజూడకన్. 2783

మ॥ చిరకాలార్జితమైన నాయశము నీవేపేదు నిందార్హమై
కరముంగూర్చె కళంకమున్ సుర్షత్కులీ గర్వంబులన్ వీడి యా
సురవైరి విక్రమ ఖ్యాతిఁ బ్రాభవఖ్యాతిన్ శూరుండు సంగ్రామమం
దరయన్నిందు వచించు శాత్రవితృధాయమ్యోఁగధేనేడికన్. 2784

చ॥ అరిగెలువంగ స్యందనము నాహవభూమి జరింపజేయకన్
స్థిరమతివీడి మూలలకు దెచ్చుచు నాకిట మేలుకోరెదే
చిరతరమిత్రు డెవ్వడును జేయడుగా విపరీతకృత్యముల్
నరియొనరించు కృత్యముల నక్కటచేసితె నాకు చేటుగన్. 2785

చ॥ పరులకు మేలుగూర్ప నిటువంటి విహీనపు నీచకర్మమున్
దారకొని చేసియుంటివని దోచెను వార్తలచేత మేలు వే
కురెనొకొ నీకు దుష్ట, నను గొల్చుచు నిన్ని దినంబులిప్పు డి
త్తరిని కృతఘ్నుఁ డంగి మదిఖ్యాతియె నాకిట కీడుచెల్వగన్. 2786

చ॥ రణమున సూతధర్మమగు కృత్యముల న్నొనరించినాడ నో
దనుజకులాధినాథ మదిదాల్పకు శంకలు నీహితంబు నే
వనవరతంబుగోరెద ననాదరణంబున జూడబోకుమా
వినబడ సూతధర్మము వివేకతదెల్పెదు నీవెరుంగవే. 278:

సీ॥ సంగరంబందు దేశంబు కాలంబును
రణముతీరును మరిరాజునందు
గల ఖేదమోదంబు గమనించుచును సదా
పరుల బలంబుల నరసికొనుచు
మిరుసు పల్లంబుల మేదినిగాంచుచు
నరిచక్రభేద నావశ్యతను నెరిగి
సమర వేళల యందు సర్వత్రభద్రంబు
రథికుడు బొందెడి క్రమముగాగ

గీ॥ రథము నడపంగవలయు సారథియు నెపుడు
వరుల ఢీకొను వెడ నెదు రరుగవలయు
సమయమెరుగుచు పక్కల జరుపవలయు
రథికు గాపాడవలయు సారథికినెపుడు. 278

మ॥ నిమగాపాడగ నెంతో తీక్రమము మేనింబావగానెంచి యా
మనవాలి క్రమతీర్పనెంచి యిటులం గావించితింగాని ని
మనమందుంగల పేక్షపద్ధతిని యీమార్గంబునం జేతు నే
దనజాధీశ్వర నీదుబాణము రణస్థానంబునం జేర్చెదన్. 278:

క॥ నీకున్న ఋణము దీర్పగ
వాకారి యొట్టిపనుల నైనం జేతున్
లోకస్తుతవిక్రమ ని
నీకున్ భృత్యుండ నమచు నెరుగవె యెపుడున్. 2788

ఉ॥ సారథి పల్కువాక్యముల సంతసమందియు వానిమెచ్చి యిం
పారెడునట్టి యాభరణ మాతడు బొందగనిచ్చి రాముపై
తీరును బంషమంచు గిరిధీరుడు రావణుడంత బల్కి న
ద్ధ్యేరయ మొప్ప స్యందనము దోలెను రాముడు నున్న భూమికిన్.

-: అగస్త్యుడు రామున కాదిత్యహృదయముపదేశించుట :-

క॥ రణరంగ పరిశ్రాంతుని
జనితాతుల చింతితాత్ము సంగరమతి రా
వణుగాంచి రాముడత్తరి
మనమున చింతించె శత్రుమర్దనకాంక్షన్. 2798

చ॥ నరవర దైత్యవాదుల రణంబును జూడగ నంబరస్థలిన్
సురలను గూడియున్న కలశోద్భవుడైన యగస్తి రాముని
దరియగ వచ్చి యుద్ధ జయదంబగు గుహ్యము దెల్పనెంచి సా
దరముగ బల్కె నీగతిని ధన్యమనస్కత రాముతోడుతన్. 2799

ఉ॥ ఓ రఘురామ విన్ము మహిమోజ్జ్వల గుహ్యము వైరివీర సం
హారమునున్ సనాతనము సద్భుతశక్తి ఫలప్రదంబు దు
ర్వారుడవై రణస్థలిని రావణుపై విజయంబుగాంతువే
పేరుపురిటి దాని ధరణీవర నీవుజపింపు మెంతయున్. 2800

సీ॥ ఆదిత్యహృదయంబు నఖిలపుణ్యప్రదం
బత్యంత సుశ్రీకరాంచితంబు
సకలశాత్రవలోక సంహార శరమును
జయకారణంబు నక్షయ్యగుణము
పరమశివంబును గురుతరమంగళ
ప్రదమును పాప విభంగకంబు
శోకచింతా శమన కరదంబు నుత్తమం
బాయుష్కరంబు సంవత్సరంబు

యంశుమంతుడు నగ్నిగర్భాఖ్యుడీవ
శంఖుడవు నీవ మరియు భాస్కరుడవీవ
శిశిరనాశనుడీవ విశేషగగన
నాథుడవు నీవ తిమిర నాశనుడవీవ. 2803

॥ అరయగ వేదపారగుడ వృష్టికిమిత్రుడవున్ సువృష్టివిప్
కరము హిరణ్యగర్భుడవు జ్ఞాధరవింధ్య విహంగముండవున్
మరియును పింగళుండవును మృత్యువవున్ కవిరాజవీవ భా
సురగతి సర్వభూతమయు వృష్టినిరంతర దీప్తిశుండవున్. 2804

॥ ఆతపివి మండలివి మృత్యుకృతుడు వీవ
తారకాగ్రహ నక్షత్ర దయితుడీవ
యతులతేజుండవును ద్వాదశాత్ముడీవ
దినవిభుడవీవ విశ్వభావనుడ వీవ. 2805

॥ దండంబు పూర్వశైలికిని
దండము పశ్చిమాద్రికిని ధరణీధరవున్
దండము దినాధిపతికిని
దండము జ్యోతిర్గణాధి దయితున కెపుడున్. 2806

॥ మ్రొక్కెదు జయునకు భక్తిని
మ్రొక్కెదు జయభద్రునకును మోదముమీరన్
మ్రొక్కెదు హర్యశ్వునకును
మ్రొక్కెదను సహస్రకిరణ మూలంబునకున్. 2807

॥ వందనము లుగ్రమూర్తికి
వందనంబు వీరునకును భవ్యాంగునకున్
వందనము పద్మహితునకు
మందగతిన్ వందనంబు మార్తాండునకున్.

సీ॥ బ్రహ్మయు విష్ణువు పరమశివుండును
వాదిత్యుడును సూర్యుడగుదువీవ
భావ్యంతుడవు సర్వభక్షకుండును నీవె
విశ్వసాక్షివి విశ్వ విభుడవీవె
విఘ్నతిమిర వ్యూహ వేధివి మఱి విశ్వ
కర్మవు రుద్రునాకార మీవె
యమితాత్ముడవు శత్రుసముదాయ నాశన
కరుడవు హిమపుంజ హరుడవీవె

గీ॥ గ్రహపతివినీవ సర్వలోకముల భూత
తతి లయంబును జేసి యంతట సృజించు
వాడవునునీవ తపియించువాడవీవ
తిరిగి వృష్టినిగూర్పు [illegible]కరుడవీవ. 280

ఉ॥ ప్రాణులు నిద్రబోవుతరి జాయకనుండుదు జాగరూకతన్
మానుగ సర్వభూతచయమందు వసింతువు సర్వవేద సం
తానము యాగకర్మములు వహ్నియు తత్ఫలదాత వీవ వి
జ్ఞానివి సర్వలోకగురు నాథుడవున్ భువనాధిపుండవున్. 281

చ॥ దినకరమండలాంతరుడు దివ్యపురూషుడు వీనిగూర్చియున్
మనమున చింతజేసి వనమందుననైన నరణ్యమందునన్
ఘనతర కష్టకాలముల గాంచదు భీతి స్మరింప గావునన్
దినకరవంశ్య దీనిపటు నిష్ఠ జపింపు జయాభిలాషివై. 281

క॥ జనవర ముమ్మారులు నీ
ఘనమంత్రము జపముజేసి గడగుమిక రణం
బునకును జయముం గాంచెదు
దనుజవిభుడు మడియు రామధరణీ నాథా. 281

క. అనివచియించి యగస్త్యుఁడు
చనియెను వినువీధి రామ చంద్రుండంతన్
మనమున ముదమును గాంచుచు
దనుజవిభుని జంపుటింక తథ్యంబనుచున్. 2813

చ. ముని యుపదేశమంత్రము ప్రమోదత భక్తిని మూడుసార్లుగా
జనవరుడుం జపించియును చాపశరంబుల దాల్చి భానుడున్
మనమున సంతసించి సురమధ్యమునుండి వినిర్గతుండునై
యినకులవర్యు జూచి రణమింకను జేసి జయంబుగొమ్మనెన్. 2814

-: సారథి రావణుని రథంబు యుద్ధభూమికి మరల్చుట :-

సీ. శాత్రవభంజన సమధిక భీమంబు
బహుళోన్నత ధ్వజ భాసురంబు
కాంచనహార వికాసాశ్వ యుక్తంబు
సాంగ్రామికాయుధ సంయుతంబు
రథనేమి నిస్వన పృథుల ఘోషంబును
బహువీర భటలోక పరివృతంబు
దారుణోగ్రంబును దానవోత్సాహంబు
సతుల ఘంటా నినాదాంచితంబు

గీ. నైన రథమున రావణుడతి కసించ
సారథియుదోలె రామభూవరు డున్న
సంగరావని సీమకు చటులగతిని
దానిగని రాముడంత మాతలికి బలికె. 2815

చ. కనుగొని రాఘవుండు శుభకార్ముక ముంగొని చెంతనున్న యా
యనిమిషనాథ సారథిని వత్తుణిగాంచి వచించె కంటివే
దనుజవిభుండు శాత్రవుడు దర్పయుతే రణమాచరించగా
మనదెస వచ్చుచుండె నవమాన జవంబున క్రోధమూనుచున్. 2816

చ॥ ఇతడు మదీయ బాణముల నింకను మృత్యువుగాంచు గాన నీ
గతి నవసవ్యమార్గమును గైకొని తప్పుచునుండె తేరిక
న్నతిజవమొప్ప దాకి జలదంబును గాడుపు చీల్చుతంగి నీ
దితిసుతనాథు జంపెదను తేటపడందను జూడుమిత్తరిన్. 2817

మ॥ కనుదృష్టిన్ మరలింపబోక రణరంగంబందు నీమానసం
బును శీఘ్రాగ్రగతజేసి ధైర్యగుణఘుం బోలీక విభ్రాంతత్వముం
గనకన్ పగ్గములందరించుటను యుక్తంబైన కేళ్లొప్పగా
గనుమా లాఘవమింక శత్రుజయ కాంక్షాయుక్తచిత్తుండనై. 28 8

ఉ॥ వాసవు డంతవానికి ప్రభావత సంగరభూమి తేరులన్
వాసిగదోలి సల్ప నిను లాఘవజేయుట వింతకాదు సం
త్రాసను గూర్చు వేళ నితరంబుల దృష్టిని గాంచకుండగా
నీ సమయంబునన్ దెలుపనేర్చితి యున్నగ శత్రుపారతీ. 2819

ఉ॥ మాతలి యంతప్రీతుడయి [illegible] ధ్వజ [illegible]
జాతసరోమడౌచు సపక్షవిద్ధంబున రావణుండు జ
న్యాతురుడై రథంబును రణావనిలో బరవంగజేయుచున్
వాతత ధూళిగప్ప రఘునాయకు డాతతరాశినేసెనన్. 2820

-: రావణునకు దుర్నిమిత్తములు దోచుట :-

చ॥ అరిబల మర్దనుండు సమరాచల ధైర్య నిధుండు విక్రమ
స్ఫురితుడునౌచు శక్రధనువుంగొని రాముడు తీక్ష్ణభానుడున్
బరపెడి రశ్ములట్లు శితబాణములన్నిగిరించి యేసె సం
గరమున రావణాసుర వినాశనకాంక్ష నవేక తంగులన్. 2821

మ॥ దనుజాధీశుడు మానవాధిపుడు నత్యంతంబు నన్యోన్య సం
జనితాయత్త జయాభిలాషులగుచున్ సంగ్రామముం జేయగా
వినువీధిం గుమిగూడి దేవతతి వీక్షించె వీరద్వయం
బును పొంగించుచు రావణుండు బాపంగోరుచున్ శిరమ్ముల్. 2822

క॥ దనుజవిభు వాహనంబును
మనుజవిభు జయంబుతోఁ మార్గంబులనున్
గనబడెను నిమిత్తంబులు
రణమత్తరి పొగుచుండ రణరంగమునన్. 2813

సీ॥ రక్తవర్షముగురిసె రావణు రథమందు
సుడిగాలి వీచె నిస్తులతగాగ
స్యందనోపరి భాగసంస్థితి బొందుచు
గృధ్రంబులును గుంపుగూడి యెగసె
దినభాగమయ్యు సంధీప్రాగ్ని భంగిని
ధరయంతయు విభీతకరమునయ్యె
తోకచుక్కలును విద్యుద్భంగి రాలెను
పుడమిబీటలువారె పిడుగులాదవె

గీ॥ వసురసముదాయ హృదయ సంకటమునించె
దీపదశగాంచె లంక నిస్తేజమగుచు
దానవులదేహ మెవ్వరో తాకి మిగుల
పీడనముజేయుభంగి గాన్పించెనపుడు. 2814

క॥ దనుజవిభుతేరు జనియెడి
రణమార్గము భూమివణకె రవికిరణంబుల్
మనుజాళనుపై బడియె న
రుణ హారి వినీల ధవళ రుచిరములగుచున్. 2815

సీ॥ ప్రతికూల వాయుసంగత ధూళిరజమున
దనుజుల దృష్టులు తల్లడిల్లె
గర్జాధ్వనులులేక గగనంబు నందుండి
పిడుగులు నత్తరి పుడమిబడియె

భూమీరజంబు నభోభాగమును గప్ప
గగనభాగంబంత గాఢబడక
పరుషధ్వనులతోడ పక్షిసంఘంబులు
దనుజనాధుని రథధ్వజిని బ్రాలె

గీ॥ దనుజసైనిక తతుల నేత్రములయందు
నీరములుగారె నటుల విస్తారమయిన
దుష్టశకునంబులత్తరి దోచె దనుజ
నాయకుని కీడుగా రణాంతరమున. 2826

క॥ ఆ సమయంబున రాముని
వాపిగ శుభచిహ్నములను వరలెను దానం
జేసి తలంచెను రాముడు
నాసురశాత్రవుడు జమ్ము వంచును మతిలో. 2827

చ॥ జ్యారావంబులు భూనభోంతర దిశావ్యాప్తంబులై వర్వగా
సారవత్క్రియ శాతబాణతతి విస్తారంబుగా నొందురుల్
మీరన్నేయుచు సంగరోచిత కళామేయ ప్రభావాఢ్యులై
వీరుల్ సల్పిరి ద్వంద్వయుద్ధగతులన్ భూభాగమల్లాడగన్. 2828

చ॥ వనచరలోకముల్ దనుజ వర్గములున్ రణ కాంక్షులయ్యు సా
ధనముల దాల్చి యున్నపుడు దానవ మానవనాథులిర్వురన్
రణతల శూరులంగని మనంబున చేష్టలుదక్కి దిగ్భ్రమన్
గనుచును నిల్చెదెన్ నెపుడుగాంచని యుద్ధ రణంబుగావునన్. 2829

క॥ ఇరుపురును పోరువేళను
సురవైరులు వానరులును చూచుచునుండెన్
కలము తమనాయకులకుమీ
పరిరక్షణ జేయకుండు శంకిని నచటన్. 2830

క. దనుజవిభు జూచు సురులు
మనుజవిభుని జూచు మిగుల మర్కటతతులున్
రణరంగమటుల జూచుచు
తనువులమరచియును నిలిచె దా ప్రతిమ లనన్. 2831

-: రాముడు రావణు ధ్వజమును ఖండించుట :-

శా. అటు లన్యోన్య జయాభిలాషులయి శస్త్రాస్త్రకము న్మెండౌరుల్
చటులౌద్ధత్యము మీరనేసికొనుచున్ సంగ్రామముంజేయ నం
తట దేవారి శరాన రామధరణీనాథధ్వజంబేసె ను
త్కటరీతి న్నదిశాకటుండయె రణస్థానంబునన్ రాలగన్. 2832

మ. రాముండుద్ధతి దానికిన్ బ్రతిగ ఘోరంబైన నారాచమున్
భీమప్రక్రియగూర్చి రావణు ధ్వజం బింతేనియున్నే సివన్
భూమింగూలెను తుక్కలై విశిఖద పూత్కారంబు భీతిల్లగన్
నామోడ్కిన్ దశకంఠువిక్రమము నంతంబందు నంచత్తరిన్. 2833

ఉ. తన ధ్వజమట్లు గూలగన్గ దానవనాథుడు తీవ్రకోపుడై
ధనువున తీవ్రబాణము లదాల్చుచు రాఘురథాశ్వపంక్తిపై
చెనకగ నేసినన్నవియు సారథకాండము లట్టుదాకి యా
ఘనజవ వాజులుంజెదర గ్రాలుచునుండె రణాంతరంబునన్. 2834

ఉ. దానిని గాంచి రావణు డుదగ్ర భూరిశరాస్త్రజాలమున్
దానవమాయగాగ వివిధంబగు చక్రగదాసిశూల నం
తానము లన్ మహాశిలల నత్తరి రాము రథంబునేయగా
వానను బోలియుండె రఘువర్యు రథంబున్ దాకతేరయున్. 2835

క. అపహాయ తూరుదగుచును
దశకంఠుడు యుద్ధతంత్ర తత్పరుడగుచున్
దశరథ తనయునిపై బా
ణపహాస్రము లతులగతిని నాటగనేసెన్. 2836

క॥ ధరణీనాథుడు నడిగని
దరహసిత ముఖాబ్జుడగుచు దగురీతిని నా
సురవైరి నేయఁజొచ్చెను
పరిపరివిధములను తీవ్రబాణవితతులన్. 26

క॥ ఒండొరులు సాయకములు
ద్దండత నేయంగ గగనతలమున యందున్
మెండయి పందిరి రీతిని
నుండెను పోరటులసాగె నుగ్రముగాగన్. 28

మ॥ గురుబంధవ్యక వ్యర్థమై చనక రక్షోనాథ క్ష్మానాథు లి
ద్దరు ఘోరంబుగ బోరఁజొచ్చె కదనంపుం తీవిలోపింపకన్
నరపాలుండును రావణాశ్వములపై నత్యంతమున్నేయగా
సురవైరి ప్రభుడున్ నరేంద్రుహయ సంక్షోభంబు గావించుచున్.

క॥ ధర సకల భూతచయములు
పరికింపగ జొచ్చె నిట్టి భవ్యరణంబున్
నరయంగలే దపూర్వము
తరతమభేదంబు లేనిదంచును మిగులన్. 26

సీ॥ దరిజేరు మరియును నరుగును బాయంగ
నొండొరుల్ వధియింప గండుమీరి
భూరితేజంబు విస్ఫూర్తి బ్రకటించుచు
తప్పులబల్కు చుద్దండగతిని
సారధి చతురత సంగర స్థలమున
చిత్రవిన్యాసముల్ జేయసాగ
రథయుగ్మముల జేరంగను బాయుచు
భూరిశరాళి విస్ఫూర్తిమీర

మ॥ శరజాలంబుల తాకిడిన్ జలధులన్ సంక్షోభముంబొందె భూ
ధరముల్ చంచలితంబులయ్యెను దిశాదంతావళంబుల్ గడున్
వెరపుంగాంచెను సర్వభూతలము వృథ్వీజాది సంయుక్తమై
కరముం దద్దరిలంగజొచ్చె దిశలుంగపించె రావంబులన్. 284

క॥ దినరాజు కాంతిదప్పెను
ననిలుడు స్థబ్ధుండునయ్యె యక్షామర స
న్మునిగణములు భీతిల్లెను
ఘనరావణ రామవిభుల కదనమువేళన్. 284

చ॥ ధరను సమస్తసాధుజన సంఘములెంతయు వృద్ధిబొందు భూ
వరుడు జయంబుగాంచుతను పాపుడు రావణుడంతమొందుతన్
ననుచును సిద్ధసాధ్యులు మహర్షి నిలింపులు యక్షకిన్నరుల్
మనముల జింతజేయుచు ప్రమాదము దవ్వావిధంబునెంచుచున్.

క॥ అరయ గగనంబు గగనము,
శరధియు శరనిధియు నగము క్ష్మాధరళంగిన్
పరిబోరు రామరావణ
గురుతర సమరమును జూచుకొనుచును నుండెన్. 285

మ॥ రణవిస్తారుడునైన రాఘవుడు విభ్రాజన్మహాశీ విషో
ప నిశాతాస్త్రమునుం దొడంగి మదివిభ్రాజల్లసత్కుండలా
నను దైత్యాధిపు శీర్షముందునిమె జన్యంబందు బ్రహ్మాండ మె
ల్లను వీక్షించెను నప్డు రావణుని మూర్ధంబట్లు వేలంబతన్. 285

క॥ వెనువెంటనె యొక శీర్షము
దనుజవిభుని యందుమొలిచె దాశరథియు దా
నిని వెంటనె ఖండించెను
ఘనతర నారాచమేసి కడుశీఘ్రముగన్. 285

క॥ మరివెంటనె దానవుసన్
శిరము మొలిచె దానిగాంచి సీతాపతి త
చ్ఛిరమును వెనఖండించెను
శరమును నూరొకటిగాగ ఖండించెనటుల్. 2853

క॥ తల ఖండించిన వెంటనె
తలమొలచుట జూడనద్భుతావహమంచున్
తలచెను రఘురాముడు చిం
తిలసాగెను రావణుండు దెగు మార్గంబున్. 2854

సీ॥ ఖరదూషణాదుల ఖండించినాదను
మారీచు గూల్చితి మహితబాణ
మును నేసి మరివిరాదుని ద్రుమ్మివాదను
దండకంబున కబంధాఖ్యు జంపి
పదునాల్గువేల సురవైరుల తృటిలోన
జంపగగల్గిన యట్టి సారశరము
లన్నియు వృధయౌచు నంతరించెను నేడు
రావణుజంపు మార్గంబదేమొ

గీ॥ యంచు చింతించి రణరంగమందు నలస
గాననాతుండ బాణ సంధాను డగుచు
దానవుని వక్షమందు శరఘాతనంబు
జేయగా రావణుడు రణస్థితుడు నయ్యె. 2855

-: రాముడు రావణుపై బ్రహ్మాస్త్రము ప్రయోగించి సంహరించుట :-

క॥ విజయం బెవ్వరు గాంతురొ
రజనిచర శేఖరుండొ రాముడొ యనుచున్
గజిబిజిపడి మాతలి నీ
రజ బంధుకులీను జూచి రయమున బలికెన్. 2856

మ॥ ధరణీభాగము దద్దరిల్లె కులగోత్రంబుల్ చలించెం బరా
చర భూతాళి యదంబటంచు మదిలో సంభ్రాంతముం బొందె సా
గరముల్ పొంగుచు మిన్ను ముట్టెను ధరాకాంతుండు బ్రహ్మాస్త్రమున్
సురవైరి వక్షముమీద వేయగ జగత్క్షోభాయమానంబుగన్. 2863

ఉ॥ అనిమిషనాథ ముక్తపవి యట్టుల కాలుని యుగ్రదండమో
యనగను లోకకంటకు దశాననువక్షము భూరినిష్ఠురం
బునబడి దాకి చొచ్చి కడు బోంట్యలరీతిని చీల్చివైచినం
దనుజవిభుండు గూలె రణధారుణి ప్రాణములంతరించగన్. 2864

కం॥ ఆ మహనీయాస్త్రం బటు
లా మూఢు దురాత్ము జంపి యశని జొచ్చియున్
భూమీశు తూణిజొచ్చెను
స్వామికార్యమంత దీర్చి సఫలతగాగన్. 2865

చ॥ దనుజవిభుండు మిత్తిగొన దానవులత్తరి ద్వారకొచ్చె వెం
టను తరుమాడు చుండగ వనాటబలంబులు మొరపెట్టుచున్
గనులను నీరుగార్చుచును గాఢవిషాదము దీనభావముల్
గనుపడజేయుచుఁ రణపరాఙ్ముఖులై పురిలంకజేరగన్. 2866

కం॥ దైత్యవిభుని మరణంబును
సత్యధర్మరతుని రామజయమును గనుచు
న్నత్యంతంబును మరుదా
దిత్య ఖచరవరులు సంస్తుతించిరి రామున్. 2867

సీ॥ త్రిభువనంబులను సందీప్తిమై భాసిల్లె
దృప్తిమై దేవదుందుభులు మ్రోసె
విబుధవర్గంబులు వేడుకమై పుష్ప
వృష్టిని గురిసె భూతలము మీద

పరిమళోపేత సంభావ్యమై సుఖదమై
మందానిలము వీచె మహితగతిని
దేవతావర్గముల్ దీవన లిచ్చిరి
ముని సంఘములు మహామోద మొందె

గీ॥ లోక కంటకుడగు దైత్యలోక విభుడు
భూరినిష్ఠుర కర్ముండు భువనభీతి
కరుడు రావణు డా రఘు కాంతుచేత
సంగరావని గూలిన సమయమునను. 2868

సీ॥ సాధుసజ్జనులంతు సంతాపమారెను
దిశలందు తేజంబు తేజరిల్లె
ధరణీతలంబు సుస్థిర జెల్వారెను
నిర్మలత్వము గాంచె నింగియంత
అరుణుడు నిజతేజమంతట దాల్చెను
యాగాగ్ని ధూమంబులంటె నింగి
జనులువిచ్చలవిడి సంచారములు జేసె
నారుల భయములు నంతరించె

గీ॥ సర్వలోకము శుభచిహ్న సరణిదాల్చె
గర్వముడిగెను రాక్షస గణములకును
క్రూరదనుజుండు దశకంఠ రూపుడైన
రావణుడు రాముచేత హెూరాజిగూల. 2869

చ॥ దనుజవిభుండు గూల శరధారుడి నర్కసుతాదు లా విభీ
షణ యుతులై రఘుప్రవరు సంగరభూమినిజేరి రావణుం
జెనకిన భూరిదిగ్విజయ శీలుని రాముని సంస్తుతించె న
త్యనుపమ వీరవాదము లనంతముగా కపిసేన జేయగన్. 2870

-: విభీషణుడు రావణు కళేబరంబును జూచి దుఃఖించుట :-

చ॥ రణతల భాగమందు రఘురామునిచే హతుడైన యగ్రజున్
గనుచు విభీషణుండు దనకన్నుల నశ్రులు రాలనీడ్చుచున్
దనుజ విభుం దలంచుచును దాపము నొందుచు దీనవక్త్రుడై
వినబడ ఘోరమంచు తనువెంతయు గ్రుంగ వచించె నీగతిన్. 2871

ఉ॥ దారుణ యుద్ధరంగముల దండనజేసితి శత్రువీరులన్
వీరుడవన్న పేరుగని విశ్రుత దిగ్విజయంబు గాంచియున్
మీరుచు శాస్త్రపాఠము లమేయముగాగ పఠించివేర్చి యీ
తీరున దిక్కుమాలిన విధిన్ భువికూలితి దైవికంబుగన్. 2872

చ॥ అనుపమ సౌఖ్యతల్పముల యందు సుఖాన్వదలీల నీవు కాం
చనమణి భూషణావళులు గ్రాలగ దాల్చియు నిద్రబోవు నీ
వనుకొనరాని యీక్షితిని నక్కట తేజమువీడి దీర్ఘ ని
ద్రను గొనువాడవైతివి విధాత్రువరంబులు నంతరించగన్. 2873

కం॥ పలుభంగుల నీకీగతి
గలుగునుగా యనుచు మున్ను తరముదెలిపితిన్
జులకనజేసితి మోహా
కులతజేసి తెచ్చికొంటి కోతి యీగతిన్. 2874

చ॥ మరియును కుంభకర్ణుడనమాన బలుండగు నింద్రజిత్తు సం
గరతల ధీరులైన యతికాయ నరాంత మహోదరాదుల న్
కరముహితంబుగూర్పక వికారము నీకును గల్గజేసె నీ
వరయగ కత్తిలేక యిటులక్కట మృత్యువొందితే కదా. 2875

కం॥ ఎంతయు నేజెప్పిన నా
వంతయు వినవైతి వకట బలవద్విధి యీ
వంతలకు నిన్ను ద్రోసెను
చింతించి యికేమినేను జేసెదనకటా. 2876

చ॥ తొలఁగెను నీతిమార్గములు దూరముగా జనె ధర్మమింక గా
సిలె పటుసత్త్వసంగ్రహము చెల్లెను నేటితో స్తోత్రపాతముల్
కలతవహించె నీపురము గన్పడె శూన్యముగాగ భూమి ని
శ్చలతవహించె సర్వనిశాచర శేఖర నీవుసేగుటన్. 287

శా॥ దినానాథుండును నేలఁగూలె శశియుం దీనత్వముం జూపుచున్
మునిగెన్ దొంతలనగ్నిహోత్రుడును నామోదంబు బాటింపక
వ్నఁగెన్ శీతలభావమొందుచు ధరన్ మోదంబులేదాయెగా
దనుజాధీశ విశాలవిక్రమ రణస్థానంబునం గూలుటన్. 287

దనుజసింహంబు రణరంగ ధరణియందు
గూలి యిటు దీర్ఘనిద్ర జేకూర ధాత్రి
యందు పవళించు నీకయి యర్థము దైత్య
గణములకు దిక్కులేదు దశకంఠవీర. 287

మ॥ అతిగంభీరము భూరిమూల బలసాహాయ్యం బసాధ్యంబు ను
స్థితదార్ఢ్యంబు విశేషశాఖల బలాధిక్యంబునౌ రావణ
క్షితిజం బీగతి రామమారుతముచే వేటొంది గూలెన్ధరన్
గతమయ్యెన్ బలసంపదావళులు దుష్కార్యంబుచేతం గదా. 288

క॥ బలమద దంతావళమను
దనుజవిభుడు రామచంద్ర ధరణీనాథుం
డను కేసరిచే మడిసెను
ననిమిషవైరులను దుఃఖమందగ నింకన్. 288

క॥ అతిబల సంభృతమును సం
తత విభవాన్వితము పటుల దర్పంబగు నీ
చితిసంతాన మహాగ్ని ని
క్షితిపాలాశ్రంబు నార్పె చేటుంగూర్పెన్. 288

క॥ ఘనభీమ విపాటంబును
జనహింసకరంబు చపలచక్షులతోడన్
అనయత వర్తించెడు రా
వణ వృషభము రామచంద్ర వారణమడచెన్. 2883

వ॥ అనుచుమ హేతుయుక్తమగు నట్టి విధంబున వాక్యసంతతిన్
వినబడ నేడ్చుచున్ దనుజవీరుని రావణుచేతనుండ నా
యినకులవర్యుడుం జని యహీనతనేడ్చెడు రావణానుజుం
గని యిటుపల్కెఁ జొచ్చె పదిగాంచిన దుఃఖము బాపనెంచుచున్.

-: రాముడు విభీషణు నోదార్చుట :-

శా॥ శోకింపంగనునేల వీనికయి రక్షోనాథుడెంతేని య
స్తోకప్రౌఢిమ భూరిసంగరకళా శూరత్వముం జూపి తా
నేకత్వంబున బోరె వీనికయి చింతింపంగనీకేల నా
లోకింపంగను మేరుమందర సుధీరుండున్ మహావీరుడున్. 2885

చ॥ మరణము గాంచునంతకును మానక వీరరణంబొనర్చె తా
నరిగెను క్షత్రధర్మమున నాహవ భూమిని వీరవర్య లీ
కరణిని బోరి స్వర్గపథగాములునై చనుగాదె కావునని
కరమును స్వస్థతం గనుట కార్యము నీకగు రాక్షసోత్తమా. 2886

చ॥ అరయగ సర్వలోకముల యందు జయంబును గాంచె వీరుడై
సురలనునొంచె భూరిరణశూరత వాహవరంగమందునన్
సరినముడౌచు నాకెదిరి సంగరమున్బొనరించి స్వర్గమున్
దరియగనేగె వానికయి దద్దయు దుఃఖముబొందనేలొకో. 2887

చ॥ మరియును సంగరంబులను మానుగ నెవ్వడు గెల్వవచ్చునో
యెరుగుట దుర్లభంబు పరులెంతయు తన్నునుజంపుతప్పినన్
పరులను దానుజంపు గద భవ్యరణంబున సూరలోక మీ
తెరగున దెబ్బ కాంతురు యధేచ్ఛగ స్వర్గపథంబునెంతయున్. 2888

ఉ॥ నరవర సమ్మతంబును సనాతన రాజమతానుసారమున్
దురమున నీల్గుచో పగతుడున్నించుటయో తిరోసరాభిరంబుగా
వరగును గాదె యాగతిని శత్రుకులాంతకుగు రావణుండను సం
గరమున చచ్చె వానికయి కన్నులనీరును గార్చనేటికిన్. 288

ఉ॥ కాలము దేశమున్నెరిగి కాగల కార్యము చింతజేయుచూ
జాలము జేయునేల విధివంచుటవంబున ప్రాణికోటి యీ
లీలను బుట్టి చచ్చును నెరింగెడువాడవుగాదె నీవు చిం
తాలస వృత్తమున్ విడుము తత్వమునీమతి నూహజేయుచూ. 289

క॥ అనవిని విభీషణుం డా
జనవిభునిం గాంచి దుఃఖ జనితాత్ముండై
దనుజ విభుదతచి పలికెను
వినుమా రఘువంశతిలక విశిత్సితంబుల్. 29

చ॥ అనిమిషనాథు దంతటి మహాబలశాలిని లింపకోటితో
రణమున దాకి నన్నతని ప్రాపును మాన్పి యణంచె మేటియై
ఘనభుజసార విక్రమ మఖండగతిన్ జగముల్ నెరుంగ జే
సెను నిమదాకి చచ్చె వనధీశుడు వేలనుదాటుకై వడిన్. 2

సీ॥ దానధర్మముల విస్తారంబుగా జేసె
గురుదేవతా సేవ వరలజేసె
విపులభోగముల ననుభవించిన వాడయ
శ్రితజన పోషణ జేసెనితడు
నర్థంబు హితవర్గమేలరంగ నిచ్చెను
వైరినంహారుడై వరలినాడు
నగ్నులతర్కల నాచరించిన వాడు
ఘోరితపోవృత్తి బొదవినాడు

గీ॥ వేదశాస్త్రజ్ఞుడును తత్త్వవేత్త యితడు
నిత్యకర్మల నిష్ఠల నెరపువాడు
దహనసంస్కార విధులను ధరణినాథ
సలుపగా సమ్మతమె నీకు తలపనిమ్ము. 2893

ఉ॥ అనవిని రాముడిట్లనియె వైరము దల్పగ జీవకోటికిన్
దనువునయందు ప్రాణముల ధారణ జేసెడి యంతమేరకౌ
మనపని దీరె గావున సముంచిత రీతిని నగ్నికర్మ నీ
వొనరిపు మిత్ర దిర్వురకు నూహనుజేయ సమానుడౌ కదా. 2894

-: రావణకాంతలు రావణుని జూచి దుఃఖించుట :-

క॥ మనుజవిభుడటుల బలుకగ
దనుజవిభుడు రామబాణ తాడితుడగుటన్
రణమున మృతిగాంచిన వా
ర్తను విని రావణుని వనిత లత్తరి జేరెన్. 2895

చ॥ శిరముల పూలవీడియును శీఘ్రముగా కువిరాల కన్నులన్
గురుతర దుఃఖబిందువులు ఘోరముగా వసుగట్టుటంబడన్
కరముల తాడనంబులను కాంచన రత్న విభూషణావళుల్
ధరపయి రాల కాల్నడక దద్దయు దొట్రిల రావణాంగనల్. 2896

క॥ హతవత్స గోగణంబుల
గతి నరచుచు మోదుకొనుచు గడుదుఃఖితలై
దితిజాధిపునిదు గూలిరి
క్షితిని భీకరరణరంగ సీమకేగుచున్. 2897

చ॥ అరిగితె ప్రాణనాథ దనుజాధిప జీవితనాయకా మహా
గిరిధర ధీరయంచు మదికించను బొంది వికాంతదుఃఖమై
నరవరబాణ తాడితుని నాథుని పైబడి యేడ్వసాగె వ
త్తరి దెగనట్టి కానన లతావళియో యన భూరివేదనన్. 2898

సీ॥ ఒక కాంత తనకున్న యకలంక మైత్రిని
దెలుపుచు గౌగిలి దీర్పుయేడ్చె
నొకకాంతపదముల నుత్కటంబుగ బట్టి
తమబోవుగతి జూపి ఘనతనేడ్చె
నొకకాంత గ్రీవంబునున్ హస్తములరాసి
పతి తనుఁజెడి భంగినేడ్చె
నొకకాంత హస్తంబులున్నతిమై జోడ్చి
హా నాథయనుచును నచట దొరలె

ఆ॥ తెలివిలేక యొక్క బాలతుక మూర్ఛల్లి
నాథుశిరము తొడల నంతజేర్చి
బాష్పవారి బిందువర్గంబు చేతను
దనుజముఖము నపుడు దడియనేడ్చె. 2899

క॥ ధరణీతల గతురావణు
పరికించి తదీయ బంధువర్గముతోడన్
పరివరి విధముల నేడ్చిరి
సురవైరి ప్రభుని సతులు శూరుదలచుచున్. 2900

చ॥ హరిహయు నంతవాని సమరావని దీనత బొందజేసె నా
యరుణ సుతున్నె దిర్చి విలయంబగు రూపముమాపుజేసె శం
కరహితు బోరి పుష్పకము గైకొనె దేవవిహంగనాగ కి
న్నరచయవర్గముల్ మునులు నందరె భీతిని నీదుధాటికిన్. 2901

ఉ॥ అంతటి దోర్బలాఢ్యునకు నక్కటకీడు ఘటిల్లె నీడు వి
శ్రాంతము గాగదోచె నరపాలుని చేతను మిత్తిబొందితే
పంతము జూపువాడ సురవర్గమువందున నాగరాజు ల
త్యంతము నిమ్ము గాంచి భయమందుముగాదె నిశాచరాగ్రణీ. 2902

మఱియు సురదానవాదుల
వెరపుగాంచ నట్టి భూరిబీరుడ విటులన్
నరమాత్రునిచే గూలితె
మురవైరి మమ్ము వీడి శోభదొలగితే. 2903

హితమును గోరివచించెడి
హితబోధల వినక కాలమీ గతి గూడన్
మతిచెడి తెచ్చితి జానకి
దితిజాధిప నీకునిట్టి దీనతగలిగెన్. 2904

అనుజుడు నీతిపారగుడు నైన విభీషణు డెంత చెప్పినన్
వినకను ధిక్కరించి పతివీడగ ద్రోసితి వట్టికార్యముల్
వనిగొనివేసి యీగతిని పాటును బొందితి మమ్ము దుఃఖపా
జవగతి ద్రోసి సర్వదమకాంతము జేసితివేమి దిక్కికన్. 2905

జనకజ నీవురాముతకు నమ్మతినీయ విభీషణుండు నీ
యనుజుడు సంతసించు జలజాక్షుడు నీకుహితంబుజేయు మా
కును విధవత్వముందొలగు క్షోభవినాశము రాక్షసాళికిన్
గనపడ కుండుగాదె దశకంఠ మనోహర రాక్షసాధిపా. 2906

పూర్వా పరముల నరయక
నుర్వీసుత దెచ్చు కతన నుజ్వలశోభల్
సర్వంబుజెడియె లంకకు
ఖర్వగతుల్ నీకు మాకు గలిగెను నాథా. 2907

అరయగ నీవు కాముడవంచును దెల్పగలేముస్వేచ్ఛగా
పరముగ నిట్టికార్యముల భావమువందు దలంచవీవు నీ
తెరగులు దైవికంబగువిధిన్ ఘటియిల్లెను గాన నీవు సం
గరముఖమందు దైవగతి నంది మృతింగనినాదవెంతయున్. 2908

క॥ దనుజకుల వినాశనమును
వనచర సంతతుల మృత్యువందుట దలపన్
దనుజాధీశ్వర దైవిక
మున గలిగె నటంచునెంతు ముఖ్యముగాగన్. 290

చ॥ బలమును సంపదావళుల భాగ్యము భోగములెన్నియుండియున్
బలవదరాతి వర్గబల భంజన శక్తుతవయ్యు నస్త్రసం
కలితదవయ్యు భూరి బలకాండ యుతుంతవునయ్యు నీధరన్
జలితమునైన యట్టి విధివ్రాతను గూలితి దోసియశక్యమే. 29

క॥ అనియీగతి దశకంఠుని
వనితాతతి రోదనంబు వారకజేయన్
దనుజవిభు దేవి దుఃఖం
బున జేరి యనేకవిధుల భోరుననేడ్చెన్. 291

-: మండోదరీ విలాపము :-

చ॥ ధనదుని సోదరుందవయి దక్షత భూరి పరాక్రమంధసై
యనిమిష వాసవాది నికరంబుల నీదగు పేరు విన్న చో
మనముల భీతిజెందుచును మార్గములం బడియుంచిపారునే
దనఘ దలంప నొక్కనరు నస్త్రములం భువిగూలితే కటా. 29

క॥ గెలిచితి లోకత్రయమును
బలుతంగుల భాగ్యలక్ష్మి బడసితి లోకం
బులపేరు గాంచినాదవు
నలిగితె యొక నరునిచే రణావని యందున్. 9

చ॥ కరమును మానవాదులకు గాని మహోదధి బంధనక్రియన్
నరుడొకరుండు జేసి నినునాహవ రంగమునందు గూల్చె నే
పరమగు సర్వశస్త్ర శరవర్గము లందున పూర్ణుడైన నిన్
దురమున రాముడన్ నరుడుదుస్సెంచెను నియ్యదినమ్మవచ్చునే. 29

మ॥ దనుజాధీశ్వర మున్ను రాముడు జనస్థానేరటునందుం ఖరా
ది నికాయంబుల సర్వరాక్షసుల నుద్రేకించి చెండాడుటన్
మనుజుం డాతడు కాడటంచు మది సంభావించితిన్ నేడు వా
కను రూపంబుగ దృష్టమయ్యె రణరంగంబందు నీకూలుటన్. 2915

చ॥ అనిమిష దానవాదులకు నైన కఠోరంగనిరాని లంకలో
వనిలసుతుండు చొచ్చుటయు నాతడు లంకను గాల్చి పోవుటన్
గని మదిశంకలొందితిని గట్టును కీడుకటంచు దానినే
కనులను గంటిగాదె దశకంఠ మనోహర ప్రాణవల్లభా. 2916

చ॥ వనచర కోటితోడ దగ వారిధి సేతువు గట్టినప్పుడే
మనుజుడు గాడటంచు రఘునందను నెంచితి కాలుడీగతిన్
జననము నంది దాశరథి చందమునన్ నిను గూల్చ నెంచి యా
దనుజవరేణ్య లోనియెడ దాల్చెనె యుద్ధమహావిపత్తులన్. 2917

చ॥ అతడు సనాతనుండు పరమాత్ముడు యోగియు నిత్యసత్యసు
వ్రతుడును సృష్టిమూలబలవద్విధి యాదియు మధ్యమంతమున్
చతురుడు లోకరక్షణ విచారుడు సాధుజనావనుండు శ్రీ
పతియును చక్రధారియును శవ్యుడు దల్పగ నిశ్రేయంబుగన్.

చ॥ మరియును నవ్యయుండు ఋజుమార్గ పరాయణుడు ఆదివిష్ణువే
ధర నవతారరూపమున దాశరథి తనయుడుగాగ బుట్టి వా
నరగతి రూపముల్ గొని వనాక నివాసులగూడి నిన్ను వధ
గరమున గూల్చెనంచు మదిగాంతును రావణ ప్రాణవల్లభా. 2919

క॥ మును నింద్రియ విజయంబును
నొనరిచి ముల్లోకములను నొంచితిగానన్
దనుజాధీశ్వర పగగొని
నినుగూల్చెను నింద్రియములు నేడీవిధిగన్. 2920

చ॥ తెలిపితి మున్ను నీకు రఘుధీరునితో పగమానుమంచు నా
పలుకుల నాలకించక యథావ్యగతిం జరియించ నేడు త
త్ఫల మనుభావ్యమొందె వలుభంగుల చింతనుజేయనేల నీ
యిలపయి కర్మపక్వముల నెంతయుగల్గు శుభాశుభంబులున్. 2921

చ॥ బలములు గల్గి సంపదల భాగ్యముగల్గియు పెక్కునారులం
గలిగి యనేక బంధుజన కాండము మిత్రులుగల్గి యుండియున్
జులకనజేసి ముందుగతి జూడక సీతను దెచ్చియుండుటన్
బలరిపువైరి యీగతుల వట్టెను గాదె నిశాచరాగ్రణీ. 2922

చ॥ తలప వరుంధతిన్ మరి సుధాకరు తారమ బోలుసాధ్వి ని
ర్మలగుణ శీల భర్తృకమలాంఘ్రి సుసేవల నుండు జానకిన్
తెలివి యొకింత లేకయిటు దెచ్చితివక్కట సాధువర్తమల్
సలిపెడి మార్గమిద్దియొకొ పారవిచారులు దీనిమెత్తురే. 2923

మ॥ పతిసేవారతి నున్న సీత శుభసర్వాంగిన్ మహాలక్ష్మిబోల్
సతి దానొంటరి యౌచు కానవగతిన్ పంవాసముంజేయ దు
ర్మతివై నీవుహరించ నేమిసుఖముల్ ప్రాప్తించె నీకక్కటా
మృతికై జానకి దెచ్చినాడవని యింద్రద్వేషి యూహించెదన్. 2924

క॥ జనకజ పాతివ్రత్యా
గణిత తపముజేసి నీవు గంటివీగతిన్
జనకజ స్పృశింటు వేళను
తనువునీవు దాల్పతద్భుతము బొందె సురల్. 2925

చ॥ అరయగ కిల్బిషంబులను నాచరణంబుమ జేయువాడు దా
పరిణతి కర్మపక్వముగు కాలమునందు వశించు దప్పకన్
కరము నపాత్యమౌను కృతకర్మ ఫలంబుల ద్రోయనేరికిన్
వెరుగవె నీవుదీని రజనీచరశేఖర శాస్త్రవేదివై. 2926

శుభకృతుల జేయువారికి శుభము గలుగు
పాపులకు పాపఫలము సంప్రాప్తమగును
శుభము గాంచె విభీషణ సోదరుండు
నీకునీగతి వచ్చెను నేమియందు.

కం. జనకజ మించునట్టి వనజాక్షులు పెక్కురునీకుగల్గగా
మనసిజ బాణతాడన ప్రమాద పరిస్థితి జిక్కి యీ గతిం
రణమున గూలినావు విధికృత్యము ద్రోయనసాధ్య మేరికి
దనుజ కులాధినాథ మతిదాల్పగ జాలను దుఃఖమీగతిన్. 2928

ఉ. కులమున సాటిరాదు నధికోజ్వలమైన గుణంబులందునన్
దులయునరాదు నందమున దోచదు వానరి రామపత్ని యా
కులవతి మోహితుండవయి కోరుచు మృత్యువుగొన్నబుద్ధి నా
లలనను జానకింగొనగ లంకకు నీవును మున్వుగల్గెడిన్ 2929

చ. తనువుల బ్రాణముల్ విడవు ధారుణి నేడియొ నింద్రలేక గా
వున ధరణీజదెచ్చితివి భోగమిషంబున సీతయెచ్చటన్
జననమునందె నీవెచట నంభవమైతివి మిత్తినీకు నా
జనకజచే విధింపబడె సాగర తీర మహోవరాక్రమా. 2930

కం. జనకజను గూడిరాముడు
ఘన సౌఖ్యములంద నేమువనదుఃఖాబ్దిన్
మునిగెదను నీవులేమిని
దనుజాధిప యేమటంచు దలపోతుకనినన్. 2931

సీ. మందర కందర మందిరంబుల యందు
కనకాద్రి సానుభాగముల యందు
రజతశైలము నందు రమ్యంబులగు యక్ష
వన వాటికలయందు భర్మరత్న

మఱియు గృహంబులయందు మంజులంబగు మహా
హర్మ్యంబులను విమానంబు లందు
భూరిసాగర నదీతీర కాసార వం
తతి లయందున మహోత్సాహ మొప్ప

గీ॥ నీవు జనక సుతగ విహరించి యెన్ని యేని
భోగము లంటి నీవు రణభూమి గూల
నన్ని యును నాశమయ్యె నేడాదిగాగ
నృపతుల సిరులు క్షణ భంగురములు గాదె. ౨౮౩

సీ॥ సుకుమార రూపంబు సుభ్రూలలాటంబు
దీర్ఘనేత్రములు సందీప్తకాంతి
వంతదేహంబును భాస్వరరత్నాంచిత
పటుకిరీటము గండ భాగములను
రత్నకుండలకాంతి రమ్యత గ్రాలంగ
తామ్రాననంబు దరహసితముఖము
దీర్ఘభుజాదండ దృఢ శరీరంబును
నరయ ముద్రాంగుళీతాక్షములును

గీ॥ గలుగుదేహంబు రఘువంశతిలకు బాణ
గతుల విచ్ఛిన్నమై తనుకాంతి దొలగ
రక్తసిక్తుండవై రణరంగ ధాత్రి
గూలినాడవె కర్పూరపాళ్యపుడు. ౨౮౫

చ॥ అరయగ నేను మందమతినౌటను నామనమందునెన్నడి
తెరగు మతిల్లు నంచెరుగ ధీరుడు కాంతుడు బోవ నేటితో
పాడవ మొందగంటి విధవత్వము గాంచితి పాపవల్లభా
కఠిన మనఃపరంబయిన కాలముగూడె నికేమి చేయుదున్. ౨౮౬

ఉ॥ దానవరాజు తండ్రికి బలదర్పుడు రాక్షసరాజు భర్త సం
తానము శక్రజిత్తనుచు దర్పయు గర్వముగాంచియుండె నా
పూనుడు నీవునిట్టిగతి చూచెదరంచును నెన్నడేని నా
మానసమందు నెంచను ప్రమాదము వచ్చె నికేమి చేయుదున్ 2935

క॥ తనువున శరములు నాటుట
దనుజవరా నిన్ను జూచు ధన్యతగాంచన్
గన సిరల రక్తధారలు
తనువెల్లను నిండెనేమి దలతును నాథా. 2936

చ॥ సురల కజేయుడయ్యు బలసూదను నోంచిన శూరుడయ్యు భీ
కరుడయి సర్వలోక జయకామితసిద్ధిని గాంచినట్టి యా
గురుబలశాలి రావణు రఘూత్తముడీ రణరంగమందు భూ
ధరమును వజ్రిఖండన విధంబున గూల్చెను ఘోరరీతిమై.

చ॥ అరయగ స్వప్నమంచు మనమందు దలంతును మృత్యురూపిపై
కరమును మృత్యువుందగిలి కాదియుజెట్టెడువాడవౌట యా
నర విభుడెంతవాడు నిను నంతము జేయగ రాక్షసాధిపా
యెరుగుదు నీబలంబు దనుజేశ్వర సర్వజగన్నుతంబుగాన్. 2938

క॥ ధరగల సర్వార్థంబుల
కరముం గ్రహియించి మరియు ఘనయుద్ధములన్
వరులం దెగటార్చియు స
త్పురము లంకనేలినావు భోగసమృద్ధిన్. 2939

ఉ॥ సారబలాల్ నిహిత కవచాది గృహీత సమస్తశత్రు సం
హారుడు యజ్ఞకోత్ర నృజనావనదక్షుడు హీనవాది బృం
దారక దర్పవార్త ఘటన [illegible] క్రియా
చారుడు భూరిభోగ గుణసాంద్రుడు రాక్షస చక్రవర్తియున్. 2940

క॥ ఘోరతనేడ్చుచు నుండగ
యూరడిల్లుమంచు పలుకకుండక యిటులన్
ధారుణి సుదీర్ఘమగు ని
ద్రారతి వవశించితొక్కొ దానవనాథా. 2947

ఉ॥ నే వవతుంతపంబువిడి నేలపయిం బడదాకినాచు విన్
దాయగ వచ్చియుంటి నిజనారులు శీర్షములన్ మునుంగులన్
వేయక వచ్చిపందులకు వేగమ కిన్కవహింపకుండ నీ
జాయను నూరకుంటి విది సారమతంబొకొ ప్రాణనాయకా. 2948

క॥ నినుజేరి మిత్రసహచర
గణములు పలురీతి నేడ్వగా నవి వినకన్
కినుకవహించియు కఠినత
దనుజాధిప యూరకుంట ధర్మమెనీకున్. 2949

చ॥ పరమసుశీల ధర్మగుణ ధామలదెచ్చితి వార్తల్లెల్ల ని
ష్ఠురవది నిన్ను దిట్టిరి విరుద్ధతబోంబల మంతరింప వా
తరుణుల యశ్రుధారలు వృథాయగు నొక్కొ ధరాతలంబువన్
కరమును నాశకారణము కాంతలు దుఃఖకథాశ్రి రాల్చుటన్. 2950

క॥ వనితల చోరత్వంబున
దనుజాధిప నీకునిట్టి దైన్యముగలిగెన్
మును జగతీతలమెల్లను
ఘనవిక్రమ గతుల జయముగంటివి కాదే. 2951

క॥ హరిణ మిషంబున రఘువరు
తరుణిని జానకిని నీవు తస్కరబుద్ధిన్
కరమును దెచ్చితి గావున
పరిణతి నీరీతి కర్మపక్వముగంటే. 2952

ఉ॥ మరియు త్రికాలవేదియును మోక్షవ్యయుడు నీకును సోదరుండు సు
స్థిరమతియై హితంబుగ విదేహసుతన్ రఘురామునకర్పగా
కరమును బల్కె వాని వినకన్నిటు సర్వవినాశ లోకదం
హరుడవునై రణస్థలిని నక్కట కాయము వీడితేకదా. 2853

చ॥ మంచియొ చెడ్డయో సలిపి మృత్యువుకెందియు నీదుమార్గముం
గాంచుచు నేగియుంటివిక గాంచెదు మార్గమునాకుటావు రా
త్రించరనాథ యేగతి పతివ్రతనై భవదీయు యోగమున్
గాంచకయుంటనాత దశకంఠ మహోజ్వలవిక్రమక్రమా. 2854

సీ॥ హితులును సోదరుల్ హితము గూర్పగనెంచి
తమమరు పద్ధతుల్ దెలిపె
నాజనకుండు జానకిని దెచ్చుట చూచి
యన్యాయమనుచు నీకపుడు దెలిపె
మటకర్ణ మారీచ మనులు నీకెరతయు
హితుమార్గంబుల నీతిబలికె
పతియందు బావిక్షణుడు భావినెరింగి
వైవిధ్యంబుల నీతు వివదపరిచె

గీ॥ వారిమాటల నీతత్వవీధి నీవు
జొరగనీయక బలమద స్ఫురణ జేసి
కోరిమృత్యువు నీవగై కొంటి విటుల
కర్మఫలముల నీగతి గారెటిపోవె. 2855

గీ॥ కనకవేలంబు నీనీల కాయమిపుడు
రక్తసిక్తంబునై పొరిడము త్రిగాంచి
భూమినిదిరించు నీకయి ఘోరమనుచు
రోదనము జేయు ననుజూడరాదొ యేధవ. 2856

క॥ ఘనబల విజయుడు దక్షుడు
రణతలమర్దిత విరోధి ప్రముఖ మాల్యవం
తుని దౌహిత్రుడ వీగతి
నను జూడక యుంట నీకు న్యాయమె యధిపా. 2957

క॥ కలిగెను లంకాపురికిని
కలతలు వేవేగ తెమ్ము గావగ రవిబిం
బ్వలగతి కరముల బరపెను
వలమటలను బొందనీకు వర్తంబగునే. 2958

క॥ రణతలము కందు నను గని
దనుజాధిప బలుక వేల యుద్దయు నాపై
కినుకంబూనితె ప్రియకా
మిని గాదనుమాడ్కి ధర్మమే యితవీకున్. 2959

క॥ ఎంతటి నాదగు తరితపు
వింతగు హృదయంబొ దనుజవీరుండవు నా
కాంతుడు గూలగ నిత్తరి
నింతింతలు ప్రియ్యలొత్తు శిగూల్చవాక్కో. 2960

క॥ అని మయ దానవ పుత్రిక
ఘనశోకము వట్టజాలగా శోకి వడిన్
దనపతి వక్షము ప్రాలెను
ఘనపంథ్యాభ్రస్థ శంపకైవడిని యుంతన్. 2961

చ॥ దరిగల కాంతలంత గని దైత్యకులాధిపు దేవితోడ దు
ర్భరమగు శోకవేదనను బల్కెర రాణివి నీవెరుంగవే
ధరపయి రాజ్యభోగముల తత్పరతంగల యట్టిరీతులన్
కరమును మానుచుండు గదె కాలవిధమ్మనివార్య పద్ధతిన్. 2962

క॥ కావున ధైర్యము గొనుచును
క్రోవంగా మమ్ము లెమ్ము బుణముదీరె నం
చావిధి బల్కగ రావణు
దేవి పతిని బట్టి మిగుల దీనతనేడ్చెన్. 2963

–: విభీషణుడు రావణునకంత్యక్రియలు జేయుట :–

చ॥ జనవిభుడంత గాంచి దనుజాధిపుసోదరు తోడబల్కె నీ
వనితల సేదదేర్చి యికవహ్ని కృతంబగు కర్మజాతమున్
వనుజనకు న్నొనర్పుమన నాతడు ధర్మము నూహజేసి యా
యినకులవర్యుడున్ వినగ నిట్లనిపల్కెను చింతజేయుచున్. 2964

సీ॥ ధర్మమార్గంబును దలపనివాడును
దురితుండు కరుణా విదూర మతియు
పరకాంత హరణైక పాప చిత్తుండును
ఖాతృరూపము గొన్న శాత్రవుండు
జగదేక కంటకుం డగుణుండు కఠినుండు
శిష్ట జనానీక కష్టమతియు
వ్యగ్రజుండైనను నగ్ని కర్మకు నితడు
నర్హుండు కాడని యాత్మదలతు

గీ॥ కర్మములు జేయ నన్ను లోకములు దిట్టు
నొక్క రావణుగుణములు నూహజేసి
చేయకున్నను మెచ్చునో చింతజేయ
జాల నరపాల దెల్పు దయాలవాల. 2965

చ॥ అనవుడు రామచంద్రుడు మహామహితాత్ముడు ధర్మబుద్ధి చిం
తనపడటు బల్కె నీదనుజ నాథు జయంబును నీకృతంబుగా
గనుగొని యుండి నాదుప్రియ కార్యము నీకు ప్రియంబుగావునన్
ననల కృతంబుగాగ క్రియలాచరణంబును జేయగావలెన్. 2966

ఉ॥ ఈతడ ధర్మవర్తనుడు హీనమవమ్మడు పాపచిత్తుడున్
భూత దయావిహీనుడయు బొల్పువహించెను దేవదిక్ప్రతి
వ్రాతము పారదోలి బలుభంగుల విక్రమముం ఘటించె నీ
భ్రాతను కీవలందనుచు భ్రాంతిని బొందుట నీకున్యాయమే. 2967

చ॥ ప్రాణము బోవునంతకును వైరములుండునుగాని యా పయిన్
బూనుట చెల్లరాదు రణముల్న తి జేసి యితండుగూరి నీ
దానవ రాజునీకెటులో దద్దయునాకును నట్టివాడనా
పూను ప్రతిజ్ఞచెల్లెనిక బూనుము ముందగు కార్యజాతమున్.

క॥ కావున దహనక్రియలన్
గావింపుము శంకగొనక కడుధర్మముగన్
నీవలన గొనగ నర్హుడు
భావింపగ నీకు భ్రాత భవమున గనుమా. 2969

సీ॥ రామవచనంబులు రాక్షసేశుని భ్రాత
వినీ యంత దహన కర్మను సుధర్మ
పద్ధతి జేయంగ బహుచందనపు కాష్ట
ముల గూర్చి పితృమేధమును నొనర్చి
యాగ్నేయ దిశగాగ నగ్ని వేదిక నుంచి
వహ్నిపై వాజ్యస్రువంబు పైచి
పశువును బలిజేసి వహ్నియందున వ్రేల్చి
యాజ్య సిక్తములైన యట్టి దర్భ

గీ॥ లంత బరపియు దశకంఠునందు మాల్య
గంధములు నూత్న వస్త్రముల్ గప్పి చితిని
కన్నులను బాష్పబిందువుల్ గారుచుండ
నగ్ని దగిలిచి యార్ద్ర వస్త్రాన్వితముగ
తిలల దూర్వాళి మిశ్రిత జలమువిడిచె. 2970

క॥ జలముల ౖమొక్కుచు నిచ్చియు
వలు విధములసేద్చు దనుజ వరు వతులను సే
దలదేర్చి పురికి నంపుచు
నిలిచెను రఘురాముదరిని నిశ్చలుడగుచున్. 2971

–: విభీషణు పట్టాభిషేకము :–

ఉ॥ రావణు డంత మొందుటను రాముని సంగరవిక్రమంబు సు
ౖగీవుని మంత్రితంబు కమలేక్షణు లక్ష్మణు బాహుశక్తి సం
భావనజేయుచున్ సురలు వచ్చినరీతిని బోయిరంత వా
భూవిభు డాసుర్యాధిపతి భూరిశతాంగము దోలుమాతలిన్
శ్రీవిభవంబుగా బొగడి చేరగ నాకము నాజ్ఞనిచ్చినన్. 297

గీ॥ రాము నాజ్ఞను గొని సురరాజ సూతు
డైన మాతలి స్వర్గ ధామంబు జేరె
వనచరాధిపు డాసుమిత్రి పట్టిగుర్చి
కౌగిలించెను హర్ష పులకాంకురముల. 297

చ॥ అనుజుని బిల్చిరాఘవుడు నత్తరిమన్న విభీషణాసురున్
గని వచియించె యీతడధికంబుగ నాకు సహాయకారియై
రణమున నిల్చె గావున కరంబును నాకుప్రియుండు వీనికై
యొనరుతు మారుగాగ గడునున్నతమౌ యుపకార మిత్తరిన్. 297

క॥ పురమునకు వేగి వేగము
సురుచిర భవ్యాసనమున శుభగతి వెలయన్
సురవైరి ప్రభు నొద్దకు
గురుమతి పట్టంబు గట్టుకోర్కెను సనగన్. 297

గీ॥ వనచరులు కనక కలశముల్ వడిని గొనుచు
వనిధి జలములు దేర లక్ష్మణుడు నొందు
కలశమును గొని యావిభీషణు సలఘుమతిని
భద్ర సింహాసనస్థితి వరలజేసి. 297

ఉ॥ దనుజ వళాంతరాళమున దావరరత్నము నావిభీషణున్
ఘనతర వేదమంత్రము లఖండగతింజెలరేగ పట్టము
గొన నభిషిక్తుజేసె నధికోన్నతి నందరు సంతసింపగా
నినకులవర్య దత్తము మహితలముంగొనె దైత్యనాధుడున్. 677

గీ॥ వచివ వర్గంబు సంతోష జలధిదేల
రామవిభుదత్త రాజ్య విభ్రాజుడగుచు
దనుజముఖ్యుల కాన్కలు గొని విభీష
ణుండు రఘురాముజేర నాన్నృపుడువంత. 2978

క॥ నరవరుడు విభీషణుగని
పర మానందంబునొంది ప్రక్కను గల కే
సరి సుతు హనుమంతుం గని
స్థిరమతి నిట్లనియె కార్యదీక్షా వరుడై. 2979

చ॥ వినుమిక వాయుపుత్రక విభీషణు సమ్మతిజేసి లంకకుం
జని యటనున్న సీతకు నిశాచర నాథుని మిత్తి నాజయం
బున వినిపించి లక్ష్మణుని వృక్షచరాధిపు క్షేమవార్తలం
వినబడ దెల్పి రమ్ము పృధివీసుత సంతసమందు నట్లుగన్. 2980

—: హనుమంతుడు సీతకు రామవిజయము దెలుపుట :—

క॥ నరవరు నాజ్ఞ శిరంబున
ధరియించి యనేకదైత్య క్షతి మానితుడై
పురసీమ జనియె నందున
ధరజగనె హర్షహీనతను గనుదానిన్. 2981

దనుజస్త్రీ పరివృతయయి
ఘనదుఃఖా కలితయగుచు క్ష్మాజమ్మూలమం
దున నున్న జానకిం గని
యొను తేజములేని రోహిణి క్ష్మార్కగతిన్. 2982

క॥ కనిప్రాంజలి ఘటియించుచు
వినయపటిమ తవదుపేరు వినదెలిపి మహా
జనితా నందాత్ముండయి
వినిపింప దొడంగె రామవిభు విజయంబున్. 2983

మ॥ వినుమో సాధ్వి రణాంతరంబునను పృధ్వీనాధుడా రావణున్
దునిమెన్ లక్ష్మణ హనుమానుల రణోద్యోగంబుచే నావిభీ
షణుండు దోడుగనుండ వానరపమ స్తంబైన సైన్యంబుతో
వినిపింపంగను రాముడంపె ధరణీ విఖ్యాతసాధ్వీమణీ. 2984

క॥ జనవిభుడు రామచంద్రుడు
ననుజుడు రవిసుతుడు నంగదాదులును విభీ
షణుడును నత్తరి కుశలత
దనరుచునున్నారు సుమ్ము ధరణీపుత్రీ. 2985

క॥ ధరవద్భుత కార్యంబును
నెరవేరిచి నన్నుబంపె నీకడకును తా
మరసాక్షి రాముడంపిన
సురుచిర వార్తలవినుము శోభజెలంగన్. 2986

సీ॥ ధరణిజ నీకు నేకరము ననురక్తుడ
నాభాగ్యవశత ప్రాణముల నీవు
నిల్పగల్గితివి యనిందితాత్మవు గాన
జయము గాంచితి ధర్మసంగరమున
దశకంఠుజంపితి తత్పురముగులంక
నాకు స్వాధీనత నలరు కతన
చింతింపబోకు నిశ్చింతంబుగా నిన్ను
బంధముక్తను జేసి వరలినాడ

తే॥ జలధిసేతువు గట్టి నిక్కముండగ్రి గరిమ
జగతిగల సర్వవానర చయము నాకు
సాయమొసరగ నా ప్రతిజ్ఞా విధంబు
నేడు సంపూర్తి యయ్యెను నీరజాక్షి. 2987

క॥ రావణుని గృహంబంచును
భావంబున దలచినీవు భయమందకు మీ
కేవలము నిజగృహంబున
నీవిపుడున్నట్లు దలచుటెంతయు నొవ్వన్. 2988

క॥ అని రాముని వాక్యంబులు
వినిపించిన నామెవినుచు వేగమె లేచెన్
మునిగతి మౌనము దాల్చుచు
ననిలసుతునితోడ మాటలాడక యచటన్.

క॥ జానకి యాగతి మౌనం
బూనగ కారణము తెలుపు బోల్పగలేకన్
వానరపుంగవు డపుడా
మానిని కారణము దెలుపు మంచును వేడన్. 2990

క॥ అని హనుమంతుడు బలుకగ
వనితామణి ధర్మబద్ధవాక్యసరణి ని
ట్లనియెను గద్గదకంఠ
స్వనయై మౌనంబు తతము సాగించివన్. 2991

చ॥ అనిలతనూజ రావణవిజయాదిక సుప్రియ వార్తనెంతయున్
విని విశదత్వమొందితిని పెద్దకవార్తను దెల్పువారికిన్
వినబడ నేమి పల్కుదని వీక్షణజేసితి కావ్యవస్తువుల్
దనరవు వాదుచెంత నినుదన్పగ నిచ్చుట నంజవాముగా.

ఉ॥ మరియును విశ్వమందుగల మానికముల్ రజతాదిమేరువుల్
పరియగునొక్క సత్యమయ సంగతిఁజెందిన మాటకెందునన్
హరివరయంచు బల్కగ పదాగతి సూనుడు ప్రాంజలించి యా
తరుణికి బల్కె సద్వినయతా విధి నామెయు సంతసింపగన్. 2893

ఉ॥ శ్రీరఘురామచంద్రుని రణసీమ జయంబును దెల్పువానికిన్
గూరుగ నిచ్చునట్టి బహుమానము లేదు జగత్త్రయంబులన్
సారతబల్క నీపదమె చాలును నన్నిటికన్న మిన్నయై
భూరిమణీవిభూషలను భోగము స్వర్గము సాటివచ్చునే. 2894

క॥ రావణ విజితాత్ముని యా
భూవరు శ్రీరాముజూచి భూరి భోగసం
భావిత నాకము కన్నన్
పేవిధులన్ సంతసింతు విమలేందు ముఖీ. 2895

క॥ అని హనుమంతుడు బలుకగ
విని జనకజ హర్షమందు వితతిని కనులం
దున రాలబలికె నీగతి
వనచర వీరునకు హర్ష భావంబలరన్.

ఉ॥ హరివర నీకె చెల్లె సమయస్ఫురితంబుగ మాధురీగుణా
కరమును సమ్మతంబునగు కార్యములం ఘటియించి పల్కుటల్
పరమ సుధర్మవృత్తుడవు వాయుసుతుండవు విక్రమక్రమ
స్ఫురిత యశోవిశాలుడవు సూరివరుండవు కోవిదుండవున్. 2897

—: హనుమంతుడు రాక్షసస్త్రీల జంపెదననుట :—

ఉ॥ జనకజ యట్లు బల్కగను సామిరి యంజలి సంఘటించి యా
దనుజకులాంగనల్ బహువిధంబుల కారియ నిన్ను బెట్టి గా
వున హతమొనర్తు శలవు నొసగంగను నిన్ను వేడెదన్
వనుగరుడింపు మీదనుజ వారలు బెట్టిన బాధ జూచితిన్. 2898

సు॥ వరిచింతామతివై ఘనేక విధులన్ బాధాకులస్వాంతవై
వెతలం బొందెదు నిన్ను గాంచియు దయానీవై కవేతన్కవై
యతి ఘోరంబుగ శిక్షజేయగ సముద్యద్భీతి పీడించె నా
గతులన్నివు దలంచి యాజ్ఞనిదుమా ఖండించెదన్ వీరలన్. 2999

చ॥ అనవిని వల్కెజానకి మహాత్మక వీరున్నపాశ్రియంబునన్
దినములు బుచ్చువారు పతి దెల్పినరీతినిజేయు వారలం
గనలను దామలం గినియ నక్కటధర్మమె వీరకృత్యమే
వనచరవర్య నీవెరుగవా యిది తెల్పగ నేల నీవిధిన్. 3000

క॥ మ న సేచేసిన పాపము
ననుభావ్యము నొంద దుఃఖమందితి గాదే
జనులకు కృతాకృతంబుల
వసుగుణమగు ధర్మఫలమువందును గాదే. 3001

క॥ కలిగెను దుర్దశకాలం
బలఘుగతిని యంచు శాంతమగు చిత్తమునన్
నిలిపితిని జీవముల కపి
కులతిలకా తెలియుమింక కోవిదవర్యా. 3002

క॥ దనుజ విభునాజ్ఞ చేతను
దనుజాంగన లిటులనన్ను తర్జించిరి యా
దనుజవిభుడేగె గావున
ననుతర్జన జేయరింక వగచర ముఖ్యా. 3003

క॥ మునుభల్లూకము వ్యాఘ్రం
బునకు న్నుపదేశమిచ్చె పుణ్యవ్రదమౌ
ఘననీతి వాక్యమది నే
వినిపింతును కీశలోక వీర వరేణ్యా. 3004

చ॥ ధరపయి సజ్జనుండు తనదారిని బోవును నెవ్వడైన దు
ష్కరమపకారముస్ తనకుసల్పిన నాతడు దానికెన్నడున్
కరమపకారముస్ సలుపగా మదినెంచడు ధర్మవృత్త మీ
కరణిని జెల్లుగాదె కపికంజవనాంతర హేళి మారుతీ. 3005

చ॥ మఱియును పుణ్యులందు బహుమాయికులందు నవధ్యులందునన్
హరివర నక్కృపన్ జూపుటర్హమగాదె ధరాతలంబునన్
నరసిన పాపముల్ సలుపనట్టి యితండు గలండె మారుతీ
యెరుగవె కోవిదుండవయి యిట్టివిధుల్ దెలువంగనీలోకో. 3006

క॥ కావున వీరల జంపక
యో వానర వీరవర్య యుడుగు సుభయము
న్నీవరకె యిచ్చి యుంటిని
బ్రోవంగా వలయువీరి బ్రదుంపగనగునే. 3007

-: సీత రాముని జూడగోరుట :-

చ॥ అనుచును సీతపల్క హనమంతుడు దానికి సమ్మతించి యి
ట్లనియెను రామపత్నివి గదమ్మ యిటుల్ బలుకంగనేర్చితే
జనియెదు రామసన్నిధికి సత్వరటన్ బదులేమి చెప్పెదన్
వినబడ బల్కుమన్న వృథివీసుత వాయుజు గాంచి యిట్లనెన్.

క॥ మారుతనందన నే వల
శ్రీరాముని జూడ నిచ్చ జేసితి వినినన్
నారీమణి లక్ష్మణ యుతు
శ్రీరఘువరు రామునింక జేరెదవనియెన్. 3009

క॥ అని సీతా జననికి వం
దనము లాచరించి దశరథాత్మజు రామున్
గననేగి రామునకు నా
జనకజ వృత్తాంతమంత సరవిని బలికెన్. 3010

మనుజాధీశ్వర దేనికై యిటుల సామాన్యప్రకారంబులన్
ఘనకార్యంబులు సంఘటించియును లంకానాథుఁజెండాడితో
వనితా రత్నమునట్టి సీత గన నీవౌదార్యముంజూపవే
జనకాధీశ తనూజ నీవిజయముఁన్ శ్లాఘించె నెంతేనియున్. 3011

నను నమ్మియు జనకాత్మజ
నిను లక్ష్మణ సహితుఁజూడ నిచ్చగొనియె గా
వున నీవు కార్యసాధన
మును జేయుము తడవదేల భూతలనాథా. 3012

-: రాముడు సీతను తెమ్మని విభీషణునకు దెలుపుట :-

మ॥ హనుమంతుండటు పల్క రాఘవుడు నేత్రాంతంబులన్ బాష్పవాః
కణముల్ రాలగ వెచ్చనూర్చుచును యుక్తంబైన వాక్యంబులన్
తన చెంతంగల యా విభీషణుని నత్యంతంబు సంప్రీతిమై
కని భాషించెను జానకింగనగ యుక్తంబంచు చింతించుచున్. 3013

మ॥ దనుజశ్రేష్ఠను భూమిజాత నిక నాదృష్టిన్విలోకింపగా
మనమందెంచితి నామె దెమ్మిటకు సన్మాన్యమ్ముగా స్నాతగా
ఘనభూషాంబర యుక్తగా నవయువ శ్రీంఖాంగరాగాంగగా
జనుమా రాముని యాజ్ఞగాదెలిపి యా సాధ్వీమణిం దెమ్మిటన్. 3014

చ॥ అనుచు విభీషణుండు దనుజాంగనలన్ మహిజాత చెంతకున్
బనిచిన వారలేగి రఘువర్యుని యాజ్ఞ గనంగరాగ భూ
షణ రుచిరాంబరంబుల నసద్గతి ధాల్చి యు నందలంబునం
జనవలె రాము చెంతకన సాధ్వి యు నీగతి బల్కె నత్తరిన్. 3015

క॥ స్నానముజేయక యిప్పుడు
నేనిటనున్నట్టి రీతి నేగెదు విభునిం
గానంగనంచు పల్కిన
దానవవరత్నంబు పలికె ధరణిజకంతన్. 3016

క॥ శ్రీరాముని యాజ్ఞను వో
నారీమణి నీకుదెలిపినాడను వతి యా
జ్ఞారీతి సంచరించెతి
ధారవు నీవరయుమింక ధర్మపథంబున. 3017

క॥ వతియాజ్ఞ నిర్వహించుచు
సతికిని ధర్మంబుగాగ సాధ్విదలచి యో
గతి సుస్నాతయునై యం
చిత వస్త్రసుభూషణాళి శీఘ్రమతాల్చెన్. 3018

క॥ శిరమున మేలి ముసుంగిడి
వరలు దివ్యశిబికనెక్కి పతియాజ్ఞగ నా
ధరణిజ యేగెను నీరా
కర స్పష్టకరుణాత్మ తనదు కాంతుని గనగన్. 3019

—: విభీషణుడు జానకి రాక రామునకు దెలుపుట :—

క॥ నరవరుడు ధ్యాననిష్ఠ
సిరుడై యుండంగ దరికిజేరి దానవా
ధీశుండటు విభీషణు డా
ధరణిజ వచ్చుటను వినయతా విధి బలికెన్. 3020

క॥ దానవు గృహాంతరంబున
జానకి బహుకాలమున్న సంగతిమదిలో
భూనాధు డూహజేయుచు
మానవగతి దైన్యరోషమంతట జెలగన్. 3021

క॥ మదిలోన విమర్శించుచు
పృధివీనాధుండు నావిభీషణుగని యా
సుదతీమణి సీతను దా
నధివసించు దరికి దేవ వాజ్ఞాపించెన్. 3022

ఉ౹౹ భూవిభునాజ్ఞ నాదనుజ పుంగవుదవ్వుడు వేగ జానకీ
దేవిని చుట్టుముట్టుకొని దృప్తముగాగ జరించువారలన్
ద్రోవకునడ్డమౌటగని ద్రోయగ జేసిన వారు భీకరా
రావములన ఘటింప పృథులంబుగ మ్రోసె దిగంతరంబులన్. 3023

క౹౹ ఆ రావంబుల విని భూ
దారుండతి కినుకనొంది దానవనాధున్
భూర్యనల తుల్యదృష్టుల
వారయుచును బల్కెనిష్ఠురంబగ్గు సూక్తిన్. 3024

క౹౹ వీరలు వారించెదె యీ
తీరున మర్యాదవీడి తెలియుమికను నా
వారలుగా వీరిని యీ
దారుణ వృత్తంబు జేయుదగునే నీకున్. 3025

గీ౹౹ వస్త్రసంతతి కుడ్యముల్ భవనములును
రాజలాంఛనముల్ తెరల్ రావు స్త్రీల
కడ్డముగ బోవ వారల కరయు రక్ష
జేయు శీలము సంపద చిరతరముగ. 3026

గీ౹౹ సమరముల యందు పెండ్లియో సమయములను
వ్యసనముల బొందువేళ స్వయంవరముల
యజ్ఞయాగాది క్రతువుల నాచరించు
సమయముల స్త్రీలజూడ దోషంబుగాదు. 3027

జనకజ రణరంగసీమ
ఘన దుఃఖక్లిష్టచిత్త కడుదప్పి యిటుల్
తనపట్టి చెంతకు జేరగ
జనునే చూపరుల ద్రోయు సమయమెరుగకన్. 3028

-: శ్రీరాము చెంతకు సీతాదేవి వచ్చుట :-

క॥ కావున నిప్పుడు సీతా
దేవి వన్నుజూడనిటకు దెమ్మననపుడా
దేవారి జానకీ సతి
భూవిభు వన్నిధికిదెచ్చె ప్రమొక్కుల నిడుచున. 3029

క॥ జనవరుడాడెడి మాటల
విని సౌమిత్రియును వద్మవిభు సూనుండున్
హనుమంతుడు మదిశంకల
గనె సీతనువిభుడు ప్రియత గాంచడటంచున్. 3030

చ॥ వినయవిధేయతా విధుల వృద్ధిజ దానవరాజువెంట రా
ముని దరియంగవచ్చి తనమోము ముసుంగునమాటుజేసి యా
నరవరు మోముగాంచి కదనాంతర భూమిని జేవితేశ యం
చుదు గతినేడ్చె నార్తిగొని చూపరులందరు చూచుచుండగన్. 3031

మ॥ చిరకాలంబుగ గాంచనట్టి పతినిం జెల్వొందు ప్రేమాభిమా
వరతింగాంచెను పూర్ణచంద్రముఖు భూనాధు ప్రతాపోన్నతున్
నరిసంహారవిశాల విక్రమయుతున్ గంభీర ధీరాత్మసం
చ్ఛరితున్ రావణమర్ధనున్ నిజమనోజ్ఞాత్మక శృంగంబునున్. 3032

-: రాముడు తన విజయము సీతకు దెలుపుట :-

క॥ వినమిత గాత్రయు నగుచును
జనకజ తనదరిని నిలువ క్ష్మావిభుడంతన్
ఘనటుచు నందరు వినగను
తవసతితో నిటులబలికె దయుజూవకయున్. 303[illegible]

క॥ కరము విరోధియైన దశకంఠుని జంపితి భూరిశక్తి దు
ష్కరముగు కార్యముల్ సలిపి శాత్రవవర్గము కీటడంచితిన్
జరుపగలట్టి కార్యముల సర్వముజేసితి సార్థకంబునై
పరగెను నాదుజన్మ ధరబాయనికీర్తి వహించెంటయున్. 3034

మును నే పలికినబాసల
ఘనగతి దీర్చితిని పూర్ణ కాముడనైతిన్
జనపతుల యందు శిరమును
మునుపటివలె నెత్తి తిరుగబోలును బాళిన్. 3035

క॥ నేలేని యట్టి వేళను
లోలాక్షీ రావణుండు గూర్రుండగుచున్
లీలగ నినుహరియించెను
దోలితి దోషంబు వానిద్రుంచుటకతనన్. 3036

క॥ అవమానంబులు గలిగిన
యవమానము బాపు కర్మలా చరింపకన్
పవనిం పురుషుండగునే
యవినేను నొనర్చి పూరుషార్థము గంటిన్. 3037

క॥ శరనిధి లంఘించుటయును
శరనిధి బంధనము కపులసాహాయంబున్
పురి లంకా నాశంబును
కరమును సఫలంబులయ్యె ఘనతరలీలన్. 3038

క॥ రణ భూమిని తగుమంత్రో త
మ ను గూరిచి విక్రమంబు బొదజూపిన యా
యువజుని కృత్యంబులు నా
కనుపమ విజయార్థమగుచు నలరెను వింటే. 3039

క॥ అనుజుని దుర్గుణు వీడుచు
ననుశరణము వేడు దనుజనాథు సోదరుం
డన దగు విభీషణుని మన
మున కోర్కెలు సఫలమొందె మోదముగాంచెన్. 3040

మ॥ అని యా రీతిని బల్కగా జనక కన్యాసాధ్వి నేత్రంబులన్
జనితం బౌచును శోకబిందువులు విస్తారంబుగా రాల నా
జననాథుండును మందువగ్నిపయి నాజ్యంబాహుతింజేయు రీ
తిని క్రోధాంచిత మానసుండగుచు సందేహించక న్నిట్లనెన్. 30

చ॥ కరమును శత్రుసంహరణ కార్యముజేసితి లోకమందునన్
పురుషవరుండొనర్చెడు విభూతి యుతంబగు కార్యజాతమున్
జరిపితి సుంతసంశయము సర్వనికాయుల దక్షిణాశయం
దరయువహించు భంగి నిమదప్పగ జేసితి శత్రువారికిన్. 30

క॥ హితమతుల సహాయంబున
దితిజుల రణమందు గూల్చి ధీరుడనై యీ
క్షితితలము నందు నుండుట
యతివరొ నీకొరకు కాదటంచునెంచుమా. 30

క॥ వాకుంగలిగిన నిందల
బోకార్పగ వంశగౌరవోన్నతి నిలుపన్
వాకారుతో బోరితి
నీకై బోరంగలేదు నిజముగ గనుమా. 30

గీ॥ లోకశంకిత చరితవు లోలనయన
వాడు చెంతను నిలువంగనగునె నీకు
కళ్ళకలకను గొను వాని కళ్ళముందు
ఘూరదీపంబు భంగిని బోలితీవు. 30

క॥ అనుమతినిచ్చితి నా
చను మెచ్చటికైన నీకు సదుపాయములున్
గన వచ్చు దేశమునకును
వనితా నాతోడనీకు పనిలేదుకదా. 304

క॥ తులజుం డెవ్వండై నను
తిలకించునె యన్యగృహగతిం గాంచిన యా
లలను నీవాపంగతి
దలపోయుమె యెరుగతీవె ధరణిజాతా. 3047

చ॥ దురితుడు రావణుండు నిమదోహపు దృష్టులజూచె వంకమం
దరయగ శ్లిష్టపై తివి విధానము దప్పితి రాజపుత్రివై
కరమును సత్యధర్మగుణగణ్యుఁడనంచును పేరుగొన్న నే
నరయక నిన్ను గైగొనుట న్యాయముకాదని నీవెరుంగవే. 3048

చ॥ అపయశముల్ దొలంగగ మహారణభూమి దశాస్యుఁజంపితిన్
విపులయశంబు గాంచితిని వీడితి నీపయి స్నేహమోహముల్
నుపకృతి నీకుజేసితి ననూహ్యములైన మహావిపత్తులన్
తవనత నొందకుండఁగతి నాజనొసంగితి బోవుమెందునన్. 3049

చ॥ నిలుపుము నీకునిష్టమగు నేనియు లక్ష్మణునొద్ద గానిచో
దొలగుము కైకసూనుదరి తోయజబాంధవపుత్రి చెంగటం
గొలువుము గానిచో దనుజ కోవిదరత్న మునీవిభీషణుం
దలఁపుని చెంతకేగుము మనంబుల శంకల బొందనేటికిన్. 3050

చ॥ సురుచిర సుందరాంగివయి చూపులకున్ననురాగ దృష్టవై
సురపతివై రిగేహమున జూడగనుండితివి చాలకాలమున్
తరుణిరొ నిన్ను జూచుచును దానవనాథుడు నూరకుండు నీ
వరుగుము నెందునైన దడయింగను నేలమ నొల్లనిన్నికన్. 3051

చ॥ తనకును వంతసంబు ఘటితంబగువేళను నాథుడీగతిన్
వినుటకు వీలుగాని కటువిప్రియముల్ విని భూరివాత వం
జనిత రయంబునన్ లతిక సంచలంబును బొందు భంగి యా
జనకజ వంచలించుచు నిజాశ్రు కణంబులరాల్చె చిత్తరిన్. 3052

-: రామునికి సీత ప్రత్యుత్తరమిచ్చుట :-

చ॥ ధరను కఠోరమానవుడు దారను క్షుద్రకజాతిపఙ్క్తిపా
క్వరతిని బల్కుతీవు నిదిపత్యమె న్యాయమె ధర్మమార్గమే
నరవర వంశయించితివి నన్నిటు భావ్యమె శీలసంపదన్
దరుగని దానినంచు మదదాత్మ్యము రామునివత్ని గావవే. 3053

మ॥ కులమర్యాద విహీనకులకలమ సాకుం జెప్పి తన్నిగతిన్
దలబోయంగమ నీకుధర్మమె నరేంద్రానీక సంస్తోత్రి తం
కలు బోవంగను నన్ను నెంతయు పరీక్షఁ జేసి నన్నిగతిన్
పలుక న్మేరపుగాదె రామవసుధా పాలా మనోనాయకా. 3054

క॥ తెలివిని దప్పినవేళను
బలితుడు రావణుడు నన్నుపట్టి శయించి కొనెన్
దలపగ దైవిక విధమున
బిలతిని వాదోషమెట్లు బొసగునొ చెపుమా. 3055

క॥ మనమును నీయం దుంచుచు
తనువును నిల్పితిని నింతదనుకను రామా
మనిశిత సాయక జాలము
లను బోలెడు నిష్ఠురోక్తు లనగా దగునే. 3056

మ॥ చిరకాలంబుగ నీశరీతిగను సుస్నేహైక భావంబు సు
స్థిరతన్ వర్ధిల నీవునేనొకటిగా శ్రీయుక్తిమై కాలమున్
జరుపన్ లేదే మహాత్మ నాయెడల శంకంజేయగానేల నీ
వరయం జాలని వాదవేని హతనై యత్యంతముం గూలెదన్. 3057

చ॥ అనిలసుతుండు వచ్చి వనమందున వన్గనియున్ననాడు నీ
మనమున గల్గు శంకలను మానములేకయె చెప్పియుండినన్
తనువును వీడుదానకద దానను నీకును కష్టమైన యా
రణము దొలంగియుండు గద రావణ నాశముజేయనేలకో. 3058

క॥ నేకడ శేరియె యుండిన
నీకును నీవానరులకు నీమిత్రులకున్
లేకుండు రణక్లేశము
కాకుత్స్థ కులాబ్ధిచంద్ర ఘనబల సాంద్రా. 3059

ఉ॥ ధరణి తలంబునుండి జనితంబయి ధన్యవిదేహరాజ భూ
వరుగృహమందు వెంపెరిగి భూపలలాముని నిన్ను గూడి సం
చరమును జేయు నన్నిటుల శంకలజేయుట నీకు ధర్మమే
గురుతర కోపమూని యిటు కూడని పల్కులు పల్కగూడునే. 3060

సీ॥ చిరుతవయసున నేను చిరుతవయసున నిన్ను
పెండ్లియాడుట దల్పవైతి వొక్కొ
దైవంబుగా నిన్ను భావించి సేవల
దీర్చుట మదిలోన దెలియవొక్కొ
యిర్వుర హృదయంబు లేకత్వగతి జెంది
యన్యోన్యతను నుండు టరయవొక్కొ
భవతియ సుఖదుఃఖ పరిపాటి నీతోడ
సరిభాగములు గొంట మరచితొక్కొ

ఆ॥ విస్మృతింబొందితే పూర్వ వృత్తములను
పూర్వమైత్రిని విడిచి యపూర్వముగను
నిర్మలంబైన నాశీల నియమములను
శంక జేయుట ధర్మమే సారసాక్ష. 3061

—: సీతాదేవి యగ్నిప్రవేశము జేయుట :—

మ॥ అనుచుం గద్గదకంఠి యౌచు పటుదుఃఖాక్రాంతుడై యున్న ల
క్ష్మణు వీక్షించుచు బల్కె యీ ఘనతరంబైనట్టి శోకంబు బా
ప్పను నగ్నిం జొరుదాన గావునను నీవాలస్యముం జేయకన్
దహనంబున్ సమకూర్పు శీఘ్రముగ నా నాథుండు శంకించెడిన్.

క॥ పరిభవ మొందితి వరిచే
నరయమి వశయందు నన్ను నాథుడు వీడన్
వరపతికి యోగ్య మార్గము
కరము వహ్నిఁ దొచ్చుటగును గాదె తలపన్. 3063

చ॥ జనకజ యట్లుపల్కగ నశాంతిని బొందుచు లక్ష్మణుండు దా
ననుజాని దిట్కఁజూచి మహిజాత్మని యాశయమున్నెరింగి యా
జనవిభు నాజ్ఞగాగ చితిపత్వరతన్ పమకూర్చ జానకి
మది రఘురాముపీఠి యటమందు చితిన్ దరియంగఁజేరుచున్. 3064

క॥ జనకజ యనలము దరి చని
యనలునకు నమస్కరించి యమరుంవరులకున్
వినయత మొక్కుచు రాముని
మనమున దలచుచును ధర్మమార్గాన్వితయై. 3065

చ॥ నిరతము నామనంబు గడు నిశ్చలతన్ రఘురామునందువన్
కరమును నిల్పదేని మదిగాంచెదనేని సుశీలవృత్తము స
తరుణి వసుగ్రహించి వనుగావుత హవ్యవహుండటంచు భూ
వరుని మనంబునందలచి వారని భక్తి నమస్కరించుచున్. 306

క॥ వను శంకించెను రాముడు
మనమున నేదుష్టమార్గమన్నది లేకన్
మనియెద నేనిం దహనుడు
మనుచుగాత నన్నుఁ గడు ప్రమాణముగాగన్. 30

చ॥ మనమున వాక్కునం దితరమార్గములన్ దనువందుకర్మలన్
జనవిభు రామచంద్రు మనసార భజింతునయేని వానికిన్
వనువుగ సర్వకార్యముల యందు జరింతునయేని తప్పకన్
వనలుడు నన్నుఁ బ్రోవుత కృపాకరియు మిచ్చుచు జూడనందరున్.

మ॥ దిననాథుండు సుధాకరుండు దిశలున్ దిగ్దేవతా వల్లభుల్
దినముల్ రాత్రులు సంధ్యలున్ సురలు సందిగ్ధంబుగాకుండ నే
ననయంబుం గుణశీలనం బెరిగినన్ న్యాయంబు బాటించి వ
న్న సుమానంబును లేకపోవగదవే స్వాహావధూవల్లభా. 3069

చ॥ అనుచు ప్రదక్షిణించి విమలంబగు భక్తిని రాముసెంచి యా
జనకజ వహ్ని మధ్యమున సర్వజనంబులు జూచుచుండగా
వనిగొని చొచ్చె హాయనురవంబులు మిన్నునుముట్ట ఘోరభం
గిని జగతిన్న పూర్వమని కీశజదైత్యులు భ్రాంతిజెందగన్. 3070

క॥ అనలమున పుటముబెట్టిన
కనకపు ప్రతిమా వికాస కాంతుల తోడన్
జనకజ యవలక్షితయై
కనపడె బహులాన్వృతంబు గాగన్ మహిలో. 3071

చ॥ అరయ ప్రవాళరాశి గతమైన సువర్ణశలాక కైవడిన్
సురుచిరపల్లవంబులను శోభిలు చంపకపట్టు రక్తభా
సుర వనజాలయంబున సుశోభిత హంసియనంగ సాంధ్య వి
స్ఫురిత ఘనాంతరస్థ శశిచాప్పున గన్పడె చూచువారికిన్. 3072

గీ॥ నాక భూమిని శాపంబునంది నిరయు
మందుపడు నిర్జరాంగన యనెడు రీతి
యక్షగంధర్వ సిద్ధ విద్యాధరాది
ఖేచరులు దేవతలు జూచె క్షితిజకృతిని. 3073

క॥ దరిజేరియున్న కపులను
మరి యసురులు దహనునందు మహిజచొరబడన్
పరిపరి విధముల నాహా
కరవాదము లాచరించె గడుదుఃఖమువన్. 3074

-: శ్రీరామునకు బ్రహ్మేంద్ర రుద్రాదిదేవతలు ప్రత్యక్షములగుట :-

క॥ వారల రావము విని యా
ధారముఖుడు దాశ్వవారి పూరితాక్షుడై
మూరుత మాత్రంబుండెను
ధారుణి సుత దహనమందు తనువుండోర్చియన్. 3075

ఉ॥ ధనద విరించి శక్రులును దండధరుండు యముండు ఫాలలో
చన వరుణాదులున్ దివిని సత్వరతన్వి డి భాసుతుల్యముల్
విమల విమానపంక్తి రఘువీరునిజాడగ అంకవచ్చి భూ
షణ యుతహస్త సంపుటిని జాలగ భక్తిని మొక్కి యిట్లనెన్. 3076

ఉ॥ ధరణి సుతాభిరామ గుణధామ జగత్త్రయమూలకారణా
యరయగ సర్వకాలముల యందున మేటి విజ్ఞానులందునన్
ధరణిజ వహ్నికీలల వృథాగతి జొచ్చిన నీవు మానసాం
తరగతి సంచలింపవు కదా మదినెంచవె నీవెవండవో. 3077

సీ॥ దేవతా చక్రవర్తివి గావె మున్నీవు
వసువులందువ ప్రజాపతివి గావె
ఋతుధాముడవు నీవె లోకాతిశేలను
ప్రభుడవు మరి స్వయంప్రభుడవీవ
రుద్రులందువ మహారుద్రుండవు న్నీవ
సకల భూత ప్రవర్తకుడవీవ
చంద్రసూర్యులు నీకు చక్షువులై యుండ
యశ్వులు కర్ణంబులగుచు శివయు

గీ॥ జగతితతులకు విలయంబు జరుగువేళ
నాదికాలంబునందు నీవంత్య ప్రుండు
జగతి ప్రాకృతలీల నీజనక సుతను
గాయగానీకు కూడునే భవ్యచరిత. 3078

మ॥ అని దిక్పాలక వర్యులున్ బలుక దానాలించి రాముండు ని
ట్లనియెన్ నేనొకమానవుండ ధరణీ భృన్నాళికింబుత్రుడన్
వమచున్నెంచెదు గానిదో దెలుపుడీ న్యాయంబుగా నెందుకై
జననంబందితి యేరివాడనో సవిస్తారంబుగా నిత్తరిన్. 3079

క॥ జననిభుడు వటులబలుకగ
వనిమిషులను బెద్దయైన యంబుజభవు డా
జనకసుతాపతి గాంచుచు
విను వలికెదు సత్యమింక విశదముగాగన్. 3080

-: బ్రహ్మ శ్రీరాముని స్తుతియించుట :-

దండకము -

శ్రీమద్రమారమణ దివ్యావతార ప్రభో రామచంద్రా, గుణాసాంద్ర యిక్ష్వాకువంశాబ్ధి రాకాశరచ్చంద్ర, మేఘాయతశ్యామ దేవాదిదేవా నమో సాంద్ర యోగీంద్ర దిక్పాలక స్తోత్రపాత్రా, మనోజాతరూపా, లసద్దివ్య రూపా, సదా సత్య ధర్మప్రదారా, బుధాధార, విధ్వస్తసంతాప, దివ్య ప్రతాపా, పరంజ్యోతిరూపా, సుధారాశి భోగీంద్రతల్పా, నమో సత్య సంకల్ప వీరాధివీరా, నమో భూరికోదండపాండిత్య దుష్టాసురశ్రేణి నిర్మూలితాఖండ కీర్తి ప్రవకాజాల సంపోషితా, దివ్యసంభావితా, సాధ్వి కౌసల్య గర్భైక ముక్తాఫలా, మేరుగంభీరధీరా, మహోదార సత్యవ్రతాచార, పృథ్వీ సుతాధార గీర్వాణవంద్యా, నమోయద్వయబ్రహ్మతేజా మహాశక్త సంకల్ప సిద్ధిప్రదా కల్పభూజా, నమోదేవతా సార్వభౌమా, యశఃకామ కోదండరామా దయాసాగరా, యోగవిద్యాధరా, ప్రాతరుద్భూతకంజాత సమ్మోహనాకార రాజన్ముఖా, వేదవేదాంత వీధీవిహారా, సదాచార సమ్మంగళాకార, లోకైకరక్ష ప్రవకారా, లసత్పంగ దుష్టాసురశ్రేణిభంగా, దిగీశామరవ్రాత మౌళిస్థ రత్నప్రభాజాల వందిత పాదప్రదేశా, నమోకాళ కాలాత్మ కాలత్రయీరూప, యాద్యంత మూన్యా త్రికాలైకవేద్యా, మహాశక్త సాధ్యా, నమోసర్వ భూతాంతరా, లోకనాథా, జగన్నాథ, విశ్వాత్మ విశ్వప్రకారా వేదజాలంబులన్ సోమకాఖ్యాసురుం డంతమొందింపగా

బూని దుష్టాత్మునిన్ మత్స్యరూపాకృతిం బూని దండించి వేదంబుల
ద్ధారణంజేయువే, మందరాద్రిన్ మహోన్నత్యమానంబుగా జేసి, యా క్షీ
రాబ్ధి దధిమంథనంగ నాపేక్షితా పూర్తికై పర్వతంబంతటిన్ వీపునందాల్చవే,
భూతలం బాతాళపద్యంబునుం, దావగా జుట్టి యత్నించు స్వర్ణాక్షు గూల్చన్
మహాక్రోడ రూపాకృతిందాల్చి దంష్ట్రాగ్ర భాగంబునన్ భూమినుద్ధారణం
జేసి లోకంబు రక్షించవే పుత్రునత్యంత బాధాకులుంజేయు దైత్యేయ
నాథున్ హరింపంగ నృనారసింహాకృతిం దాల్చి ప్రహ్లాదు గాపాడగా
స్వర్ణకశిపున్ విదారింపవే, దానవక్షోణి నాథుండు దాతృత్వ గర్వాధికారంబు
నన్ మించ, నానామరశ్రేణి రక్షింప, భూమీసురాకార వట్వాకృతిందాల్చి
పాదత్రయిన్ దానరూపాకృతింగోరి లోకత్రయిన్ మించి, పాతాళ లోకాం
తరావాసుగా, బలిం ద్రోయవే, మత్తగర్వాంధకారంబుచే భూమి
బాధింప, యారాజనంబైన తేజంబుచే బ్రహ్మతేజంబు హీనత్వముంబొందగా
జేయ, నాభార్గవాంశంబునన్ రామనామాకృతిన్ దుష్టభూనాథులం బట్టి
ముయ్యేడుసారుల్ మహాఘోర దుర్వార ఘోర కుఠారోగ్ర ధారావినిర్భిన్న
భూపాలదేహాంతరా రక్తధారా ప్రవాహంబులన్ తర్పణల్ జేసి బ్రాహ్మ్యంబు
రక్షించవే దేవతా నీకముల్ రాక్షసేంద్రుండు లంకేశు డత్యంతమున్ బాధలం
బెట్ట నాదేవతా ప్రార్థనంజేసి యిక్ష్వాకు వంశార్ణవంబందు శ్రీరామచంద్రుం
డవై దశరథేశపుత్రాకృతిందాల్చి సీతామనోనాథరూపాకృతిన్ తండ్రి
యాజ్ఞానుసారంబుగా దండకారణ్య సంచారివై దుష్టదైత్యుల సంహారివై
వారిధింగట్టి లంకేశు జెండాడి లోకంబు నిష్కంటకంబొప్పగా జేసియున్నట్టి
యా విష్ణురూపుండవీవేకదా వృద్ధవున్, కర్తవున్ హర్తవున్ నీరెవ్వపాటుల్
వారాత్రముల్, నీదు నిశ్వాసముల్ వేదముల్ నీదుకాయంబె యీ సర్వ
లోకంబులున్ సూర్యచంద్రగ్రహాదుల్ మహాకాశమందున్న నక్షత్ర సం
ఘంబులున్ పంచభూతంబులున్ భవద్రూపంబుగాదే జగన్నాటకాధ్యక్ష
భూజాతయేంక్ష్య, శ్రీవత్సచిహ్నా, పరంధామ, యీ మానుషాకారముం
బూని దైత్యేశ జెండాడియున్ ధర్మసంస్థాపనంజేసి యున్నాడవింతన్,
భరాలోకముం బాలనంజేసి యాపైని వైకుంఠముం జేరుమా భవత్పాద
భక్తిన్ సదా నిన్ను సేవించువారల్ భరన్ శుద్ధచిత్తాత్ములై యైహికా
ముష్మిక సౌఖ్యముల్గొందు గాదే త్రిలోకైక నాథా నమస్తే నమస్తే
నమః.

గీ॥ అశలను బెత్కుజూపుచు మోవగించె
ధిక్కరించెను మరియును దీనుడగుచు
ప్రార్థనము జేసె గాని ఈ పరమసాధ్వి
చింతనము జేసె నిన్ను హృదంతరమున. 3088

ఉ॥ లోక హితార్థమై ధరణిలో నవతారము దాల్చినట్టి యో
లోకసనాథ యీ తరుణి లోపమొకించుకయైన లేదు న
స్తోక మనీష నా పలుకు సూనృతమంచును నెంచి యీమెనుం
గైకొను మింక శంకలను గాంచగనేలను నీవెరుంగవే. 3089

-: సీతను రాముడు పరిగ్రహించుట :-

గీ॥ జాతవేదుడు నా భూమి జాతగూర్చి
పలుకు పలుకులవిని యశ్రువులను నేత్ర
యుగ్మమున నిండ జనములు వినుచునుండ
దహనునకు బలికె ప్రీత చేతస్కుడగుచు. 3090

చ॥ జనకజ శుద్ధురా లనెడి సత్యమెరుంగుదు గాని కైకసీ
తనయు గృహంబునందు దలదాచి వసించుటచేత నే నిద
ర్శనమును జూపకుండ జలజాక్షిని గైకొన రాముడేమి ధీ
జనుడగు కాముకుండనుచు సర్వజనంబులు నాడువే కదా. 3091

చ॥ ఎరుగుదు పంకజాక్షి మిథిలేశ తనూజ విశుద్ధగాగ నే
నెరుగుదు సత్యశీలగ ననింద్రిత పూతపవిత్రగాగ నే
నెరిగియు సర్వలోకములు నేర్వగ నీగతిజేసినాడ నీ
ధరణి జనంబు శంకలను దాల్పకయుండెడు నట్టి రీతిగన్. 3092

మ॥ తన శీలంబును దాచుకోగల మహాధన్యాత్మ యంచున్ మదిం
గనుదున్ వేలనుదాటి రావణ భుజాకాండాబ్ధి యీ భూమిజన్
గనదంచున్ విలయాగ్నిబోలు జనక క్ష్మాధీశకన్యామణిన్
దనుజాధీశుడు తాకలేడనుచు నేదర్శింతు చేతంబునన్. 3093

గీ॥ ఛాయనాద్యుని పీడని శంతమునను
తన్ను వీడియు మందలేదన్న దయిన
మరి మకీర్తియు దుమతిని కరముకాయు
లేనిగతి నీవెటాయగా లేనువేమ. 3094

వ॥ సురవరులార లోకలత శోభితులార మహాత్ములార మీ
రరయుచు జానకింగొమట యర్హమటంచును బల్క వాగతిం
గరమును జేయువాడనని కంజదళాక్షి పరిగ్రహించి భూ
వరుడు కృతార్థుడై భువనవందితుడై తనరారె వత్తరిన్. 3095

—। దశరథుడు సీతారామ లక్ష్మణుల జూచుట :—

క॥ అని శ్రీరాముని శుభదము
వినుత సుభాషితము వినుచు విమలేందుధరుం
డనియెను రాముం గనుచును
దనరారు శుభోక్తి దశరథాత్మజ రామా. 3096

సీ॥ ఓ మహాబాహ యత్యుగ్ర పరితాప దీ
ర్ఘాయతలోచన రమ్యవక్ష
వరధమర్ధారివై వైరి దశకంఠుని
శాత్రవవర్గమున్ సంహరించి
దారుణంబైనట్టి దానవ భయమును
ధరణికి బాపితి ధన్యచరిత
లోకైకరక్షణ శ్రీకరుండవునీవ
వేగంబ యీ రణవీధి విడిచి

గీ॥ భరతు దైన్యంబు నింకను బాపజనుము
జనని కౌసల్యదేర్చుము జననితుల్యా
లైన కైకసుమిత్రల నాదరించి
పట్టముం గాంచు మయోధ్య భాగ్యలక్ష్మి. 3097

క॥ నిను పుత్రుకుగా గాంచుట
వనిమిషలోకంబు గంటి నందితి ఫలముల్
నినునిపుడు గాంచినపదమున
ననుపమ సౌఖ్యంబు నమధికంబుగ గంటిన్. 3104

చ॥ అరయగ సత్యమున్ మనమునందు గ్రహించితి నేడు దేవతల్
సురపతివైరిరావణుని సూదనమున్నొనరింపఁబూనుటన్
పురమున పట్టభద్రగతి బూనెడు వేళను విష్ణుముత్తరిన్
కరముమజేసె గాదె మరికైకయు వాగతిదెల్పనెంతయున్. 3105

క॥ ఇది దైవ నిర్ణయంబని
మదినెంచితి నిపుడు జగతిమాన్యుడ వగుచున్
బొదలెడి నినుగని జననియు
ముదము గాంచు నిన్నొ పుణ్యపుత్రుని గనుటన్. 3106

మ॥ అనుకూలుండును నీకుభక్తుడును మర్యాదానుసారంబుగా
నినుగొల్చెన్ భరతుండు గావునను మన్నింపవన్నెలె వ్వాని కా
ననమందున్ బదునాల్గు వర్షములు సంచారంబు సీతాయుతిన్
ననుజుండు న్వెమవెంటరాగ వలుపంగాలేదె ధన్యుండవై. 3107

చ॥ వ్రతినయు నీకు జెల్లె సురవైరిని రావణుబంధుయుక్తుగా
హతమును జేసి యా యునికిమోదుల కార్యముదీర్చి నావికన్
సుతమతివౌచు నీపురమునుంగని పట్టము గట్టుకొమ్ము పెం
తతమును ఖాత్రయుక్తముగ ధారుణిపాలనము న్నొనర్చుమా.

గీ॥ చిరతరాయువు గల్గి యశేషకీర్తి
యనుజులను బ్రోచి జనముల నాదరించి
యజ్ఞయాగాది క్రతువుల నాచరించి
చిరతరంబైన శుభకీర్తి వరలుమింక. 310

-: దశరథుడు లక్ష్మణు నంబోధించుట :-

క॥ అని పల్కి చెంగటను ల
క్ష్మణు గని యాలింగనంబు గావించుచు నో
తనయా రాముని సేవను
ఘనధర్మాత్ముండవైతి కాదే తలపన్. 311

క॥ చరితము ఫలదంబయ్యెను
చిరతర కీర్తులను బడసి శ్రీకరరీతిన్
బరగుము రాముని సత్కృప
తరమును శ్రీరాము సేవ గాంచుము శుభముల్. 311

క॥ సురలును మునులును సాధ్యులు
నరపతులు దిగాధిపతులు నతులగతిని శ్రీ
కరురాము నర్చజేయును
స్థిరమతివై రామసేవ జేయుము పుత్రా. 311

చ॥ అరయ సమస్తలోకముల కాదియు నవ్యయుడక్షరుండునై
పరగెడువాడు తత్త్వమయు భాసురుడున్ శ్రుతివేద్యబ్రహ్మమున్
వరిచయ తగ్గుడున్నగుచు వా తనువందున రామనాముడై
కరమునుబుట్టె నంచు సురకాండము బల్కగ వింటినిత్తరిన్. 311

-: దశరథుడు సీత నోదార్చుట :-

క॥ అని లక్ష్మణునకు బలుకుచు
జననాథుడు దశరథుండు జానకి పుణ్యాం
గన శుభచరితను గాంచుచు
ననుపమగతి సేదదీర్చి యుత్తరి పలికెన్. 311

చ॥ వినుత చరిత్ర కోపమును వీడుము రాముని పత్ని పోట భూ
జనముల నిందబాయ రఘునందుడు నీదుపతివ్రతా నిరూ
పణమును జేసి యీజగతి బాయనికీర్తి ఘటింప యాగతిన్
తనయుడుజేసె యొండొక విధంబున నెంచకు రామునందునన్.

క॥ ధరలో పతి కన్యాశ్రీయె
వరమధర్మమనుచు నీకు బలుకగనేలా
వరదైవము పతియేయని
యెరుగవె జనకాత్మజాత యెంతయు నీవున్. 3116

క॥ అని తనయుల కోడలినిం
జననాథుడు సేదదేర్చి జనియె స్వర్గమున్
ధనదు విమానము నెక్కుచు
వనిమిషపతి రాముజూచి యనియె నీగతిన్. 3117

-: ఇంద్రుడు మృతిజెందిన వానరుల పునర్జీవితుల జేయుట :-

ఉ॥ రామపవిత్రనామ యతులంబుగ బ్రీతులమైతి మేము నీ
కామితమేదియో దెలుపగల్గిన నేనెరవేర్చువాడ నా
రాముడు పల్కె నావయిని రంజిలునేని కృపారపంబు సు
త్రామ వచింతు నంచు వినుతంబుగ నంజలి సంఘటించుచున్. 3118

చ॥ రణమున గూలి ప్రాణము హరంబయినట్టి వనాటభల్లుకా
గణములు ప్రాణయుక్తులయి గాయములన్నియు మానగా పున
ర్జనితులజేయగా వలయు సారబలంబులు మున్ను నున్న రీ
తిని వలరంగ సౌఖ్యములందెలగ దారసుతాది యుక్తులై. 3119

క॥ వారలు వసించు చోటుల
నీరంబులు వృద్ధియై యనేక సత్ఫలా
గారంబగు వృక్షంబుల
పూరితమై మూలఫల విభూతులతో డన్. 3120

క॥ కాలంబు గానివేళల
మేలుగ ఫలియించునట్టి మేటివరంబున్
పాలితసుపర్వ యొసగుము
నాలంబున బ్లావహితుల కంతములేమిన్. 3121

క॥ కోరిన వరములనిచ్చితి
ఘోరమదా యతుల గోలభోయిన నీదౌ
వారలగు భల్లుక కపి
వారంబులు జీవితములు వడసేదురికన్. 312

క॥ మరియును నెటజరియించిన
గురుతర ఫలవృక్షములను కుసుమాఢ్యములన్
కరమును బహునీరము చే
కురుగావుత కాలముకము గూడని వేళన్. 31[illegible]

చ॥ అనిమిషనాథు డట్లు వరమాయత రీతినినీయ వెంటనే
వనచరభల్లుకాది మృతవర్గము నిద్దురలేచు భంగి యా
రణతలమందులేచిరి విరాజిత పూర్వ శరీరధారులై
తనుపుల గాడనాంకములు దద్దయు మాయ మహాద్భుతంబుగన్.

క॥ దానింగని యద్భుతమని
వానర భల్లూకతతులు పటు హర్షమునన్
భూనాథు మ్రొక్కి పలికిరి
కానము ధరనిట్టి కృతుల కంజదళాక్షా. 31[illegible]

ఉ॥ దేవతలంత రాముని సుధీవినుతుంగని పల్కి రామ నీ
వీ వనచారుల న్విడిచి వేగము యోగి యయోధ్యకందు నిన్
భావమునన్ స్మరించు గుణభద్రుని దైవతమూర్తి బ్రోచి చిం
తావిధిమన్న తల్లులకు దావము బాయగ శాంతిగూర్పుమా. [illegible]

చ॥ పురమునుజేరి రాజ్యరమ బొంది జనంబుల బ్రోవుమెంతయున్
ధరణి జనంబులెల్ల సుఖితం దవరారగ నంచుదెల్పి భూ
వరు విడి దేవతల్ నిజనివాసము జేరగవేగ నంత నా
వరవరుడున్ ముదంబున విమాన చయంబుల గూర్చి నాక్షణన్.

-: విభీషణుడు రాముని సంస్కారాదులకై ప్రార్థించుట :-

క॥ ఆ రాత్రిని సుఖనిద్రన్
భూరమణుడు గాంచి ప్రొద్దుపొడచిన యుండన్
వారకలేచిన గని సం
స్కారంబుల జేయ రాక్షసాధిపు డంతన్. 3128

ఉ॥ రామమహానుభావ విమలంబగు గంధముగంధ తైలముల్
కామిత దేహరాగములు కాంచనచేల విభూషణల్ సుపు
ష్పాదుల మాల్యముల్ బహులభంగిని సిద్ధమునయ్యె గావునన్
నో మిహిరాంశువంశ కలశోదధిరత్నము స్వీకరింపవే. 3129

వ॥ అనుచు విభీషణుండు వసుధాధిపుతోడను బల్క రాఘవుం డి
ట్లనియెను కోయమీ కపికులాధిప భూరిసుఖార్హుడయ్యు నా
యనుజుడు కైక సూనుడు మహాత్ముడు నిష్ఠనుబొందియుండ నే
మనుచుము సంస్కరింతు గుణమందననీవు నెరుంగజాలవో. 3130

క॥ అనుజుండు ధర్మచరితుడు
గుణనిధి భరతుండు లేక గైకొనదగునే
ఘనవస్త్ర విభూషణముల
దనుజవరా నేను నొందు దలపకు మదిలో. 3131

క॥ పురము నయోధ్యను జేరగ
కరమును దూరంబు ఘోరకాంతారములన్
సరియగు మార్గము కాదని
నరవరుడును బలుక దనుజనాథుం డంతన్. 3132

సీ॥ జనవర సూర్యతేజస్స్ఫూర్తిగల్గిన
పుష్పకాఖ్య విమాన మున్న దిచట
ధనదు జయించి రావణుడు దానిహరించె
కామగమనంబు వాకాశమందు

నీవధివసింపంగ నిట దెచ్చియుంచితి
నతిశోభితం బగును జూచి
యొకపూటలో నయోధ్యకు నిన్ను జేర్చెను
నిశ్చింతమై యుండ నీవునందు

గీ॥ నీవునాస్నేహ భావంబు నియతి మనము
నందున నెఱింగితేని యానందముగను
జనకజను గూడి లక్ష్మణ సహితముగను
నధివసించుము యీ విమానంబునందు. 31

క॥ దనుజోత్తమ నీవెంతయు
ననుకూలుడవౌచు గడు సహాయము నాకున్
నొనరించి యున్న వాడవు
నినుకాదని యెందుబోవ నేర్తునె చెపుమా. 31

ఉ॥ మఱియును తల్లులన్ హితుల మంత్రుల పౌరుల వారినంతటిన్
గురువుల నందరన్ జూడ గోరెద వేగము దేవ లంపుమీ
సురుచిర పుష్పకంబిటకు జూడగ నా వనవాసదీక్షయున్
జరిగెను పొంతమౌచు నికపోగుట యొప్పు నయోధ్యజేరగన్. 31

సీ॥ అన విభీషణుడు చయ్యన లంకజేరియు
కాంచన మణిమయా కాంతమగుచు
రాజతవైడూర్య రమణీయ వేదికా
శర్మహర్మ్య కవాట శవ్యమగుచు
పాండుర వర్ణ సుధ్వజ పతాకానీక
శోభాయమాన విస్ఫురిత మగుచు
ఘంటికారావ సంకలితమై కింకిణీ
జాల వినాద సుస్వరము నగుచు

గీ॥ వివిధమణి మౌక్తిక గవాక్ష వితతిగలిగి
మేరుగిరి వన్నెఁ దెంబయి మెరయుదాని
విశ్వకర్మ వినిర్మిత విభవ మొంది
యలరు నా పుష్పకాఖ్యంబు నపుడ తెచ్చి. 3136

-: విభీషణుడు వానరుల సత్కరించుట :-

గీ॥ అజ్ఞచేయంగదేయంతు నసురవిభుడు
పలుక రాముండు స్నేహంబు వరలు రీతి
నా విభీషణుగాంచి యిట్లనియె నపుడు
మృదుమధుర వాక్యఫణితుల ముదముగాంచి. 3137

చ॥ వినుమొకమాట యీ కపులు వీరరణంబొనరించి నాకుగా
దనుజ పురంబు లంక బందర్పముతోడ జయించె గాన నీ
వనచర తల్లికాదులను వస్త్రవిభూషణ సత్కరించగా
మనమున నెంచెదన్ దనుజమందన కామిత సిద్ధి బొందుటన్. 3138

చ॥ రణమున బోరువారలకు రాజులు సత్కరముల్ ఘటింపగా
జను, నటుగానిచో భటులు సంతసమందక రాజుబాయు గా
వున దనుజాధిపా విమలబోద్ధవు దాతవు నీవునాట నీ
వనుగుణమైన రీతిగని యందర నివ్వుడు సత్కరించుమా. 3139

క॥ మనుజవిభు డటుల బలికిన
దనుజవిభుడు వివిధరత్న ధనసంపదలన్
గొనితెచ్చి వారికిచ్చెను
ఘనతర మోదంబు కపులుగాంచగ నచటన్. 3140

చ॥ మనుజ విభుండు పుష్పక విమానము నంతటనెక్కి వేడుకన్
జనకజ యంకభాగమున సంస్థితి బొందగ లక్ష్మణుండు చే
ధనువును దాల్చి రామ వసుధాధిపు చెంగట నిల్వ నా విభీ
షణుని బహూకరించె పలుభంగుల వానికృతంబులెంచుచున్. 3141

క॥ వనచర వర్గము గనుగొని
ఘనమతియుతులార మిత్రకార్యము దీరెన్
రణమున ప్రియాన ఘటితి
జనవచ్చును మీరు నిలయ వంగతిజేరన్. 3142

క॥ ఇనతనయ మిత్రుడిలపై
నొనరించెడు కార్యకృతిని యోగ్యతమీరన్
ఘన ధర్మబుద్ధి జేసితి
జనమిక కిష్కింద కీశసైన్యము గొనవన్. 3143

క॥ అనుచు విభీషణు గనుగొని
ఘనలంకారాజ్యమిరక గైకొని సుఖతన్
మన మిరక దీర్ఘ కాలము
జనక నసాధ్యంబులంత జేరి యేలికిన్. 3144

క॥ జనక పరిపాలితము వ
ట్టణమయోధ్యకును జేరుటకు కాలము వ
చ్చెను నాకు కలవానంగుడు
ఘనతర మతులార మేలుకలుగును మీకున్. 3145

చ॥ నరవరుడట్లు బల్కు దశరథ తనూజుడు నావిభీషణుం
డురుతరభక్తి బల్కె మహితోజ్వల మేమిక నీపురంబుమన్
గరమును జూడనెంచితిమి గావున మమ్ముంగొంచువేగు మా
పురమునసెట్టి యాపదలు బొందక మేము చరింతుమందువన్. 3146

చ॥ జనకజగూడి రాక్షసులు పర్వమునీకు వశంబుగాగ నీ
యనుజుల గూడి పట్టమును నరెదగ నాయభిషేకకృత్యముల్
గనేగను వాంచకల్గదిని కొదాకటరడగ వాక్షయామవే
వినుతదయాలవాల సువివేక సుధీనుత మిత్రరాజమా. 3 41

రాముడు పుష్పక విమానముపై సుగ్రీవ విభీషణాదులను తోడ్కొనిపోవుట

మ॥ అనుచున్నారలు బల్కు రాఘవుడు సత్యంతంబు ప్రీతాత్ముడై
యనిమెన్ మిమ్ములగూడి నాపురికి నేయాతంబు జేయంగ వ
చ్చెను నాభాగ్యవశంబుగాగ గావునను నేబేధంబులేకుండ వే
గను నెక్కుండిక పుష్పకంబు మది నాకాంక్షల్ ఫలంబొందగన్.

గీ॥ వచనయుక్తుండవయి విభీషణ తడయక
పుష్పకమునెక్కు దినకర పుత్ర యింక
నెల్ల కపులను గూడి నీవిందు నిపుడ
నాతుతోడుగ రమ్ము ప్రియమంద నేను. 3149

క॥ వారలు నాగతినెక్కిన
పారెపుష్పకంబు నభ్రపదమున యందున్
భూరమణు డొప్పె జగదా
ధారుండగు సర్వదేవతాధిపు డనగన్. 3150

గీ॥ ఆ విమానంబు నందు మధ్యంతరముల
వనువుగా నుండు భంగి వనాటదనుజ
వర్గములు గూరుచుండిరి పృథ్విగలుగు
చిత్ర శోభల దమలోన జెప్పికొనుచు. 3151

ఉ॥ మారుత తుల్యవేగము విమానము బోవగ రాముడంత నా
ధారుణి పుత్రిజూచి యమితంబగు హర్షము నింపుటిల్ల వే
ర్వేరుగ నెందునేమి వ్రభవించెనొ యన్నియు జెప్పసాగె సీ
తారమణీ సుసాధ్వి మదిదర్పయు పంతవమందు చుండగన్. 3152

క॥ ఘన శంకర శైలంబున
కెనయగుచు త్రికూటశిఖరి యిందున వెలయున్
మును విశ్వకర్మ నిర్మిత
మను లంకాపురముకంటె మోదముమీరన్. 3153

సీ॥ వానర రాక్షసవర్గముల్ పోరాడ
మాంపరక్త స్థుల జంటాల మిదియె
దుష్టుని రావణు దుర్కించితి నిందున
గూల్చె వాడను కుంభకర్ణు నిందు
మారుతి ధూమ్రాక్షు మాయించె నీచోట
మరివఁహస్తుండిందు మృతినిగాంచె
దునిమెనుషేణు డిందునను విద్యున్మాలి
నింద్రజిత్తును నముఖు డిందు గూల్చె

గీ॥ అంగదుడు వికటు గూల్చె నీయవనియందు
మరి విరూపాక్షుడును మహోదంః దకంప
నుడు మహాపార్శ్వదాదిగా దనుజవరులు
గూలిరీ రణభూమిని కోమలాంగి. 3154

క॥ సురవైరి సాధ్వి మండో
దరి యీ రణభూమి పెక్కు తరుణులతో దన్
గురుతర శోకావృతయై
కరము నేడ్చె నతుఁతులు గన్నులగారన్. 3155

క॥ వనితా కనుగొనుమియ్యది
వననిధి బంధించి కీశవర్గంబులతో
దను దాటిరేయి సుఖ ని
[ద్రను గంటిని నిమ్న మదిని దలచుచు మిగులన్. 3156

క॥ కనుగొను మియ్యది సేతువు
వననిధిమధ్యంబు నందవారణ రీతిన్
వనచర సాహాయంబున
దనుజవినాశార్థమిందు దగగట్టితిగా. 3157

చ॥ కనుమిదె భూరిసాగరము కంజముఖీ బహుళోర్మికాతతుల్
ఘనతర నిస్వనంబులధికంబుగ సల్పుచు సాగరాంతరం
బునను హిరణ్యనామకము భూధరమయ్యదె స్వర్ణశృంగ భా
జనమయి గ్రాలుచున్నయది చాలవిచిత్ర మనోహరంబుగన్. 3158

క॥ వననిధి లంఘన వేళను
హనుమంతుని కీనగంబె యాశ్వాసింపం
గను జలధినుండి వెలువడె
విమలగతిని దీనిగన్న విభవముగంటే. 3159

క॥ జలనిధి తీరస్థంబుగ
నళినాక్షి కనుము దేవనరపూజ్యంబై
విలసిత తీర్థంబయి యు
జ్జ్వలమగు నీసేతు బంధ పావనభూమిన్. 3160

క॥ వినుము మహాదేవుండగు
వనధి విభుడు నాకునిచట ప్రత్యక్షంబై
ననుగాంచి వార్ధి బంధన
మున్నుఁజేయువిధంబు దెలిపె మోదముమీరన్. 3161

క॥ మఱియును నిందు విభీషణు
డరుదెంచియు నన్ను శరణమడిగెను కంటే
శరణంబు నొసగి దానవ
వరుపట్టము నిందుగట్టి వరలిన వాడన్. 3162

క॥ కనుమదె కిష్కింధాపురి
వనచర వల్లభుని చిత్రనవ పట్టణమున్
మును నేనిందున వాలిని
దునిమితి నొకవేటునేసి దోర్బలశక్తిన్. 3163

చ. జనకజఁగాంచి యారత రఘూద్వహుఁడిట్లు పల్కెను గాంచుమయ్యెడిన్
ఘనగిరి ఋష్యమూక మటఁగాంచితి భామ జూ వాలిఁ జంపఁగా
నొనరిచి యుంటి నిచ్చటి యుర్వ్యతవారిని యుక్తపంపనుం
గనుమదె పుష్పవత్పం విశాలము భూరి మనోహరంబునున్. 3170

ఆ. నీ వియోగజలధి నెరెసేని గుందుచు
విరహతాపమునను వేగివేగి
కమల బాష్పజలము కనములు రాలంగ
మున్ను కాలమటుల బుచ్చివాఁడ. 3171

క. వనజాక్షి శబరి యాశ్రమ
మును గాంచుము వతియె యామె మోదముతోడన్
వనఫలము లిచ్చినను తి
ష్టని గాగముజేసె తర్మకోభిత యగుచున్. 3172

క. కనుమిందు కబంధుని యా
జన బాహుని ద్రుంచియుంటి జలజాతాక్షీ
మనపక్షుడు జటాయువనం
డిన వృక్షంబిదియె దీనినెంతయు గనుమా. 3173

గీ. అదె జనస్థానభూమి దశాననుండు
గృధ్రరాజును జోరిన క్షేత్రమదియ
ఖరుడు దూషణ త్రిశిరులు ఘనరణంబు
సలిపి గూలిన యట్టి యీ స్థలము జూడు. 3174

క. మును దశకంఠుడు పల్కిని
నినుగొని చనినట్టి స్థలము నివ్వలదు గనుమా
మనముష్ట పర్ణశాలను
గనుమా యల్లదిగొ పయోధి కాసంతమునన్. 3175

క॥ పావన వాహినియగు గో
దావరి యదె విపులమగుచు తరగల పారన్
భూవినుతు డగు నగస్త్య త
పోవనముం గాంచు మదియె పుణ్యచరిత్రీ. 3176

క॥ కనుమదె సుతీక్ష్ణు నాశ్రమ
వనభూమిని వారిజాక్షి వరలెడు శరభం
గుని యాశ్రమమల్లదిగో
యనిమిషపతి వచ్చె నాడు నాతని జూడన్. 3177

క॥ కనుమదె యీ భూమిని నే
దనుజు విరాధుని వధించి దనరితినవాడన్
ఘనమౌని యత్రి యాశ్రమ
వనభూమియు నిదియె కంటె వారిజనయనా. 3178

క॥ అందున ననసూయా సతి
సుందరాంగి నీవుగంటి శుభగతి గాగన్
బొందితివి కామితంబుల
నందంబుగ నీవుబొంద నబ్జదళాక్షీ. 3179

క॥ కనుమదియె చిత్రకూటము
ననుజుడు భరతుండు వచ్చె నయోధ్యకు నన్
గొనిపోవ నిచ్చ జేయుచు
మనమున నాటినవి నేమ మరువంగలనా. 3180

క॥ కనవచ్చె దూరముగ పా
వన వాహిని యమున తీరభాగము నందున్
ముని భరద్వాజు నాశ్రమ
మును గాంచుము పుష్పఫల సమృద్ధము తరుణీ. 3181

క॥ నానాతరు ఫల పుష్ప వి
తానంబులతీర మతుల ధన్యత మీరన్
గానంగవచ్చు శాగం
గా నదిని నదీమతల్లి గాంచుము తరుణీ. 3182

క॥ అది శృంగి బేర పట్టణ
మదియె గుహుని వాసమగుచు నలరుచు నుండున్
నదియే సరయూ వాహిని
ముదితరొ గాంచుము మనంటు మోదము కొందన్. 3183

చ॥ కనుమది పేర్కతోఁద జనకాశ్మజా నం త్రిరఘాగ్రగణ్య మ
జ్జనకు పురం బయోధ్య మునసౌరగ వందనమాచరించుమా
మనకును నిల్చి నాళ్ళకును మారుగ దర్శనమిచ్చినందునన్
జనగను వాతికాక్షి ముదమ్మునను వందనమాచరించినన్. 3184

ఉ॥ వనచర వర్గమంత గదుల త్తిని లేచి నమస్కరించె భూ
వినుతము సారదాశ్రచయ్య వీధి సమున్నత సౌధ భాగమున్
జనిత మనోహరంబును గజాశ్వ రథాధిక సంచరంబునున్
వనిమిష నాథ పట్టణ సమంబును భోగ సమృద్ధ యుక్తమున్. 3185

—: రాముడు భరద్వాజాశ్రమమున దిగుట :—

మ॥ వననుండట్లు చతుర్దశాబ్దములు సంపాలించి సంపూర్తిమై
మనుడా రాముడు పంచమీతిథిని యుక్తంబొప్పె నాపుష్పకం
బన కూలంబుగ నిల్పె నక్షత భరద్వాజుం గనన్నెంచి వే
గను యానంబునుడిగ్గి మౌనివరు పేర్కంగాంచి దామ్రొక్కుచున్.

క॥ మునినాథ మా పురంబున
జనులకు క్షేమంబె వారిసంగతి వినదె
జననిలు కుశలమ్మే భరతుండు
మనుచునె జనవర్గములను మానితరీతిన్. 3187

కం॥ అని పలుకు రాముఁగాంచుచు
మునివరుండు మొలక నవ్వు మోమున గదురన్
ఇనకుల తిలకా నీదగు
జనులందరు సుఖులె సుమ్ము సర్వవిధములన్. 3188

ఆ॥ జడలు బూని మౌని సరణిని భరతుండు,
నీదుపాదుకలను నెపుడు గొలుచు
నీవు వత్తువంచు నెపుడును నిర్లిప్త
లోచనుండు పగుచు జూచుచుండె. 3189

వ॥ వరవర నీవురాజ్యరమ నంతయుఁబాసి చతుర్దశాబ్దముల్
కరమను చరించితివి నాథ జనకజతో బద్ధుడవౌచు కానలో
వర ముని వేషమూనుచు దివంబున సుందరుదెంచ సద్ధి ని
ర్జరు గతి వచ్చియుంటివి విహితము బొందితి నిమ్ము నెంచుచున్.

కం॥ ఘన శత్రు విమర్దన స
జ్జన రక్షాదక్ష ధర్మజయ పరిపూర్ణున్
వినుతాఖిల నిర్జరు నిను
గని నేనానందమొంద గలిగితి నేడున్. 3191

కం॥ మఱియు జనస్థానంబున
ఖర దూషణ త్రిశిరవధయు గావించుటయున్
నెఱుగుదును సాధురక్షణ
వరముగ నొనరించినట్టి భవ్యసత్కృతుల్. 3192

కం॥ దురితుడు మారీచుడు నీ
తరుణి మాయ గరుపవచ్చి దశకంఠుండున్
హరియించుటయు కబంధు ని
బొరిగొనుటయు నెరిగియుంటి భూవరతిలకా. 3193

క॥ మరియును శబరిని గనుటయు
గురుమేటి వర్మ జని కోడ కూర్మి వలుపుటన్
సురపతినందను వాలిన్
హరియించుట నేనునాత్మ యందు నెరుగుదున్. 3194

క॥ హనుమంతుడు వారిధి లం
ఘనముజేసి సీతజూచి కార్యము దెలుపన్
వననిధి బంధించుటయును
దనుజవిభుని ద్రుంచుటయును దా ల్తును మదిలో. 3194

ఉ॥ అనిమిషవర్గముల్ నిశిచరాధిపు లంకను నిన్ను జూడగా
జనుటయు వారిచేత వరపంగతి నీవును బొందియుండుటన్
గనుదు మనంబునందు నధికంబగు నాదు తపోబలంబునన్
గొనుము వరంబులిచ్చెదను కోరుము రామనృపాల శేఖరా. 3195

క॥ నరవర యీ దినమందున
స్థిరమతి నిందుండి రేపుజేరు పుర మవన్
గురునాజ్ఞగాగ సీతా
వరుడందుకు నమ్మతించె వల్లె యటంచున్. 3196

ఉ॥ రాముడు నంతపల్కె మునిరాజ యయోధ్యకు నేగు దారిలో
కామిత వృక్షసంతతుల కాలము లందునస్సైన నత్ఫల
స్తోమత యుండురీతి దయ జూడు మటంచును బల్క నాముని
గ్రామణి యట్లయౌనమచు కామితసిద్ధి నొసంగి వేడుకన్. 3197

చ॥ పలువిధ పుష్ప పల్లవ విభాసితమై ఫలవృద్ధిమీరి యే
కలనను మూడుకోశములు గాగను భూరిమహీజసంతతుల్
విలసిలె దానిగాంచి తడపేంచుక జూపక కీశలోకముల్
వలనుగ నత్ఫలాదులను భక్షణజేసిరి ప్రీతచిత్తులై. 3198

:- శ్రీరాముడు భరతుజూడ హనుమంతుని బంపుట :-

సీ॥ పవమాన సుతుని భూవరుడు వంతట బిల్చి
పురము నయోధ్య వేగిరమ యేగి
యందు రాజగృహంబు నందున్న నందర
కుశల వార్తల దెలిసికొనుచు రమ్ము
దారి యందున శృంగిబేర పట్టణముందు
నందు మిత్రుడు గుహుండనెడి రాజు
గాంచి నారాక సక్రమత నెరిగించిన
నత్యంత సఖుడౌట నతడు నీకు

గీ॥ పురికి మార్గంబు నీకును కరముదెలుపు
మార్గ మధ్యంబునందున మహితయశుడు
భరతుడున్నాడు వాని దగ్గరకు నేగి
వాదు మాటగ బలుకుము వనిలతనయ. 3199

గీ॥ మొదల బలుకుము సీతభూపుత్రితోడ
ననుజు లక్ష్మణుతోడను సన... దీక్ష
పూర్తి గావించి వచ్చిన వార్త దెలిపి
యవల దెలుపుము జరిగిన వివిధకృతులు. 3200

క॥ దనుజుడు సీత హరించుట
యినసుతు స్నేహంబు వాలికిం దుంచుటయున్
జనకజ వెదకుట శరనిధి
ఘనసేతువు గట్టి పంక్తికంఠు దునుమటన్. 3201

క॥ వరదానంబులనే సుర
వరులచేత గొంట వనజభవ శంకరులున్
కరము విప్రసన్ను లు నగుటను
సురయానగతుండు జనకు జూడగలుగుటన్. 3202

హరివరుడున్ విభీషణుడు తద్గజుతోడను వచ్చిరంచు నీ
వెరుగగ బల్కు మావయిని వీడక వానిముఖంబునందువే
తరటిని మార్పుగల్గునో పరికెతగతిన్ బరికింప గావలెన్
వరయుము వానిమానవ గతంబగు రీతులు దెల్పు పెంపునన్. 3203

దునిమెను దుష్టరాక్షసుల దోర్బలశక్తిని సర్వదిక్కులన్
బెనగొన కీర్తి నిల్పి వనవీధిని దీక్షను పూర్తిజేసె స
త్యనఘుల మిత్రులంగొనుచు దక్షత భూరిబలంబుతోడ ప
త్తనము నయోధ్య వచ్చుటని దావలారా తెలియంగ బల్కుమా.

అతుల విభూతిగల్గి చతురంగబలంబులు గల్గి సంపద
స్థితులనుగల్గి రాజ్యరమ చేతను బట్టిన మావపుండు నే
గతులను సంచరించునొకొ కాలము సంతతమొక్కరీతి భూ
పతులను గాంచ దుర్లభము ప్రాజ్ఞుడవై పరికింపుమెంతయున్.

ధరణీ భారవిమోహము
భరతువతును గలిగెనేని బాయక నతడే
ధరనేలుగాత దానికి
హరివరసే కించనంద నంచు నెరుగుమా. 3206

వేసందు రాకమున్నగ
మామగ నీవింక గగనమార్గ చరుడవై
యా వాగులకై యేగెదు
వైనతేయుతంగి నేగి వచ్చుము వేగన్. 3207

అన హనుమంతుడు వేగం
బున జని గంగాస్రవంతి బొడగని తీరం
బున శృంగిబేర జనపద
ఘును జేరుచు గుహునిగాంచి మోదముమీరన్. 3208

క॥ వినుమా నీమిత్రుండగు
జనపతి యా రాముడిపుడు సానుజుఁడగుచున్
జనకజను గూడివచ్చెను
ననుబంపెను క్షేమవార్త నడుగుమటంచున్. 32

గీ॥ ముని భరద్వాజు నాశ్రమభూమి నతఁడు
పంచమీరాత్రిగడిపి యావలను వాని
యాజ్ఞగొని వచ్చునంచు ముదమార బలికి
పయనమయ్యె నయోధ్యకు పవనసుతుడు. 33

చ॥ చనునెడ మార్గమధ్యమున చారునదీనద వన్యదేశముల్
జనపదముల్ గమించుచును సత్వరతంగనె నంది నామకం
బున జెలువారుగ్రామమును భూజసుపుష్పఫలాన్వితంబు ప
త్తనము నయోధ్యకున్ కోసు దవ్వుననుండెడి దానినత్తరిన్. 34

–: హనుమంతుడు భరతుని దర్శించుట :–

చ॥ పరిసర భాగమందు నటవర్తిలు నాశ్రమమందు గాంచి యం
దరసెను మౌనివేషు నజినాంబరధారుని దుఃఖితాత్మునిన్
కరమును బ్రహ్మతేజమున గ్రాలెడివాని సుదీర్ఘమౌ జటా
ధరు భరతున్ నితాంతనియతాత్ముని మూలఫలాశనారతున్. 35

చ॥ అనుజుడు మున్నొసంగిన శుభావహపాదుక లాదరంబునన్
దనకును ముందుగానిలిపి ధర్మపదస్థితి రాజ్యభారమున్
జనములు తృప్తిఁ బొందుగతి సాగగ జేయుచు నున్నవాని రా
ముని హృదయాబ్జమందు దలపోయుచు జింతిలు వానినెంతయు

క॥ పురజన ముఖ్యులు సైనిక
పరివారము గురులు హితులు పరిస్ఫుటభంగిన్
నిరతంబు గొలుచువానిని
భరతు రాముభ్రాత గనియె పవనజుడంతన్. 3

చ॥ చిరతర ధర్మమూర్తిని విశిష్టుని రాముని ప్రీతగాంచి యు
త్కరతర భక్తిమొ్రక్కి వినయోక్తిని బల్కెను నీవునెవ్వనిన్
కరమును దండకన్ దవసిగా మదినెంచెదొ యట్టి రాముడే
కరమును నన్ను బంపెనిట కారయగా భవదీయ క్షేమమున్. 3215

చ॥ విడువుము దుఃఖమింక పృథివీవర నీకు బ్రియంబు గూర్చు దా
నడవి చతుర్దశాబ్ద నియమంం బలరారగ చేసి యిందులం
దడయక వచ్చు రాముడిక ధన్యుడు లక్ష్మణుగూడి సీతతో
నడచెను రావణుం గదనమందున జానకి బొందె కీర్తిమై. 3216

చ॥ వనచరకోటి తోడ బలవర్గ హితాదుల గూడి యిందులన్
జనగను నున్న వాడనుచు సత్వరతన్ వినిపింప కైకయీ
తనయుడు భూరిహర్ష జనితాత్ముడునై ధర ప్రాలె మూర్ఛనం
తను దెలివొంది యూరటను దాల్చుచు నాతని గ్రుచ్చి కౌగిటన్.

చ॥ కమలను హర్షబిందువులు గ్రాల వచించెను నీవెవండవో
మనుజుడవో నిలింపపురి మామగవీడిన నిర్జరుండవో
ననుదయగాంచి రామ మనంబును నీవురిజేర బల్కగా
వినుత సుశీలధన్యపదవిం గనినాడను నీదువార్తలన్. 3218

క॥ ఈ వార్త దెలిపినందుకు
భూవినుతా నీకు గ్రామముల నూరిత్తున్
నీవలచు కపుల వారల
సేవాదళములను సేవజేయగ నితున్. 3219

క॥ జరిగెను బహువర్షంబులు
నరనాధుడు జనియె కానవా వాసముకై
మరలన్ వింటిని యా ప్రభు
వరనామము నీవునేడు బలుకగ మిత్రా. 3220

క॥ వనచర లోకంబునకును
ఘనుడగు నగ్రజునకేమి కారణమున సం
జనితంబయ్యెను మిత్రిత
వినబడ వే దెల్పుమింక భ్రాతన్వినగన్. 3221

క॥ తన దరిగల దర్భాసన
మున గూర్చొని యనిలసుతుడు మోదముమీరన్
వినిపించె నతడు వినగను
వనవాస గతంబులైన వృత్తాంతంబుల్. 3222

—: హనుమంతుడు భరతునకు రామవనవాస వృత్తాంతము దెలుపుట :—

చ॥ జనకుని యాజ్ఞగాగ రఘుచంద్రుడు కాననకేగ తండ్రియుం
జనియెను స్వర్గసీమ జననాయక నీవట చిత్రకూటమం
దునగల రాముగాంచి యుచితోజ్వలరీతి పురంబు జేరగా
వినతి యొనర్చిన న్విభుడు వేడుక పాదుకలన్నొసంగుచున్. 3223

క॥ నినుబంపె పురము నేలగ
ననంతరము రాముడందు నన్నుండక దా
జనియెను దండకవనికిని
తన హితులకు దగ్గరున్న తరలుదు రంచున్. 3224

మ॥ వనసంచారము జేయునట్టియెడ దుర్వారుండు దాహాబలుం
డనిమేషారి విరాధనాముడు మహీజం గొంచుబోవంగ నా
యనుజుల్ నిర్వురు వానిజెండియు నరణ్యాంతర్గంబైన యా
మునివర్యున్ శరభంగు గాంచిరి మహాపుణ్యాత్ముడా మౌనియున్.

క॥ శరభంగుడు స్వర్గంబున
కరుగ జనస్థాన ముని నికాయము బ్రోవన్
వరవరుడందు వశించెను
పరమధర్మ నియతి సత్య పరతంత్రుండై. 3226

ఘాతుడు రావణాసురుని సోదరి శూర్పణఖాఖ్య వచ్చి మో
హారతి దాక లక్ష్మణుఁడు నామెను బట్టియు రామువాజ్ఞచే
ఘోరతరాసి నాసికము గోసియు కర్ణము లుత్తరించినన్
వీరులు రాక్షసుల్ కదనవీధిని దాపదునాల్గువేలు యు
ద్ధారతి వచ్చి వెం దునిమె దారుణరీతిని రాముఁడొక్కఁడే. 3227

ఘృతియును దండకావనము మౌనులకెల్ల సహాయకారియై
సర్వవరుఁడుండ నాదనుజ నాథుడు రావణుఁడాత్మమిత్రునిన్
దురితుని తాటకాసుతుని తోడుగ గొంచును దండకాటవిన్
స్థిరమతి రాముఁడున్న వనసీమను నాశ్రమభూమి జేరుచున్. 3228

మారీచుఁడంత మాయా
కారంబున కనకమృగము కైవడి నట సం
చారంబుజేయ గని యా
ధారుణి పుత్రికయు విభుని దరికేగి యనెన్. 3229

జనవర యీ సుందర మృగ
మును బెంచగ నాశగల్గె మోదముమీరన్
గొనితెమ్మన రాముండును
ధనువుచేత బూనివెడలె దానింబటన్. 3230

పరువిడ జొచ్చెను మృగమటు
శరమునేసి చంపె రామచంద్రుడు దానిన్
సురవైరి లక్ష్మణా యని
గురుతరముగ కేకవేసి గూలెన్ భువిపై. 3231

ఆ నాదము విని యనుజుడు
భూనాథున కేమి కష్టమొదవెనో యనుచున్
దానాభూమికి నేగిన
జానకి యొంటరిగ నున్న సమయమునందున్. 3232

చ॥ దురితుడు రావణుండపుడు ద్రోహపు బుద్ధినిజేసి రోహిణీం
దరియగ వచ్చు క్రూర భయదాకృతి గల్గు గ్రహంబురీతి భూ
వరునతినిం గ్రహించి రథభాగమునం గొనిపోవ గృధ్రరా
జరసి జటాయునాముడు నిశాచరనాథుని యడ్డగించినన్. 32

చ॥ రణమున వానిజంపి యటులంగొని పోవగ పర్వతస్థలిన్
వనచరనాయకుల్ గనిరి వాడటుపోవుచు నాత్మపట్టణం
బనగనుజెల్లులంక జనియందున నామెను నుంచి యెన్నియో
యమనయ సంగతుల్ బలుక నన్నియు నామె నిరాకరించుచున్.

క॥ మనమున నెప్పుడు రాముని
ఘనచింతారతిని దలచి కడుదుఃఖమునన్
వనజాక్షి యా పురస్థలి
వనమున శోకంబునందు వసియించె గడున్. 32

ఉ॥ కాననమందు రాముడు మృగంబును ద్రుంచియు పర్ణశాలకుం
దాను జరింప తండునను దారను జానకి గాంచలేక చిం
తానమడై సమస్త దిశలందున జూచుచు పోవుచుండగా
దానవుడౌ కబంధుని వధంబొనరించియు వాడు జెప్ప చం
దానను ఋష్యమూకగిరి ధారుణి వానరనాథు గాంచినన్. 32

క॥ వానరపతి సుగ్రీవుడు
భానుసుతుడు తనకు నన్న వాలికి వైరం
బూనిన వృత్తము దెలుపగ
భానుకులీనుండు వాలి వధజేసి వెనన్. 3

క॥ వనచరపతి సుగ్రీవుని
వనచర రాజ్యమున్కపట్టభద్రుని జేయన్
గని సంతసించి యినజుడు
జనకజ వెదకంగ సైన్యసంతతి బంపెన్. 3

క॥ ధరణిజ వెదకగ దక్షిణ
వరభూమీధరము వింధ్యవర్తింపంగన్
దరిసెను గడువును మేమును
వరయంగా లేకపీత వతులితచింతన్. 3239

క॥ శరమును దుఃఖింపం గని
దరిజేరుచు గృధ్రరాజు ధన్యుండును సో
దరుడును జటాయునకు మా
కెరుగంగా దెల్పె జానకీ వృత్తంబున్. 3240

ఉ॥ రావణురాజ్యమందుగల లంకను జానకియున్నదంచు సం
భావిత రీతిబల్కగ వవారణరీతిని సాగరంబునే
లావున నూరుయోజనములత్తరి లంఘనజేసి లంకలో
దేవిని దుష్కితాంగిని విదేహసుతం గనుగొంటి నెంతయున్. 3241

చ॥ ధరణిజ గాంచిమ్రొక్కి గుణధాముని క్షేమమెరుంగబల్కి భూ
వరుడు నొసంగినట్టి మణి తర్మ్య ఁ కుసుముద్రికనిచ్చి యామెచే
గురుతుగ వేరుభూషణము గోరి మహోదధి దాటిక్రమ్మరన్
ధరణి సుతాభిరాము గని దద్దయుభూషణ మందజేసినన్. 3242

క॥ అతివల బొసెడువేళను
పనగల యమృతంబు ద్రావి బ్రతికినరీతిన్
వసుమతి తనయ విధంబున
దశరథసుతు డంత మనియె ధైర్యము గొనుచున్. 3243

చ॥ వనచరసైన్యముల్ గొలువ వాహినిబోలుచు వెంటరాగ నా
మనుజవిభుండు సాగరుడు మార్గముదెల్పగ నీలుచేత నా
వననిధి గట్టి సేతువును వారిధి దాటియు లంకలోనికిం
జనియెను వేలకోట్ల వనచారులు వెంటనురాగ వత్తరిన్. 3244

సీ॥ ఘటకరు రాముండు తృణిలోన గూల్చెను
నీల దాపత్రిహస్తు నేలగలిపె
మేఘనాథాంకు సుమిత్రిపట్టి వధించె
నని రాముడంత రావణు వధింప
చతురాననుండు గిష్ణుతుల శివుండ్యును
సకలదేవతలు ప్రసన్నమగుచు
వారలిచ్చిన భూరి వరములగైకొంచు
పుష్పకాఖ్య విమానమున వసించి

గీ॥ వానరానీకములు గొల్వవచ్చి మార్గ
మధ్యమందున కిష్కింధమహిని నిలిపి
కిశతరుణుల నచటనెక్కించి యువేదు
వచ్చెరాముండు నాభరద్వాజ భూమి. 3245

గీ॥ పుష్య యోగంబుననుసెల్లి పురసవర్య
రాము డీ-చేదినంచు సీతా త్రితతయగ
జటీక కరములు మోడ్చి యూభరతుడనియె
నెన్నో నాళ్ళకు భాగ్యంబు గన్నహొఁడ. 3246

–: భరతుడయోధ్యాపురము నలంకరించుట :–

క॥ భరతుడు శత్రుఘ్నునిగని
పురము నలంకరణజేయు బూనుము రామున్
దరిశనము జేయు భాగ్యము
దరిజేరెన్ యాలసంబు దలపకుమింకన్. 3247

సీ॥ దేవతా నిలయముల్ పుష్పములకూర్చించి
ఛందకస్తగంధవ్యాసనవల్లపెల్లయు
సర్పసళీకుకయుక్తమగు రీత్యాలపింపు
వాదిత్రి విజుల బహుపురాణ

విడులను స్తోత్రసంవేద్యుల గడికల
గాయక శతముల క్ష్మామరులను
వరమవేషోల్లాస భావమానసులను
భటనికాయము శుభప్రదముగాగ

గీ। పయనముం జేయు లోక శుభంబుగాగ
భానువంశాబ్ధి సోము దివాకరాభు
జానకీనాథు శ్రీరామచంద్ర విభుని
పురికి వాహ్వానమును జేయ వరసగతిని. 3248

క। అవ విని శత్రుఘ్నుండును
పనిచెను పెక్కండ్ర జనుల పనిగొని మార్గం
బును వరిజేయగ పురికిని
జనునెడ నడ్డములులేక చనియెడురీతిన్. 3249

క। పరిమళగంధ జలంబుల
తరవుచు మార్గమున రజముగాంచక యుండన్
గురుతర రీతిని జల్లగ
నరవరసుతు డాజ్ఞనిచ్చె నత్తరి పెలుచన్. 3250

చ। పురమున మార్గమందునను పూర్ణశశాంకుని బోల్పు కాకలన్
సురుచిరరీతి నిల్పగను శోభలగూర్ప గృహంబు లందునన్
నరుదగు తోరణంబుల నలంకరణంబును జేయనాజ్ఞలన్
బరపెను రాజనందనుడు భాగ్యదశల్ మటియిల్లువేళలన్. 3251

క। మరి పంచవర్ణముల గల
యరుదగు ముగ్గులను పురమునందున వెల్లియ్యన్
వరి దీర్చ నాజ్ఞ నిచ్చెను
పురి రాముడు జేయువార్త పూరింపు మనెన్. 3252

—: భరతుడు రాముని కెదుర్కొనిన తీరు :—

క॥ జనవిభుని జూడ రాజా
ప్తగణలు ద్విజులు రాజకార్యఘన తంత్రజ్ఞుల్
మనముల హర్షము వెలుగగ
చనిరది వరుసలుగ నపుడు పయనము జేసెన్. 3253

గీ॥ అష్టమంత్రులు రాముని యాగమనము
విని మహాహర్షమొందుచు జనగనెంచి
భద్రదంతావళంబుల పయనమైరి
రామచంద్రుని వీక్షింప రక్తిగలిగి. 3254

క॥ తురగముల గొందరును మరి
కరులను గొందరును సత్వకలితరథాళిన్
మరికొందరు నానావిధ
తరగతులన్ రాము జూడ తరలిరి వేడ్కన్. 3255

క॥ పలువిధము లాయుధంబులు
వలనుగ గైకొనుచు వీరభట సంచయము
జ్వలగతి పతాకలం గొని
జలజాక్షుని రాము జూడ జనియెన్ వేడ్కన్. 3256

గీ॥ మరియు కౌసల్యయు సుమిత్ర భరతుమాత
కైకయును వాహనంబుల కరము నెక్కి
వెడలెనంత నందిగ్రామ వృధిఁ జేర
పుత్రు వీక్షింప హర్ష సంభూతులగుచు. 3257

మ॥ శిరమందున్ రఘురాము పాదముల సౌశీల్యంబుగా దాల్చి భూ
వరురామార్హము రత్నభూషణమణీ ప్రాభవ్యముల్ గాంచు పాం
డుర ముక్తామయ ఛత్రయుక్తమయి మంత్రుల్ రాగ కైకాసుతుం
డరిగె న్నగ్రజు గాంచు వేడుకను సన్నాహంబుతో నత్తరిన్. 3258

మ॥ భరతుం డట్టులయోగ్గి మారుతిని సంభావించి రాముం డిట
న్నరుదేరంగను వచ్చునాడ గన సేలాయిట్లు కాగయ్యె నా
నరుసందుస్ బహుకామరూపుల గనంగావచ్చు నొక్కండు నేఁ
డరికిన్ రాడిది యేమి హేతువొకొ చింతంజేసి వేదల్పవే. 3258

క॥ అన హనుమంతుడు కైకా
తనయుని వీక్షించి పలికె తడవగుటకు కా
రణముం బల్కెద దశరథ
తనయా యరయుంగ వాతుదప్పకవచ్చున్. 3260

క॥ మునివరుడు భరద్వాజుడు
వనచరులకు వరమునిచ్చె బహుఫలములు నా
రునునుండు భూమిగలుగన్
గనుకను మెక్కుచును నచట కాలముబుచ్చెన్. 3261

చ॥ కనుమదె వాలికి దిశను గన్పడె భూమిరజంబు వానరుల్
పనిగొనియుందు సొలవన భాగమునందు జరించువారలై
జనుచును నున్న వారికిటకు జాలములేదిక జూడుమయ్యదే
మనుజవిభుండు పుష్పక విమానము నందరుదెంచుచుండెడిన్.

క॥ మును నీపుష్పక యానము
వనజభవుడు చేసియొసగె-ధనునకు నతడున్
దనద:నకు నిచ్చె గూరిమి
దనుజవిభుడు రావణుండు దాళిహరించెన్. 3263

చ॥ కనుమదె రామువందు జనకాత్మజ యుక్తునిచెంత లక్ష్మణున్
కనుమదె కీశనాథు దశకంఠ సహోదరు నావిభీషణున్
ననిహనుమంతుడున్ బలుక కంఠరు నొక్కట రామరామయుం
చును పటుదీర్ఘ నాదములు కోశజెలంగగ జేసె పెల్లగన్. 3264

## -: శ్రీరామ భరత సమాగమము :-

క॥ గురుతర హర్షోత్కంఠితులై
పరలు విమానంబునుండి వసుధకు వ్రాలెన్
భరతుడు రాముని గాంచి త
పరగ విమానంబు నెక్కి వ్రాలె సంఘ్రీలన్. 3265

ఉ॥ అంతట రామభూవిభుడు నాదరమొప్పగ కైకసూను సు
స్వాంతుని లేవనెత్తి మదిజాలిని బూనుచు నెన్ని నాళ్ళకో
వింతగ నిన్ను గంటి విక వేదురు బొందకటంచు దెల్పి ని
శ్చింతను జేసి నీకిటను క్షేమమె యంచును సేదదీర్చుచున్. 3266

చ॥ అనుజుని లక్ష్మణుంగదియు నాతడు మ్రొక్కగ గౌగిలించి యా
జనకజ పాదపద్మముల సమ్మతిమ్రొక్కియు జెంతమున్న యా
వనచర నాథు నంగదుని వారిజ సంభవ పుత్రు నావిభీ
షణులను గౌగిలించి యెదనంతట మందుచు దక్కువారలన్. 3267

చ॥ మరియును గంధమాదనుని మైందుని ద్వివిదు నీలునిన్నలున్
శరభు గవాక్షునిం బనను సాగరధీరు సుషేణుమోద సం
భరితముగా దగౌగిట సమర్పి యు క్షేమము లన్నదంగె స
త్కరముగ గాంచి వారలు ముదంబును బొందిరి రాముచెంగటన్.

గీ॥ అంత శత్రుఘ్ను దరుదెంచి యగ్రజునకు
లక్ష్మణునకు బ్రణామంబు లాచరించి
సీత పదకంజములకు సంప్రీతిమ్రొక్కి
నిలిచె శ్రీరాముచెంత వినీతిమెరయ. 3269

చ॥ తనునెడబాయు కష్టదశ తాపము నొందుచు గుందుచున్న యా
జననిని కౌసలను పాదములంటుచు మ్రొక్కుచు నీదుమాటలన్
వినక వరణ్యవాసములకు వేగ మరల్చె గీతి దానికే క్షమా
గుణములు గోరుచుంటినని పల్కెను రాముడు భక్తిమీరుచున్. 3270

క॥ ప్రణమిల్లె సుమిత్రకు ప్ర
క్కను గం కైకకు భక్తి గదురుకొనంగన్
మునివరుని కంజభవనిభు
ననఘు వసిష్ఠుని పదంబులటంచు మ్రొక్కెన్. 3271

చ॥ జనవిభుతాళి రామ గుణసాంద్రు యశేషదయాసముద్రు నీ
కును గడుస్వాగతంబు సతికౌఖ్యుల విక్రము నీకు క్షేమమే
జనకజసౌఖ్యమే విమలసాంద్రగుణుండనుజుండు భద్రమే
యనుచు జనంబు మ్రొక్కిరి సమాదరజాధిక భక్తియుక్తులన్. 3272

క॥ వారల కై మోడ్పులు నా
వారిజముల మొగ్గలట్లు వనజాప్త కులా
ధారుండు గాంచి మనమున
భూరితరానంద మొందె పురజనవ్రతులన్. 3273

మ॥ భరతుండంతట రామపాదుకల విశ్వాసైక భక్తిన్ పురం
దరతుల్యుండగు రాముపాదములకున్ ధన్యాత్ముడై యుంచి యా
దరి నిల్చుండి వచించె యింతదనుకన్ ధాత్రిన్ ప్రజాభీష్టమా
చరణం బాలనజేసినాడ నికనీ క్ష్మాభాగ మీవేలుమా. 3274

క॥ నిను సయోధ్యకు రాజుగ
నొనరించెడు పుణ్యమిపుడు నుదయించుట మ
జ్జననంబు సఫలమయ్యెను
ఘనధన్యత గాంచినాడ కమల దళాక్షా. 3275

క॥ వరవర కోశాగారము
పురము భవము బలములిపుడు మునుపటికన్నన్
వరముగ దశగుణితంబయి
బరగుచుండె నీదుకరుణ బడయుము వీనిన్. 3276

క॥ భరతుని సౌశీల్యంబుకు
గురుతర భ్రాతృత్వ సమధికోజ్వల రీతిన్
శిరసి విభీషణు డాదిగ
పరివరవర్తులును మోద భరితులనయ్యెన్. 3277

—: భరతుడు రాజ్యమును రామునకిచ్చుట :—

గీ॥ అంతరాముడు భరతునంకంబు నందు
జేర్చి పరివార యుక్తుడై శీఘ్రముగ
సురవిమానంబు నెక్కి యచ్చోటుబాసి
నందివామక గ్రామంబునందు జేరె. 3278

గీ॥ అవిమానంబు దిగ్గియు నవనివిభుడు
దానికిని నాజ్ఞనొసగెను ధనదుగొలువ
నేగుమంచును నదియును నింగికేగి
ధనదు చెంతను ధనదు చెంతను భజించె. 3279

గీ॥ అంత మునులును రాముండు వాసవముల
గూరుచుండగ నయవాక్య కోవిదుండు
భరతుడంజలి శ్రీరామ భద్రుజేరి
పలికె భక్తివినమ్రతల్ వతలుభంగి. 3280

గీ॥ జననివాక్యానుసారిపై సాదరముగ
రాజ్యలక్ష్మిని వీడి యరణ్యములకు
బోయివచ్చితి నినుబోలు పుణ్యపురుష
దేశగంబుల నుండు మహేంద్రతుల్య. 3281

క॥ నావశముగ రాజ్యంబును
భూవర జేసితివి నాడు పునరాగమనం
బీవొనరించితి విప్పుడు
నీవిచ్చిన భంగినీకు నేనిపుడిత్తున్. 3282

ఉ॥ భూరిజలప్రవాహముల ముక్కలుగా దిగుపేతువెందునన్
నారయ దల్పయత్నమున కెట్టుల దక్కిన శిల్పవాక్కొకా యీ
ధారుణి రాజ్యభారమును తావక బాహుబలాంతరాళమున్
దీంచి దిద్దుమింక ధరణీవర (ముక్కెదు నీకుత్రికై. 3283

చ॥ అరయగ హంసరీతి వసుధాధిప కాకము కర్వ నేర్చునే
మరియు హయంబురీతి ఖరమక్కట యానము సేయగల్గునే
నరవర నీదు మార్గము గనంగను నాకెటులౌను భారతీ
వర యిక రాజ్యలక్ష్మిఁగొని పాలనసేయగ నిన్ను వేడెదన్. 3284

చ॥ వినుము మహానుభావ ఫలవృక్షము నొక్కటి నాటి పెద్దదై
ఘనతరశాఖలం గలిగి కాలము వచ్చిన వేళ పత్పలం
బును నొసగెనే యనీయక యువృద్ధిని గాంచిన యూపరియత్న మె
ల్లను వృథగాదె యీగతి దలంచుము నీయెద రాఘవేశ్వరా. 3285

క॥ జనకుడు వృక్షము నాదిను
జనియించితి నీవు వృక్షసంగతి గాగన్
జనములు నీ ఫలరాశిని
యను భవించకున్న వృక్షమది వృథగాదే. 3286

క॥ దినమధ్య భాగమందున
దినకరు బోలుచును నీవు దీప్తి వహింపన్
గని మొదు పట్టము నీ విక
జనవర్గము నిన్ను జూచి పరితపమొందన్. 3287

చ॥ సరస మృదంగ వాద్యములు సారసపైడి గాయక శ్రుతుల్
సురుచిర బృందగానములు శోభిల కంకణనిస్వనంబులన్
కరమును మేలుకొల్పగను గాంచి ధరారమణ ప్రవృత్తమున్
స్థిరమతి జూడ వేడెదను శ్రీకర భూజనకల్పభూజమా. 3288

క॥ ధర యెందాకను వెలయును
స్థిరత ఖగోళంబు కలితకెందక మనువో
ధరణీ వర యావరకును
పరిపాలన జేయు ధర్మ పద్ధతి గాగన్. 3289

క॥ అని భరతుడు పలుకంగా
జనకసుతా మనోహరుడు స్వాంతమునందున్
జనితా నందుండగుచును
దనియెను నట్లగును గాగ యంచును ప్రీతిన్. 3290

సీ॥ శత్రుఘ్నుదంత యాజ్ఞను జేయ సుఖకతుల్
వేవచ్చి శ్రీరామ విభునిమ్రొక్కి
క్షురకర్మమును దీర్చి సుగ్రీవుడును విభీ
షణుడు భరతుండు లక్ష్మణుడునంత
జడలచిక్కుల విప్పిస్నానంబు జేయించె
నారీతివతడు సుస్నాతుడై న
యంగరాగాదుల నలరించి సురుచిర
కాంచన చేలముల్ గట్టజేసి

గీ॥ దివ్యమణి భూషణంబుల దీర్చిదిద్ది
యట్టిరీతిని లక్ష్మణు నలరజేసి
రాజలక్షణ లక్షిత భ్రాజులగుచు
రామలక్ష్మణు లిరువురు గ్రాలుచుండె. 3291

క॥ జనకజను దశరథీతుని
వనితలు సుస్నాతజేసి పరిమళాంగ రా
గనియతి గూర్చియు మణిభూ
షణ రుచిరాంబరము లొసగె సంతస మొప్పన్. 3292

క॥ సుతు దరుదెంచిన కతమున
పతియౌ కౌసల్య వరము సంతస మొప్పన్
హితమతి వనచరనారీ
తతుల నలంకృతుంజేసె త్వరితముగాగన్. 3293

—: రాముడయోధ్య ప్రవేశించుట :—

సీ॥ శత్రుఘ్నువాజ్ఞగా సచివులు సత్వరి
సర్వాంగ సుందర స్యందనంబు
దినమండలమునకు నీడగుదానిని
సతులతేజస్ఫూర్తి నలరుదాని
సిద్ధంబుగావింప శ్రీరఘు రాముండు
సధివసించెనుదాని సంతగదలె
సుస్నాతులగుచు విశుద్ధ వస్త్రంబుల
దాల్చుచు సుగ్రీవదనుజనాథ

గీ॥ వరులు మారుతియును జాంబవంతు దాది
గాగల యనేకప్రముఖులు కదలి చనిరి
రాముర థమును వెంబడి రమ్యగతిని
పురజనంబులు సంతోష భరితులైరి. 3294

సీ॥ భరతుండు పగ్గముల్ పట్టుచురథగతి
క్రమముగా సారధ్య మమరజేసె
ముక్తాతపత్రంబు మోదంబు గూర్పంగ
శత్రుఘ్నుడంత్య హస్తమున బట్టె
లక్ష్మణుండ త్తరి రాముముఖంబున
వ్యజనంబుల్ విసర్చె సవ్యంపు హస్త
మున చామరము దాల్చె దనుజ నాథుండున
నొంటుచామరమ్మూనియుండె నచట

గీ॥ గగనగతులగు వేలుపుగముల మౌళి
వరుల సంస్తుతి వాక్యముల్ పురమునిండ
యచలనిభమైన శత్రుంజయాఖ్యగజము
జానకీ నాథుడెక్కె నెమ్మనమునుగదుమ. ౩౨౯౫

గీ॥ మానుషాకారముల దేరి క్ష్మాతలమున
వివిధ భూషాంబరంబుల వెలయదాల్చి
నవసహస్రముఖకరుల యానములు గాగ
పురము నయోధ్యజేరంగ దరిసిరంత. ౩౨౯౬

క॥ గురుతర వాద్య రవంబుల
మరియును శంఖానినాద మహిమాన్వితమై
పరగన్ పురుషోత్తము డా
పురి జొచ్చెను హర్మ్యరాజముల గనుగొనుచున్. ౩౨౯౭

చ॥ అతిరథముఖ్యులై పరగునట్టి మహాత్ముని శత్రుఘ్ను సం
గతి వలరారువాని నిజకాంతుల బర్వగజేయువాని భూ
పతి సచివోత్తముల్ దరికివచ్చి హితోక్తుల నాదరించినన్
క్షితిపతి రాముడయ్యెడను శ్రీయుతము గాగను బల్కెవారికిన్. ౩౨౯౮

ఉ॥ పౌరులు మంత్రిసత్తములు పారులు తన్ను భజింప భూరిశృం
గార గుణాభిరాముడు వికాసముజెందుచు గానవచ్చె నా
తారల మధ్యమందున సుధాకరు డుజ్జ్వలకాంతి వంతుడై
మీరి వెలుంగు భంగి నియమేయ మహావిభవాభిరాముడై. ౩౨౯౯

సీ॥ ధరణీసురులు నక్షతలు దాల్చుచునుండ
వేదనాదంబులు విస్తరిల్ల
బహుళంబు మంగళ వాద్యముల్ చెలరేగ
గాయకుల్ పాటలు గదలుచుండ

తాళహస్తులు మహోత్సాహంబు జూపింప
　　జేజేలు పురజనశ్రేణిచేయ
పుణ్యవనితలును గోవులు కన్యకాజనం
　　బులు శోభగూర్చెదు ముమ్ము జనగ

గీ॥ పచరింపులకు రామచంద్రుండు సరవిజెప్పె
తపనజుని మైత్రి మారుతాత్మజుని శక్తి
వనచరుల కృత్యములు మరి విభీషణుని రీతి
వారలంతట నద్భుత భావమొంద. 3300

క॥ రాముండ త్రతి యేగెను
శ్రీమహితము పుష్టజన సమృద్ధంబును ద్రై
ర్ఘ్యామిత భూతిపతాక
వ్యోమము తోరణయుతం బయోధ్యా పురమున్. 3301

క॥ చనియెను రాముండంతట
మనునిక్ష్వాకాది రాజ పుంగవులకు భా
జనమయి దశరథుడుండిన
ఘన మందిరసీమ యందు గడుమోదమునన్. 3302

క॥ తన జనయిత్రుల మువ్వుర
కును పొగుచుమ్రొక్కి భరతు కోరికదీరన్
వనుచయ సంభాషణముల
వినిపించుచు నతని తోడ వేగము పలికెన్. 3303

క॥ సురుచిర మశోక వనికము
వరమహర్ష దాయకంబు బహుమణి మయ వి
స్ఫురితంబు మద్గృహంబున్
హరి విభు విడియించు మనుచు నాజ్ఞాపించెన్. 3304

క॥ కరమున హరితరు కరమును
కరము గొమచు నేగెపటు వికాసమంతిరాం
తరమున నిలిపెను మరుతిర
వరతల్పములందు గూర్చె వడిసేతులున్. 3305

మ॥ భరతుండంతట భానుపుత్రుగని తాబల్కెన్ మహాత్మాయికన్
వరపాలున్న భిషిక్తుజేయగను పుణ్యస్ఫీత తీర్థాంబులన్
త్వరతం దేవగదూతలంబనుపుమా ధన్యత్వ సంపాదిపై
వరమానందకరంబు రామవిభునిం బట్టంబు నన్నిల్పగన్. 3306

చ॥ అనవిని సూర్యసూనుడు మహాబలులన్ కపికూరవర్యులన్
గనియును నల్వురకు విమల కాంచన భూరిఘటంబులిచ్చి యా
వనధి చతుష్కమందుగల వారిని పాత్రము రాకమున్న యిం
దునగొని తెండటంచును మనోగత భావము వెల్లడించినన్. 3307

చ॥ అనవిని వారలంజనియె నంతట మారుతి జాంబవంతుడున్
ఘనుడగు వేగదర్శియును నాఋషభుండును వేగవేగి యా
వననిధి పుణ్యతీర్థముల వాయుజవంబున దెచ్చియిచ్చె సం
జనిత ముదాత్ముడయ్యె వనచార విభుండును వారిదెచ్చినన్. 3308

గీ॥ పంచశతములు బహుపుణ్య వాహినులను
గలుగు జలముల కాంచన ఘటములందు
బహువనాటులు దెచ్చి యా పృథివినాథు
మందిరంబున నుంచె సన్మానితముగ. 3309

గీ॥ పూర్వదిశ సాగరమునకు బోయి యంత
నాసుషేణుడు వార్థిజలంబు దెచ్చె
వేరు ఋషభుండు దక్షిణవారి రాశి
జనియు నుత్తరసాగర జలముదెచ్చె. 3301

గీ॥ గవయు డంతట పశ్చిమ కడలికేగి
చర్మఘటమున దెచ్చె నావార్ధి జలము
నుత్తరము జేరి నలుడు నా యుదధి జలము
వేగగొని తెచ్చె పట్టాభిషేకమునకు. 3311

చ॥ హరివరులిట్లు సాగర జలంబులు పుణ్యనదీజలంబులన్
పరువడి దెచ్చియిచ్చినను భావమునందు సుమిత్రపట్టి యు
త్కృరుతర సంతసంబుగని యభ్యుదయప్రభ మించ రామునిన్
చిరతరలీల మీర నభిషేక మొనర్పగ నాజ్ఞజేసినన్. 3312

-: శ్రీరామ పట్టాభిషేకము :-

ఉ॥ శ్రీకర రత్నమండిత విశేష శుభాకర పీఠమందు ని
క్ష్వాకుల వంశసద్గురుడు వృద్ధుడునైన వసిష్ఠు డా ద్విజా
నీకముతోడురాగ శుభనిర్మల మూర్తిని రామమూర్తి ని
క్ష్వాకు కులీను వేద్కభువిజాత యుతంబుగ నుండజేసినన్. 3313

సీ॥ పావను నాయుష్టవసువు నభిషేకంబు
గావించు గతి ముని గ్రామణులును
నగు వసిష్ఠుండు కాశ్యపుడు జాబాలియు
కాత్యాయనుడు సువిజయు గౌతములును
వామదేవ సుయజ్ఞ వరులు నత్తర్వ్దిదివ్య
గంధ సుగంధ యుక్తంబులైన
జలముచే నభిషేకముల నొనరించిరి
యాపైన ఋత్విజు లంత ద్విజులు

గీ॥ కన్యకలు మంత్రులును పురి గలుగు యోధ
వరులు వణిముఖులు నైగమ వరదివెలయ
జేసెనభిషిక్తు పట్టాభిషేక వేళ
సకల కళ్యాణు శ్రీరామ చంద్రవసుపతి. 3314

సీ॥ అంత వసిష్ఠుచే నాహూతు లగుచును
నాల్గు దిక్పతులు గగనంబు నందు
నమరులతో గూడి యభిషేక మొనరించె
దివ్యౌషధీ రసోద్దీప్తిగాగ
శత్రుఘ్ను డంత శ్వేతమ్మగు ముక్తాత ప
త్రంబును బట్టె పద్మాప్తసుతుడు
ధవళ వింజామర ధారియై వీచెను
దనుజేశుడగు విభీషణుడు పటుల

గీ॥ గాలి శశితుల్య వింజామరంబు వీచె
భక్తితత్పర భావంబు ప్రస్ఫురింప
రామభద్రుని సకల కల్యాణరాశి
అతుల పట్టాభిషేక సమయంబు నందు. 3315

క॥ అనిమిషపతి పంపున గాం
చన కమలాకారమైన చారు హారమున్
యనిలుడు గొని యాదశరథ
తనయునకు నొసంగె నంత దద్దయు బ్రీతిన్. 3316

క॥ మరియున్నాగతి రత్నా
భరణము నవరత్న కలిత భాసురమగుచున్
బరగెడు ముక్తా హారము
వరవరునకు బ్రీతినొసగె ననిలుడు బ్రీతిన్. 3317

మ॥ వరవిఖ్యాతి దలిర్ప రాముడటులన్ పట్టాభిషేకార్హతన్
వరలన్ నప్సరలెల్ల నృత్యముల సంభావించె గంధర్వు లా
దరణీయంబుగ పాడె లోకములు నత్యానంద ముంజెందె ను
స్థిరతన్ రాముడు పట్టభద్రపదవిం జేకొన్న యావేళలన్. 3318

గీ॥ అటుల పట్టాభిషేకుడై సట్టివేళ
సస్యవంతంబుగా భూమి సంభవిల్లె
పాదపంబులు ఫలభార భరితములయ్యె
కుసుమములెంతయు గడు సుగంధములు వీచె. 3319

గీ॥ తగవహస్రి వాజిగో దానములను
శతవృషంబులు భూసుర తతికి నిచ్చె
మరియు ముప్పదికోట్లు హేమములు భూష
ణములు రాముండు బ్రాహ్మణోత్తముల కిచ్చె. 3320

మ॥ రవిసంకాశములై ప్రదీప్తమగుచున్ రంజిల్లు నానావిధ
చ్ఛవులన్ రత్నమయాంచితంబగుచు ప్రాశస్త్యంబువేనొప్పు హే
మవికారంబగు హారమున్ దినకుల క్ష్మానాథుడాలోకబాం
ధవ సూనుండు గొనంగనిచ్చె నపుడుద్యత్ప్రీతి సంధిల్లగన్. 3321

క॥ నానామణి విస్ఫురితం
బై పరలెడు బాహుపురులు నంగదునకు భూ
జాని యొసంగెను గడు స
న్మానితమగు రీతి ముదము నాతడు గాంచన్. 3322

–: సీతాదేవి హనుమంతుని బహూకరించుట :–

క॥ అంతట రాముడు సీతా
కాంతకు శశికిరణ సమత గాంచుచు మిగులన్
కాంతి యుతమైన మౌక్తిక
సంతాన సుహారమొకటి సమ్మతి నిచ్చెన్. 3323

ఉ॥ ఆతరిసీత భర్త నయనాంబుజ దృష్టుల జూచి యామనో
జాత సుభావమున్నెరిగి బంధుర భూషణ రాజితోడ సం
ప్రీతిని వస్త్రయుగ్మమును ధీమ బలాఢ్యుడునైన యంజనా
సూతికి వాంఛనీయమునకు భారునకిచ్చెను సంతసిల్లుచున్. 3324

మ॥ తనకున్ రాముఁడు నిచ్చియున్న ఘనము క్తాహారమువ్వేళ నా
వనసంచారుల నేరికియ్యవలెనో భావంబునం గోరి యా
వనజాతేక్షణ వానరప్రకరమున్ వర్తన్‌గనన్ సొంగి యే
ఘనుఁడర్హుండొ యటంచు రామవిభు వాకాంక్షించుచున్న త్తరిన్. 3325

గీ॥ ఇంగితజ్ఞాని యగుధరణీసుత దంత
ధరణిజా హృదయగత కామితంబునెరిగి
సీతవీక్షించి యారఘునేత పలికె
పరమ సంతుష్టగతులు నాతరుణిబొంద. 3326

చ॥ బలమును బుద్ధియున్ సుగుణవర్గము బాహుబలాధికంబు వే
విలసిలు భూరివిక్రమము పెంపుమజూపుచు వానరావళిం
జెలగుచు నీకు సంతసవిశేషము గాగను గూర్చువట్టి యా
యలఘున కీయుమంచు మనుజాధిపు డత్తరి నాజ్ఞజేయగన్. 3327

ఉ॥ రాముని యాజ్ఞమేరకు విరాజిత మౌక్తికహారమత్తరిన్
భామిని సీతవీరునికి వాయు తనూజునకిచ్చె సత్కృతిన్
నామెయి శ్వేతమేఘ కలనం జెలువొందెడి భూధరంబవన్
నామహితాత్ముఁడొప్పె తుహినాంశు కరప్రతబొందుకై వడిన్. 3328

గీ॥ నీలమైందద్వివిద వనేచరాదు
లకును తగురీతి వారికోరిక లెరింగి
బహుమతుల నిచ్చె రామభూపాలవరుడు
శత్రుశోషణు డఖిలోక సంహరుండు. 3329

చ॥ వనచరులందు వృద్ధులకు వానరవీరులకున్ హితంబు గా
గను నుచితప్రకారగతి కామకలిచ్చెను వస్త్రభూషలన్
నినజుడు జాంబవంతుడు వనేచరమల్లులు సర్వవానరుల్
సనిలజుడున్ ముదంబుగొన సందరకున్ బహుమాన సత్కృతుల్
తనివిగ నిచ్చె నాదశరథాధిప పుత్రుడు రాముడెంతయున్. 3330

క॥ వానరులందరు వాగతి,
భూనాయకు రామచంద్రు పుడుషోత్తము స
న్మానితు పట్టము గాంచుచు
నానందముతోడ జూచిరందరు మిగులన్. 3331

గీ॥ వానరులు నంత రామ భూపాలునాజ్ఞ
గొనుచు కిష్కింధ నగరంబు గనగజనియె
నగచరవిభుండు కిష్కింధ నగరికరిగె
దనుజవిభుడును లంకకు జనియెనంత. 3332

గీ॥ అరి భయంకరు డగుచు దుష్టాత్ములైన
శత్రుశోషణజేసి యశంబు గాంచి
పరమ సంతుష్టగతి రాజ్యపాలనంబు
జేయసాగెను రామ భూనాయకుండు. 3333

సీ॥ అంత లక్ష్మణుజూచి యనియెను రాముండు
మునుజనకుండు దాముదముతోడ
నాకు పట్టముగట్టు నవసరంబున నిమ్ము
భరతుడు నప్పుడు దరినిలేని
వేళను నీరాజ్య వి[శుత భారంబు
నీవునాతో నిర్వహింప వలయు
ననిబల్కు కతన నాడనిన మాటను నిల్పి
రాజ్యభారంబు నక్రమముగాగ

గీ॥ నాకుతోడుగ వహియింపవగును నీకు
పితృ పైతామహాదిక ప్రతిభగాంచి
నట్టి యీరాజ్య భారంబు నందు నీవు
ప్రజల బాలించు యువరాజ్య పట్టమంది. 3334

చ॥ అనుచును రామచంద్ర విభుడాడిన మాటకు నానుమిత్రినం
దనుడు గ్రహించియున్ దనకు నగ్రజుడౌ భరతుండునుండగా
జనదటు నిర్వహింపనని సమ్మతి బల్కగ యౌవరాజ్యమం
దున భరతున్ నియోగమును నొప్పగజేసెను రాముడత్తరిన్. 3335

గీ॥ పౌండరీకాశ్వ మేధముల్ వాజపేయ
వివిధ యాగాది యజ్ఞ సద్విధుల నెల్ల
బహుళముగ జేసె రామభూపాల వరుడు
లోక కళ్యాణ రక్షణా స్తోకుడగుచు. 3336

గీ॥ ధర్మ వరుడయి రాజ్యంబు దశసహస్ర
వర్షములు పాలనంబు భూవరుడు జేసె
తురగ మేధంబులను నూరు పరలజేసె
తురగముల భూరిదక్షిణ తోడనిచ్చె. 3337

ఉ॥ ఆయత దీర్ఘబాహుడు మహాభుజు డారఘురాముడంత సా
హాయము జేయ లక్ష్మణు డహర్నిశలం బరిపాలనంబు భ
ద్రాయుత మూర్తియై సలిపె ధన్యులు సైరి జనాళిసౌఖ్య సం
ధాయకుడయ్యె భూప్రజకు తత్పరబంధుజనాళికెంతయున్. 33[illegible]

చ॥ ధరణి సుతాభిరాముడటు ధాత్రిని పాలనజేయువేళ నె
వ్వరికిని యావదల్ గలుగవయ్యెను వ్యాళవిషాదిభీతులం
న్నెరుగక రోగచోరభయమెందునగానక యుండె స్త్రీజనుల్
బరగుచునుండె శోభ విధవాత్వ మెరుంగక రాజ్యమందునన్. 333[illegible]

గీ॥ వృద్ధులకు ముందు బాలకు మృతిలిగనక
సకల జనములు ధర్మసంచరులు నగుచు
వైరములుగల్గు నెడల రఘువరుని దలచి
వైరభావంబు బొందక వరలుచుండె. 334

ఉ॥ రాముడు రాజ్యపాలన విరాజితరీతి నొనర్చుచుండగా
భూమిజనంబు వేయిగను పుత్రులఁగాంచి చిరాయుసంపద
స్తోమముగల్గి దార్ఢ్యతను శోభితులౌచు సహస్రవర్షదై
ర్ఘ్యామిత జీవులై సుఖవిలాసములం దనరారె నెంతయున్. 3341

ఉ॥ రాముడు రాముడంచును విరామము లేకయె సర్వకాల మా
నామము నుచ్చరించుచు జనాళి చెలంగుచు కార్యజాతమున్
రామమయంబు జేయుచును రాజిత సంపదలంది సర్వసౌ
ఖ్యామయ జీవితాత్ములయి కాలము బుచ్చుచునుండిరెంతయున్.

చ॥ తరువులు నిత్యపుష్ప ఫలదంబులునై సకలర్తువేళ వి
స్ఫురిత విశాలశాఖలను వృద్ధిని బొందుచునుండె మేఘముల్
పరిమితి దప్పకుండగను వర్షములంగురిపించె వాయువా
దరణముగా సుఖస్థితి విధంబున వీచెను రాముడేలగన్. 3343

గీ॥ బ్రాహ్మణ క్షత్రవైశ్య శూద్రులైన
వర్ణములు విహిత ధర్మప్రవృత్త కర్మ
పరులను సంతృప్తులయి లోభములను వీడి
వరలుచుండిరి రామ భూపాలుడేల. 3344

ఉ॥ అందరు సత్యవాదులును నందరు ధర్మపరాయణాత్ములా
నందులు సద్గుణాన్వితులు నంచిత లక్షణలక్షితాఢ్యులున్
బొందిక గూడి సౌఖ్యమును బొందిరి సర్వజనంబుభూమి భృ
న్నందనుడేలు రాజ్యమున నాదరణీయత రామరాజ్యమై. 3345

గీ॥ అనుజులను గూడి భూమి పాలనముజేసి
పదియునొక్కండు వేల సంవత్సరములు
దశదిశలయందు కీర్తి విస్తారుడగుచు
దశరథసుతుండు శ్రీరామ ధన్యనృపతి.

-: ఫ ల శ్రు తి :-

మ॥ వరవాల్మీకి మునీంద్ర కృత్యమయి కావ్యశ్రీకాద్యంబునై
వరమాయుర్ధన భాగ్యవృద్ధికరమై భాసిల్లుచున్ వేద వి
స్ఫురితానేక విశేష భావగతులన్ బొల్పారు రామాయణం
బరయన్ విన్న సమస్తపాపములు విధ్వస్తంబు గాంచుంధరన్.

సీ॥ శ్రీరామ పట్టాభిషేకాంతముగ రామ
చరితంబు వినినట్టి సజ్జనునకు
సత్పుత్రసంతతుల్ సంభవించును ధన
బహు భాగ్యసంప దావలులు గలుగు
క్షత్రియుడిది విన్న శత్రుక్షయము జేసి
వసుధాధి పత్యంబు బడయు మిగుల
నారీజనము విన్న శ్రీరాము కౌసల్య
లక్ష్మణాఖ్యుని సుమిత్రయును కైక

గీ॥ భరతు గాంచిన భంగి సచ్చరితులైన
తనయులం గాంచి యాయురర్థాది సకల
సంపదలనొందు శ్రీరామ జయమువిన్న
వారుదీర్ఘాయువును బొంది వరలుచుండ్రు. 3347

సీ॥ ఆర్షమై ధరను మహర్షి వాల్మీకిచే
కృతమగు సియాది కావ్యమెవడు
శాంతుడై క్రోధవర్జనజేసి శ్రద్ధమై
వినిన దారిద్ర్యంబు గనకయుండు
ధరప్రవాసునకు బాంధవ సమాగమ మగు
నిహమున రామవృద్ధివ్రత కరుణ
సకలార్థ కామిత నికరసిద్ధులు గలుగు
దైవతాతతుల సంతసమునందు.

గీ॥ గృహమునందున విఘ్నముల్ గలుగకుండు
రాజవిఘ్నము భూమండలంబు నంత
జయము గాంచును దూరదేశమున నున్న
వాడు స్వస్థానమును జేరి వృద్ధిగాంచు. 3348

గీ॥ పుష్పవతులగు స్త్రీలు నీపుణ్యకథను
విన్న నుత్కృష్ట పుత్రసంపన్న లగును
వినినవ్రాసిన చదివి పూజనము జేయ
వాడు పాపవినిర్ముక్త వరతగాంచు. 3349

గీ॥ క్షత్రియుడు దీనిగాంచి సాష్టాంగముగను
వందనముజేసి సద్విజు వలన వినగ
చిరతరైశ్వర్య సుశ్లోక చరితులైన
పుత్రసంతతి బొందు నభ్యుదయ మొందు. 3350

శా॥ ఈ రామాయణ మెవ్వడుం జదివినన్ నిచ్ఛాగతిన్విన్న యా
శ్రీరాముండును బ్రీతిబొందు నతడే శ్రీవిష్ణువున్ సర్వ దే
వారాధ్యుండు సనాతనుండు నగుటన్ నత్యంతభాగ్యాన్వితో
దారుండై ధనధాన్య వృద్ధిగనుచున్ ధన్యాత్ముడై వర్ధిలున్. 3351

గీ॥ ఆదిదేవుండు మరియు నారాయణుండు
నైన శ్రీరామకథ విన్న యతివలకును
సకల సౌభాగ్య సుఖముల సంభవించు
ఆయురారోగ్య సత్కీర్తులందు భువిని. 3352

క॥ శ్రీరామాయణ కావ్యము
పారాయణ జేయు దివిజవర్గముదృప్తి
న్నారూఢి జెందు కోర్కె
ల్దీరును దివిగాంచు గ్రంథలేఖన జేయన్. 3353

కాండాంత పద్యములు :-

చ: జలనిధి బంధనా చతుర, సాగర దర్పనివారణాస్త్ర ప్రౌఢి
మ్యం కపికోటి ధీవర, నిశాచర పట్టణవైభవాంతకా
జంభదరాతి వర్గమద శాతన, తూణిమృగేంద్రహర్య్య, వి
ర్దళిత సమస్తదైత్య, విబుధప్రకర ప్రియ, జానకీ ప్రియా. 3354

ఉ: ఘనతర సంగరస్థ దశకంఠమహాసురకంఠ ఖండనా
వినమిత శత్రుసోదర విభీషణ రాజ్యపద ప్రదాయకా
జనక సుతా పరిగ్రహణ సారమనీష సమస్తదేవతా
జన శివ పద్మసంభవ దిశాపతి వర్గ సుతైకపూరుషా. 3355

ఉ: భూనుతకల్పభూజ, శుభభూషణభూషితవిగ్రహా, రూపమన్మథా,
భానుసమానతేజ, గుణభాసుర, శక్త, సమస్తలోక స
న్మానిత, పూతదివ్య మహిమాన్విత కీర్తిచరిత్ర, మానవా
జ్ఞాన మహాంధకార ఘనకాస్త్ర, సుధాకర కీర్తి విశ్రుతా. 3356

శా: పారావార విదార, సాధుజన రక్షాదక్ష, బృందారకా
వారాధ్యక్ష, విరించి శంకరనుత ప్రాశస్త్యచారిత్ర, వి
స్తారోదార మనీష, పంక్తిరథ, పుత్రజ్యేష్ఠ, లోకాధిపా,
యీ రామాయణ పారిజాత సుమమర్పింతున్ భవత్సేవకాన్. 3357

గద్య :- ఇది శ్రీరుద్రమూరమణ దివ్యావతార శ్రీరామభద్ర పాదారవింద
మిళిందాయమాన మానస అఘమర్షణ గోత్ర వంతులాన్వయసంజాత
చినజోగయార్య పౌత్ర, శైరవభట్ల చిటిసింగనార్య దౌహిత్ర,
జగన్నాథార్య పుత్రశుభుజన విధేయ చినజోగరాయ ప్రణీతంబయిన
రామాయణ పారిజాతంబను నిర్వచనాంధ్ర శ్రీమద్రామాయణము
నందు యుద్ధకాండము సర్వము సమాప్తము. 3358

సర్వం శ్రీరామార్పణమస్తు.

— ० —

శ్రీ శ్రీ శ్రీ